అనువాద వాఙ్మయము-42
ఆయుర్వేదము



ఇందుకృత శశిలేఖా వ్యాఖ్యా సహిత

# అష్టాంగసంగ్రహము

## సూత్రస్థానము

(34 నుండి 40 అధ్యాయములు)

సంస్కృత మూలము
వాగ్భటుడు

అనువాదము
శ్రీ ఎమ్. శరభయ్యశర్మ
ప్రొఫెసర్, నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, విజయవాడ.

పరిష్కర్త
వైద్య ఇటికాల సంజీవరావు
G. C. I. M. (Madras), D. Ay. M. (Banaras)
ప్రిన్సిపాల్, ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, హైదరాబాదు.







తెలుగు అకాడమి
హైదరాబాదు
1979

ashTaanga sangrahamu (Ashtanga Sangraha) Sanskrit original: Vaagbhata; Telugu translation: Prof. M. Sarabhiah Sarma; Scrutiniser: Vaidya I. Sanjeeva Rao; First Edition, 1979 pp. vi+152.







*First Edition, 1979*
Copies : 1,000

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price : Rs. 5-00

Library (Hard bound) Edition : Rs. 7-50

Printed in India
At Dakshina Bharata Press, Khairatabad, Hyderabad-500 004
Andhra Pradesh.

# ప్రస్తావన

కళాశాల స్థాయి వివిధ తరగతులకు పాఠ్య పఠనీయ గ్రంథాలతోపాటు తెలుగు అకాడమి వివిధశాస్త్రాలకు సంబంధించిన ప్రామాణికమైన అనువాదాలు, శాస్త్ర నిఘంటువులు, మోనోగ్రాఫ్‌లు, మాండలికభాషా పరిశీలనకు సంబంధించిన వివరణగ్రంథాలు, ఇంకా ఆయా శాస్త్ర విస్తృతాధ్యయనానికి సంబంధించిన ప్రామాణికమైన రచనావళి జనరంజకగ్రంథావళి మొదలైనవి ప్రచురించడానికి తలపెట్టి ఆయా పరంపరలలో కొన్నిటిని ఇదివరకే ప్రకటించింది.

తెలుగుభాషా సాహిత్యాలకు సంబంధించిన ఛందఃపదకోశం, వ్యాకరణ పదకోశం, సాహిత్య పదకోశాలు ఇదివరకే వెలువడ్డాయి. ప్రామాణిక అనువాద గ్రంథాలలో వాక్యపదీయం మొదటి సంపుటం వెలువడింది. రెండో సంపుటం త్వరలోనే వెలువడుతున్నది.

ఈ అనువాద గ్రంథ పరంపరలో ఇప్పుడు వెలువరిస్తున్న ఆయుర్వేదగ్రంథమైన అష్టాంగ సంగ్రహం (సూత్రస్థానం) చాలా విశిష్టమైనది. శ్రీ పాణ్యం పార్థసారధిశర్మ, శ్రీ జి. రంగాచార్యులు, శ్రీ వి. రంగాచార్యులు, శ్రీ ఎం. శరభయ్యాశర్మ గారలు ఈ మహోద్గ్రంథాన్ని ఇందుకృత శశిలేఖా వ్యాఖ్యా సమేతంగా అనువదించగా వైద్య శ్రీ ఐ. సంజీవరావుగారు పరిష్కర్తృత్వ బాధ్యతను వహించారు. ఈ విశిష్టమైన ఆయుర్వేద గ్రంథం వైద్యవిద్యార్థి లోకానికి, భారతీయ వైద్య విజ్ఞానాన్ని గూర్చి తెలుసుకోగోరే జిజ్ఞాసువులకు ఎంతగానో ఉపకరించగలదు.

వేదాంగాలలో ఆయుర్వేదానికి కూడా మన పూర్వులు సముచితమైన స్థానాన్ని కల్పించి ఈ శాస్త్రానికి ఐహిక జీవనంలో గల విశిష్టమైన ప్రతిపత్తిని లోకానికి వెల్లడించారు. వాగ్భటాచార్య కృతమైన ఈ అష్టాంగ సంగ్రహానికి ఆయుర్వేద గ్రంథాలలో చాలా గొప్ప స్థానం వున్నది. అష్టాంగసంగ్రహంలోని సూత్రస్థానంలో మొత్తం నలభై అధ్యాయాలున్నవి. ఈ నలభై అధ్యాయాలను నలుగురు అనువాదకులు సరళ సుందరమైన శైలిలో అనువదించారు. ఈ గ్రంథాన్ని త్వరితగతిని వెలువరించే ఉద్దేశంతో ఆ యా అనువాదకులు అనువదించిన భాగాలను విడివిడిగా నాలుగు భాగాలుగా ప్రచురించడం జరుగుతున్నది. ఇప్పుడీ గ్రంథం నాలుగోభాగం. దీనిని శ్రీ ఎం. శరభయ్యాశర్మగారు మూలగ్రంథంనుంచి అనువదించారు. అష్టాంగ సంగ్రహం అనువాదంలో ముప్పైమూడో అధ్యాయం నుంచి నలభైయవ అధ్యాయం వరకు సంపూర్ణగ్రంథం ఈ భాగంలో ఇందు కృత వ్యాఖ్యా సహితంగా చేర్చడం జరిగింది. తక్కిన భాగాలన్నీ ఇదివరకే వెలువడినవి.

ఈ గ్రంథం ఆయుర్వేద విద్యార్థులకు చాలా ఉపయోగకారి. ఈ ముద్రణంలో ఏవైనా లోపాలుంటే సహృదయతతో వాటిని మా దృష్టికి తీసుకొని వస్తే మలిముద్రణలో వాటిని సవరించగలమని మనవి.

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | ముప్పదినాల్గవ అధ్యాయము | (యన్త్రశస్త్ర విధి) | 1-34 |
| 2. | ముప్పదిఅయిదవ అధ్యాయము | (జలూకా విధి) | 35-46 |
| 3. | ముప్పదిఆఱవ అధ్యాయము | (సిరావ్యధ విధి) | 47-72 |
| 4. | ముప్పదిఏడవ అధ్యాయము | (శల్యాహరణ విధి) | 73-93 |
| 5. | ముప్పదిఎనిమిదవ అధ్యాయము | (శస్త్రకర్మ విధి) | 94-123 |
| 6. | ముప్పదితొమ్మిదవ అధ్యాయము | (క్షారపాక విధి) | 124-140 |
| 7. | నలుబదియవ అధ్యాయము | (అగ్నికర్మ విధి) | 141-152 |

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## ముప్పది నాల్గవ అధ్యాయము

**మూలము :** **అథాతో యన్త్రశస్త్ర విధిన్నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః**
**ఇతి హస్మాహు రాత్రేయాదయో మహర్షయః ॥**

**ప్రతి పదార్థము :** అథ = తర్పణ, పుటపాకవిధి అను అధ్యాయమును వివరించిన తరువాత, అతః = సహజ, ఆగంతుక రోగముల చికిత్సలందు యంత్ర, శస్త్రముల ఉపయోగముగూడ అవసరమగుచుండుటచే, యన్త్రశస్త్రవిధిం నామ = యంత్ర, శస్త్రవిధి యను పేరుగల, అధ్యాయం = అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము. ఇతిహ = ఈ విధముగానే, ఆత్రేయాదయః = ఆత్రేయుడు మొదలగు, మహర్షయః = మహర్షులు, ఆహుః స్మ = చెప్పియుండిరి.

**తాత్పర్యము :** పూర్వాధ్యాయమున తర్పణ - పుటపాక విధులనుగూర్చి వివరించిన తరువాత, యంత్రశస్త్రవిధి యను అధ్యాయమును, ఆత్రేయాది మహర్షు లుపదేశించిన విధముగానే వివరించెదము. (నిజ - ఆగంతుక భేదములగు ద్వివిధరోగముల చికిత్స ప్రస్తావించబడినది. రెండింటి యందును యంత్ర, శస్త్రముల ఉపయోగముండుటచేత యంత్రశస్త్రవిధి అధ్యాయము ప్రారంభింపబడుచున్నది. అందును, యంత్రములచే మొదట వ్యాధులు పరీక్షించుటకై చూడబడుట, శల్యములు మొదలగునవి పట్టుకొనబడుట అయిన తరువాత శస్త్రములు ప్రయోగింపబడును గాన మొదట యంత్రములనుగూర్చి చెప్పబడు చున్నది).

### యంత్రములు - వాని సామాన్య ప్రయోజనములు

**మూలము :** మనశ్శరీరాబాధకరాణి శల్యాని । తేషాం నానావిధానాం శల్యానాం నానాదేశనివిష్టానామాహరణే ఒభ్యుపాయో యన్త్రాణ్యర్శో భగందరాదిషు శస్త్రక్షారాగ్న్యవచారణే శేషాఙ్గరక్షణే చ । తథావస్తి ప్రణయనాదౌ శృఙ్గాలాబు ఘటికాదయో జామ్బవౌష్ఠాదీని । అన్యాన్యపి చానేక రూపాణ్యనేక కర్మాణి స్వస్థాతురోపకరణాని । అతః కర్మవశాత్తేషామి యత్తావధారణ మశక్యమ్ ॥

**ప్రతి పదార్థము :** మనఃశరీరాబాధకరాణి = మనస్సునకును శరీరమునకును బాధ కలిగించునవి, శల్యాని = శల్యములు, నానావిధానాం = అనేక విధములైనవియు, నానాదేశ = శరీరమునందలి అనేక ప్రదేశములలో, నివిష్టానాం = ప్రవేశించినవియునగు, తేషాం = ఆ శల్యముల యొక్క, ఆహరణే = వెలితీయుటకు, అభ్యుపాయః = తగిన సాధనములు, యన్త్రాణి = యంత్రములనబడును. (ఇవి) అర్శోభగందరాదిషు = అర్శస్సు, భగందరము మొదలగు వ్యాధులందును, శస్త్ర-క్షార-అగ్ని-అవచారణే = శస్త్ర-క్షార-అగ్నికర్మల ప్రయోగ

సమయమున, శేషాఙ్గరక్షణే = తక్కిన అవయవములను రక్షించుటయందును (ఉపయోగింపబడును).

తథా = అట్లే, బస్తిప్రణయనాదౌ = బస్తి మొదలగువానిని పైకి దీయుటయందు, శృంగ-అలాబు-ఘటికాదయః = కొమ్ము, సొరకాయ బుర్ర, కుండ మొదలగునవి; అపి చ = ఇంకను, జామ్బవౌష్ఠాదీనామ్ = జాంబవౌష్ఠము మొదలగునవి, అన్యాని = ఇతరములగు యంత్రములు, అనేక రూపాణి = అనేక ఆకారములు గలవి, అనేక కర్మాణి = అనేక కర్మలు గలవి, స్వస్థ-ఆతుర-ఉపకరణాని = స్వస్థులకును, రోగులకును సాధనములగును. అతః = అందువలన, కర్మవశాత్ = కర్మలనుబట్టి, తేషాం = ఆ యంత్రముల యొక్క, ఇయత్తావధారణం = ఇన్నియని నిర్ణయించుట, అశక్యమ్ = శక్యము గాదు.

**తాత్పర్యము :** మనస్సునకు శరీరమునకు బాధను కలిగించునవి శల్యములు. ఇవి అనేక విధములుగా నుండును. అట్టి నానావిధ శల్యములు శరీరమున అనేక ప్రదేశములందు ప్రవేశించినపుడు వానిని వెలికి దీయు సాధనములే యంత్రములు అనబడును.

అర్శస్సు, భగందరము మొదలగు వ్యాధులందును, శస్త్ర, క్షార, అగ్ని కర్మలందును వ్యాధిలేని ప్రదేశముల రక్షించుటకును, వస్తి మొదలగువానిని పైకి దీయుటకును, కొమ్ము, సొరకాయ బుర్ర, కుండ, జాంబవౌష్ఠము మొదలగునవియు, ఇంకను ఇతరములగునవియు, అనేక రూపములు గలిగి అనేక కర్మల కుపకరించునవి, స్వస్థులకు–రోగులకును ఉపయుక్తములైనవి గలవు. అట్టి యంత్రములను ఇన్ని అని నిర్ణయించుటకు శక్యముగాదు.

*శశిలేఖ :* శల్యములు మనశ్శరీరములకు రెంటికిని బాధను కలిగించును. శల్యములను తీయుటకు నానావిధ ఆకృతులు గలవిగా యంత్రము లుండును. పెక్కు ఆకారములు, రకరకముల కొలతలు గలిగి అనేక కర్మలను జేయునవిగా నుండుటచే యంత్రముల సంఖ్య, లక్షణములు ఇవి అని నిర్ణయించుటకు శక్యముగాదు.

### యంత్రముల సంఖ్య - నామములు

**మూలము: అన్యే పునరేకోత్తరం యన్త్రశతమిత్యాచక్షతే । ఇహ పునః సమాసతః షోఢా నిర్దిశ్యన్తే । తద్యథా– స్వస్తికసందంశతాలనాళీశలాకాఖ్యాన్యనుయన్త్రాణి చ ।**

*ప్రతి పదార్థము :* అన్యే పునః = మరికొందరాచార్యులు, ఏకోత్తరం యన్త్రశతం = నూట ఒక్క యంత్రములుగా, ఆచక్షతే = చెప్పుచున్నారు ఇహతు = ఈ అష్టాంగ సంగ్రహమునందైతే, సమాసతః—సంగ్రహముగా, షోఢా = ఆరు విధములుగా, నిర్దిశ్యన్తే = నిర్దేశింపబడుచున్నవి. తద్యథా = అది ఎట్లనగా, స్వస్తిక-సందంశ-తాల-నాళీ-శలాకాఖ్యాని, అనుయన్త్రాణి చ = స్వస్తికము, సందంశము, తాలము, నాడీ, శలాకా యను పేర్లు గలవి, అను యంత్రములును.

తాత్పర్యము : కొందరాచార్యులు యంత్రముల సంఖ్య నూట ఒకటిగా చెప్పుచున్నారు. ఈ తంత్రమునందు సంగ్రహముగా ఆరు అని నిర్దేశించబడినది. అవి–స్వస్తిక యంత్రములు, సందంశ యంత్రములు, తాల యంత్రములు, నాడీ యంత్రములు, శలాకా యంత్రములు అను యంత్రములు.

*శశిలేఖ :* కొందరాచార్యులు యంత్రములను నూట ఒకటిగా చెప్పినారు. మొత్తము సంక్షేపముగా ఇచట స్వస్తికాది యంత్రములు ఆరు ప్రకారములుగా చెప్పబడినవి. అన్ని యంత్రములును ఈ ఆరింటికంటె అతిక్రమించి లేవు అని యర్థము.

## స్వస్తిక యంత్రముల వివరణ - వాని ఉపయోగములు

**మూలము :** తత్ర స్వస్తికయన్త్రాణి కఙ్క సింహగృధ్రకురరాది వివిధ వ్యాళముఖా న్యాకారానుగతాభిధానాని ప్రాయశో లౌహాన్యష్టాదశాంగులాని । మసూరాకార ప్రాన్తైః కణ్ఠేకీలైరవబద్ధాని మూలేఽఙ్కుశవదావృత్తవారంగాణ్యస్థి వినష్టశల్యోద్ధర ణార్థాని । తేషాం సింహవ్యాఘ్రభుజంగమకరాదిముఖాని దృశ్యవారంగేషు శల్యేషు ప్రయోజయేత్ । ఇతరేషు తు యథాయోగం వ్రణాకారానురోధేన కఙ్కకాకకుర రాది ముఖాని ।

*ప్రతి పదార్థము :* తత్ర = అందు, స్వస్తిక యన్త్రాణి = స్వస్తిక యంత్రములు, కఙ్క = కొంగ, సింహ = సింహము, గృధ్ర = గద్ద, కురర = లకుముకి పిట్ట, ఆది = మొదలగు పక్షులయొక్క; వివిధ = అనేక విధములైన, వ్యాల = పశువులయొక్క, ముఖాని = ముఖములవంటి, ఆకార = ఆకారమును, అనుగత = అనుసరించిన, అభిధానాని = పేర్లు గలవియు, ప్రాయశః = తరచుగా, లౌహాని = లోహముచే నిర్మించబడినవియు, అష్టా దశాంగులాని = పదునెనిమిది అంగుళముల పొడవు గలవిగాను (ఉండును), (ఇవి) మసూ రాకారప్రాన్తైః = చిరుసెనగ బద్దవంటి చివరలు కలిగి, కీలైః = మేకులచేత, కంఠే = కంఠ భాగమున, అవబద్ధాని = బంధింపబడినవియు, మూలే = మూలమున, అంకుశవత్ = అంకుశమువలె, ఆవృత్త = వంచబడిన, వారంగాణి = వారంగములు గలవియునై, అస్థి వినష్ట = ఎముకలలో దాగియున్న, శల్య = శల్యములను, ఉద్ధరణార్థాని = వెలికిదీయుట కుప యోగించునవి, తేషాం = వానిలో, సింహ-వ్యాఘ్ర-భుజఙ్గ-మకరాది ముఖాని = సింహము, పులి, పాము, మొసలి మొదలగువాని ముఖములవంటి ముఖములుగల యంత్రములను, దృశ్య వారంగేషు శల్యేషు = కనబడునట్టి వారంగములుగల శల్యములను దీయుట యందు, ప్రయోజ యేత్ = ప్రయోగించవలెను. ఇతరేషుతు = ఇతరములగు వానియందైతే, వ్రణాకారాను రోధేన = వ్రణముయొక్క ఆకారము ననుసరించి, యథాయోగం = తగినట్లుగా, కఙ్క-కాక-కురరాది ముఖాని = కొంగ, కాకి, లకుముకి పిట్టల ముఖముల ఆకారముగల స్వస్తిక యంత్ర ములను (ఉపయోగించవలెను).

*తాత్పర్యము :* వానిలో స్వస్తిక యంత్రములు కొంగ, సింహము, గద్ద, లకుముకిపిట్ట మొదలగువాని ముఖములవంటి ఆకారముగను, జంతువుల ముఖమువంటి ఆకారమున ముఖ ములు గలిగియుండునట్లుగా, ఆపేర్లతో తరచు లోహముతోను, పదునెనిమిది అంగుళముల పొడవుండునట్లు నిర్మింపబడును. వీని అగ్రభాగములు చిరుశెనగ బద్దయంత ఉండి, కంఠ మున కీలముచే బద్ధమై, మూలమున అంకుశమువలె వంచబడి యుండును. అస్థులందు దాగి యున్న శల్యములను దీయుటకు వీని నుపయోగింతురు. వీనిలో దృశ్యవారంగములుగల శల్యములను దీయుటకు సింహ, వ్యాఘ్ర, భుజంగ, మకరముఖములవంటి ముఖములుగల స్వస్తికయంత్రములను ఉపయోగింపవలెను. ఇతరములగువానియందు, వ్రణాకారము ననుస

రించి కొంగ, లకుముకిపిట్ట, కాకి - వీని ముఖములవంటి ఆకారముగల స్వస్తికయంత్రములను తగురీతిని ఉపయోగించవలెను.

*శశిలేఖ :* దక్షిణబాహువు వామభాగమునకు పోవుట, వామబాహువు దక్షిణమునకు పోవుట స్వస్తికతా యనబడును. వారంగం అనగా గ్రహణస్థానము. అదృశ్యవారంగములందు వారంగములు శరీరమున మగ్నమై యుండుటచే కనబడవు.

వి. వ్యా : యంత్రముయొక్క కంఠము అనగా రెండు తుండ్లను ఒకచోటచేర్చి మేకుచే బంధింపబడు ప్రదేశము. మూలప్రదేశమనగా యంత్రమును చేతితో పట్టుకొనునట్టి స్థలము. లోహ నిర్మితము లనగా సువర్ణాది పంచలోహములచే నిర్మితములనియు; ఇంకను వేణు, వృక్ష, సూత్ర, శృంగ, వల్కల, తృణ, స్నాయు ప్రతాన, అశ్మ (రాయి) ములచే గూడ యంత్రములను నిర్మించవచ్చుననియు డల్హణుడు వివరించెను.

వ్యాలముఖం — వ్యాలశబ్దము పశువులకు విశేషణముగా నుపయోగింపబడినది. వారంగం అనగా యంత్రముయొక్క శిఖాకార అవయవము. ఇది ధారణకొరకు.

## సందంశ యంత్రముల వివరణ - ఉపయోగములు

**మూలము :** స నిబన్ధో నిర్నిబన్ధశ్చ షోడశాంగులౌ సందంశౌ ద్వౌ భవతః । తౌ త్వక్ మాంససిరాస్నాయుగతశల్యోద్ధరణార్థముపదిశ్యేతే । తథాన్యః సందంశః షడంగులోఽర్ధాంగుల విస్తృతో వక్రద్విబాహురఙ్గుష్ఠాంగులిప్రాప్త సమాగమాకృతిః సూక్ష్మశల్యాక్షిపక్ష్మవ్రణాధిమాంసాహరణే ।

*ప్రతి పదార్థము :—* షోడశాంగులౌ సందంశౌ = పదునారంగుళముల ప్రమాణము గల సందంశ యంత్రములు, సనిబన్ధనః = నిబంధనము గలదియు, నిర్నిబంధనః = నిబంధనము లేనిదియు అని, ద్వౌ = రెండు విధములుగ, భవతః = ఉండును. తౌ = ఆ రెండును, త్వక్-మాంస-సిరా-స్నాయుగత = చర్మము, మాంసము, సిరా స్నాయువులందు ప్రవేశించిన, శల్య ఉద్ధరణార్థం = శల్యములను వెలికిదీయుటకు, ఉపదిశ్యేతే = చెప్పబడుచున్నవి. తథా = అట్లే, అన్యః సందంశః = మరియొక సందంశయంత్రము, షడంగులః = ఆరు అంగుళముల ప్రమాణము గలదై, అర్ధాంగుళ విస్తృతః = అర్ధాంగుళము వెడల్పు గలది, వక్రద్వి బాహుః = రెండు వక్రములగు బాహువులు గలది, అంగుష్ఠాంగుళప్రాప్త సమాగమాకృతిః = బొటనవ్రేలు; అంగుళి కలిసిన ఆకారము గలది, సూక్ష్మశల్య = సూక్ష్మములైన శల్యములను, అక్షిపక్ష్మ = కనురెప్పల వెంట్రుకలను, వ్రణ = అధిమాంస = వ్రణమునందు పెరిగిన అధిమాంసములను, ఆహరణే = లాగుటకు (ఉపయోగింపబడును).

*తాత్పర్యము :* పదునారంగుళముల ప్రమాణముగల సందంశ యంత్రములు బంధనముగలవి-లేనివి యని రెండు విధములు. అవి రెండును చర్మ, మాంస, సిరా, స్నాయు గతములైన శల్యములను దీయుట కుపయోగింపబడును. ఆరంగుళముల ప్రమాణము, అర్ధాంగుళ విస్తృతి కలిగి, రెండు వక్రములగు బాహువులను కలిగి, అంగుష్ఠము-అంగుళి కలిసియుండునపుడుండు ఆకృతి కలిగిన ఇతర సందంశ యంత్రములు సూక్ష్మములగు శల్యములను, కనురెప్పల వెంట్రుకలను, వ్రణములయొక్క అధిమాంసములను లాగుట కుపయోగించును.

*శశిలేఖ :* సనిబంధనము అనగా కీలబద్ధము.

*వి. వ్యా. :* సుశ్రుతుడు వీనినే సనిగ్రహ-అనిగ్రహ సందంశయంత్రములుగా వర్ణించెను.

## ముచుటీ యంత్రము — దాని ఉపయోగము

**మూలము :** తద్వచ్ఛ ముచుటీ । సా తు సూక్ష్మదన్తర్జుర్ద్విభుజామూలే రుచకనద్ధావలయపీడనాత్ ఛిన్నార్మశేష గమ్భీరవ్రణాధిమాంసాహరణే ।

*ప్రతిపదార్థము :* ముచుటీ చ = ముచుండియను యంత్రమునూ, తద్వత్ = అట్లే (ఉపయోగింపబడును). సా తు = ఆ ముచుండియైతే, సూక్ష్మదన్త = సూక్ష్మములగు దంతముల గలిగి, ఋజుః = సూటిగానుండు, ద్విభుజా = రెండు భుజములు గలిగి, మూలే = మూల ప్రదేశమున, రుచకనద్ధా = గుండ్రనీ ఆకారము గలిగి, వలయపీడనాత్ = గుండ్రని ఆకారమును ఒత్తుటచేత, ఛిన్నార్మశేష = తెగిన అర్మయొక్క శేషభాగమును, గంభీర-వ్రణ-అధిమాంస-ఆహరణే = లోతగు వ్రణముల అధిమాంసమును లాగుటకును (ఉపయోగించును).

**తాత్పర్యము :** ముచుండీ యను యంత్రముకూడ అట్లే ఉపయోగించును. అది సూక్ష్మములగు దంతములు గలిగి, సూటిగానుండు రెండు భుజములను కలిగి, మూల ప్రదేశమున గుండ్రని ఆకారమున నుండును. ఆ గుండ్రని భాగమును ఒత్తుటచేత, తెగినట్టి అర్మశేషములను, గంభీర వ్రణములందలి అధిమాంసములను లాగుటకును ఉపయోగించును.

## తాల యంత్రములు – వాని ఉపయోగములు

**మూలము :** తాల యన్త్రే అపి ద్వే । ద్వాదశాంగులే మత్స్యగల తాలకవదేకతాలక ద్వితాలకే కర్ణనాలీ శల్యాహరణార్థే ।

*ప్రతి పదార్థము :* మత్స్యగల తాలకవత్ = చేపగొంతులోని తాలువులవలె, ఏకతాలక-ద్వితాలకే = ఒక తాలువు, రెండు తాలువులు గలవి, ద్వాదశాంగులే = పన్నెండంగుళముల ప్రమాణము గల, తాలయన్త్రే అపి = తాలయంత్రములును, కర్ణనాలీ-శల్య-ఆహరణార్థే = కర్ణనాళి యందలి శల్యములను లాగుటకు ఉపయోగపడునవి, ద్వే = రెండు విధములు.

తాత్పర్యము : తాలయంత్రములు రెండు విధములు. పన్నెండంగుళముల ప్రమాణముగలిగి చేప గొంతులోని తాలువులవలె ఒక తాలువు లేక రెండు తాలువులు గలిగి యుండును. ఇవి కర్ణనాడి యందలి శల్యములను తీయుట కుపయోగించును.

*శశిలేఖ :* తాల యంత్రములు రెండు. ఒక పార్శ్వమున తాలువు గలది ఒకటి. ఇరు పార్శ్వములందును తాలువులు గలది మరొకటి.

*వి. వ్యా. :* ఇవి రెండును ఏకతాలక-ద్వితాలక నామములచే అష్టాంగహృదయమున వర్ణింపబడినవి. తాలశబ్దమిచ్చట ప్రదేశమును సూచించును అని డల్హణ వివరణ.

## నాడీ యంత్రములు — వాని ఉపయోగములు

**మూలము :** నాలీయన్త్రాణి సుషిరాణ్యనేకప్రకరాణ్యనేకప్రయోజనాన్యనేకతోముఖాన్యే

కతోముఖాని చ భవన్తి। స్రోతోగతశల్యదర్శనార్థమాహరణార్థం చ క్రియా సౌకర్యార్థమాచూషణార్థం చేతి। తాని స్రోతోద్వార పరిణాహాని యథాయోగ ప్రదీర్ఘాణి చ కుర్యాత్।

ప్రతి పదార్థము : నాలీయన్త్రాణి = నాడీయన్త్రములు, సుషిరాణి = లోపల రంధ్రములు గలిగి, అనేక ప్రకారాణి = అనేక విధములై, అనేక ప్రయోజనాని = అనేక ఉపయోగములు గలిగి, అనేకతోముఖానిచ = నానాముఖములు గలిగియును, ఏకతోముఖాని = ఒకవైపు ముఖమును గలిగియు, భవన్తి = ఉండును.

స్రోతోగత = స్రోతస్సులందు ప్రవేశించియున్న, శల్య-దర్శనార్థ-ఆహరణార్థం = శల్యములను చూచుట, లాగుట కొరకును, క్రియా సౌకర్యార్థం = శస్త్రక్రియ సౌకర్యము కొరకును, ఆ చూషణార్థం చ = (దోషాదులను) పీల్చుటకొరకును, ఇతి = అని (వాని ఉపయోగములు చెప్పబడినవి).

తాని = ఆ నాడీ యంత్రములు, స్రోతోద్వారపరిణాహాని = స్రోతోద్వారములంత చుట్టు కొలత కలిగియుండునట్లు, యథా యోగ ప్రదీర్ఘాని చ = ఉపయోగమునకు తగినంత పొడవుండునట్లు, కుర్యాత్ = చేయవలెను.

తాత్పర్యము : లోపల గొట్టమువలె రంధ్రము గలిగి నాడీ యంత్రములు అనేక విధములై, అనేక ప్రయోజనములు గలిగి, అనేక ముఖములు గలిగియు, ఒకవైపు ముఖము కలిగియు ఉండును. ఇవి స్రోతస్సులందుండు శల్యములను చూచుటకును, తీయుటకును, శస్త్రకర్మసౌకర్యము కొరకును, దోషాదులను పీల్చుటకును ఉపయోగించును. స్రోతోద్వార మంత ప్రమాణమున, తగినంత పొడవుండునట్లు వీనిని నిర్మించవలెను.

*శశిలేఖ* : పరిణాహము అనగా వర్తులత్వము.

వి. వ్యా : ఈ నాడీ యంత్రములను ప్రయోగించు స్రోతస్సుల పరిమాణమునకు తగినట్లుగా యంత్రముల పరిమాణముండవలెను.

క్రియా సౌకర్యమనగా శల్యాహరణ, శస్త్ర, క్షార, అగ్ని, ప్రక్షాళన ఔషధప్రణి ధానాది కర్మలందు సౌకర్యము.

పరిణాహం అనగా పరినిష్ఠప్రమాణ పరిచ్ఛేదము అని చన్ద్రనన్దనవ్యాఖ్య.

**మూలము :** కణ్ఠ శల్యదర్శనార్థం నాలీం దశాంగులాయతాం పఞ్చాంగుల పరిణాహాం ద్వి కర్ణస్యతు వారంగస్య సంగ్రహార్థం త్రిచ్ఛిద్రముఖాం నాడీం తత్ప్రమాణతః కుర్యాత్। తథాచతుష్కర్ణస్య పఞ్చచ్ఛిద్రముఖామ్। శల్యనిర్ఘాతనీ తు పద్మకర్ణికా కారశీర్షాం ద్వాదశాంగులాం త్ర్యఙ్గుల సుషిరామ్।

ప్రతి పదార్థము : కణ్ఠశల్యదర్శనార్థం = కంఠములోని శల్యములను చూచుటకు, నాలీం = నాడీ యంత్రమును, దశాంగులాయతాం = పది అంగుళముల పొడవైనదిగా, పఞ్చాంగుల పరిణాహం = అయిదంగుళముల చుట్టుకొలత గలదిగను (ఉండవలెను).

ద్వికర్ణస్య = రెండు చెవులు గల, వారంగస్య = వారంగము యొక్క, సంగ్రహార్థం = పట్టుకొనుటకు, త్రిచ్ఛిద్రముఖాం = మూడు రంధ్ర ముఖములు గల, నాడీం = నాడీయంత్ర

మును, తత్-ప్రమాణతః = ఆ ప్రమాణము ననుసరించి, కుర్యాత్ = చేయవలెను. తథా = అట్లే, చతుష్కర్ణస్య = నాలుగు చెవులు గల వారంగమునకు, పఞ్చచ్ఛిద్రముఖామ్ = అయిదు రంధ్ర ముఖములు గలదిగా (ఉండవలెను).

శల్యనిర్ఘాతనీం తు = శల్యములను ధ్వంసము చేయు నాడీ యంత్రమునైతే, పద్మకర్ణికాకార శీర్షాం = పద్మముయొక్క బొడ్డువంటి ఆకారముగల శీర్షము గలిగియుండునట్లు, ద్వాదశాఙ్గులాం = పన్నెండంగుళముల పొడవుండునట్లు, త్ర్యఙ్గులసుషిరమ్ = మూడంగుళముల రంధ్రము గల దానినిగా (చేయవలెను).

తాత్పర్యము : కంఠమందలి శల్యములను చూచుటకు నాడీయంత్రము పది అంగుళముల పొడవును, అయిదు అంగుళముల చుట్టుకొలతయు ఉండునట్లు చేయవలెను. రెండు కర్ణములుగల వారంగమును పట్టుకొనుటకు మూడు రంధ్ర ముఖములుగల నాడీయంత్రమును అట్లే నాలుగు కర్ణములు గల దానికి అయిదు రంధ్రముఖములు గల నాడీయంత్రమును ప్రమాణము ననుసరించి చేయవలెను. శల్యములను భేదించు నాడీయంత్రముయొక్క శీర్షము పద్మముయొక్క బొడ్డువంటి ఆకారమున నుండునట్లు, పన్నెండంగుళముల పొడవు మూడంగుళ రంధ్రముగలదానినిగా చేయవలెను.

*శశిలేఖ* :- శల్య నిర్ఘాతినీ నాడీయంత్రముయొక్క సుషిర భాగమున నిర్ఘాతమైన శల్యము ప్రవేశించి ముఖమునుండి వెడలును.

వి. వ్యా. "శరాజి దణ్డప్రవేశః శిఖాకారః కీలకో వారఙ్గ ఉచ్యతే అని అరుణదత్త వ్యాఖ్య. "కీలక శిఖాకారో వారఙ్గః" అని చన్ద్రినన్దన వ్యాఖ్య.

## అర్శోయంత్రభేదములు – ఉపయోగములు

**మూలము :** అర్శోయన్త్రం త్రివిధమ్ । తామ్రాయోహైమం దాంతం శార్ఙ్గం వార్షం వా గోస్తనాకారం చతురఙ్గులాయతం హస్తతలాయతమేకం పఞ్చాంగులాని పరిణాహేన పుంసాం షడంగులానిస్త్రీణామ్ । ద్విచ్ఛిద్రం దర్శనార్థమేకచ్ఛిద్రం కర్మణి । తథాహి సుఖేన దర్శనం శస్త్రక్షారాగ్న్యైనతి క్రమశ్చ । ఛిద్రం తు త్ర్యఙ్గులాయత మఙ్గుష్ఠోదర విస్తారమ్ । యదఙ్గుల మవశిష్టం తస్యాథోఽర్ధాంగులముపరి తథార్ధాంగులోచ్ఛ్రితోద్వృత్తకర్ణికమ్ । తృతీయాం తు తాదశ్యమేవ శమ్యాఖ్యం పార్శ్వచ్ఛిద్రరహితం పీడనార్థమ్ । భగన్దరే తు ఛిద్రాదూర్ధ్వమోష్ఠమపనీయ కుర్వీత । తద్వచ్చఘ్రాణార్శోర్బుదయన్త్రం నాల్యాకారం ద్వ్యఙ్గులాయతమేకచ్ఛిద్రం ప్రదేశినీపరిణాహమ్ ।

*ప్రతిపదార్థము* :- అర్శోయన్త్రం = అర్శోయంత్రము, త్రివిధం = మూడు విధములుగా నుండును. తామ్రాయోహైమం = రాగి, ఇనుము, బంగారపుది. దాంతం = దంతనిర్మితము, శార్ఙ్గం = కొమ్ముతో చేయబడినది, వా = లేక, వార్షం = కొయ్యతో చేయబడినది, గోస్తనాకారం = గోస్తనాకారముననుండి, చతురఙ్గులాయతం = నాలుగు అంగుళముల పొడవు గలది, హస్తతలాయతం = అరచేయి అంత విస్తరించియుండునది, ఏకం = ఒకటి; పుంసాం = పురుషులకు, పరిణాహేన = లావుతో, పఞ్చాఙ్గులాని = అయిదంగుళములుండును. స్త్రీణాం = స్త్రీల కుపయోగించునది, షడంగులాని = ఆరంగుళములుండును,

ద్విచ్ఛిద్రం = రెండువైపుల రంధ్రములు గలది,దర్శనార్థం = చూచుట కుపయోగించునది, ఏకచ్ఛిద్రం = ఒకవైపు రంధ్రముగలది, కర్మణి = శస్త్ర-క్షారాది, కర్మలందుపయోగింపబడునది, తథాహి = అది ఎట్లనగా, సుఖేన = సుఖముగా, దర్శనం = శల్యాదుల దర్శనమగును; శస్త్ర-క్షార-అగ్ని = శస్త్రకర్మ, క్షారకర్మ, అగ్నికర్మలయొక్క, అనతిక్రమశ్చ = అతిక్రమము గూడ జరుగదు, ఛిద్రంతు = రంధ్రమైతే, త్ర్యంగుళాయతం = మూడంగుళముల పొడవు, అంగుష్ఠ-ఉదర-విస్తారమ్ = అంగుష్ఠముయొక్క అడ్డుకొలతయంత వెడల్పు (గలిగియుండును), యత్-అఙ్గులం = ఏ అంగుళ విభాగము, అవశిష్టమ్ = మిగిలినదో, తస్య, అధః = దానికి క్రింద, ఉపరి = పైన, అర్ధాంగుళం = అర్ధాంగుళము; తథా = అట్లే, అర్ధాంగుళ = అర్ధాంగుళము, ఉచ్ఛ్రిత-ఉద్వృత్త = పైకి ఎత్తి చుట్టబడిన, కర్ణికామ్ = కర్ణిక కలది.

తృతీయంతు = మూడవదైతే, తాదృశం-ఏవ = దానివలెనే, శమ్యాఖ్యం = శమీ అను పేరు గలది, పార్శ్వచ్ఛిద్రరహితం = ప్రక్కనరంధ్రము లేనిది, పీడనార్థం = వత్తుటకుపయోగించునది.

భగన్దరే తు = భగంధర వ్యాధియందైతే, ఛిద్రాత్-ఊర్ధ్వం = రంధ్రమునకు పైన, ఓష్ఠం = యంత్రముయొక్క ఓష్ఠమును, అపనీయ = తొలగించి, కుర్వీత = చేయవలెను.

తద్వత్-చ = అటులనే, ఘ్రాణ-అర్శో-అర్బుదయంత్రం = ముక్కునందలి అర్శస్సు, అర్బుదము అను వ్యాధులలో ఉపయోగించు యంత్రమును, నాల్యాకారం = నాడీ ఆకారమున, ద్వ్యఙ్గులాయతం = రెండగుళముల పొడవు, ఏకచ్ఛిద్రం = ఒక రంధ్రముగల దానినిగా, ప్రదేశినీపరీణాహం = చూపుడువ్రేలు యంత లావుగలదానినిగా (చేయవలెను).

తాత్పర్యము : రాగి, ఇనుము, బంగారము వీనితో చేయబడి అర్శోయంత్రము మూడు విధములుగా నుండును. లేక దంతము, కొమ్ము, కొయ్యలతో గూడ నిర్మించబడును. ఈ యంత్రము గోస్తనాకారమున నుండి నాలుగంగుళముల పొడవుగలిగి అరచేతి యంత విస్తరించియుండును. పురుషుల కుపయోగించునది అయిదంగుళముల లావును, స్త్రీల కుపయోగించునది ఆరంగుళముల లావును ఉండును. ఇందు రెండు రంధ్రములు గల దానిచే శల్యాదులను చూడవచ్చును. ఒక రంధ్రము గలది శస్త్రవిచరణ, క్షారాది కర్మల యందుపయోగించును. ఇంకను శస్త్ర-క్షార-అగ్నికర్మలను అతిక్రమించకుండ చేయుటకు ఇవి ఉపయోగించును. రంధ్రము మూడంగుళముల పొడవు, అంగుష్ఠపు అడ్డుకొలత యంత వెడల్పు ఉండవలెను. మరియొక యంత్రమున రెండవరంధ్రము వద్ద పైన, క్రింద అర్ధాంగుళము పైకి ఎత్తి చుట్టబడి యుండవలెను. మూడవ యంత్రమును శమీ యంత్రమను పేరుగలిగి దానివలెనే యుండును. దీనికి ప్రక్కన రంధ్రముండదు. ఇది వత్తుట కుపయోగించును. భగందర వ్యాధియందు ఛిద్రమునకు పైనయుండు ఓష్ఠము లేకుండునట్లు యంత్రమును చేయించవలెను.

అట్లే, నాసికయందలి అర్శో అర్బుద వ్యాధుల కుపయోగించు యంత్రము రెండంగుళ

ముల పొడవు, ఒక రంధ్రము గలిగి చూపుడువ్రేలి యంత లావు గలిగి నాడీ ఆకారమున ఉండునట్లు చేయవలెను.

*శశిలేఖ :* అర్శోయంత్రములు మూడు విధములు. ఒక పార్శ్వమున ఛిద్రము గలది, ఇరుపార్శ్వములందు ఛిద్రములు గలది, ఛిద్రరహితమైనది అని.

భగందరమున ఉపయోగించు అర్శోయంత్రము ఓష్ఠరహితముగా నుండును.

వి. వ్యా. : స్త్రీలగుదము పురుషుల గుదముకంటె స్వాభావికముగ పెద్దదగుటచే స్త్రీల కుపయోగించు అర్శోయంత్రము పెద్దదిగా నుండవలెనని అరుణదత్త వ్యాఖ్య.

## అంగుళీ త్రాణక యంత్రము – ఉపయోగములు

**మూలము : తథాంగుళిత్రాణకమంగుళి ప్రవేశితం కిఞ్చిత్స్థూలవృత్తౌష్ఠమూర్ధ్వాధశ్ఛిద్రం గోస్తనాకృతి చతురఙ్గులం దాన్తం శార్ఙ్గం వార్క్షం వా తద్ధృఢేన సూత్రేణ మణిబన్ధ ప్రతిబద్ధమాస్యవిస్రావణే యోజ్యం ।**

*ప్రతి పదార్థము :* తథా = అట్లే, అఙ్గులీ ప్రవేశితం = (నోటిలో) వ్రేళ్ళను ప్రవేశింప జేయునదియు, అఙ్గులీత్రాణకం = వ్రేళ్ళను (రోగికొరకకుండ) రక్షించునదియు, కిఞ్చిత్ = కొంచెము, స్థూల = లావై, వృత్త-ఓష్ఠం = వంకరగనుండు పెదవులను కలిగి, ఊర్ధ్వ-అధః ఛిద్రం = పైన క్రింద రంధ్రములు కలదియు, దాంతం = దంతముతో, శార్ఙ్గం = కొమ్ముతో, వా = లేక, వార్క్షం = కొయ్యతో చేయబడినదిగానియైన, తత్ = ఆ యంత్రమును, దృఢేన = గట్టిదైన, సూత్రేణ = దారముతో, మణిబన్ధప్రతిబద్ధం = మణికట్టుకు గట్టిగా కట్టబడినదానిని, ఆస్యవిస్రావణే = నోటినుండి స్రావములను వెడలింపజేయుటకు, యోజ్యం = ఉపయోగింప దగినది.

తాత్పర్యము : నోటినుండి స్రావములను వెడలింపజేయుట కుపయోగించు యంత్రము నోటిలో వ్రేళ్ళను ప్రవేశింపజేయునదియు, అట్టి సమయమున రోగి వ్రేళ్లు కొరక కుండ రక్షించునదియుగాను ఉండును. అది కొంచెము లావుగాను, వక్రముగాను ఉండు ఓష్ఠములను కలిగి పైన, క్రింద రెండు ఛిద్రములు కలిగి, గోస్తనాకారముననను, నాలుగంగుళముల ప్రమాణముననను ఉండి, దంతము, కొమ్ము, కొయ్యలతో నిర్మితమై యుండవలెను. ఆ యంత్రమును గట్టి దారముచే మణి బంధమునకు బంధింపవలెను.

వి. వ్యా. : నోటిని తెరచుటకు, అంగుళమును లోనికి ప్రవేశింపజేయునపుడు అంగుళిని రక్షించునుగాన దీనికి అంగుళీత్రాణకమని పేరు కలిగెనని హేమాద్రి వ్యాఖ్యానము.

## యోని వ్రణ దర్శన యంత్రము

**మూలము : యోనివ్రణ దర్శనే యన్త్రం షోడశాఙ్గులమ్ । మధ్యేసుషిరం చతుర్వృత్తం చతుశ్శలాకమ్ సఞ్చారిణ్యాముద్రయోర్ధ్వం నిబద్ధముత్పల ముకుళవక్త్రం మూలే శలాకాక్రమణాదూర్ధ్వవికాసి చ ।**

*ప్రతి పదార్థము :* యోనివ్రణ దర్శనే = యోని యందలి వ్రణమును చూచుట యందు, యన్త్రం = యంత్రము, షోడశాఙ్గులమ్ = పదునారంగుళములు గలది, మధ్యే =

మధ్యలో, సుషిరం = రంధ్రము గలది. చతుర్భిత్తం = నాలుగు పత్రములు గలది. చతుశ్శలాకమ్ = నాలుగు శలాకలు గలది. ఊర్ధ్వం = పై భాగమున, సఞ్చారిణ్యాముద్రయా = సంచారిణీముద్రచే, నిబద్ధం = మూయబడినది. ఉత్పలముకులవక్త్రం = కలువమొగ్గ ఆకారమున ముఖముగలది, శలాకాక్రమణాత్ = శలాకలను వత్తుటచే, ఊర్ధ్వవికాసి చ = పై భాగమున తెరుచుకొనునదియు (అగును).

తాత్పర్యము : యోనివ్రణములను చూచుటకుపయోగించు యంత్రము పదునారంగుళముల పొడవు గలిగి మధ్యలో శూన్యముగానుండి, నాలుగు పత్రములుగా విభజింపబడి, నాలుగు శలాకలను గలిగి, పై భాగమున సంచారిణీముద్రచే మూయబడి, కలువమొగ్గవంటి ఆకారమున ముఖము గలిగియు ఉండును. క్రింద శలాకలను వత్తుటచే ఊర్ధ్వభాగమున తెరచుకొనునట్లుగా నుండును.

నాడీవ్రణ - దకోదర వ్యాధులందుపయోగించు యంత్రములు

**మూలము : నాశీవ్రణప్రక్షాళనాభ్యఞ్జన యన్త్రే షడఙ్గులే వస్తియన్త్రాకారే ముఖతో ఒకర్ణికే మూలముఖయో రఙ్గుష్ఠ కలాయ ప్రవేశస్రోతసీ। దకోదరే నాడీ ముభయతోద్వారాం పింఛనాళీం వాయుఞ్జ్యాత్ ।**

*ప్రతి పదార్థము :* నాశీవ్రణ = నాడీవ్రణముయొక్క, ప్రక్షాళన = కడుగుట, అభ్యఞ్జన = (తైలాదులచే) అభ్యంగనము చేయుటకుపయోగించు, యన్త్రే = యంత్రములు, షడఙ్గులే = ఆరు అంగుళముల ప్రమాణము గలవి. వస్తియన్త్ర ఆకారే = వస్తి యంత్రమును పోలిన ఆకారము గలవి. ముఖతః = ముఖము వద్ద, అకర్ణికే = కర్ణికలు లేనివి. మూల ముఖయోః = మూలమునందును, ముఖమునందును, అంగుష్ఠ - కలాయ - ప్రవేశ - స్రోతసీ = అంగుష్ఠమును, గుండ్రని శనగగింజను ప్రవేశింపజేయు స్రోతస్సు (గలిగి యుండును).

దకోదరే = జలోదరమున. ఉభయతోద్వారాం = రెండు వైపుల ద్వారములుగల, నాడీం = నాడీయంత్రమును, పింఛనాళీం వా = నెమలి మొదలగు జంతువుల పింఛముతో నిర్మింపబడిన యంత్రమునుగాని, యుఞ్జ్యాత్ = ఉపయోగించవలెను.

**తాత్పర్యము :** నాడీవ్రణములను కడుగుటకును, తైలాదులచే అభ్యంగనము చేయుటకునుఉపయోగించు యంత్రములు ఆరు అంగుళముల ప్రమాణమున యుండవలెను. ఇట్టి నాడీ యంత్రమువస్తి యంత్రాకారముననుండి, ముఖము వద్ద కర్ణికలు లేనివిగాను, మూలమున అంగుష్ఠమును, ముఖమున గుండ్రని శనగగింజయు ప్రవేశింపదగునంత స్రోతస్సుగలవిగా నుండవలెను. జలోదరమున నాడీ యంత్రము ఇరువైపుల ద్వారము గలదిగా నుండునది లేక నెమలి పింఛము మొదలగు వానిచే నిర్మితమైనదిగా ఉండవలెను.

*శశిలేఖ :* పింఛం అనగా పక్షులకు వెనుకనుండు పక్ష సంహతి.

ఇతర యంత్రములు

**మూలము : స్నేహవస్త్యుత్తరవస్తిప్రధమనధూమ మూత్రవృద్ధి నిరుద్ధమణి ప్రభృతిషు యథాస్వమేవ యన్త్రాణ్యుక్తాని ।**

ప్రతి పదార్థము : స్నేహవస్తి = స్నేహద్రవ్యములచే చేయబడు వస్తికర్మ, ఉత్తర వస్తి = ఉత్తరవస్తి కర్మ, ప్రధమన = చూర్ణమునుపయోగించి చేయబడు నస్యకర్మ, ధూమ = ధూమపానవిధి, మూత్రవృద్ధి = మూత్రవృద్ధివ్యాధి, నిరుద్ధమణి = నిరుద్ధమణియను వ్యాధి, ప్రభృతిషు = మొదలగువానియందు, యథాస్వమేవ = తగినట్లుగా, యన్త్రాణి = యంత్రములు, ఉక్తాని = చెప్పబడినవి.

తాత్పర్యము : స్నేహవస్తి, ఉత్తరవస్తి, ప్రధమననస్యము, ధూమపానములందుపయోగించు యంత్రములు మూత్రవృద్ధి నిరుద్ధమణి వ్యాధులందుపయోగించు యంత్రములు వాని వాని కార్యానుగుణముగా ఆయా అధ్యాయములందు చెప్పబడినవి.

## శృంగ యంత్రము

మూలము : శృఙ్గం తు హ్రస్వమధ్యదీర్ఘమష్టాదశ ద్వాదశాంగులాయతం త్ర్యంగుల ప్రవేశముఖమగ్రే సర్షపోపమచ్ఛిద్రం తనుచర్మనద్ధం చూచుకాకారముఖం చ। తద్వాతవిషరక్తాంబు దుష్టస్తన్యా చూషణార్థమ్ ।

ప్రతి పదార్థము : శృఙ్గంతు = శృంగయంత్రమైతే, హ్రస్వ - మధ్య - దీర్ఘం = పొట్టిది, మధ్యరకమైనది, పొడవైనది (అని మూడు విధములు) (క్రమముగా) అష్ట - దశ ద్వాదశాంగులాయతం = ఎనిమిది, పది, పన్నెండు అంగుళముల పొడవైనవి, త్ర్యఙ్గుల ప్రవేశ ముఖం = ప్రవేశముఖము మూడు అంగుళములుండునట్టిది. అగ్రే = చివర, సర్షప - ఉపమ - ఛిద్రం = ఆవగింజను బోలినంత రంధ్రములనుండి, తను చర్మనద్ధం = పలుచని చర్మముతో కప్పబడినది; చూచుక - ఆకార - ముఖం - చ = చనుమొనవంటి ఆకారముగల ముఖమును గలిగి యుండును. తత్ = అది; వాత - విష - రక్త - అంబు - దుష్టస్తన్య = వాయువు, విషము, రక్తము, నీరు, దుష్టస్తన్యము, వీనియొక్క, ఆ చూషణార్థం = పీల్చుటకు (ఉపయోగింపను).

తాత్పర్యము : శృంగ యంత్రము (కొమ్ము - లేక కొమ్మువలె నిర్మింపబడిన యంత్రము) పొట్టిగా, లేక మధ్యరకముగా లేక పొడవుగా నుండును. ఇవి క్రమముగా ఎనిమిది, పది, పన్నెండు అంగుళముల పొడవు కలిగి యుండును. ప్రవేశ ముఖము మూడంగుళముల ప్రమాణమున యుండును. చివర ఆవగింజంత రంధ్రము గలిగి పలుచని చర్మముచే కప్పబడియుండును. దీని ఆకారము స్తనచూచుకమువలె యుండును. ఈ యంత్రము వాతము, విషము, రక్తము, నీరు, దుష్టస్తన్యము మొదలగు వానిని పీల్చుటకుపయోగించును.

*శశిలేఖ :* చూచుకం యనగా స్త్రీల స్తనాగ్రము.

*వి. వ్యా:* అగ్రం అనగా చూషణము కొరకు శరీర ప్రదేశమున నియోగింపబడు యంత్రభాగమని అరుణదత్తుని వ్యాఖ్యానము.

## అలాబు యంత్రము

మూలము : శ్లేష్మరక్తాచూషణార్థస్త్వలాబుః । సద్వాదశాంగుల దీర్ఘోఽష్టాదశాంగుల పరిణాహస్త్రిచతురఙ్గుల వృత్త సముచ్ఛ్రితముఖః పరివేష్టితదీప్తకుశలబ్ధః పిచు గర్భశ్చ ప్రయోజ్యః ।

*ప్రతిపదార్థము :* అలాబుః - తు = సొరకాయబుఱ్ఱయైతే, శ్లేష్మ - రక్త - ఆచూష ణార్థం = శ్లేష్మమును, రక్తమును పీల్చుటకుపయోగించును. సః = అది, ద్వాదశాంగుల దీర్ఘః = పన్నెండంగుళముల పొడవైనది; అష్టాదశాంగుల పరిణాహః = పదునెనిమిది అంగుళ ముల చుట్టుకొలత గలది; త్రి - చతురఙ్గులవృత్త - సముచ్ఛ్రిత - ముఖః = మూడు - నాలుగంగుళముల గుండ్రని, ఎత్తైన ముఖము గలది, పరివేష్టిత = చుట్టగా చేయబడి, ప్రదీప్త = వెలిగించబడిన, కుశ = రెల్లు, బల్బజ = తుంగ, పిచు = దూది, గర్భఃచ = గర్భమున గలదియు (అగు అలాబు యంత్రము), ప్రయోజ్యః = ప్రయోగింప దగినది.

**తాత్పర్యము :** అలాబు యంత్రము దుష్టమైన శ్లేష్మ, రక్తములను పీల్చుటకుప యోగించును. అది పన్నెండంగుళముల పొడవు, పదునెనిమిదంగుళముల చుట్టుకొలత గలిగి, మూడు నాలుగంగుళముల ఎత్తైన, గుండ్రని ముఖమును గల్గియుండును. దానిలోపల, రెల్లు, తుంగ, దూది చుట్టగా పెట్టి, వెలిగించి, ఉపయోగించవలెను.

## ఘటీ యంత్రము

**మూలము : తద్వదేవ చ మానకర్మాభ్యాం ఘటీ। సా తు గుల్మోన్నమన విలయనార్థం చ।**

*ప్రతి పదార్థము :* ఘటీ చ = ఘటీ యంత్రమున్నూ, మాన - కర్మాభ్యాం = కొలత, ప్రమాణములందును, చేయుపనులందును, తత్ - వత్ - ఏవ = అలాబు యంత్రమువలెనే (ఉండును). సా - తు = ఆఘటీ యంత్రమైతే, గుల్మ = గుల్మముయొక్క, ఉన్నమన = పైకెత్తుట, విలయనార్థంచ = కరగింప జేయుటకునూ (ఉపయోగింప బడును).

**తాత్పర్యము :** ఘటీయంత్రము కూడ కొలతలందును, కర్మలందును అలాబు యంత్రమువలెనే యుండును. ఇంకను ఇది గుల్మమును ఆకర్షించి, పైకెత్తుటకును, కరగింప జేయుటకును ఉపయోగింప బడును.

## శలాకాయంత్రములు — వాని ఉపయోగములు

**మూలము :** శలాకాయన్త్రాణ్యపి నానాకృతీని నానార్థాని యథాయోగం దైర్ఘ్య పరిణాహాని చ భవన్తి। తేషామేషణ కర్మణీ ద్వే గణ్డూపదముఖే। స్రోతోగత శల్యా హరణార్థేఽష్టాంగుల నవాంగులే ద్వే మసూరదల ముఖే।

*ప్రతి పదార్థము :* శలాకాయన్త్రాణి అపి = శలాకా యంత్రములునూ, నానాకృతీని = అనేక ఆకారములు గలవి, నానార్థాని = అనేక ప్రయోజనములు కలవి. యథా యోగం = వాని వాని పనులకు తగిన, దీర్ఘ - పరిణాహాని - చ = పొడవు, చుట్టుకొలత గలవియును, భవన్తి = అగును, తేషాం = వానిలో, ఏషణకర్మణీ = (నాడీ వ్రణాదులందు) మార్గము లను వెదకుటకుపయోగించునవి. గణ్డూపద - ముఖీ = వానపాము నోటివంటి ముఖముగలవి, ద్వే = రెండు, మసూరదళముఖే = చిరుసెనగ బద్దవంటి ముఖముగలవి, అష్టాంగుల - నవాంగులే = ఎనిమిది, తొమ్మిది అంగుళముల ప్రమాణముగల, ద్వే = రెండు శలాకా యంత్రములు, స్రోతోగత = స్రోతస్సులందున్న, శల్య - ఆహరణార్థే = శల్యమును వెలికి లాగుటకు (ఉపయోగించును).

**తాత్పర్యము :** శలాకాయంత్రములును నానావిధములైన ఆకారములను గలిగి యుండి, అనేక ప్రయోజనములు గలవై, వాని వాని పనులకు తగిన కొలతలను కలిగి యుండును. వానిలో వ్రణములలోతు - గతి తెలిసికొనుటకుపయోగించు ఏషణ యంత్రములు రెండు; గండూపద ముఖములవంటి ముఖములను గలిగియుండును. చిరుసెనగబద్దవంటి ముఖములుగల రెండు యంత్రములు ఎనిమిది - తొమ్మిది అంగుళముల ప్రమాణమున నుండి శ్రోతోగత శల్యములను దీయుటకుపయోగించును.

*శశిలేఖ :* ఏషణం అనగా మార్గమును వెదకు కర్మ, అట్టి పనులను చేయునవి ఏషణీ శలాకా యంత్రములు.

**వి. వ్యా :** వర్షము వెలిసిన తరువాత భూమిపై తీగలవలె ప్రాకుచుండు, మెల్లగ కదలునట్టి, దీర్ఘాకృతి గల కీట విశేషములు గండూపదములు అని చన్ద్రినన్దనుని వ్యాఖ్య.

## శంకు యంత్రములు — వాని ఉపయోగములు

**మూలము :** షట్ శఙ్కవః । తేషాం వ్యూహనక్రియౌ ద్వాదశ షోడశాంగులౌ। ద్వావహిఫణముఖౌ । తథా చాలనార్థే దశద్వాదశాంగులౌ శరపుఙ్ఖముఖౌ । ఆహరణార్థే బలిశముఖౌ । తథా గర్భశఙ్కుః శఙ్కుతుల్యోఽష్టాదశాంగులః ప్రణతాగ్రో మూఢగర్భాహరణే । తథా సర్పఫణాగ్రవదేవాగ్రవక్రం తదాఖ్యమశ్మర్యాహరణార్థమ్ । తథా దన్త నిర్ఘాతనం చతురఙ్గులం శరపుఙ్ఖముఖం స్థూలవృత్తప్రోన్తమ్ ।

*ప్రతి పదార్థము :* శఙ్కవః = శంకు యంత్రములు, షట్ = ఆరు, తేషాం = వానిలో, వ్యూహన క్రియౌ = విపరీత స్థానములందుండు మాంసాదులను సరిచేయుటయందుపయోగించునవి, అహి - ఫణాముఖీ = పాము పడగవంటి ముఖముగలవియు, ద్వాదశ - షోడశాంగులే = పన్నెడు, పదునారు అంగుళముల ప్రమాణము గలవి, ద్వే = రెండు.

తథా = అట్లే, చాలనార్థే = శల్యమును కదలించుటకై, శరపుంఖముఖౌ = బాణము యొక్క పింజము వంటి ముఖము గలవి, దశ - ద్వాదశాంగులే = పది - పన్నెండు అంగుళముల ప్రమాణము గలవి, ద్వే = రెండు; ఆహరణార్థే = (కదలించిన శల్యమును) వెలికి లాగుటకు, బలిశ ముఖౌ = గాలమువంటి ముఖము గలవి రెండు (కలవు)

తథా = అట్లే, గర్భశఙ్కుః = గర్భశంకు యంత్రము, శఙ్కుతుల్యః = శంకుయంత్రముతో సమానమైనది, అష్టాదశాంగులః = పదునెనిమిది అంగుళముల ప్రమాణముగలది, ప్రణతాగ్రః = వంచబడిన కొనగలది, మూఢగర్భాహరణే = మూఢగర్భమును వెలికి లాగుటయందు (ఉపయోగించును).

తథా = అట్లే, సర్పఫణావదేవ = పాముపడగవలెనే, అగ్రవక్రమ్ = చివర వంగినట్టిది. తదాఖ్యం = సర్పఫణమను పేరుగల యంత్రము, అశ్మరీ - ఆహరణార్థం = అశ్మరీని వెలికి లాగుటకుపయోగించును.

తథా = అట్లే, దన్త నిర్ఘాతనం = దంతములను పీకు శంకుయంత్రము,

చతురఙ్గులం = నాలుగంగుళముల ప్రమాణము గలదియు, శరపుఙ్ఖముఖం = బాణపుంఖము వంటి ముఖముగలదియు, స్థూల వృత్తప్రాన్తం = లావై, గుండ్రని చివరలు గలిగి యుండును.

తాత్పర్యము : శంకు యంత్రములు ఆరు, వానిలో వ్యూహన క్రియ యందుపయోగించునవి రెండు, ఇవి పాముపడగవంటి ముఖము గలిగి పన్నెండు - పదునారు అంగుళముల ప్రమాణమున నుండును.

శల్యములను కదలించుటకై శరపుంఖమువంటి ముఖముగలిగి, పది - పండ్రెండు అంగుళముల ప్రమాణము గలవి రెండు. అట్లు కదలించిన శల్యములను వెలికిదీయుటకుపయోగించు నట్టివి రెండును గాలము వంటి ముఖము గలిగియుండును.

గర్భశంకువనెడిది పదునెనిమిది అంగుళముల ప్రమాణము గలిగి, వంచబడిన కొన గలిగి మూఢగర్భమును బయటకు లాగుటకుపయోగించును.

సర్పఫణమను పేరుగల శంకు యంత్రము పాము పడగవలె వంగిన ముఖము గలిగి, అశ్మరీని వెలికిలాగుటపయోగించును.

దంతములను పీకుటకుపయోగించు శంకు యంత్రము నాలుగంగుళముల ప్రమాణమున నుండి శరపుంఖమువంటి ముఖము గలిగి చివర లావుగను గుండ్రగను ఉండును.

శశిలేఖ : వ్యూహనం అనగా విపరీత స్థానములందు మాంసాదులను సరిచేయుట.

వి. వ్యా. : వ్యూహనం అనగా యథాస్థానం విన్యాసం అని హేమాద్రి వ్యాఖ్యానము. ఊర్ధ్వీకరణం అని డల్హణుడును; చూర్ణితమైన అశ్మర్యాదుల సంగ్రహణం అని హారాణచంద్రుడును; వ్రణఓష్ఠముల రెండింటి యొక్క సన్నిహితీకరణమని గణనాథుడును వివరించిరి.

బడిశం అనగా మత్స్యవేధనమని హేమాద్రి వ్యాఖ్య.

## ఇతర శలాకా యంత్రములు - వాని ఉపయోగములు

మూలము : షట్ కార్పాసకృతోష్ణీషాని వివిధవ్రణక్లేదక్షారప్రమార్జనక్రియాసు। తేషామపి దూరాసన్నఘ్రాణవ్రణోపయోగీని షట్సప్తాంగులే ద్వే । తద్వదేవ కర్ణేఽష్టాఙ్గులనవాఙ్గులే ద్వే । పాయౌ దశద్వాదశాంగులే । కర్ణశోధనం స్రువముఖమశ్వత్థపత్రాగ్రమ్ । తథా క్షారాగ్నికర్మార్థే జామ్బవోష్ఠాని ద్వాదశదశాష్టాంగులాని క్రమాద్వ్యంగులాంగులార్ధాంగు లఫలాని ।

ప్రతిపదార్థము : కార్పాసకృత - ఉష్ణీషాణి = చివరలందు దూది చుట్టబడి యుండునట్టివి (శలాకాయంత్రములు), షట్ = ఆరు. వివిధ = అనేకములగు, వ్రణ = వ్రణముల యొక్క, క్లేద = చీము మొదలగు తడిని, ప్రమార్జన క్రియాసు = తుడుచుట కుపయోగించును.

తేషాం అపి = వానిలోనూ, దూర = లోతుగాను, ఆసన్న = సమీపమున ఉన్న, ఘ్రాణవ్రణ = నాసికయందలి వ్రణములలో, ఉపయోగినీ = ఉపయోగించునవి, షట్ - సప్త

అంగులే = ఆరు, ఏడు, అంగుళముల ప్రమాణముగలవి, ద్వే = రెండు.

అష్టాఙ్గుల నవాఙ్గులే = ఎనిమిది,తొమ్మిది అంగుళముల ప్రయాణముకలవి, ద్వే = రెండు యంత్రములు, కర్ణే = చెవియందు తత్ - వత్ - ఏవ = పైవానివలెనే (ఉపయోగించును).

దశ - ద్వాదశ - అఙ్గులే = పది - పంద్రెండు అంగుళముల ప్రమాణము గలవి, ద్వే = రెండు, పాయౌ = గుదమునందు (పైవలెనే ఉపయోగించును).

కర్ణశోధనం = కర్ణశోధన శలాకా యంత్రము, స్రువ ముఖం = చిన్న గరిటవంటి ముఖము గలిగినది. అశ్వత్థ పత్ర అగ్రం = రావి ఆకువంటి కొనగలిగినది.

తథా = అట్లే, జాంబవౌష్ఠాని = నేరేడుపండువంటి అంచులు కలిగిన శలాకాయంత్ర ములు, ద్వాదశ-దశ-అష్ట - అంగులాని = పన్నెండు, పది, ఎనిమిది అంగుళములు గలవై, క్రమాత్ = క్రమముగా। ద్విఅఙ్గుల - అఙ్గుల - అర్ధ అఙ్గుల ఫలాని = రెండు, ఒకటి, అర అంగుళముల ప్రమాణముగల ఫలకములను గలిగియుండి, క్షార - అగ్నికర్మ - అర్థం = క్షార అగ్ని కర్మల కొరకు, (ఉపయోగించును)

**తాత్పర్యము :** చివరలయందు దూది చుట్టబడిన ఆరు శలాకాయంత్రములు, అనేక విధవ్రణములందు చీము, తడి, రక్తము మొదలగునవి తుడుటకు ఉపయోగించును. ఆరు, ఏడు అంగుళముల ప్రమాణముగలవి రెండు నాసికావ్రణములందు క్రమముగా బయట - లోపల ఉండు వ్రణములను తుడుచుటకు ఉపయోగించును, ఇట్లే కర్ణరోగములందుపయో గించునని రెండును ఎనిమిది - తొమ్మిది అంగుళముల ప్రమాణమున ఉండును. గుదము నందుపయోగించు రెండు యంత్రములు పది - పంద్రెండు అంగుళముల ప్రమాణమున ఉండును. కర్ణశోధనకుపయోగించు శలాకా చిన్న గరిటవంటి ముఖము గలిగి రావి ఆకు వంటి కొన గలిగియుండును. జాంబవౌష్ఠములనబడు యంత్రములు పంద్రెండు - పది - ఎనిమిది అంగులముల పొడవునను, రెండు, ఒకటి, అర అంగుళముల ప్రమాణమున ఫలకములను గలిగియుండి క్షారకర్మ, అగ్నికర్మలందుపయోగించును

**వి. వ్యా :** పైన ఆసన్న - దూర వ్రణ ఉపయోగముల కొరకు చెప్పిన శలాకా లలో, కర్ణ - నాసిక గుదాలందు బాహ్యభాగమునకు క్రమముగా సమీపముగాను, లోతుగాను ఉపయోగింపదగినవని భావము.

జామ్బవౌష్ఠములనగా జంబూఫలముఖాకృతి గలవి యని దల్హణ వ్యాఖ్య.

## మరికొన్ని విధముల శలాకాలు — వాని ఉపయోగము

**మూలము :** శలాకాశ్చ స్థూల-సూక్ష్మ దీర్ఘ హ్రస్వముఖ్యాః । అన్తవృద్ధౌ త్వర్ధేన్దు వక్రా మధ్యోర్ధ్వానిర్గత శలాకాః । దహనే నాసార్శోఽర్బుదయోః కోలాస్థిదలమాత్రముఖా వేల్లితోష్ఠా । క్షారవిషౌషధప్రణిధానాయ చ దర్వ్యస్త్రిస్రోఽష్టాంగులా దర్వ్యాకారాః కనిష్ఠికానామికామధ్యమాంగులినఖపరిమాణ నిమ్నముఖాస్తథాఙ్గలి సంస్థానాః । ఉత్తరవస్త్యఙ్జనాదిషు యథాయథమేవోపదిష్టాని ।

ప్రతి పదార్థము : శలాకాశ్చ = శలాకాయ న్త్రిములును, స్థూల = లావైనవి, సూక్ష్మ = సన్ననివి, దీర్ఘ = పొడవైనవి, హ్రస్వ = పొట్టివి, మధ్యాః = మధ్యరకమున నుండునవి. అర్ధఇన్దువక్రా = అర్ధచంద్రాకారమున వంకరగ నుండు, మధ్య - ఊర్ధ్వ - నిర్గత శలాకా = మధ్యలో పైభాగము నుండి బయలుదేరు శలాకా, ఆన్త్రవృద్ధౌ = ఆంత్రవృద్ధి వ్యాధి యందుపయోగింపబడును.

కోల - అస్థి - దల మాత్రముఖా = రేగు గింజపలుకుతో సమానమగు ముఖము గలిగినట్టి శలాకాయంత్రము, నాసా అర్శఅర్బుదయోః = నాసికయందలి అర్శస్సు, అర్బుదములను రోగములందు (ఉపయోగింపబడును).

ఖల్లీ = ఖల్లీయను యంత్రము, తీక్ష్ణోష్ఠా = తీక్ష్ణమగు ఓష్ఠములవంటి అంచులగలది, క్షార - విష - ఔషధ ప్రణిధానాయచ = క్షారము, విషము, ఔషధము (వీనిని వ్యాధిగల ప్రదేశమున) ఉంచుటకు ఉపయోగింపబడును.

దర్వ్యః = దర్వులనబడు శలాకా యంత్రములు, త్రిసః = మూడు, అష్టాఙ్గులాః = ఎనిమిది అంగుళముల ప్రమాణముననుండును, దర్వీ ఆకారాః = గరిట ఆకారమున నుండును, కనిష్ఠికా - అనామికా - మధ్యమా అఙ్గులీ = చిటికెనవ్రేలు, అనామిక, మధ్యవ్రేలియొక్కయు, నఖ = గోళ్లయొక్క, పరిమాణసమాన = పరిమాణము గల, నిమ్నముఖాః = వంగిన ముఖముగలవి. తథా = అట్లే, అఞ్జలి సంస్థానాః దోసిలివలె ఉండునవియు (అగును).

ఉత్తరబస్తి - అఞ్జన - ఆదిషు = ఉత్తరవస్తి కర్మ, అంజనకర్మ మొదలగువాని యందు, యథాయథమేవ = ఆయాపనులకనుకూలమగు రీతిన, ఉపదిష్టాని = చెప్పబడినవి.

తాత్పర్యము : శలాకాయంత్రములు లావైనవి, సన్ననివి, పొడవైనవి, పొట్టివి, మధ్యరకమైనవి గాను వివిధ రీతులుగా నుండును. అర్ధచంద్రాకారముగ నుండి మధ్యలో పైభాగమునుండి బయలుదేరు చువ్వగలిగినట్టి శలాకా ఆంత్ర వృద్ధియందును; రేగుగింజ బద్ద వలె ముఖము గలిగిన శలాకా నాసార్శస్సు, అర్బుదములందును; తీక్ష్ణమగు ఓష్ఠములు గలిగిన ఖల్లీయంత్రము వ్యాధిప్రదేశములపై క్షార - విష - ఔషధములను వేయుటకును ఉపయోగించును. దర్వీయను శలాకా యంత్రములు మూడు. ఇవి ఎనిమిది అంగుళముల ప్రమాణముగలిగి గరిటవలె ఉండును క్రమముగా ఇవి కనిష్ఠిక, అనామిక, మధ్యమాంగుళుల గోళ్ల పరిమాణము, వంగిన ముఖములు గలిగి దోసిలివలె యుండును.

ఉత్తరవస్తి, అంజనము మొదలగు వానియందు ఆయాక్రియలకనుకూలముగ నుండు శలాకా యంత్రములు చెప్పబడినవి.

### అనుయంత్రముల వివరణ

మూలము : అనుయన్త్రాణ్యయస్కాన్తరజ్జు చర్మాన్త్రవస్త్రాశ్మముద్గర పాణిపాద తలాంగులి జిహ్వాదన్తముఖ శాఖానఖ జాలచలకాలపాకహర్ష భయాని ।

ప్రతిపదార్థము : అయస్కాన్త = అయస్కాంతము, రజ్జు = త్రాడు, చర్మ = చర్మము, అన్త్ర = ప్రేవులు, వస్త్ర = బట్ట, అశ్మ = రాయి, ముద్గరము = సమ్మెట, పాణి =

అరచేయి, పాదతల = అరికాలు, అంగులి = వ్రేలు, జిహ్వా = నాలుక, దంత = దంతము, ముఖ = నోరు, శాఖా = శాఖ, నఖ = గోరు, బాల = వెంట్రుకలు, చల = గాలి, కాల = కాలము, పాక = పాకము, హర్ష = సంతోషము, భయ = భయము (అనునవి), అను యన్త్రాణి = అనుయంత్రములు.

**తాత్పర్యము :** అయస్కాంతము, త్రాళ్లు, చర్మము, ప్రేవులు, వస్త్రము, రాళ్లు, సమ్మెట, అరచేయి, అరికాలు, వ్రేళ్లు, నాలుక, దంతములు, ముఖము, గోళ్లు, వెంట్రుకలు, గాలి, కాలము, పాకము, హర్షము, భయము ఇవి అనుయంత్రములు.

**వి. వ్యా.** స్వల్ప యంత్ర కార్యములను చేయునవి అనుయంత్రములని అరుణదత్త వ్యాఖ్య. యంత్ర సదృశ కార్యములను చేయుచు యంత్రాకృతిని లేనివి అని చన్ద్రినన్దనవ్యాఖ్య. వీనినే హీనయంత్రములని కొందరందురని డల్హణుని వివరణ. సుశ్రుతుడు వీనినే ఉప యంత్రములని వర్ణించెను. "ఉపమితాని యంత్రై రిత్యుపయన్త్రాణి" అని హారాణ చంద్రుని నిర్వచనము.

**మూలము॥** ఏతాని దేహే సర్వస్మిన్ దేహస్యావయవేఽపి వా।
సన్ధౌ కోష్ఠ ధమన్యాం చ యథా యోగం ప్రయోజయేత్।

*ప్రతి పదార్థము :* ఏతాని = ఇవి, సర్వస్మిన్ = సమస్తమైన, దేహే = దేహమునందు గాని, దేహస్య = దేహము యొక్క, అవయవే-అపి-వా = అవయవమునందైనను, సంధౌ = సంధియందును, కోష్ఠే = కోష్ఠమునందును, ధమన్యాం-చ = ధమనులయందును, యథా యోగం = ఉపయోగము ననుసరించి, ప్రయోజయేత్ = ప్రయోగించవలెను.

**తాత్పర్యము :** ఈ అనుయంత్రములను అవసరము ననుసరించి దేహమంతటను గాని, అవయవములందుగాని, సంధులు, కోష్ఠము లేక ధమనులందుగాని ప్రయోగించ వలెను.

## యంత్రములయొక్క ఇరువది నాలుగు కర్మలు

**మూలము ॥** యన్త్రకర్మాణి తు నిర్ఘాతనపూరణబన్ధనవ్యూహనపరివర్తన చాలన వివర్తన పీడన మార్గశోధన వికర్షణాహరణ వ్యధనోన్నమనవినమన భఞ్జనోన్మథనా చూష ణైషణదారణర్జుకరణ ప్రక్షాళన ప్రథమనాఞ్జన ప్రమార్జనాని బాహుశ్యేన చతుర్వింశతిర్భవన్తి ।

*ప్రతిపదార్థము :* యన్త్రకర్మాణి తు = యంత్రముల యొక్క పనులైతే, బాహు శ్యేన = ఎక్కువగా, నిర్ఘాతన = కొట్టుట, పూరణ = నింపుట, బన్ధన = కట్టుట, వ్యూహన = (వ్రణాదులను చూచుటకై) తెరచుట, పరివర్తన = త్రిప్పుట, చాలన = కదిలించుట, వివర్తన = తెరచుట లేక విడదీయుట, పీడన = వత్తుట, మార్గ-శోధన = మార్గములను శుద్ధి చేయుట, వికర్షణ = పట్టుకొని లాగుట, ఆహరణ = శల్యాదులను వెలికిదీయుట, వ్యధన = సిరా వేధాదులను చేయుట, ఉన్నమన = పైకెత్తుట, వినమన = వంచుట, భఞ్జన = (శల్య మును) ఖండించుట, ఉన్మథన = మర్దించుట, ఆచూషణ = పీల్చుట, ఏషణ = వెదకుట, దారణ = చీల్చుట, ఋజుకరణ = సూటిగానుండునట్లు చేయుట, ప్రక్షాళన = కడుగుట

ప్రధమన =(ఓషధీ చూర్ణములను) ఊదుట, అఞ్జన = నేత్రములందు అంజనమువేయుట, ప్రమార్జనాని = తుడుచుట (అనునవి), చతుర్వింశతిః = ఇరువదినాలుగు, భవన్తి = అగుచున్నవి.

తాత్పర్యము : నిర్ఘాతనము, పూరణము, బంధనము, వ్యూహనము, పరివర్తనము, చాలనము, వివరణము, పీడనము, మార్గశోధనము, వికర్షణము, ఆహరణము, వ్యధనము, ఉన్నమనము, వినమనము, భంజనము, మథనము, ఆచూషణము, ఏషణము, దారణము, ఋజూకరణము, ప్రక్షాళనము, ప్రధమనము, అంజనము, పరిమార్జనము అను ఇరువదినాలుగును యంత్రములయొక్క ముఖ్యములగు కర్మలు.

శశిలేఖ : పరివర్తనం అనగా అన్యముఖముగా నుండుదానిని సమ్ముఖీకరణము చేయుట (తనవైపునకు త్రిప్పుట). వివరణం అనగా ప్రకాశనం, వికర్షణం అనగా అన్య మార్గమునకు తీసుకొనిపోవుట.

వి. వ్యా. అష్టాంగహృదయమున పదునైదు కర్మలు వివరింపబడినవి. అవి:— నిర్ఘాతనము, ఉన్మథనము, పూరణము, మార్గశుద్ధి, సంవ్యూహనము, ఆహరణము, బంధనము, పీడనము, ఆచూషణము, ఉన్నమనము, నామనము, చాలనము, భంగము, వ్యావర్తనము, ఋజూకరణము.

## కంకముఖ యంత్ర విశిష్టత

మూలము ॥ వివర్తతే సాధ్వవగాహతే చ గ్రాహ్యం గృహీత్వోద్ధరతే చ యస్మాత్ ।
యన్త్రేష్వతః కఙ్కముఖం ప్రధానం స్థానేషు సర్వేష్వవికారి యచ్చ॥

ప్రతి పదార్థము : కఙ్కముఖం = కంకముఖమను యంత్రము, యస్మాత్ = ఎందువలన, వివర్తతే = బాగుగాతిరుగునో, సాధు = బాగుగా, అవగాహతే చ =(వ్రణాదులందు) ప్రవేశించునో, గ్రాహ్యం = పట్టదగిన దానిని, గృహీత్వా = పట్టుకొని, ఉద్ధరతే చ = పెకలించును గూడనో, యత్ చ = ఏ కంకముఖయంత్రమైతే, సర్వేషు = అన్ని, స్థానేషు = స్థానములందును, అవికారి = వికారమును గలుగజేయదో, అతః = ఆకారణము వలన, యన్త్రేషు = యంత్రములలో, కఙ్కముఖం = కంకముఖయంత్రము, ప్రధానం = ముఖ్యమైనది.

తాత్పర్యము : బాగుగా తిరుగునదై, వ్రణాదులందు ప్రవేశించి పట్టుకొనవలసిన శల్యాదులను పట్టుకొని, పెకలించుటకుపయోగపడునదిగా నుండి, అన్ని స్థానములందును వికారమును కలిగించకుండుటచే కంకముఖ యంత్రము యంత్రములన్నింటిలో ముఖ్యమైనది.

శశిలేఖ : అవగాహతే అనగా ప్రవేశించుట; గ్రాహ్యం అనగా శల్యమును గ్రహించునది. అన్నిస్థానము లందును వికారములను చూపకుండుటచే కంకముఖము ప్రధానమైనది.

## ఇరువది ఆరు శస్త్రముల వివరణ

మూలము ॥ శస్త్రాణి షడ్వింశతిర్భవన్తి। తద్యథా- దంతలేఖన మండలాగ్ర వృద్ధిపత్రోత్పల పత్రాధ్యర్ధధార-ముద్రికా- కర్తరీ-సర్పవక్త్రకరపత్ర కుశపత్రాటా

ముఖాన్తరముఖ శరారిముఖ త్రికూర్చకుఠారికా-వ్రీహిముఖ శలాకా వేతసపత్రారా కర్ణవ్యధన సూచీసూచీకూర్చ ఖజైషణీ బడిశనఖశస్త్రాణి॥

ప్రతిపదార్థము: శస్త్రాణి = శస్త్రములు, షడ్వింశతిః = ఇరువది ఆరు, భవన్తి = అగును, తద్యథా = అది ఎట్లనగా, దంతలేఖన = దంతలేఖనము, మండలాగ్ర = మండలాగ్రము, వృద్ధిపత్ర = వృద్ధిపత్రము, ఉత్పలపత్ర = ఉత్పలపత్రము, అధ్యర్ధధార = అధ్యర్ధధార, ముద్రికా = ముద్రిక, కర్తరీ = కత్తెర, సర్పవక్త్ర = సర్పవక్త్రము, కరపత్ర = కరపత్రము, కుశపత్ర = కుశపత్రము, ఆటాముఖ = ఆటాముఖము, అంతర్ముఖ = అంతర్ముఖము, శరారీముఖ = శరారీముఖము, త్రికూర్చ = త్రికూర్చము, కుఠారికా = కుఠారిక, వ్రీహీముఖ = వ్రీహీముఖము, శలాకా = శలాక, వేతసపత్ర = వేతసపత్రము, ఆరా = ఆరా, కర్ణవ్యధన సూచీ = కర్ణవేధ సూది, సూచీ = సూది, కూర్చ = కూర్చము, ఖజ = ఖజము, ఏషణీ = ఏషణి, బడిశ = బడిశము, నఖ-శస్త్రాణి = నఖ శస్త్రములు. (అని గలవు).

తాత్పర్యము: శస్త్రములు ఇరువది ఆరు గలవు. అవి: దంతలేఖనము, మండలాగ్రము, వృద్ధిపత్రము, ఉత్పలపత్రము, అధ్యర్ధధార, ముద్రికా, కర్తరీ, సర్పవక్త్రము, కరపత్రము, కుశపత్రము, ఆటాముఖము, అంతర్ముఖము శరారీముఖము, త్రికూర్చము, కుఠారిక, వ్రీహీముఖము, శలాకా, వేతస పత్రము, ఆరా, కర్ణవ్యధన సూచీ, సూచీ, కూర్చము, ఖజము, ఏషణీ, బడిశము, నఖశస్త్రము అనునవి.

## శస్త్రముల వర్ణన — నిర్మాణము

మూలము ॥ ప్రాయశశ్చ తాని షడఙ్గులాని సుధ్మాతావర్తితాయో ఘటితాన్యుత్పలపత్రనీలాని సుగ్రహాణి, సురూపాణి సుధారాణి సుసమారాహిత ముఖాగ్రాణ్యకరాళాని ప్రత్యేకం చ ప్రాయో ద్విత్రాణి స్వప్రమాణార్థచతుర్థభాగఫలాని తాని వ్యాధిదేశవశాత్ ప్రయుఞ్జీత। తేషాం నామభిరేవాకృతయః ప్రాయేణ యంత్రవద్వ్యాఖ్యాతాః॥

ప్రతి పదార్థము: ప్రాయః చ = తరచుగానున్నూ, తాని = ఆ శస్త్రములు, షడఙ్గులాని = ఆరు అంగుళముల ప్రమాణము గలవి. సు-ధ్మాత = బాగుగా ఊదబడి, ఆవర్తిత = త్రిప్పబడిన, అయస్ = ఇనుముతో, ఘటితాని = కూర్చబడినవి. ఉత్పలపత్రనీలాని = కలువరేకువలె నల్లనైనవి. సుగ్రహాణి = సులభముగా పట్టుకొన వీలైనవి, సురూపాణి = మంచిరూపముగలవి, సు-ధారాణి = మంచి వాడియగు అంచులుగలవి, సు-సమాహిత = బాగుగా కూర్చబడిన, ముఖ-అగ్రాణి = ముఖము, అగ్రము గలవి, అ-కరాళాని = భయంకరము గానివి, (అట్లు ఉండవలెను), ప్రత్యేకం-చ = (వీనిలో) ప్రతిఒక్కటియును, ప్రాయః = తరచుగా, ద్విత్రాణి = రెండు-మూడుగా (ఉండవలెను). తాని = ఆశస్త్రములను, స్వప్రమాణ = తమ ప్రమాణము, అర్ధ = సగము ప్రమాణము, చతుర్థభాగ = నాలుగవవంతు ఫలాని = ప్రమాణము, ఫలముగా గలవానిని, వ్యాధి-దేశ-వశాత్ = వ్యాధి, ప్రదేశములను బట్టి, ప్రయుఞ్జీత = ప్రయోగించవలెను.

తేషాం = వాని యొక్క, నామభిః ఏవ = పేరులతోనే, ఆకృతయః = ఆకారములు,

ప్రాయేణ = సామాన్యముగా, యన్త్రవత్ = యంత్రములకువలెనే, వ్యాఖ్యాతాః = వ్యాఖ్యానింపబడినవి.

తాత్పర్యము : సామాన్యముగా ఆశస్త్రములు ఆరు అంగుళముల ప్రమాణము గలిగి, బాగుగా ఊదబడి, త్రిప్పబడిన (కరిగించిన) ఇనుముతో చేయబడియుండును. కలువరేకుల వంటి వర్ణముకలిగి, సులభముగా పట్టుకొనదగియుండి, మంచి ఆకృతి, తగిన వాడి యగు అంచులు కలిగి, సరిగా కూర్చబడిన ముఖము, అగ్రము గలిగి, భయంకరము గాకుండునట్లు (చూచుటకు ఇంపుగా) ఉండవలెను. ఒక్కొక్క రకమునకు రెండు మూడు శస్త్రములుండవలెను. స్వప్రమాణము, అర్ధప్రమాణము, చతుర్థభాగ భాగప్రమాణమున ఫలములు గలిగియుండి శస్త్రములుండవలెను. వీనిని వ్యాధి, శరీరప్రదేశముల కనుగుణముగా ప్రయోగించవలెను. యంత్రములవలెనే శస్త్రములుగూడ పేర్లనుబట్టి ఆకారములు వివరించబడినవి.

వి. వ్యా: అష్టాంగహృదయమునగూడ ఇరువది ఆరు శస్త్రములు చెప్పబడినవి. వీని లక్షణములు గూడ ఇట్లే చెప్పబడినవి. విశేషముగా రోమశాతన సమర్థములుగా-అనగా-వెంట్రుకలను నిలువుగా చీల్చునంతటివిగా నుండవలెనని చెప్పబడినది.

## ద్వాదశవిధ కర్మలందు శస్త్రముల ఉపయోగము

**మూలము :** తత్రద్వయమాద్యం లేఖనే। వృద్ధి పత్రాదీని త్రీణి పాటనే చత్వారి భేదనే। మణ్డలాగ్రాదీన్యష్టౌ ఛేదనే। కుశపత్రాదీని పఞ్చ ప్రచ్ఛానే। కుఠారికాదీని షట్ వ్యధనే। తేషామారా-వ్రీహిముఖే భేదనే ఛేదనే చ। సూచ్యః సీవనే। సూచీకూర్చః కుట్టనే। ఖజో మథనే। ఏషణ్యేషణే భేదనే చ। బడిశో గ్రహణే। నఖశస్త్రముద్ధరణే ఛేద్య భేద్య లేఖ్య ప్రచ్ఛానేషు చ। ఇతి ద్వాదశవిధే కర్మణ్యుపయోగః।

*ప్రతి పదార్థము :* తత్ర = అందు, ఆద్యం ద్వయం = మొదటి రెండు శస్త్రములు, లేఖనే = లేఖన కర్మయందుపయోగించును, వృద్ధిపత్రాదీని త్రీణి = వృద్ధిపత్రము మొదలుకొని మూడు శస్త్రములు, పాటనే = పాటనకర్మ (చీల్చుట) యందు; (వృద్ధిపత్రాదీని) చత్వారి = (వృద్ధిపత్రము మొదలుకొని) నాలుగు శస్త్రములు, భేదనే = భేదనకర్మ (పగులగొట్టుట) యందు; మండలాగ్రాదీని - అష్టౌ = మండలాగ్రము మొదలుకొని ఎనిమిది శస్త్రములు, ఛేదనే = ఛేదన కర్మయందు; కుశపత్రాదీని పఞ్చ = కుశపత్రము మొదలుకొని అయిదు శస్త్రములు, ప్రచ్ఛానే = ప్రచ్ఛానకర్మ (ఎక్కువ లోతులేకుండ కోయుట) యందు; కుఠారికాదీని షట్ = కుఠారిక మొదలుకొని ఆరుశస్త్రములు, వ్యధనే = వ్యధనమునందును; తేషాం = ఆ ఆరింటిలో, ఆరా-వ్రీహిముఖే = ఆరా, వ్రీహిముఖ శస్త్రములు, భేదనే = భేదన కర్మయందు, ఛేదనే-చ = ఛేదనకర్మయందును; సూచ్యః = సూదులు, సీవనే = సీవనకర్మ (కుట్టుట) యందు, సూచీకూర్చః = సూచీకూర్చ శస్త్రము, కుట్టనే = కుట్టనకర్మయందు, ఖజః = ఖజశస్త్రము, మథనే = మథనకర్మయందు; ఏషణీ = ఏషణీశస్త్రము, ఏషణే = ఏషణ కర్మ (వెదకుట) యందు; భేదనే-చ = భేదనకర్మయందును, బడిశః = బడిశ శస్త్రము, గ్రహణే = గ్రహణకర్మ (పట్టుకొనుట) యందును; నఖశస్త్రం = నఖశస్త్రము, ఉద్ధరణే = ఉద్ధరణకర్మ = (పైకెత్తుట) యందును; ఛేద్య-భేద్య-లేఖ్య-ప్రచ్ఛానేషు-చ = ఛేదింపదగిన,

భేదింపదగిన, లేఖనము చేయదగిన, ప్రచ్ఛానము చేయదగిన వ్యాధులందును ఉపయోగించును.

ఇతి = ఈవిధముగా, ద్వాదశవిధే-కర్మణి = పన్నెండు విధములగు కర్మలందు, ఉపయోగః = (శస్త్రములయొక్క) ఉపయోగము (అగును).

తాత్పర్యము : పై జెప్పిన శస్త్రములలో మొదటి రెండును లేఖన కర్మయందును, వృద్ధిపత్రము మొదలుకొని మూడు యుపాటన కర్మయందు; నాలుగును భేదనకర్మయందు, మండలాగ్రము మొదలుకొని ఎనిమిది ఛేదనకర్మయందు; కుశపత్రాదికములైదును ప్రచ్ఛానమునకు; కుఠారికాది ఆరును వేధన కర్మయందును, వీనిలోని ఆరా-వ్రీహిముఖ శస్త్రములు భేదన-ఛేదన కర్మలందును, సూదులు సీవ్యకర్మయందును, సూచీకూర్చము కుట్టనమునకును; ఖజశస్త్రము మథనమునకు, ఏషణిఏషణకర్మకు, బడిశము పట్టుకొనుటకు, వఖశస్త్రము ఉద్ధరణకర్మకు, ఇంకను ఛేద్య, భేద్య, లేఖ్య, ప్రచ్ఛానములందును ఉపయోగింపబడును.

శస్త్రములయొక్క ఉపయోగము ద్వాదశ విధ కర్మలందు ఇట్లు చెప్పబడినది.

శౌశలేఖ : వ్యధనమనగా తాడనము.

వి. వ్యా : శస్త్రకృత్యములను అష్టాంగ హృదయకారు డీక్రిందివిధముగా వివరించెను. ఉత్పాట్యము (పెళ్లగించుట), పాట్యము (చీల్చుట), సీవ్యము (కుట్టుట), ఏష్యము (వ్రణమార్గమును పరీక్షించుట), లేఖ్యము (గీకుట), ప్రచ్ఛనము (చెక్కుట), కుట్టనము (పొడుచుట) ఛేద్యము (ఛేదించుట), భేద్యము (బ్రద్దలుచేయుట), వేధనము (గుచ్చుట), మంథనము (చిలుకుట), గ్రహణము (పట్టుకొనుట), దాహము (కాల్చుట).

## ప్రత్యేక శస్త్రవర్ణన - ప్రయోగము

మూలము ॥ విశేషతస్తు దంతలేఖనం ప్రబద్ధవచ్చతురస్ర మేకధారం దంతశర్కరాలేఖనే। మణ్డలాగ్రం ప్రదేశిన్యన్తర్నఖవిస్తృతఫలం తల్లేఖనవిచ్ఛేదనయోర్వర్త్మరోగోత్పన్న దంతమాంసదుర్నివిష్టవ్రణగళశుండికాదిషు ప్రయోజ్యమ్। వృద్ధి పత్రం క్షురాకారం తత్తూన్నతే గమ్భీరేవాశ్వయథావృజు సూచ్యగ్రమిష్టం విపరీతేతు పృష్ఠతోఽవనతధారమ్। అంగుళిశస్త్రకం ముద్రికానిర్గతముఖం వృద్ధిపత్రమణ్డలాగ్రాన్తర్ధారాన్యతమ తుల్యార్ధాంగుళాయతధారం ప్రదేశినీ ప్రథమపర్వప్రమాణార్పణ వృత్తముద్రికం దృఢసూత్రప్రతిబద్ధం కణ్ఠరోగేషు ప్రయుజ్యతే। కర్తరీ త్రిఖాశపాశా వ్రణస్నాయుకేశసూత్రచ్ఛేదనార్థమ్। పర్పవక్త్రం వక్రమర్ధాంగుళఫలం ఘ్రాణకర్ణార్శోఽర్బుదచ్ఛేదనార్థమ్। కరపత్రం దశాఙ్గులం ద్వ్యఙ్గులవిస్తారం సూక్ష్మదన్తం ఖరధారం సుత్సరునిబద్ధమస్థిచ్ఛేదనార్థమ్। కుశాపత్రాటాముఖే ద్వ్యఙ్గులఫలే। అంతర్ముఖమర్ధచన్ద్రాకారాధ్యర్ధాఙ్గుళఫలమ్। కుఠారికా పృథుదణ్డా గోదన్తాకారార్ధాఙ్గుళఫలాస్థ్యాశ్రితసిరావ్యధార్థా। వ్రీహిముఖ మధ్యర్ధాఙ్గుళఫలం మాంసలప్రదేశ సిరావ్యధార్థం। వర్త్మోదర గుల్మవిద్రధ్యాది వ్యధనభేదనార్థం చ। శలాకోభయతోముఖీ కురబక ముకులాగ్రా తామ్రమయీ లిఙ్గనాళవ్యధార్థా। ఆరా చతురస్రాఽర్ధాఙ్గుల వృత్తముఖా తావత్ప్రవేశాబర్హల కర్ణపాళీవ్యధార్థా

పక్వామం శోషసందేహభేదనార్థా చ। కర్ణవ్యధనం త్ర్యఙ్గులాయతమఙ్గుల సుషిరం ఘనం వా యూథికాముకులాగ్రం । సూచ్యస్తిస్రో వృత్తా నిగూఢ దృఢపాశాః । తత్రమాంసలేష్వవకాశేషు త్ర్యఙ్గులా త్ర్యస్రాగ్రా, సన్ధ్యస్థిత్రణేష్వల్పమాంసేషు చ ద్వ్యఙ్గులావృత్తా, పక్వామాశయయోర్మర్మసు చ సార్థద్వ్యఙ్గులా ధనుర్వక్రా వ్రీహిముఖా చ। సూచీకూర్చో వృత్తైక మూలోఽగ్రేసునిబద్ధ సప్తాష్టసూచికః కుష్ఠ శ్విత్రవ్యఙ్గేంద్రలుప్తాదిషు। ఖజస్త్వర్ధాఙ్గులాయతోఽష్టకణ్టకముఖస్తామ్రో లౌహో వా నాసాఖ్యన్తరతః శోణితమోక్షణార్థః । ఏషణ్యౌ ద్వే సుశ్లక్ష్ణే స్పర్శే। తయో రేకాష్టాఙ్గులా గతికోశశల్యస్రావవత్సువ్రణేషు సుషిరాన్వేషణే । అన్యాసూచీ సంస్థానా క్షారా క్తసూత్రప్రతిబద్ధా నాడీనాం భగందరగతీనాం చ భేదనే । ఖడిశోఽ త్యవనతముఖః సూచీతీక్ష్ణాగ్రోగ్రహణే గిళశుణ్డికార్మాదేః । నఖశస్త్రమష్టాఙ్గుళ మేకతోఽశ్వకర్ణ ముఖమన్యతో వత్సదన్తముఖం సూక్ష్మ శల్యోద్ధృతౌ ।

*ప్రతి పదార్థము :* విశేషతస్తు = విశేషించి యైతే (విశిష్టములైన స్వరూప ఉపయోగములందైతే), దన్తలేఖనం = దంతలేఖన శస్త్రము, ప్రబద్ధవత్ = ప్రబద్ధము వలె, చతురస్రం = నలు మూలలు గలదియు, ఏక-ధారం = ఒక అంచుగలదియునై, దన్తశర్కర-ఆలేఖనే = దంతశర్కరను గికుటయందు, (ఉపయోగించును). మణ్డలాగ్రం = మణ్డలాగ్ర శస్త్రము, ప్రదేశినీ = చూపుడు వ్రేలియొక్క, అన్తర్నఖ-విస్తృతఫలం = గోటిలోపలి కొలత యంత విస్తరించిన ఫలకముగలిగి, తత్ = అది, లేఖన-విచ్ఛేదనయోః = లేఖన, విచ్ఛేదన కర్మలయందును, వర్త్మరోగ = కనురెప్పల వ్యాధులందును, దంతమాంస = చిగుళ్లలో, ఉత్పన్న = పుట్టినట్టియు, దుర్నివిష్ట = చెడుగా ప్రవేశించిన, వ్రణ = వ్రణములందును, గళశుండికాదిషు = గళశుండికా మొదలగు వ్యాధులందును, ప్రయోజ్యం = ప్రయోగింపదగినది.

వృద్ధిపత్రం = వృద్ధిపత్రమను శస్త్రము, క్షురాకారం = మంగలికత్తి ఆకారముగలది, తత్-తు = అదియైతే, అన్నతే = ఎత్తుగానుండునది గాని, గమ్భీరేవా = లోతైనదిగానియైన, శ్వయథౌ = = శోథయందు, ఋజు = సూటిగానుండునది, సూచ్యగ్రం = సూదిమొన గలదియు, ఇష్టం = సమ్మతించబడినది, విపరీతేతు = ఇంతకంటె వేరగు శోథయందు, పృష్ఠతః-అవనతధారం = వెనుకవంగిన అంచుగలది (ఇష్టం = సమ్మతించబడినది).

అంగుళీ శస్త్రకం = అంగుళీ శస్త్రకము, ముద్రికా నిర్గత ముఖం = ఉంగరమువలె వెలుపలికి ముఖముగలిగి, వృద్ధిపత్ర-మణ్డలాగ్రా న్తర్ధారాన్యతమ-తుల్యః = వృద్ధిపత్రము, మండలాగ్రము, అంతర్ధారా శస్త్రములలో ఏదైన ఒకదానితో సమానమగు, అర్ధాంగుళాయత = అర అంగుళము పొడవైన, ధారం = అంచుగలదియు, ప్రదేశినీ = చూపుడువ్రేలి యొక్క, ప్రథమ-పర్వ-ప్రమాణ-అర్పణవృత్త = మొదటి కణుపు పట్టునంత గుండ్రని, ముద్రికం = ఉంగరము గలదియు, దృఢ సూత్ర ప్రతిబద్ధం = దారముచే గట్టిగ కట్టబడినదియు (గా నుండును). కంఠరోగేషు = కంఠరోగములందు (ఛేదన భేదనములకు), ప్రయుజ్యతే = ప్రయోగింపబడును.

కర్తరీ = కత్తెర, త్రిభాగపాశా = మూడవభాగమున కీలబద్ధమై, వ్రణ = వ్రణము, స్నాయు = స్నాయువులు, కేశ = వెండ్రుకలు, సూత్ర = దారములు, ఛేదనార్థం = కత్తి

రించుటకు (ఉపయోగించును).

సర్ప వక్త్రం = సర్పవక్త్రశస్త్రము, వక్రం = వంకరగానుండి, అర్ధాంగుళఫలం = అర అంగుళపు ఫలకము (అలుగు) కలిగినదియై, ఘ్రాణ-కర్ణ-అర్శ-అర్బుద-ఛేదనార్థం = ముక్కు, చెవిలోని అర్శస్సు అర్బుదములను ఛేదించుటకై (ఉపయోగించును).

కరపత్త్రం = కరపత్రశస్త్రము (అంపము), దశాంగులం = పది యంగుళముల పొడవు గలదియు, ద్వ్యంగుళవిస్తారం = రెండంగుళముల వెడల్పుగలది, సూక్ష్మదన్తం = సన్నని పళ్ళు గలిగి, ఖరధారం = వాడియైన అంచుగలిగి, సుత్సరునిబద్ధం = చక్కని పిడియందు అమర్చబడినదై, అస్థిచ్ఛేదనార్థం = అస్థులను ఛేదించుటను (ఉపయోగించును).

కుశపత్ర-ఆటాముఖే = కుశపత్రము, ఆటాముఖము అను రెండు శస్త్రములు, ద్వ్యంగుళ-ఫలే = రెండు అంగుళముల ఫలము గలవి.

అంతర్ముఖం = అంతర్ముఖశస్త్రము, అర్ధచన్ద్రాకారం = అర్థచంద్రుని ఆకారము, అధ్యర్ధాంగుళఫలం = ఒకటిన్నర అంగుళముల ఫలకమును (గల్గియుండును).

కుఠారికా = కుఠారికా శస్త్రము (గొడ్డలి), పృథుదణ్డా = పొడవైన కర్రగలిగినది. గోదన్త-ఆకారా = గోదంతము వంటి ఆకారము గలది, అర్ధాంగుళఫలం = అర అంగుళపు ఫలకము గలదియునై, అస్థి-ఆశ్రిత-సిరా-వ్యధార్థా = అస్థులను ఆశ్రయించియుండు సిరలను వేధించుటకు (ఉపయోగించును).

వ్రీహిముఖం = వ్రీహిముఖ శస్త్రము, అధ్యర్ధాంగుళఫలం = ఒకటిన్నర అంగుళముల ఫలకము గలదియై; మాంసల ప్రదేశ సిరా వ్యధార్థం = అధికముగా మాంసముండు ప్రదేశము నందలి సిరావేధకు, వర్ధ్మ-ఉదర-గుల్మ-విద్రధి-ఆది = వర్ధ్మము (ఆంత్రవృద్ధి), ఉదరము, గుల్మము, విద్రధి మొదలగు వ్యాధులయొక్క, వ్యధన-ఛేదనార్థంచ = వ్యధన, ఛేదన కర్మలకును (ఉపయోగించును),

శలాకా = శలాకాయను శస్త్రము, ఉభయతోముఖీ = ఇరువైపుల ముఖములుగలదియు, కురబకముకులాగ్రా = (ఎర్రపూల పెద్ద) గోరింట మొగ్గవంటి అగ్రము గలదియు, తామ్రమయిం = రాగితో నిర్మించబడినదియై, లిఙ్గనాశ వ్యధార్థా = లింగనాశము అను వ్యాధియందు వ్యధనముకొరకు (ఉపయోగింపబడును).

ఆరా = ఆరాయను శస్త్రము, చతురస్రా = నాలుగు మూలలు గలదియు, అర్ధాంగుళ-వృత్తముఖా = అరంగుళము గుండ్రని ముఖము గలదియు, తావత్-ప్రవేశా = ఆ అరంగుళమే ప్రవేశించునదియునై, ఉప్పల-కర్ణపాలీ వ్యధార్థా = లావైన కర్ణపాలీని వేధనము చేయుటకు (ఉపయోగింపబడును). పక్వ-ఆమ-శోఫ సందేహ భేదనార్థాచ = పక్వ అపక్వ సందేహముండు సోఫలను భేదించుటకు (ఉపయోగింపబడును).

కర్ణవ్యధనం = కర్ణవ్యధన శస్త్రము, త్ర్యంగుళాయతం = మూడు అంగుళముల పొడవు గలదియు, అంగుళ సుషిరం = ఒక అంగుళము రంధ్రముగలదై, ఘనం వా =

లావైనదియు, యూథికాముకులాగ్రం = పెద్దగోరింట మొగ్గవంటి మొనగలదై (యుండును),

సూచ్యః = సూదులు, త్రిసః = మూడు (విధములు). వృత్తాః = గుండ్రనివి, నిగూఢ-దృఢపాశాః = కనబడనట్టి, గట్టి దారము కలిగినవి, తత్ర = అందు, మాంసలేషు-అవ-కాశేషు = ఎక్కువ మాంసముగల ప్రదేశములందు, త్ర్యంగుళా = మూడు అంగుళములు గలదియు, త్ర్యస్యాగ్రా = అగ్రభాగమున త్రికోణముగా నుండునదియు, అల్పమాంసేషు = కొలది మాంసముగల ప్రదేశములందు, సంధి-అస్థి-వ్రణేషు = సంధులందును, అస్థులందును గలుగు వ్రణములందు, ద్వ్యంగుళా = రెండు అంగుళముల ప్రమాణముగలదియు, వృత్తా = గుండ్రగ నుండునదియును; పక్వ-ఆమాశయయోః = పక్వాశయ, ఆమాశయములందును, మర్మసుచ = మర్మలయందును, సార్థద్వ్యంగుళా = రెండున్నర అంగుళములు గలదియు, ధనుర్వక్రా = ధనుస్సువలె వంకరగా నుండునదియు, వ్రీహి ముఖా = వరిధాన్యపు ముల్లువంటి కొనగలదియు (ఉపయోగింపబడును).

సూచీకూర్చః = సూచీకూర్చ శస్త్రము, వృత్తైకమూలః = గుండ్రంగానుండు మూలము గలదై, అగ్రే = చివర, సు-నిబద్ధ = బాగుగా అమర్చబడిన, సప్తాష్టసూచికః = ఏడెనిమిది సూదులు గలదియై, కుష్ఠ-శ్విత్ర-వ్యంగ-ఇంద్రలుప్తాదిషు = కుష్ఠము, శ్విత్రము, వ్యంగము, ఇంద్రలుప్తము మొదలగు వ్యాధులందు (లేఖన కర్మకై ఉపయోగింపబడును).

ఖజస్తు = ఖజశస్త్రమైతే, అర్ధాంగుళాయతః = అర అంగుళము పొడవుగలదియు, అష్ట కణ్టకముఖః = ఎనిమిది ముళ్లతో (సూదులతో) గూడిన ముఖము గలదియు; తామ్ర-లౌహో-వా = రాగి లేక ఇనుముతో చేయబడినదై, నా సాభ్యన్తరతః = ముక్కు లోపలి భాగమునుండి, శోణిత మోక్షణార్థః = రక్త మోక్షణము చేయుటకు (ఉపయోగింపబడును).

ఏషణ్యౌ = ఏషణీ శస్త్రములు, సుశ్లక్ష్ణ స్పర్శే = చక్కని నునుపగు స్పర్శగలిగినవై, ద్వే = రెండు విధములు; తయోః = వానిలో, ఏకా = ఒకటి, అష్టాంగుళా = ఎనిమిది అంగుళముల ప్రమాణమున నుండి, గతి-కోశ-శల్య స్రావత్సు = గతి, కోశము, శల్యము, స్రావముగల, వ్రణేషు = వ్రణములందు, సుషిరాన్వేషణే = రంధ్రమును వెదకుటయందు (ఉపయోగించును). అన్యా = మరియొకటి, సూచీ సంస్థానా = సూదివంటిదై, క్షారా క్త-సూత్ర-ప్రతిబద్ధా = క్షారము పూయబడిన దారముతో కట్టబడినదియై, నాడీనాం = నాడుల యొక్క, భగందరాదీనాంచ = భగందరము మొదలగు వానియొక్కయు, భేదనే = భేదన కర్మయందు (ఉపయోగించును).

బడిశః = బడిశస్త్రము, అత్యవనతముఖః = మిక్కిలి క్రిందికి వంగిన ముఖముకలదై, సూచీ తీక్ష్ణాగ్రం = సూదివలె వాడియైన కొనగలదై, గలశుండిక అర్శాదేః = గలశుండిక, అర్శము మొదలగు వానియొక్క, గ్రహణే = పట్టుకొనుటయందు (ఉపయోగించును).

నఖశస్త్రం = నఖశస్త్రము, అష్టాంగుళం = ఎనిమిది అంగుళముల ప్రమాణము గలిగి, ఏకతః = ఒకవైపున, అశ్వ కర్ణముఖం = గుఱ్ఱపు చెవివంటి ముఖముగలదియు, అన్యతః = మఱియొకవైపు, వత్సదన్తముఖం = దూడయొక్క దంతమువంటి ముఖముగలదియునై,

సూక్ష్మ-శల్య-ఉద్ధృతా = సూక్ష్మములగు శల్యములను వెలికి దీయుటకు (ఉపయోగించును).

**తాత్పర్యము :** శస్త్రములయొక్క విశిష్టములైన స్వరూప-ఉపయోగములు ఈవిధ మున నుండును.

దంతలేఖన శస్త్రము ప్రబద్ధమువలె చతురస్రాకారమున నుండి, ఒక అంచు గలిగి, దంతశర్కరా వ్యాధియందు లేఖన కర్మకుపయోగించును.

మణ్డలాగ్ర శస్త్రము చూపుడు వ్రేలియొక్క గోటిలోపలి కొలత యంత ఫలకము గలిగి, లేఖన-విచ్ఛేదన కర్మలందును, వర్త్మరోగములందును, దంతమాంసములందు పుట్టి దుర్నివిష్టములైన వ్రణములందును, గళశుండికాది రోగములందును ఉపయోగించును.

వృద్ధి పత్రమను శస్త్రములలో చురకత్తి ఆకారమున నుండునది, ఉన్నత-గంభీర శోఫలందు, సూటిగా నుండి, సూది మొనవంటి మొనగలదియును; ఇతరములగు శోఫలందు వంగిన అంచు గలదియు ఉపయోగింపబడును.

అంగుళీశస్త్రకము ఉంగరమువలె యుండి, వృద్ధిపత్ర-మండలాగ్ర-అంతర్ధారాశస్త్రము లలో ఒకదానితో సమానమగు అర్ధాంగుళపు అంచుగలిగి, చూపుడువ్రేలి మొదటికణుపు పట్టునంత ఉంగరము గలిగి, సూత్రప్రతిబద్ధమై యుండును. ఇది కంఠరోగములందుప యోగించును.

కర్తరీ అనునది దానికొలతలో మూడవభాగమువద్ద కీలముచే బద్ధమైయుండి, స్నాయువులు, కేశములు, సూత్రములు మున్నగువానిని కత్తిరించుటకుపయోగించును.

సర్పవక్త్రి శస్త్రము వక్రముగానుండి అర్ధాంగుళపు ఫలకములు గలదియై, నాసికా-కర్ణములందలి అర్శ-అర్బుదములను ఛేదించుట కుపయుక్తమగును.

కరపత్రశస్త్రము (అంపము వంటిది) పది అంగుళముల పొడవు, రెండంగుళముల వెడల్పు గలిగి, సన్నని దంతములతోను, వాడియగు అంచుతోను ఉండి మంచి పిడి అమర్చబడి యుండును. ఇది అస్థులను ఛేదించుటకుపయోగపడును.

కుశపత్రము, ఆటాముఖము అనునవి రెండును రెండంగుళముల ఫలకములను; అంత ర్ముఖ, అర్ధ చంద్రాకార శస్త్రములు రెండును ఒకటిన్నర అంగుళముల ఫలకమును గలిగి యుండును.

కుఠారికా శస్త్రము (గొడ్డలి వంటిది) పొడవైన కర్రపిడి గలిగి గోదంతాకారమున నుండు అర్ధాంగుళ ఫలకము గలదియై అస్థుల నాశ్రయించి యుండు సిరల వ్యధనమునకుప యోగించును.

వ్రీహి ముఖ శస్త్రము ఒకటిన్నర అంగుళముల ఫలకము గలదియై మాంసమధికముగా నుండు ప్రదేశములందలి సిరావ్యధనమునకు, వర్త్మ, ఉదర, గుల్మ, విద్రధి మొదలగు వ్యాధులందు వ్యధన-ఛేదన కర్మలకును ఉపయోగించును.

శలాకాయనునది ఇరువైపుల ముఖములుగలిగి, గోరింట మొగ్గవంటి అగ్రము

గలిగి యుండును. ఇది తామ్ర నిర్మితము. నేత్రమందలి లింగనాశవ్యాధిలో వ్యధనమునకుప యోగించును.

ఆరా శస్త్రము నాలుగు మూలలు గలదియు, అర అంగుళము గుండ్రని ముఖముయు గలిగి యుండును. దీనిని ప్రయోగించినపుడు ఆ అర అంగుళమే లోపల ప్రవేశించునదిగా నుండును. ఈ శస్త్రము కర్ణపాలి వ్యధనమునకును, పక్వ-ఆమ సందేహముండు శోఫలను భేదించుటకును ఉపయోగింపబడును.

కర్ణవ్యధన శస్త్రము మూడు అంగుళముల పొడవుండి, ఒక అంగుళ ప్రమాణమున రంధ్రముగలదై పెద్ద గోరింట మొగ్గ వంటి మొనగలిగి లావుగ నుండును.

సూదులు మూడు విధములు. ఇవి గుండ్రగనుండి కనబడని విధముగ గట్టిదార ములతో గూడి యుండును. అధికమాంసల ప్రదేశములందుపయోగించునట్టిది అగ్రభాగమున త్రికోణముగనుండి మూడంగుళముల ప్రమాణమున నుండును. స్వల్పమాంస ప్రదేశము లందును, అస్థులందును సంధులందునుగలుగు వ్రణములందును ఉపయోగింపబడునది రెండంగు ళముల ప్రమాణము గలిగి వృత్తాకారమున నుండును. మూడవది రెండున్నర అంగుళముల పొడవుండి, ధనుర్వక్రమై వ్రీహిముఖ శస్త్రమువలె యుండును. ఇది పక్వాశయ-ఆమాశయము లందును, మర్మములందును సీవనకర్మ కుపయోగించును.

సూచీకూర్చ శస్త్రము మూలమున గుండ్రగానుండి, అగ్రభాగమున ఏడెనిమిది సూదులు బాగుగా అమర్చబడి యుండును, కుష్ఠము, శ్విత్రము, వ్యంగము, ఇంద్రలుప్తము మొదలగు రోగములందు దీనిని లేఖన కర్మకుపయోగింతురు.

ఖజ మనునది అర్ధాంగుళపు పొడవుండి, ముఖప్రదేశమున ఎనిమిది కంటకములతో గూడి యుండును. ఇది తామ్రమము లేక లోహముచే నిర్మితమై నాసికలోనుండి రక్తమోక్షణము చేయుటకుపయోగింపబడును.

ఏషణీ శస్త్రములు నునుపుగా నుండును. ఇవి రెండు విధములు. అందొకటి ఎనిమిది అంగుళముల ప్రమాణమున నుండి, కోశము-గతి-శల్యము-స్రావము ఉండునట్టి వ్రణము లందు గతి నన్వేషించుటకు ఉపయోగించును. రెండవది సూదివలెయుండి క్షారాక్తమగు సూత్రముచే కట్టబడి, భగందరము యొక్క-నాడుల యొక్క భేదనకర్మయందుపయో గించును.

బడిశమను శస్త్రము మిక్కిలి వంగినకొన, సూదివలె వాడియైన మొన గలిగి యుండును. ఇది గళశుండికా, అర్శము మొదలగు వానిని పట్టుకొనుట కుపయోగించును.

నఖశస్త్రము ఎనిమిది అంగుళముల పొడవుండి, ఒకవైపున అశ్వకర్ణమువంటి ముఖమును, రెండవవైపున దూడయొక్క దంతమువంటి ముఖమును గలిగి యుండును. సూక్ష్మములగు శల్యములను వెలికిదీయుటకు ఇది ఉపయోగించును.

*శశిలేఖ :* కర్ణవ్యధన శస్త్రము సుషిరభాగమున భేరీ ఆకృతి గలిగియుండును.

ధనుర్వక్రముగ నుండు సూదిలోనికి ఎక్కువగా ప్రవేశించక, వ్రణముయొక్క రెండవ ఓష్ఠము లోనికి ప్రవేశించి బయటకు వచ్చును.

*వి. వ్యా.* కుశపత్ర-ఆటాముఖ శస్త్రములు అష్టాంగ హృదయమున శరార్యాస్యము-కుశాటా అను పేర్లతో వర్ణింపబడినవి. నోటియందు పూయాదులను స్రవింపజేయుటకు వీని నుపయోగింప వలెను.

ఆటా యనునది పక్షి విశేషమని హేమాద్రి వివరణ.

నఖశస్త్రము యొక్క ఉపయోగములు ఛేదన, భేదన, లేఖన, ప్రచ్ఛన్నములు అధికముగా అష్టాంగ హృదయమున చెప్పబడినవి. ఈ శస్త్రము నఖచ్ఛేదనమునకు ప్రసిద్ధి నొందినదని అరుణదత్త వ్యాఖ్య.

ఖజశస్త్రమును వర్ణించుచు అష్టాంగ హృదయమున రెండు చేతులతో ఈ శస్త్రమును మథించుటచే నాసికనుండి రక్తమును వెడలింపవలెనని తెలుపబడినది.

## అనుశస్త్ర వివరణ

**మూలము : అనుశస్త్రాణి తు జలౌకః క్షారాగ్ని సూర్యకాన్త కాచస్ఫటిక కురువిన్ద నఖశాక శేఫాలికాది ఖరపత్ర సముద్రఫేన శుష్కగోమయాదీని ।**

*ప్రతి పదార్థము :* అనుశస్త్రాణి తు = అను శస్త్రములైతే, జలౌకః = జలగ, క్షార = క్షారము, అగ్ని = అగ్ని, సూర్యకాన్త = సూర్యకాంతమణి, కాచ = గాజు, స్ఫటిక = స్ఫటికము, కురువిన్ద = కురువిందమను మాణిక్యము, నఖ = గోరు, శాక-శేఫాలికాది ఖరపత్ర = టేకు, నల్లవావిలి మొదలగు వానియొక్క గరుకైన ఆకులు, సముద్రఫేన = సముద్రఫేనము, శుష్కగోమయాదీని = శుష్కించిన గోమయము మొదలగునవి.

*తాత్పర్యము :* జలగ, క్షారములు, అగ్ని, సూర్యకాంతమణి, గాజు, స్ఫటికము, కురువిందమను మాణిక్య విశేషము, నఖములు, టేకు-వావిలి మొదలగు గరుకు ఆకులు, సముద్రఫేనము, శుష్కించిన గోమయము మొదలగునవి అనుశస్త్రములు.

*శశిలేఖ :* శస్త్రములు కాకున్నను శస్త్రములు చేయు కార్యములను చేయునవి గాన ఇవి అనుశస్త్రములని చెప్పబడును.

## అనుక్త యంత్ర – శస్త్ర నిర్మాణము, ప్రయోగము

**మూలము : స్వబుద్ధ్యా చ వికల్ప్య వివిధాని యన్త్రశస్త్రాణి తత్కర్మాణి చోపకల్పయేత్ ।**

*ప్రతి పదార్థము :* స్వబుద్ధ్యా = తనబుద్ధిచేత, వికల్ప్య చ = విశేషముగా పరిమాణ స్వరూపాదులను కల్పించియు, వివిధాని = అనేకవిధములగు, యన్త్రశస్త్రాణి = యంత్రములను, శస్త్రములను, తత్కర్మాణి చ = వానిపనులనున్నూ, ఉపకల్పయేత్ = తగునట్లు కల్పింపవలెను.

*తాత్పర్యము :* శస్త్రవైద్యుడు తన బుద్ధిచేత ఇంకను అనేక విధములగు యంత్ర శస్త్రములను విశేష పరిమాణ స్వరూపములచే కల్పించి వానినుపయోగింపవలెను.

## యంత్రశస్త్రములకంటె వైద్యుని హస్తమే ప్రధాన తమమనుట

**మూలము :** హస్త ఏవచాత్ర ప్రధానతమస్తదధీనత్వాద్యన్త్ర శస్త్రాణామ్ ।

*ప్రతి పదార్థము :* అత్ర = ఇచట, హస్తఃఏవ = (వైద్యుని) హస్తమే, ప్రధానతమః = అన్నింటికంటె ప్రధానమైనది, యన్త్ర శస్త్రాణాం = యంత్ర శస్త్రములన్నియు, తదధీనత్వాత్ = ఆహస్తమున కధీనములగుటచేత.

**తాత్పర్యము :** యంత్ర శస్త్రములన్నియు శస్త్రవైద్యుని హస్తమునకధీనములగుట చేత, ఇట అన్నింటికంటె గూడ వైద్యుని హస్తమే ప్రధానమైనది.

## ఎనిమిది యంత్రదోషములు

**మూలము :** తత్ర దీర్ఘ హ్రస్వస్థూలవక్రతనువక్త్రవిషమగ్రాహ్యగ్రాహి శిథిలతా ఇత్యష్టౌ యన్త్రదోషాః ।

*ప్రతి పదార్థము :* తత్ర = అచట, దీర్ఘ = పొడవు, హ్రస్వ = పొట్టి, స్థూల = లావు, వక్ర = వంకర, తనువక్త్ర = సూక్ష్మముఖము, విషమగ్రాహి = సరిగా పట్టుకొనక పోవుట, అగ్రాహి = బొత్తుగా పట్టుకొనకుండుట, శిథిలతా = సడలి యుండుట, ఇతిఅష్టౌ = ఈ ఎనిమిదియు, యన్త్రదోషాః = యంత్రములందు దోషములు.

**తాత్పర్యము :** అతిపొడవు, అతిపొట్టి, అతిలావు, వక్రత, సూక్ష్మముఖము, సరిగా పట్టుకొనకపోవుట, అసలు పట్టుకొనకపోవుట, శైథిల్యము అను ఎనిమిదియు యంత్రములందలి దోషములు.

*శశిలేఖ :* శిథిలతా అనగా శిథిల గ్రహణం.

**వి. వ్యా :** సుశ్రుతమున యంత్రదోషములు పై ఎనిమిదిగాక ఈ క్రిందివి అధికములుగా చెప్పబడినవి. అసారం (అశుద్ధలోహాదులచే చేయబడుట), అత్యున్నతం (కీలాదులు పైకిలేచినది), మృదుకీలం, మృదుముఖం, మృదుపాశం.

## ఎనిమిది శస్త్రదోషములు

**మూలము :** తత్రాద్యాః పఞ్చ కుణ్ఠఖణ్డ ఖరధారతాశ్చేత్యష్టావేవ శస్త్రదోషా అన్యత్ర కరపత్రాత్।

*ప్రతి పదార్థము :* తత్ర = అచట, ఆద్యాః పఞ్చ = మొదటి అయిదును, కుణ్ఠ = మొక్కబోవుట, ఖణ్డ = విరుగుట, ఖరధారతాః చ = అంచు గరుకుగానగుట, ఇతి = అని, అష్టౌఏవ = ఎనిమిది యే, కరపత్రాత్-అన్యత్ర = కరపత్ర శస్త్రము తప్ప ఇతరములలో, శస్త్ర దోషాః = శస్త్రములందు సంభవించు దోషములు.

**తాత్పర్యము :** పై జెప్పిన యంత్రదోషములందలి మొదటి అయిదు-అనగా దీర్ఘ, హ్రస్వ, స్థూల, వక్ర, తనువక్త్రములనునవియు, ఇంకను, మొక్కబోవుట, విరుగుట, అంచు గరుకుగా నగుట అను మూడును గలసి ఎనిమిదియును కరపత్ర శస్త్రము దప్ప మిగిలిన శస్త్రములందు సంభవించు దోషములు.

*శశిలేఖ :* కరపత్ర శస్త్రమునకు ఖణ్డత్వము, ఖరధారత్వము స్వాభావిక లక్షణములు.

## శస్త్రములకు పదును బెట్టు విధానము

**మూలము :** తత్ర క్షారేణ పాయితం శస్త్రం శరశల్యాస్థిచ్ఛేదనేషూదకేన మాంసచ్ఛేదనే తైలేన పాటనభేదనేషు సిరావ్యధస్నాయుచ్ఛేదనేషు చ ప్రయుఙ్జీత ।

*ప్రతి పదార్థము :* తత్ర = అచట, క్షారేణ = క్షారముతో, పాయితం = పదును బెట్టబడిన, శస్త్రం = శస్త్రమును, శర-శల్య-అస్థిచ్ఛేదనేషు = (అంగములందు ప్రవేశించిన) బాణము, శల్యములయొక్కయు, అస్థులయొక్క ఛేదన కర్మకును, ఉదకేనపాయితం = నీటితో పదును బెట్టబడిన శస్త్రమును, పాటన-భేదనేషు = చీల్చుట, భేదించుటలోను, సిరావ్యధ = సిరావేధనమునందును, స్నాయు-చ్ఛేదనేషు = స్నాయువులను ఛేదించుటలో నున్నూ, ప్రయుఙ్జీత = ప్రయోగించవలెను.

**తాత్పర్యము :** (శస్త్రములను కాల్చి క్షారోదకము, ఉదకము, తైలములలో ముంచి, నూరి పదును బెట్టుదురు) క్షారముతో పదును బెట్టిన శస్త్రమును అంగములందు ప్రవేశించిన బాణము, శల్యములను, అస్థులను ఛేదించుటకును, నీటితో పదునుబెట్టిన శస్త్రమును మాంసమును ఛేదించుటకును, తైల పాయితమైన శస్త్రమును సిరావ్యధనమునకు, స్నాయుచ్ఛేదనమునకును ఉపయోగించవలెను.

*శశిలేఖ :* ద్రవమున తైక్ష్ణ్య కరణము పాయితం అనబడును. అనగా ద్రవమున నూరి పదునెక్కించుట, ఇది శిల్పుల భాష.

## శస్త్రముల యొక్క ధారా నిర్దేశము

**మూలము :** ధారాపునశ్ఛేదనానాం మాసూరీ లేఖనానామర్ధమాసూరీ వ్యధనానాం విస్రావణానాం చకైశికీ ।

*ప్రతిపదార్థము :* ఛేదనానాం పునః = ఛేదనములకైతే, ధారా = శస్త్రముల అంచు, మాసూరీ = మసూర దళధారయంత ఉండవలెను. లేఖనానాం = లేఖన కర్మలకొరకు, అర్ధమాసూరీ = మసూర దళధారలో సగము ఉండవలెను; వ్యధనానాం = వ్యధనకర్మలకు, విస్రావణానాం చ = విస్రావణ కర్మలకున్నూ, కైశికీ = కేశమంత ధార ఉండవలెను.

**తాత్పర్యము :** ఛేదన కర్మలకుపయోగించు శస్త్రములయొక్క ధార మసూర దళపు అంచు యంతయు, లేఖనకర్మకుపయోగించు శస్త్రములయొక్క ధార మసూరదళపు ధారలో సగముయును, వ్యధన విస్రావణ కర్మలకుపయోగించు శస్త్రములధార వెంట్రుక యంతయు ఉండవలెను.

*శశిలేఖ :* కైశికీ అనగా బాలాకృతి.

## వివిధ శస్త్ర కర్మలందు శస్త్రములను పట్టుకొను విధానము

**మూలము :** తేషాం ఛేదనభేదనలేఖనానాం వృన్తసాధారణే భాగే ప్రదేశినీ మధ్యమాఙ్గుష్ఠైః సుసమాహితం గృహ్ణీయాత్ । వృన్తాగ్రే విస్రావణాని ప్రదేశిన్యఙ్గుష్ఠకాభ్యాం

హస్తతలప్రచ్ఛాదిత వృన్తాగ్రం వ్రీహిముఖం ముఖే । మూలేష్వాహరణార్థాని। పాశస్యోపరి మధ్యే సందంశం కర్తరించ । శేషాణ్యపి యథాయోగం క్రియా సౌకర్యేణ ।

తాత్పర్యము : తేషాం = వానిలో, ఛేదన-భేదన-లేఖనానాం = ఛేదన, భేదన, లేఖన కర్మలలో నుపయోగించు శస్త్రములను, వృన్తసాధారణేభాగే = పిడియొక్క సాధారణ భాగమున, ప్రదేశినీ-మధ్యమ-అఙ్గుష్ఠైః = చూపుడువ్రేలు, నడిమివ్రేలు, బొటనవ్రేలు, బొటన వ్రేళ్లచే, సు-సమాహితం = కుదిరికగా (చక్కగా, జాగ్రత్తగా), గృహ్ణీయాత్ = పట్టుకొన వలెను. విస్రావణాని = విస్రావణకర్మలందుపయోగించు శస్త్రములను, వృన్తాగ్రం = పిడిచివర (పట్టుకొనవలెను). వ్రీహిముఖం = వ్రీహిముఖశస్త్రమును, హస్తతలం = అరచేతితో, ప్రచ్ఛాదిత వృన్తాగ్రం=పిడి చివరిభాగము కప్పబడునట్లుగా, ప్రదేశినీ-అంగుష్ఠకాభ్యాం = చూపుడువ్రేలు, బొటనవ్రేళ్లచే, ముఖే = శస్త్రము యొక్క ముఖమును (పట్టుకొనవలెను). ఆహర్ణార్థాని = లాగుటకుపయోగించు శస్త్రములను, మూలేషు = మొదళ్లలో (పట్టుకొన వలెను). సందంశం = సందంశ యంత్రమును, మధ్యే = మధ్యభాగమున (పట్టుకొనవలెను). శేషాణి అపి = మిగిలిన శస్త్రములనున్నూ, క్రియాసౌకర్యేణ = క్రియాసౌకర్యముచే, యథాయోగం = తగిన విధముగా (పట్టుకొనవలెను).

తాత్పర్యము : ఛేదన, భేదన, లేఖనకర్మలయందుపయోగించు శస్త్రములను పిడి యొక్క సాధారణ భాగమున చూపుడువ్రేలు, బొటనవ్రేలు, మధ్యవ్రేళ్లచే కుదిరికగా గట్టిగా పట్టుకొనవలెను. విస్రావణ శస్త్రములను పిడిచివర పట్టుకొనవలెను. వ్రీహిముఖ శస్త్రమును అరచేతితో పిడి చివరభాగము కప్పబడునట్లుగాను, చూపుడు వ్రేలు, బొటన వ్రేళ్లతో శస్త్రముఖమును పట్టుకొనవలెను. ఆహరణము-అనగా శల్యము మొదలగువానిని వెలికిలాగు-శస్త్రములను మొదళ్లయందు పట్టుకొనవలెను. సందంశ, కర్తరీ శస్త్రములను వాని బంధములకుపైన, మధ్యభాగమున పట్టుకొనవలెను. తదితర శస్త్రములను క్రియా సౌకర్యము ననుసరించి పట్టుకొనవలెను.

*శశిలేఖ* : వృంత సాధారణం అనగా ముఖ వారంగసంధి. ప్రదేశినీ యనగా తర్జనీవ్రేలు.

## శస్త్రములను పదునుబెట్టు సాధనములు

**మూలము** : తేషాం నిశాతనీ తు సుశ్లక్ష్ణ శిలికా మాషముద్గప్రభా । ధారాసంస్థాపనం చ శాల్మలీ ఫలకం ।

*ప్రతి పదార్థము* : తేషాం = ఆ శస్త్రములను, నిశాతనీ తు = పదునుబెట్టు సానరాయి యైతే, సు-శ్లక్ష్ణ-శిలికా = మిక్కిలి నున్నని రాతిపలక, మాష-ముద్గ-ప్రభా = మినుము, పెసల రంగు గలది(గా ఉండవలెను). శాల్మలీ ఫలకంచ = బూరుగుచెక్క యొక్క ఫలకమును, ధారా సంస్థాపనం = అంచును స్థిరపరచుటకు (ఉపయోగించును).

తాత్పర్యము : శస్త్రములను పదునుబెట్టు సానరాయి మిగుల నున్నగానుండు జాతి

పలకయై, మినుము పెసలవంటి కాంతిగలదిగా నుండవలెను. శస్త్రధారను సరిగా ఉంచుటకు బూరుగుచెక్క పలకయును ఉపయోగించును.

**శశిలేఖ :** నిశాతనీయన శస్త్రములకు తీక్ష్ణత్వమును గలిగించు ఘర్షణ శిల, శస్త్రము యొక్క ధారను స్పష్టముగా, మృదువుగా చేయునట్టిది ధారా సంస్థాపనము.

## వైద్యునకు శస్త్రకర్మాభ్యాస విధి

**మూలము :** న చాధిగతశాస్త్రోఽ ప్యకృతయోగ్యః సుబహుశో వాఽప్యదృష్టకర్మా శస్త్రకర్మణి ప్రవర్తేత సిరాస్నాయు మర్మాది వ్యాప్తత్వాద్దేహస్య । తస్మాత్సరోమచర్మ పుష్పఫలాలాబుత్రపుసోదకపఙ్క పూర్ణ దృతిబస్తి వర్త్మమాంస పేశికోత్పలనాలాదిషు యథార్థ మాహరణాది యోగ్యం కుర్యాత్ । తథా ఘట పార్శ్వస్రోతస్యమ్భోభిః పూర్ణేననేత్రేణ బస్తిపీడన యోగ్యామ్ । మృదుమాంసఖణ్డేష్వగ్నిక్షారావచరణ యోగ్యామ్ । పుస్తమయ పురుషాఙ్గ ప్రత్యఙ్గేషు బన్ధనయోగ్యామ్ ।

**ప్రతిపదార్థము :** దేహస్య = దేహమున, సిరా-స్నాయు-మర్మాది వ్యాపత్వాత్ = సిరలు, స్నాయువులు, మర్మలు మొదలగునవి వ్యాపించియుండుటవలన, అధిగతశాస్త్రః అపి = శాస్త్రమును బాగుగా చదివినవాడైనను, అకృత-యోగ్యః = చేయనట్టి ప్రయోగ శిక్షగలవాడు (ప్రత్యక్ష కర్మాభ్యాసము లేనివాడు), సు బహుశః = పెక్కుమారులు, అ-దృష్టకర్మా-వా-అపి = ప్రత్యక్షముగా శస్త్రకర్మలను చూడనివాడును, శస్త్రకర్మణి = శస్త్రకర్మలందు, న-చ-ప్రవర్తేత = ప్రవర్తింప రాదు. తస్మాత్ = అందువలన, స-రోమ-చర్మ = రోమములతోగూడిన చర్మమందు, పుష్ప = పువ్వులందు, ఫల = పండ్లయందు, అలాబు = సొరకాయ యందు, త్రపుస = దోసకాయలందు, ఉదకపంకపూర్ణ దృతి = నీరు, బురదతో నిండిన తోలుతిత్తి-బస్తి = వస్తియందును, వర్త్మ = జంతువుల అండకోశము నందును, మాంసపేశిక = మాంసపేశి, ఉత్పలనాళాది = కలువతూండ్లు మొదలగువాని యందును, యథార్థం = తగినవిధముగా, ఆహరణ-ఆది-యోగ్యం = ఆహరణ మొదలగు కర్మల అభ్యాసమును, కుర్యాత్-చేయవలెను. తథా = అట్లే, ఘట-పార్శ్వ-స్రోతసి = కుండ ప్రక్క స్రోతస్సునందు, అంభోభిఃపూర్ణ-నేత్రేణ = నీటితోనిండిన వస్తినేత్రముతో, బస్తిపీడనయోగ్యాం = వస్తిపీడన ప్రయోగ శిక్షణను (చేయవలెను).

మృదు మాంసఖణ్డేషు = మృదువుగానుండు మాంసఖండములందు, అగ్ని-క్షార-అవచరణ = అగ్నిక్షార కర్మలయొక్క, యోగ్యాం = ప్రయోగ అభ్యాసమును, కుర్యాత్ = చేయవలెను. పుస్త-మయ = బొమ్మతోచేయబడిన, పురుష-అఙ్గ-ప్రత్యఙ్గేషు = పురుషుని యొక్క అంగ, ప్రత్యంగముల యందు, బంధనయోగ్యాం = కట్టు కట్టు ప్రయోగ అభ్యాసమును, (కుర్యాత్ = చేయవలెను).

**తాత్పర్యము :** శస్త్రవైద్యమును బాగుగా చదివినవాడైనను, ప్రత్యక్ష కర్మాభ్యాసము లేనివాడు, శస్త్రకర్మలను పలుమార్లు ప్రత్యక్షముగా చూడనివాడు శస్త్రకర్మను చేయబూను కొనరాదు. ఏలననగా శరీరమంతయు సిరా, స్నాయు మర్మాదులచే కూడియుండును. అందువలన అనుభవము కొరకు, రోమములతో గూడిన చర్మముపైన, వివిధ పుష్పఫలాదులపైన,

సొరకాయ, దోసకాయ మొదలగు కూరగాయలపైన, నీరు బురద నింపిన జంతువుల వస్తి, అండకోశము మొదలగువానిపైన, మాంసపేశీఖండములు, కలువతూండ్లు మొదలగువానిపైన తగువిధముగా ఆహరణాది వివిధశస్త్రకర్మలు అభ్యాసము చేయవలెను. ఇంకను, నీటితో నింపిన కుండల ప్రక్క-భాగములందు వస్తి నేత్రమువలె అమర్చి, వస్తిపీడన ప్రయోగాదులు అభ్యసించవలెను.

మృదువగు మాంసఖండములపై అగ్నికర్మ, క్షారకర్మ అభ్యసించవలెను. పురుషుల వలె నుండు బొమ్మలయొక్క అంగ ప్రత్యంగములపై వివిధములగు బంధనములను అభ్యసించవలెను.

*శశిలేఖ :* కర్మశిక్షాభ్యాసము యోగ్యాః, అదిచేయనివాడు అకృతయోగ్యుడు. సరోమ చర్మముపై ఘర్షణ, ఫలములపైభేదనము, అలాబు-త్రపుసములపై పాటనము, ఛేదనము, ఆహరణము, ఉదకపూర్ణములగు వస్తి మొదలగు వానిపై స్రావణకర్మ, పంకపూర్ణములగు వానిపై సీవనకర్మ మాంసపేశిపై సీవనము, తక్షణకర్మ, ఉత్పలనాళాదులపై ఏషణము అభ్యసించవలెను. దృతియనగా భస్త్రా (కొలిమితిత్తి లేక సంచి), వస్తియనగా మూత్రాధారము.

## వైద్యునకు శరీరాంగముల ప్రత్యక్షజ్ఞాన సంపాదనోపాయము

**మూలము :** అపి చ । యుక్తకారి భిషగ్బుభుత్సు పురుషం సంపూర్ణ గాత్రమవిషహతమ దీర్ఘ వ్యాధిపీడితం నిష్కృష్టాన్త్రమవహన్త్యామాపగాయాం ముఞ్జబల్వజవేష్టితం పఞ్జరస్థమప్రకాశే దేశే కోథయేత్ । తం సమ్యక్ ప్రకుథితం చోద్ధృత్యాయత దేహం కృత్వోశీరవేణుకూర్చాదీనామన్యతమేన శనైః శనైరవఘృష్య త్వగాదీన్ సర్వానేవ బాహ్యాభ్యన్తరానఙ్గ సిరాస్నాయ్వాదీనవయవానాచార్యోపదర్శితేనాగమేన చక్షుషా చ లక్షయేత్ ।

*ప్రతిపదార్థము :* అపి చ = ఇంకను, యుక్తకారీ = ఉపయోగించు పనిచేయువాడు, భిషక్‌బుభుత్సుః = వైద్యుడు గాదలచినవాడు, అ విషహతం = విషముతో మరణించని, అదీర్ఘవ్యాధిపీడితం = దీర్ఘవ్యాధిచే పీడితుడు గానట్టి, నికృష్టాన్త్రం = తీసివేయబడిన ప్రేగులు గల, పురుషం = మృతపురుని (అనగా శవమును), అ-వహన్త్యాం = ప్రవహించని, ఆపగాయాం = నదియందు; ముఞ్జ-బల్వజవేష్టిం = ముంజగడ్డితోగాని, దర్భగడ్డితోగాని చుట్టబడినదానిని, పఞ్జరస్థం = పంజరములో నున్నదానిని, అప్రకాశే-దేశే = మరుగుప్రదేశమున, కోథయేత్ = నానబెట్టవలెను; సమ్యక్ = బాగుగా, ప్రకుథితం = నానిన, తంచ = అశవమునున్నూ, ఉద్ధృత్య = పైకిదీసి, ఆయతదేహం కృత్వా = పొడవైన దేహముగలదిగా జేసి, ఉశీర-వేణు-కూర్చాదీనాం = వట్టివేరు, వెదురు, కుంచె మొదలగువానిలో, అన్యతమేన = ఏదైన ఒకదానితో, శనైః శనైః = మెల్లమెల్లగా, అవఘృష్య = క్రిందిపైపునకు రుద్ది, త్వక్-అదీన్ = చర్మము మొదలగు, బాహ్యా-అభ్యంతరాన్ = వెలుపలి, లోపలి, సర్వానేవ = అన్నింటిని, అంగ = అంగములను, సిరా-స్నాయు-అదీన్ = సిరలు స్నాయువులు మొదలగు, అవయవాన్ = అవయవములను, ఆచార్య-ఉపదర్శితేన = ఆచార్యునిచే జూపబడిన, ఆగమేన = శాస్త్రముతోను, చక్షుషా = ప్రత్యక్షముగా తనకంటితోను, లక్షయేత్ = గుర్తించి, నిరూపించుకొనవలెను.

తాత్పర్యము: ఇంతేగాక, సద్వైద్యుడు గాదలచినవాడు, విషముచే గాని దీర్ఘ వ్యాధులచేగాని పీడితుడుగానట్టి పురుషుని శవమును, ముంజ, దర్భగడ్డితోచుట్టి, ఒక పంజరమున నుంచి, ప్రవహించనట్టి నదిలో మరుగు ప్రదేశమున నానబెట్టవలెను. అది బాగుగా నానిన తరువాత పైకిదీసి, చక్కబరచి వట్టివేళ్ల లేక వెదుళ్లకుంచెతో మెల్ల మెల్లగా క్రింది వైపుకు రుద్ది, చర్మపుపొరలను, బాహ్య, అభ్యంతర అవయవాదులను, సిరాస్నాయువులను ఆచార్యునిచే చూపబడిన వానిని, శాస్త్రములందుపదేశింపబడిన వానిని, తన కంటితో ప్రత్యక్షముగా చూచి, గుర్తించి నిరూపించుకొనవలయును.

## శాస్త్ర, ప్రత్యక్ష జ్ఞానఫలము

**మూలము : ఇతి శాస్త్రేణ యద్దృష్టం దృష్టం ప్రత్యక్షతశ్చ యత్ ।**
**సమాగతం యదుభయం భూయోజ్ఞానం వివర్ధయేత్ ॥**

*ప్రతి పదార్థము :* ఇతి = ఈ విధముగా, శాస్త్రేణ = శాస్త్రముతో, యత్ = ఏది, దృష్టం = చూడబడినదో, ప్రత్యక్ష-తః-చ = ప్రత్యక్షముగానున్నూ, యత్ = ఏది, దృష్టం = చూడబడినదో, సమాగతం = కలసిన, యత్ = ఏ, ఉభయం = ప్రత్యక్ష శాస్త్రసముదాయాత్మకమగు, జ్ఞానం = జ్ఞానముగలదో, (అది) భూయః = మరల మరల, జ్ఞానం = విశిష్టజ్ఞానమును, వివర్ధయేత్ = వృద్ధిచేయును.

తాత్పర్యము: ఈ విధముగా శాస్త్రమును చదివి, ప్రత్యక్షముగా చూచుటచేత విశిష్టజ్ఞానము వృద్ధియగును.

## శస్త్రకోశ నిర్మాణవిధి

**మూలము : స్యాన్నవాఙ్గుల విస్తారః సుఘనో ద్వాదశాఙ్గులః ।**
**క్షౌమ పత్త్రోర్ణకౌశేయ దుకూల మృదుచర్మజః ॥**
**విన్యస్తపాశః సుస్యూతః సాన్తరోర్ణాస్థశస్త్రకః ।**
**శలాకాపిహితాస్యశ్చ శస్త్రకోశః సుసంచయః ॥**

## ఇతి చతుస్త్రింశోఽధ్యాయః

*ప్రతిపదార్థము :* సు సంచయః = మంచికూర్పుగల, శస్త్రకోశః = శస్త్రములనుంచునట్టి సంచి (లేక పెట్టె), నవాఙ్గులవిస్తారః = తొమ్మిది అంగుళముల వెడల్పు, ద్వాదశాఙ్గులః = పన్నెండు అంగుళముల పొడవు, సు ఘనః = బాగుగా దట్టమైనదియు, క్షౌమ-పత్త్రోర్ణ-కౌశేయ-దుకూలమృదు-చర్మజః = వెలిపట్టు బట్ట, తెల్లపట్టు, పురుగుల పట్టువస్త్రము, వస్త్రమువలె మృదువగు చర్మముతో చేయబడినది, విన్యస్తపాశః = బాగుగా బిగించిన బంధములు గలదియు, సు-స్యూతః = బాగుగాకుట్టబడినదియు, సాన్తరోర్ణాస్థశస్త్రకః = ఉన్నిలోపల జొప్పబడిన యరలలో శస్త్రములు గలది, శలాకా పి హి తాస్యః-చ = శలాకతో మూయబడిన ముఖముగలదియునై, (ఉండవలెను).

తాత్పర్యము : శస్త్రపేటిక లేక శస్త్రకోశము పన్నెండంగుళముల పొడవు, తొమ్మిదంగుళముల వెడల్పు, తగినంత దట్టమైనదిగా నుండి, పట్టువస్త్రము, తెల్లపట్టువస్త్రము,

పురుగుపట్టువస్త్రము, పట్టువలె మృదువగు చర్మము-వీనితో బాగుగా కుట్టబడి, లోపల అరలన్నియు మెత్తని ఉన్ని వస్త్రముచే జొప్పబడి, శలాకచే మూయబడిన ముఖము గలదై యుండవలెను.

*శశిలేఖ* : సుఘనః అనగా నిబిడము (సాంద్రము లేక దట్టమైనది)
సు-సంచయము అనగా శస్త్రములచే పరిపూర్ణమైనది.

ముప్పది నాలుగవ అధ్యాయము సమాప్తము

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## ముప్పది అయిదవ అధ్యాయము

**మూలము :** అథ జలూకా విధిన్నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ।
ఇతి హస్మాహు రాత్రేయాదయో మహర్షయః ॥

**ప్రతి పదార్థము :** అథ = యన్త్రశస్త్ర విధి అధ్యాయము తరువాత, జలూకా విధి న్నామ అధ్యాయం = జలగలను ప్రయోగించు విధానమును గూర్చిన అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము, ఇతిహ = ఈవిధముగానే, ఆత్రేయాదయః మహర్షయః = ఆత్రేయాది మహర్షులు, ఆహుస్మ = పలికిరి.

**తాత్పర్యము :** ఆత్రేయాది మహర్షులు తెలిపిన విధముగా, యంత్రశస్త్రవిధి అధ్యాయానంతరము జలూకా విధి యను అధ్యాయమును వివరించెదము.

**వి. వ్యా. :** "జల మాసామాయురితి జలాయుకాః, జలమాసా మోక ఇతి జలౌకసః" ఉదకము ఆయువుగా కలవి జలాయుకములు-ఉదకమే ఉనికిగా గలవి జలౌకములని సుశ్రుతుని నిర్వచనము.

### జలగలను ప్రయోగింపదగినవారు

**మూలము :** నృపాఢ్య భీరు సుకుమార బాల స్థవిర నారీణా మసృగ్విస్రావణాయ జలౌకసోయోజయేత్ ।

**ప్రతి పదార్థము :** నృప = రాజులకు, ఆఢ్య = ధనవంతులకు, భీరు = భయము గల వారికి, సుకుమార = సుకుమారులు, బాల = పిన్నవయసువారికి, స్థవిర = వృద్ధులకు, నారీణాం = స్త్రీలకు, అసృక్-విస్రావణాయ = రక్తస్రావమును కలిగించుటకు, జలౌకసః = జలగను, యోజయేత్ = ఉపయోగించవలెను.

**తాత్పర్యము :** రాజులకు, ధనవంతులకు, భీరువులకు, సుకుమారులకు, బాలురు, వృద్ధులు, స్త్రీలకును రక్తస్రావము కలిగించుటకు జలగలను ఉపయోగింపవలెను.

**శశిలేఖ :** పూర్వాధ్యాయమున అనుశస్త్రములను గూర్చి చెప్పబడినది. అందు జలౌకలు ప్రధానమైనవగుటచే ఈ అధ్యాయమున వానిని గూర్చి చెప్పబడుచున్నది. పైచెప్పిన రాజులు మొదలగువారు కష్టములనోర్వలేనివారు కనుక వారికి రక్తస్రావమొనర్చుటకు జలగలనుపయోగించవలెను. సుకుమారులు కానివారికి ప్రచ్ఛానము, సిరావ్యధనము చేయవచ్చును.

### రెండువిధములగు జలగలు, అందు సవిషములు

**మూలము :** తాస్తు ద్వివిధాః సవిషా నిర్విషాశ్చ । తత్రదుష్టామ్బుసర్పమణ్డూక మత్స్యాది

శవకోథమూత్ర పురీషజా రక్తశ్వేతాతి కృష్ణ తనుస్థూలచపలపిచ్ఛిలాః స్థూలమధ్యా రోమశాః శక్రాయుధ–వద్విచిత్రోర్ధ్వ రాజీచితా వా సవిషాః ।

ప్రతిపదార్థము : తౌః తు = అవియైతే, ద్వివిధాః = రెండువిధములు, సవిషాః = విషముతో గూడినవి, నిర్విషాః = విషము లేనివి, తత్ర = అందు, దుష్టాంబు = మురికి నీటియందు, సర్ప-మణ్డూక-మత్స్యాది-శవకోథ = పాము, కప్ప, చేప మొదలగువాని కుళ్లిన శవములనుండి పుట్టినవి, మూత్ర-పురీషజాః = మూత్రపురీషములనుండి పుట్టినవి, రక్త-శ్వేత-అతికృష్ణ = ఎరుపు, తెలుపు, ఎక్కువ నలుపురంగు కలవి, తను-స్థూల = సన్ననివి, లావైనవి, చపల = ఎక్కువగా కదలునవి, పిచ్ఛిలాః = ఎక్కువ జారెడుగుణము గలవి, స్థూలమధ్యాః = నడుమ లావుగానుండునవి, రోమశాః = వెండ్రుకలు గలవి, శక్రాయుధవత్ = ఇంద్రధనుస్సువలె, విచిత్ర ఊర్ధ్వ రాజీచితా వా = విచిత్రములైన పైకి పోవునట్టి రేఖలు గలవిగాని, సవిషాః = విషము గలవి.

తాత్పర్యము : జలగలు విషముగలవి, విషములేనివి అని రెండువిధములు. వానిలో మురికి నీటియందు పుట్టినవి, చచ్చి కుళ్లిన పాములు, కప్పలు, చేపలనుండి, మలమూత్రములనుండి పుట్టినవి, ఎరుపు, తెలుపు, అధికమగు నలుపుగానుండునవి, అతి సన్నగా-అతిలావుగా నుండునవి, ఎక్కువ కదలునవి, అతిజిగురుగా నుండునవి, వెంట్రుకలు గలవిగాని, ఇంద్రధనుస్సువలె విచిత్రములగు ఊర్ధ్వరేఖలు గలిగినవిగాని విషయుక్తమగు జలగలు.

*శశిలేఖ :* కలుషిత జలము మొదలగు వానియందు పుట్టిన జలగలు విషయుక్తము లగుటచే వానిని రక్తమోక్షణమున వర్జించవలెను.

వి. వ్యా : సుశ్రుత సంహితయందు సవిషములగు జలగలు ఆరు అనియు, నిర్విషములగునవి ఆరు అనియు, వానిపేర్లు ఈవిధముగా నుండుననియు తెలుపబడెను: కృష్ణా, కర్బురా, అలగర్దా, ఇంద్రాయుధా, సాముద్రికా, గోచందనా (ఇవి సవిషములు), కపిలా, పింగలా, శంకు ముఖీ, మూషికా, పుండరీకముఖీ, సావరికా (ఇవి నిర్విషములు). నిర్విష జలౌకలు యవన, పాండ్య, సహ్య, పౌతనాక్షేత్రము లందుండుననియు, సుగంధ సలిలములందుండునవి నిర్విషములుగాను, బురదయందుండి, విషపదార్థములను తినునవి సవిషములుగానుండు ననియుగూడ వివరించబడినది.

## విషజలౌకా దష్ట లక్షణములు — చికిత్స

మూలము : తద్దంశాద్దాహ శోఫపాకకణ్డుపిటికావిసర్పజ్వరమూర్ఛాశ్విత్రోత్పత్తిః । తత్ర విషపిత్తరక్తహరాంక్రియాం కుర్వీత ।

ప్రతి పదార్థము : తద్దంశాత్ = అట్టి విషయుక్తమైన జలగ కరచుటచేత, దాహ = మంట, శోఫ = వాపు, పాక = పుండు, కణ్డు = దురద, పిటికా = పిటికలు, విసర్ప = విసర్పము, జ్వర = జ్వరము, మూర్ఛ = మూర్ఛ, శ్విత్ర = శ్విత్రము, ఉత్పత్తిః = పుట్టుట (అగును), తత్ర = అందు, విషపిత్తరక్తహరాం క్రియాం = విషమును, పిత్త, రక్త దోషములను హరించునట్టి చికిత్సలను, కుర్వీత = చేయవలెను.

తాత్పర్యము : విషయుక్తమైన జలగలు కరిచినచో దాహము, శోఫ, పాకము, దురద, పిటికలు, విసర్పము, జ్వరము, మూర్ఛ, శ్విత్రము కలుగును. అపుడు విషహర చికిత్సలను, పిత్త, రక్తదోషములను శమింపజేయు చికిత్సలను చేయవలెను.

*శశిలేఖ* : అజ్ఞానముచే అట్టి జలగల నుపయోగించినపుడు దాహాదిలక్షణములు కలుగును. అపుడు విషాది హర చికిత్సలను చేయవలెను.

వి. వ్యా : సుశ్రుతుడు విషజలౌకాదష్టమున కల్పస్థానమున నిర్దేశించిన మహాగద మను ఔషధమును, పాన-ఆలేపన-నస్య కర్మాదులందుపయోగించవలెననియు; ఇంద్రాయుధ మను విష జలౌకా దష్టము అసాధ్యమనియు తెలిపెను.

## నిర్విషములగు జలగల లక్షణము

**మూలము : పద్మోత్పల సౌగంధికాది సుగంధి విమల విపుల సలిల శైవాలజాః శైవాల శ్యావా నీలోర్ధ్వరాజయో వృత్తాశ్చ నిర్విషాః ।**

*ప్రతి పదార్థము* : పద్మ-ఉత్పల-సౌగంధికాది = తామర, కలువ, చెంగలువలచే, సుగంధ = సుగంధమైన, విమల = మురికిలేని, విపుల = విరివియైన, సలిల = నీటియొక్క, శైవాలజాః = నాచునుండి పుట్టినవి, శైవాలశ్యావా = నాచువలె శ్యావవర్ణముగలవి, నీల-ఊర్ధ్వరాజయః = నీలముగనుండు పైకిపోవు రేఖలుగలవి, వృత్తాః చ = గుండ్రగనుండు నవియు, నిర్విషాః = విషములేనివి.

తాత్పర్యము : తామర, కలువ, చెంగల్వలచే సుగంధముగానుండు, మురికిలేని, ఎక్కువనీరుగల జలాశయములందు నాచునుండి పుట్టినవి, నాచువలె శ్యావవర్ణము గలవి, పైకిపోవుచుండు నీలమగు రేఖలు గలవి, గుండ్రగను ఉండునవి యగు జలగలు నిర్విషములు.

వి. వ్యా. సుశ్రుతుడు వీనిని విశేషముగా వర్ణించినాడు. అష్టాంగహృదయమున నిర్విష జలూకా లక్షణములు ఈక్రింది విధముగా చెప్పబడినవి. పాచివలె కపిలవర్ణము, గుండ్రగ నుండుట, నీలవర్ణముగ నుండు ఊర్ధ్వరేఖలు గలిగియుండుట, కషాయవర్ణము గల పృష్ఠభాగము, కృశమైన శరీరము, కొంచెము పీతవర్ణముగల ఉదరప్రదేశము గలిగియుండుట.

## జలగల ప్రమాణము — మనుజాదులకు ఉపయోగింపదగినవి

**మూలము : సర్వాసాం చ పరం ప్రమాణమష్టాదశాఙ్గులాని। తత్రః చతుః పఞ్చషడంగులా నృషుయోజయేత్ । గజవాజిష్వపరాః ।**

*ప్రతి పదార్థము* : సర్వాసాం చ = అన్నింటికిని, పరంప్రమాణం = హెచ్చుకొలత, అష్టాదశ అఙ్గులాని = పదునెనిమిది అంగుళములు, తత్ర = అందు, చతుః- పఞ్చ- షడంగులాః = నాలుగు, అయిదు, ఆరు అంగుళముల ప్రమాణముగలవి, నృషు = మానవు లందు, యోజయేత్ = ప్రయోగింపవలెను, అపరాః = మిగిలినవి, గజ-వాజిషు = ఏనుగులు, గుఱ్ఱములందు (ప్రయోగింపవలెను).

తాత్పర్యము : జలగలన్నియు పదునెనిమిది అంగుళముల గరిష్ఠ ప్రమాణమున యుండును. వానిలో నాలుగు, అయిదు, ఆరు అంగుళముల వరకు ప్రమాణము గలవానిని మనుజులకును, అంతకన్న పొడవగువానిని ఏనుగులు, గుఱ్ఱములకును ఉపయోగింపవలెను.

శశిలేఖ : ప్రసంగవశమున ఏనుగు, గుఱ్ఱము మొదలగు జంతువుల కుపయోగించు జలగల ప్రమాణము చెప్పబడినది.

వి. వ్యా. : సావరికాయను నిర్విషజలౌకను గజ-అశ్వములకు రక్తమోక్షణజేయుట కుపయోగింతురని సుశ్రుతమున యున్నది.

## జలగలందు లింగభేదము — వాని ఉపయోగము

**మూలము : తాః సుకుమారాస్తను త్వచోఽల్ప శిరస్కా బృహదధర కాయాశ్చస్త్రియః । విపరీతాః పుమాంసోఽర్ధచంద్రాకృతి పురోవృత్తాశ్చ । తత్రబహుదోషేషు చిరోత్థితేషు చామయేషు పుమాంసో యోజయితవ్యాః । స్త్రియో విపరీతేషు ।**

ప్రతి పదార్థము : తాః = అవి, సుకుమారాః = సుకుమారములుగా నుండునవి, తనుత్వచః = పలుచని చర్మముగలవి, అల్పశిరస్కాః = చిన్నదగు తల గలవి, బృహత్ = అధరకాయాః చ = క్రింది కాయము పెద్దదిగ నుండునవియును, స్త్రియః = ఆడువి; విపరీతాః = విపరీత లక్షణములు గలవి, అర్ధచన్ద్రాకృతి = అర్ధచంద్రాకారమున నుండి, పురోవృత్తాః = ముందుభాగమున గుండ్రగ నుండునవి, పుమాంసః = మగవి; తత్ర = అందు, బహుదోషేషు = ఎక్కువ దోషములు గల, చిరోత్థితేషు- ఆమయేషు = దీర్ఘవ్యాధులందు, పుమాంసః = మగవి, యోజయితవ్యాః = ఉపయోగింపదగినవి; విపరీతేషు = ఇతరములగు వానియందు, స్త్రియః = ఆడువి (ఉపయోగింపదగినవి).

తాత్పర్యము : జలగలలో సుకుమారముగ నుండునవి, పలుచని చర్మముగలవి, చిన్నతలవి, క్రిందిభాగము పెద్దదిగ నుండునవి ఆడు జలగలనియు, అందుకు భిన్న లక్షణములు కలిగి, అర్ధచంద్రాకృతిగా నుండి, ముందువైపు గుండ్రగ నుండునవి మగవి అనియు తెలియవలెను. అధిక దోషములు గల వ్యాధు లందును, దీర్ఘ వ్యాధులందును మగ జలగలను, తద్భిన్నములగు వానియందు ఆడు జలగలను ప్రయోగింపవలెను.

## జలగలను గ్రహించు విధము—వానిని పోషించు విధము

**మూలము : జలౌకసస్త్వార్ద్ర చర్మాద్యుపాయైర్గృహీత్వా సురభిపఙ్క గర్భే నవేఘటే స్థాపయేత్ । శృఙ్గాటక కశేరుక శాలూకశైవాలమృణాళవల్లూరమృత్స్నాపుష్కర బీజచూర్ణం స్వాదుశీతం స్వచ్ఛం చ తోయమన్నపానార్థే తాభ్యో దద్యాత్ । లాలాదికోథ పరిహారార్థమేవంచ త్ర్యహాత్ త్ర్యహాదూర్ధ్వం పూర్వమన్నపాన మపనీయాన్యద్దద్యాత్ । పఞ్చాహాచ్చ తద్విధ ఏవ ఘటాన్తరే తాః సంచారయేత్ ।**

ప్రతి పదార్థము : జలౌకసః = జలగలను, ఆర్ద్రచర్మాది ఉపాయైః = తడిగానుండు చర్మము మొదలగు ఉపాయములచే, గృహీత్వా = పట్టుకొని, సురభిపఙ్కగర్భే = సువాసన గల బురదమధ్యలో, నవేఘటే = క్రొత్తకుండయందు, స్థాపయేత్ = ఉంచవలెను, తాభ్యః = వానికొరకు, అన్నపానార్థే = ఆహారపానీయములకు. శృఙ్గాటక-కశేరుక-శాలూక-శైవాల-

మృణాల-వల్లూర-మృత్స్నా-పుష్కరబీజచూర్ణం = పరికెగడ్డ, కమ్మరేగు, తామరదుంప, పాచి, తామరతూడు, ఎండినచేప (మాంసము), అడవితొగరితీగ, మెట్టతామర విత్తుల చూర్ణము-వీనిని, స్వాదు-శీత-స్వచ్ఛం చ తోయం = మధురమగు, చల్లని, శుభ్రమగు నీరును, దద్యాత్ = ఇవ్వవలెను త్ర్యహాత్-త్ర్యహాత్ = మూడు, మూడుదినములకు, లాలాదికోథ పరిహారార్థమేవచ = జొల్లు మొదలగు మలినముల పరిహరించుటకున్నూ, పూర్వం- అన్నపానం = మొదటి ఆహారపానీయములను, అపనీయ = తొలగించి, అన్యత్-దద్యాత్ = వేరైనవాటిని ఇవ్వవలెను. పఞ్చాహాత్-చ = అయిదు రోజులకు, తత్-విధఏవ = అదేప్రకారముగా, తాః = వానిని, ఘటాన్తరే = వేరొక కుండయందు, సంచారయేత్ = సంచరింపజేయవలెను.

తాత్పర్యము : తడిగానుండు చర్మము మొదలగు సాధనముల చే జలగలను పట్టుకొని, క్రొత్తకుండయందు దుర్వాసన లేని బురదను ఉంచి దాని మధ్యలో వేయవలెను, వాని ఆహారమునకు పరికెగడ్డలు, కొట్టిగడ్డలు, తామర దుంపలు, పాచి, తామరతూండ్లు, ఎండు చేపలు, మాంసము, అడవి తొగరితీగ, మెట్టతామర విత్తుల చూర్ణము మొదలగునవియు, స్వచ్ఛమై, చల్లని మధురమగు నీటిని త్రాగుటకును ఉంచవలెను. అవి కుళ్లకుండునట్లు మూడురోజుల కొకసారి మార్చవలెను. అయిదురోజులకొకసారి వేరొకకుండలో వేయవలెను.

వి. వా : సుశ్రుతుడు తడి చర్మము మొదలగు సాధనములచే జలగలను పట్టుకొని, క్రొత్తకుండలలో వేసియుంచి, రెండు మూడు దినములకొకసారి నీటిని, ఆహారమును మార్చుచుండ వలెననియు, ఏడు దినముల కొకసారి కుండను మార్చవలెననియు తెలిపెను. శరత్కాలమున జలగలను పట్టుకొన వలెనని డల్హణుని అభిప్రాయము.

## జలౌకావచరణ విధి

మూలము : తాసాం తు దుష్టశోణితానమ్యగ్వమనాత్ ప్రతతపాతనాచ్చ మూర్చాభవతిక్షే। తాసామమ్భోభిః పూర్ణ భాజనస్థానామచేష్ట యాహారానభిలాషేణ చ జ్ఞాత్వా తా వివర్జయేత్ । ఇతరాస్తు హరిద్రాసర్షపకల్కామ్భసి ముక్తపురీషా అవన్తిసోమ తక్రేవా పునరాశ్వాసితా జలేసుఖోపవిష్టస్య సన్నివిష్టస్య వా మృద్గోమయచూర్ణాభ్యా మనుసుఖం విరూక్ష్య దంశదేశం యోజయేత్ । అలగన్తీషు క్షీరఘృతనవనీత రుధిరాన్యతమబిందూన్న్యసేత్ ప్రచ్ఛేద్వా। అశ్వఖురవచ్చవక్త్రం నివేశయోన్నత స్కన్ధాదశన్తి । యదాచ శిశువచ్ఛ్వసన్త్యోశిరఃస్పన్దోర్మివేగైః పిబన్తి తదార్ద్రవాస సావచ్ఛాదయేత్ । సేచయేచ్చామ్భసా ఽల్పాల్పమ్ । యథాచ హంసః క్షీరోదకాత్క్షీర మాదత్తే తద్వదుత్క్లిష్టేరక్తే జలౌకాః ప్రాగ్దుష్టమసృక్ । యదా చ తద్దంశే తోదః కణ్డూర్వా తదా శుద్ధరక్త రక్షణార్థమపనయేత్ । లౌల్యాచ్చ దంశమ ముఞ్చన్త్యాః క్షౌద్రం లవణచూర్ణం వా ముఖేదద్యాత్ । పతితాం తు తణ్డుల కణ్డనోపదిగ్ధగాత్రాం తైలలవణాభ్యక్తముఖీం అపుచ్ఛాదాముఖమనులోమం శనైః పీడయన్ సమ్యగ్వామయేత్ । తతః పూర్వవత్సన్నిదధ్యాత్ । సప్తరాత్రం చ తాః పునర్నపాతయేత్ । అశుద్ధేతు రక్తే మధునా గుడేన వా దంశాత్ కిఞ్చిదవ ఘట్టయన్ స్రావయేత్ । స్రుతరక్తస్యచ సద్యోదంశం శీతాభిరద్భిః ప్రక్షాళ్య సర్పిఃపిచునా ఽవగుణ్ఠయేత్ । స్థితరక్తం చోత్క్లిష్టశోణితశేషప్రసాదనాయ

కషాయమధురశిశిరైః సఘృతైః ప్రదేహైః ప్రదిహ్యాత్ । తత్రయోగాదీన్ సిరావ్యధవదుపలక్షయేత్ । ప్రతికుర్వీత చ । దుష్టరక్తాపగమాచ్ఛ్వయథు శైథిల్యం దాహరాగశూలోపశమశ్చ ।

ప్రతి పదార్థము : తాసాం = ఆ జలగలకు, దుష్టశోణిత-అసమ్యక్-వమనాత్ = దుష్టరక్తము చక్కగా వాంతి కాకపోవుటచేత, ప్రతతపాతనాత్ చ = మాటి మాటికి ఉపయోగించుట చేతను, మూర్ఛా = మూర్ఛ, భవతి = కలుగు చున్నది.

తాసాం = అట్టివానిని, పూర్ణభాజనస్థానాం అమ్భోభిః = కుండయందుగల నీటియందు, అ చేష్టయా = కదలకుండు ట చేత, ఆహార అనభిలాషేణ చ = ఆహారముపై కోర్కె లేకపోవుటచేతను, జ్ఞాత్వా = తెలిసికొని, తా. = వానిని, వివర్జయేత్ = విడువవలెను.

ఇతరాః తు = మిగిలిన వానినైతే, హరిద్రా-సర్షప-కల్కా-మ్బుసి = పసుపు, ఆవాల కల్కముగల నీటియందు, ముక్తపురీషా = మలమును విడిచిన వానిని, అవన్తిసోమే = ధాన్యామ్లమునందు, తక్రేవా = మజ్జిగయందుగాని, పునః = తిరిగి, జరే చ = నీటియందును, సమాశ్వాసితాః = ఊరింపబడిన వానిని, సుఖోపవిష్టస్య = సుఖముగా కూర్చున్నవానికి, సన్నివిష్టస్య వా = లేక పరున్నవానికి గాని, మృత్-గోమయ చూర్ణాభ్యాం = మన్ను, ఆవు పేడల చూర్ణములచేత, అనుసుఖం = సుఖముగా నుండునట్లు, దంశదేశం = కొరికించవలసిన చోటును, విరూక్ష్య....రూక్షమగునట్లుచేసి (శుద్ధి), యోజయేత్ = ప్రయోగించవలెను.

అలగన్తీషు = (జలగలు) పట్టుకొనిన సమయము లందు, క్షీర-ఘృత-నవనీత-రుధిర-అన్యతమ బిందూన్ = పాలు, నెయ్యి, వెన్న, రక్తములలో ఒకదాని చుక్కలను, న్యసేత్ = వేయవలెను, వా = లేక, ప్రచ్ఛేత్ = ఛేదింపవలెను, వక్త్రే = నోటిని, అశ్వఖురవత్ = గుఱ్ఱము గిట్టవలె, నివేశయ = ఉంచినదై, ఉన్నతస్కన్ధాః = భుజములను ఎత్తుగా ఉంచి, యదా = ఎపుడు, దశన్తి = కొరుకునో, శిశువత్ = శిశువువలె, శ్వసన్త్యః = శ్వాసించుచు, ఊర్మివేగైః = పెద్ద అలల వేగమున, శిరఃస్పన్దం = తలాడించుచు, పిబన్తి = (రక్తమును) త్రాగుచున్నవో, తదా = అపుడు, ఆర్ద్రవాససా = తడి బట్టచే, అవచ్ఛాదయేత్ = కప్పవలెను, అల్పాల్పమ్ = కొంచెము కొంచెము, అంభసాచ = నీటిచేతనున్నూ, సేచయేత్ = తడుపవలెను.

యథా = ఎట్లు, హంసః = హంస, క్షీరోదకాత్ = క్షీరోదక మిశ్రమమునుండి, క్షీరం = పాలను, ఆదత్తే = గ్రహించునో, తద్వత్ = అట్లే, జలౌకాః = జలగలు, ఉత్క్లిష్టే రక్తే = దుష్టమైన రక్తమందు, ప్రాక్ = మొదట, దుష్టం-అసృక్ = దుష్టమైన రక్తమును (గ్రహించును), యదా = ఎపుడు, తద్దంశే = ఆ కరచిన చోట, తోదః-కణ్డూరాః = నొప్పి లేక దురద కలుగునో, తదా = అపుడు, శుద్ధరక్తరక్షణార్థం = శుద్ధ రక్తమును రక్షించుటకై, అపయేనత్ చ = (జలగను) తొలగించవలెను.

లౌల్యాత్ = లోభముచేత, దంశం = కొరికిన స్థలమును, అముఞ్చత్యాః = వదలని వానికొరకు, ముఖే = నోటియందు, క్షౌద్రం = తేనె, లవణ చూర్ణం వా = ఉప్పుపొడిని గాని, దద్యాత్ చ = ఇవ్వవలెను, పతితాం తు = పడినవానినైతే, తణ్డుల కణ్డనోపదిగ్ధగాత్రాం =

బియ్యపు తవుడుచే రుద్దిన శరీరము గల వానిని, తైల లవణాభ్యక్త ముఖీం = నూనె, ఉప్పు నోటియందు రుద్దిన వానిని, అనులోమం = అనులోమముగా, అపుచ్ఛాదాముఖం = తోకనుండి నోటివరకు, శనైః = మెల్లగా, పీడయన్ = వత్తుచు, సమ్యక్ = బాగుగా, వామయేత్ = వమనము చేయించవలెను, తతః = తరువాత, పూర్వవత్ = ముందు చెప్పిన విధముగా, సన్నిదధ్యాత్ = ఉంచవలెను, తాః = అట్టివానిని, సప్తరాత్రం = ఏడు రాత్రులు (రోజులు), న పాతయేత్ చ = త్రాగించరాదు (తిరిగి ఉపయోగించరాదు).

అశుద్ధేరక్తేతు = అశుద్ధరక్తమునందయితే (స్రవించినపుడు), మధునాగుడేన వా = తేనె లేక బెల్లము చేత, దంశాన్ = కొరికిన స్థలమున, కిఞ్చిదవఘట్టయన్ = కొంచెము రుద్దుచు, స్రావయేత్ = స్రవింప జేయవలెను. స్రుతరక్తస్య = రక్తస్రావమైన, సద్యోదంశంచ = కొరకబడిన గాయమును, శీతాభిః - అద్భిః = చల్లనైననీటితో, ప్రక్షాళ్య = కడిగి, సర్పిః పి చునా = నేతితో తడిపిన పిచువుతో, అవగుణ్ఠయేత్ = కప్పవలెను.

స్థిత రక్తం చ = రక్తము ఆగిన దగుచుండగా, ఉత్క్లిష్ట శోణిత శేషప్రసాదనాయ = మిగిలినదగు ప్రకోపించిన రక్తము సమస్థితికి వచ్చుట కొరకు, కషాయ - మధుర - శిశిరైః = కషాయ, మధుర రసములు గలిగి, చల్లనైనవియు, సఘృతైః = నేతితో గూడినవియు అగు, ప్రదేహైః = పట్టులచేత, పట్టువేయవలెను. తత్ర = అచట, యోగాదీన్ = (రక్తస్రావము యొక్క) హీన - అతియోగములను, సిరావ్యధవత్ = సిరావేధము (నందలి హీన - అతియోగములకు)వలె, ఉపలక్షయేత్ = తెలియవలెను; ప్రకుర్వీత చ = ప్రతిక్రియ చేయవలెను.

దుష్ట రక్త అపగమాత్ = దుష్టరక్తమును వెడలించుటచేత, శ్వయథు - శైథిల్యం = వాపుతగ్గుట, దాహ - రాగ - శూల - ఉపశమశ్చ = మంట, ఎరుపు, నొప్పి తగ్గుటయు (కలుగును).

**తాత్పర్యము :** చెడురక్తమును త్రాగిన తరువాత వాంతి చేయించక పోవుటచేతను, మాటిమాటికి త్రాగించుట చేతను జలగలకు మూర్ఛ కలుగును. అట్టి వానిని, నీటికుండలో ఉంచినచో కదలకుండుటను బట్టి ఆహారమునందు కోరికలేకుండుటను బట్టి, తెలిసికొని, విడిచి వేయవలెను. మిగిలిన వానివి పసుపు, ఆవాలకల్కము గల నీటియందు వేసి, అవి మల విసర్జనచేసిన తరువాత, ధాన్యామ్లమునందు గాని, మజ్జిగలోగాని వేసి, తరువాత స్వచ్ఛమగు నీటిలో వేసి, తీసి ఉపయోగించ వలెను.

రోగిని సుఖముగా కూర్చుండబెట్టి లేక పరుండ జేసి, జలగను పట్టించు ప్రదేశమున మన్ను, ఆవు పేడల చూర్ణమును రుద్ది, జలగను పట్టించవలెను. అది వెంటనే పట్టుకొనినచో, తేనె, నెయ్యి, వెన్న లేక రక్తము, ఒకటి రెండు చుక్కలు వేయవలెను. లేదా కత్తితో కొంచెము గాయము చేయవలెను. గుఱ్ఱము గిట్టవలె మోరపైకెత్తి, భుజములు ఎత్తుగాఉంచి, శిశువులవలె శ్వాసించుచు, పెద్ద తరంగములవలె తలను కదలించుచు రక్తమును త్రాగు

చున్నపుడు మృదువగు బట్టచే దానిని కప్పవలెను. దానిపై కొంచెము నీటిని చల్లుచు తడుప వలెను. ఏవిధమున హంస, పాలు, నీరు కలిసియున్నపుడు పాలను మాత్రమే గ్రహించునో, అట్లే, జలగ రక్తము నందు మొదట దుష్టమైన రక్తమును మాత్రమే గ్రహించును. అది కరచిన చోట నొప్పి, లేక దురద కలిగినచో శుద్ధ రక్తమును త్రాగుచున్నదని గ్రహించి వెంటనే జలగను తీసివేయవలెను అస్థలమును జలగ విడువకుండ యున్నచో దానినోటి యందు తేనెగాని, ఉప్పుపొడినిగాని వేసినచో విడుచును. అట్లు వదలిన జలగపై బియ్యపుతవుడు రుద్ది, దానినోటితో నూనె, ఉప్పువేసి తలక్రిందుగా తోకనుండి నోటివరకు మెల్లగా నొక్కుచు, త్రాగిన దుష్టరక్తమును పూర్తిగా వమనము చేయించవలెను. పిదప పూర్వమువలె కుండలో వేసి ఉంచవలెను. దానిని ఏడురోజులవరకు తిరిగి ఉపయోగింప రాదు. జలగను ఉపయోగించినచోట అశుద్ధరక్తము ఇంకను శేషించియున్నచో, తేనె, బెల్లము రుద్దుచు స్రవింపజేయవలెను. అట్లు రక్త స్రావణమయిన తరువాత, ఆగాయమును చల్లని నీటితో కడిగి, నేతితో తడిపిన పిచువుతో కప్పవలెను. రక్తస్రావము ఆగిన పిదప శేషించియున్న దుష్టరక్తమును శమింపజేయుటకు ఘృతముతో గూడిన, కషాయ మధుర రసములు గల చల్లని పట్టులను గాయముపై వేయవలెను.

రక్తస్రావముయొక్క హీనయోగ, అతియోగ, సమ్యగ్యోగ లక్షణములు సిరావేధన మునందు వలెనే ఉండును. చికిత్స గూడ వానికి చేసినట్లే చేయవలెను. దుష్టరక్తము స్రవించి వెడలినచో వాపు తగ్గి ఒడిలిపోయి, మంట, ఎరుపు, నొప్పి తగ్గును.

*శశిలేఖ* : తణ్డులకణ్డనమ్ అనగా తండుల త్వక్ చూర్ణము. స్థితరక్తమ్ అనగా అవహల్ రక్తమ్—ప్రవహించక గడ్డ కట్టిన రక్తము.

వి. వ్యా. : చల్లని నీటితో తడుపుట, తడివస్త్రము కప్పుటవలన జలగకు సుఖముగా నుండుటచేత రక్తమును బాగుగా పీల్చును.

చక్కగా వమనము చేయించిన జలగ నీటియందుంచబడి, ఆహారముపై కోర్కెగలిగి సంచరించుననియు, నీటియందు మునిగియున్నచో దుర్వాంతగా తెలిసికొని దానికి మరల వమనము చేయించవలెననియు సుశ్రుతుడు తెలిపెను. ఇంకను దుర్వాంతయగు జలగకు ఇంద్రమదమను అసాధ్యమగు వ్యాధి కలుగునని తెలిపెను.

"పూర్వవత్పటుతాదార్ఢ్యం సమ్యగ్వాంతే జలౌకసామ్"—జలగలకు చక్కగా వమనము చేయించినచో పూర్వమువలె పటుత్వము, దార్ఢ్యము కలుగునని అష్టాంగహృదయమున తెలుపబడినది. అట్లే, అధికమగు వమనముచే బడలిక లేక మరణము; బాగుగా వమనము కానిచో స్తబ్ధత్వము, మత్తత కలుగునని గూడ చెప్పబడినది.

డల్హణుని విశేష వివరణ మిట్లున్నది : తేనెరుద్దుట, కషాయాదుల లేపన సంధానార్థము చెప్పబడినది. దోషములయొక్క, వ్యాధియొక్క బల-ప్రమాణాదుల ననుసరించి, లేక, శుద్ధ రక్తము చక్కగా వెడలు వరకుగాని జలగను పట్టించవలెను. రక్తస్రావమునకు ప్రమాణము ఉత్తమమాత్రగా, ప్రస్థమును, మధ్యమమాత్రగా అర్ధప్రస్థమును, అధమమాత్రగా కుడవమును చేయించవలెను. ఇవి యన్నియు రెండు దినములలో వెడలింపదగినవి.

## రక్తమోక్షమున అలాబు, ఘటికా ప్రయోగ విధి

**మూలము :** రక్తపిత్తేన దుష్టమలాబు ఘటికాభ్యాన్ననిర్హరేదగ్ని సంయోగాద్వాత కఫాభ్యాం చ దుష్టం నిర్హరేత్ । తథా కఫేన న శృఙ్గేణ స్కన్నత్వాద్వాత పిత్తాభ్యాం తు దుష్టన్నిర్హరేత్ । అథప్రచ్ఛాద్యాఙ్గం తనువస్త్రపటలావనద్ధప్రాన్తేన శృఙ్గేణాచూషేత్ । తథాప్రదీప్తపిచు గర్భాభ్యామలాబు ఘటికాభ్యామితి ।

**ప్రతి పదార్థము :** అగ్నిసంయోగాత్ = అగ్ని సంబంధముండుటచేత, రక్త - పిత్తేన - దుష్టం = రక్తము, పిత్తములచే దూషితమైన రక్తమును, అలాబు - ఘటికాభ్యాం = సొరకాయ బుఱ్ఱ, కుండలచేత, న, నిర్హరేత్ = వెదలించరాదు, తథా = అట్లే, స్కన్నత్వాత్ = గడ్డకట్టు గుణము ఉండుటచేత, కఫేన (దుష్టం - రక్తం - న నిర్హరేత్) = కఫముచే (దుష్టమైన రక్తమును వెదలించరాదు), వాత - పిత్తాభ్యాం - దుష్టం - తు = వాత - పిత్తములచే దూషితమైన రక్తమునైతే, నిర్హరేత్ = వెదలింపవలెను.

అథ = తరువాత, ప్రచ్ఛాద్యాఙ్గం = కప్పబడిన అంగమును, తనువస్త్ర పటలా - వనద్ధ ప్రాన్తేన = పలుచని బట్టపొరచేత మూయబడిన ప్రాంతముగల, శృఙ్గేణ = కొమ్ము చేత, అచూషేత్ = పీల్చవలెను, తథా = అట్లే, ప్రదీప్త - పిచు - గర్భాభ్యాం = నిప్పు ముట్టించిన పిచువులు గర్భమునగల, అలాబు - ఘటికాభ్యాం = సొరకాయ బుఱ్ఱ, కుండలచేతను, (వెదలించవలెను).

**తాత్పర్యము :** అగ్ని సంయోగ ముండుటచేత రక్త, పిత్త దుష్టమగు రక్తమును వెదలించుటకు సొరకాయబుఱ్ఱ, కుండలనుపయోగించరాదు. అట్లే, గడ్డకట్టు గుణముండుటచే కఫదూషితమైన రక్తమును గూడ వెదలింపరాదు. వాత - పిత్తముల రెండింటిచే దూషితమైన రక్తమును వెదలింపవలెను. వ్యాధిగ్రస్త ప్రాంతమును కప్పియుంచి, పలుచని బట్టపొరచే కొమ్ముకొనను మూసి రక్తమును పీల్చవలెను. నిప్పు ముట్టించిన పిచువు లోపలనుంచినట్టి సొరకాయబుఱ్ఱ, కుండలచేత రక్త మోక్షణము చేయించవలెను.

**శశిలేఖ :** రక్తమునకు స్కన్నత్వ (గడ్డకట్టు) గుణముండుటచేతను, అలాబు - ఘటికలందు అగ్ని సంయోగము ఉండుట చేతను వాని నుపయోగింపరాదు.

**వి. వ్యా :** సుశ్రుతు డీ విషయమున ఇట్లు తెలిపెను. అలాబు కటుకము, రూక్షము; తీక్ష్ణమైన దగుటచే శ్లేష్మదూషిత రక్తమును స్రవింపజేయుటకు ప్రశస్తమైనదనియు; గోశృంగము ఉష్ణ, మధుర, స్నిగ్ధగుణములు గలదగుటచేత వాతదూషిత రక్తమును స్రవింప జేయుటకును; జలగలు చల్లని నీటి యందుండునవగుట చేతను, మధురమైనవగుట చేతను, నీటియందు పుట్టినవగుట చేతను, పిత్తదూషితరక్తమును స్రవింపజేయుటకును ప్రశస్తమైనవి. అని తెలిపెను.

**మూలము :** భవన్తి చాత్రశ్లోకాః :—

శ్లో. గాత్రం బద్ధ్వోపరి దృఢం రజ్జ్వా పట్టేన వా సమమ్ ।
స్నాయు సన్ధ్యస్థిమర్మాణి త్యజన్ ప్రచ్ఛానమాచరేత్ ॥

ప్రతి పదార్థము : గాత్రం = శరీరమును, ఉపరి = పైభాగమున, సమమ్ = సమానముగా, దృఢం = గట్టిగా, రజ్వా = త్రాటిచేతగాని, పట్టేనవా = వస్త్రముచేతగాని, బద్ధ్వా = బంధించి, స్నాయు-సన్ధి-అస్థి-మర్మాణి = స్నాయువులను, సంధులను, అస్థులను, మర్మలను, త్యజన్ = వదలివేయుచు, ప్రచ్ఛానం = (శలాకచే) పొడుచుటను, ఆచరేత్ = చేయవలెను.

తాత్పర్యము : శరీరముపై వ్యాధిగ్రస్తమగు ప్రదేశమునకు పై భాగమున త్రాడు లేక వస్త్రముచే గట్టిగా కట్టి, స్నాయు-సంధి-అస్థి-మర్మ ప్రదేశములను విడిచిపెట్టి ప్రచ్ఛానము చేయవలెను.

మూలము : శ్లో॥ అథోదేశప్రవిసృతైః పదైరుపరిగామిభిః ।
నగాఢ ఘనతిర్యగ్భిర్న పదే పదమాచరేత్ ॥

ప్రతి పదార్థము : అధోదేశప్రవిసృతైః-న = క్రింది భాగమునకు ప్రసరించకుండునట్లుగా, గాఢ-ఘన-తిర్యగ్భిః-న = లోతుగా-పెద్దదిగా-అడ్డముగా లేకుండునట్లు, పదే-న= క్షతమునందు కాకుండునట్లు, ఉపరి-గామిభిఃపదైః = పైకి పోవునట్లు క్షతములచేత, పదం = క్షతమును, ఆచరేత్ = చేయవలెను.

తాత్పర్యము : క్షతమును కలిగించునపుడు క్రింది భాగమునకు ప్రసరించకుండునట్లును, లోతుగ-పెద్దదిగ-వంకరగా లేకుండునట్లును, మరియొక క్షతమునందు చేయకుండను, పైకి పోవునట్లు క్షతముల నాచరించవలెను.

మూలము : ప్రచ్ఛానేనైకదేశస్థం స్రుతం శృఙ్గాదిభిర్హరేత్ ।
గ్రథితం తు జలౌకోభిరసృగ్వ్యాపి సిరావ్యధైః ॥
ప్రచ్ఛానం పిణ్డితే వాస్యాదవగాఢే జలౌకసః ।
త్వక్స్థేఽలాబు ఘటీశృఙ్గం సిరైవవ్యాపకేఽసృజి ।
వాతాధి ధామవా శృఙ్గజలౌకోఽలాబుభిః క్రమాత్ ॥

ప్రతి పదార్థము : ఏకదేశస్థం = ఒకే ప్రదేశమున ఉన్నట్టి (రక్తమును), ప్రచ్ఛానేన = పొడుచుటచేతను, స్రుతం = ప్రవహించకుండునట్టిదానిని, శృఙ్గాదిభిః = కొమ్ము మొదలగువానిచేతను, గ్రథితంతు = గడ్డకట్టినదానినైతే; జలౌకోభిః = జలగలచేతను, వ్యాపి = సర్వశరీరమున వ్యాపించియున్న, అసృక్ = రక్తమును, సిరావ్యధైః = సిరావేధముల వలనను, హరేత్ = వెడలించవలెను.

వా = లేక, పిణ్డితే = గడ్డకట్టిన దానికి, ప్రచ్ఛానం = పొడుచుట, అవగాఢే = లోతగు దానికి, జలౌకసః = జలగచేతను, త్వక్స్థే = చర్మమునందున్న దానికి, అలాబు - ఘటీ - శృఙ్గం = సొరకాయ బుఱ్ఱ, కుండ, కొమ్ము; వ్యాపకే = సర్వశరీరమున వ్యాపించిన, అసృజి = రక్తమునందు, సిర - ఏవ = సిరావ్యధనమే, స్యాత్ = (చికిత్స) అగును.

వా = లేక, వాతాది ధామ = వాతాదులకు నెలవైన (దుష్ట రక్తమునకు), క్రమాత్ = క్రమముగా, శృఙ్గ - జలౌకో - అలాబు భిః = కొమ్ము, జలగ, సొరకాయ బుఱ్ఱలచే, (చికిత్స అగును).

**తాత్పర్యము :** ఒకే స్థానమున గల రక్తమును పొడుచుటచేతను, స్థిరమగురక్తమును శృంగాదులచేతను, గడ్డకట్టిన రక్తమును జలగలచేతను, సర్వశరీరమున వ్యాపించియున్న దూషిత రక్తమును సిరావేధముచేతను వెడలింపవలెను. లేక పిండీభూతమైన రక్తమును పొడుచుటచేతను, లోతగు దానిని జలగలచేతను, చర్మమునందున్న (అనగా పైపైనయున్న) రక్తమును సొరబుఱ్ఱ, కుండ, కొమ్ములచేతను, సర్వశరీర వ్యాపకమగు దానిని సిరావేధము వలనను వెడలించవలెను. లేక, వాత - పిత్త - కఫలముచే దూషితమైన రక్తమును వెడలించుటకు క్రమముగా, కొమ్ము - జలగ-సొరకాయ బుఱ్ఱలనుపయోగించవలెను.

**వి. వ్యా. :** గోవులయొక్క శృంగములు ఉష్ణ - మధుర - స్నిగ్ధ గుణములు కలిగియుండుటచేత వాతోప సృష్ట రక్తమునందును; జలగ శీతలమగు నివాసము గలిగి, జలమున పుట్టి, మధురముగ నుండునదగుటచే పిత్తోపసృష్ట రక్తమున, సొరబుఱ్ఱ కటు - తీక్ష్ణ - రూక్ష గుణముల కలిగియుండుటచే శ్లేష్మోప సృష్ట రక్తమునందును హితకారులగునని సుశ్రుతుడు తెలిపెను. అయినను "సర్వాణి సర్వైర్వా" అనగా ఏ విధముల దోషయుక్త రక్తమునైనను నియమము లేక దేనిచేనైనను వెడలింపవచ్చునని వ్రాసెను.

## రక్తమోక్షణానన్తర ఉపద్రవము — దానికి ప్రతీకారము

**మూలము :** స్రుతాసృజః ప్రదేహాద్యైః శీతైః స్యాద్వాయు కోపతః ।
స తోదకణ్డూః శోఫస్తం సర్పిషోష్ణేన సేచయేత్ ॥

*ప్రతి పదార్థము :* స్రుతాసృజః (పురుషస్య) = రక్తమోక్షణము చేయించిన పురుషునకు, వాయుకోపతః = వాతప్రకోపము వలన, శీతైః ప్రదేహాద్యైః = చల్లని పట్టు మొదలగు వానివలన, స-తోదకణ్డూః శోఫః = నొప్పి, దురదతో గూడిన వాపు, స్యాత్ = కలుగును, తం = అట్టిదానిని, ఉష్ణేన సర్పిషా = వేడినేయితో, సేచయేత్ = తడుపవలెను.

**తాత్పర్యము :** రక్తమోక్షణము చేయించిన రోగికి, చల్లని పట్టు మొదలగునవి వేయుటచేత వాతప్రకోపము వలన ఒక్కొక్కప్పుడు నొప్పి-దురదతో కూడిన వాపు కలుగును. దానిని వేడిగానుండు నేయిచే తడుపవలెను.

**వి. వ్యా :** చరకసంహిత యందు కుష్ఠచికిత్స, పిత్తజవిసర్ప చికిత్స, దంశ విష చికిత్సలలో జలౌకా ప్రయోగము చెప్పబడినది. కాయచికిత్సాప్రధానగ్రంథమగుటచే రక్తమోక్షణముగాని, జలౌకాప్రయోగముగాని విస్తరింపబడలేదు.

భావమిశ్రుడు వాతరక్త వ్యాధియందు ఎక్కువ మంట, చురుకులు ఉన్నపుడు జలగలచే రక్తమోక్షణము చేయించవలెనని; చిమచిమ, దురద, వణుకు ఉన్నపుడు శృంగముల చేతను, వ్యాధి ఒకచోటినుండి మరొకచోటికి పోయినపుడు కత్తితో గీయుట (ప్రచ్ఛానము) లేక సిరావేధనచేగాని రక్తమోక్షణము చేయవలెనని వ్రాసెను. వ్రణశోథాధికారమున రక్తమోక్షణ ప్రాశస్త్యమును వర్ణించుచు, వేదన శమించుటకును, పాకము శాంతించుకొరకును, శీఘ్రముగ జనించిన శోథయందు రక్తమోక్షణము చేయవలెననియు; బాధలకు అన్నింటికి రక్తమే మూలమగుటచేత దుష్టరక్తమును వెడలింపవలెననియు; శరీరవర్ణముకంటె భిన్న

వర్ణము కలిగియుండి, కఠినమై, శ్యామవర్ణము కలిగియుండు స్వల్పవేదనగల వ్రణశోఫలకు విశేషముగ శృంగములచేత, లేక జలగలచేత లేక పదములచే (అనగా కత్తినాట్లు) రక్త మోక్షణము చేయించవలెనని తెలిపెను.

అష్టాంగ హృదయమున జలౌకాప్రయోగముచే అర్శస్సు, విద్రధి, కుష్ఠము, వాత రక్తము, గళరోగములు, నేత్రరోగములు, విషము, విసర్పము శమింప జేయవచ్చునని తెలుపబడినది

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## ముప్పది ఆఱవ అధ్యాయము

**మూలము :** అథాతః సిరావ్యధవిధిం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ।
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః ॥

*ప్రతి పదార్థము :* అథ = జలౌకవిధియను అధ్యాయము తరువాత, అతః = సర్వాంగమున వ్యాపించిన దుష్టరక్త విస్రావణము సిరావ్యధ విధిచే జరగవలసి యుండుట చేత, సిరావ్యధవిధిం నామ = సిరావ్యధ విధియను అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము, ఆత్రేయాదయః - మహర్షయః = ఆత్రేయాది ఋషులు, ఇతిహ = ఈవిధము గానే, ఆహుః స్మ = పలికిరి.

సర్వ శరీరమున వ్యాపించి యుండు దుష్ట రక్తమును వెలిదీయుటకు సిరావ్యధ విధి జరుగవలసి యుండుటచేత జలూకా విధియను అధ్యాయము తరువాత, ఆత్రేయాది ఋషులు వివరించిన విధముగానే సిరావ్యధ విధియను అధ్యాయమును ఇప్పుడు వివరించెదము.

### సిరావేధ ప్రాశస్త్యము

**మూలము :** బహవోహి రక్తావసేచనోపాయాః ప్రాగభిహితాస్తేషామన్యేషాం చ విరేకాదీనా ముపక్రమాణాం తత్సాధ్యేష్వామయేషు సిరావ్యధః ప్రధానమ్ । అమునా హి తే సమూలాః శోషమాయాన్తి కేదారసేతుభేదేన శాల్యాదయ ఇవ ।

*ప్రతి పదార్థము :* రక్త - అవసేచన - ఉపాయాః = రక్తమును స్రవింపజేయు ఉపాయములు, బహవః = పెక్కు, ప్రాక్ - అభిహితాః హి = ముందు చెప్పబడినవి గదా! తేషాం = వానియొక్క, అన్యేషాం - చ = ఇతరములైన వాని యొక్కయు, విరేకాదీనాం = విరేకము మొదలగు, ఉపక్రమాణాం = చికిత్సలకు, తత్ - సాధ్యేషు = వానిచే సాధ్యమగు, ఆమయేషు = రోగములందు, సిరావ్యధం = సిరావేధన కర్మ, ప్రధానం = ముఖ్యమైనది. అమునా = దీనిచేత, కేదారసేతుభేదేన = పొలముయొక్క గట్టును త్రెంచుటచేత, శాల్యాదయః - ఇవ = శాలిధాన్యపు మొక్కలు మొదలగువానివలె, సమూలాః = మూలముతో గూడ, తే = ఆవ్యాధులు, శోషం = క్షీణించుటను, ఆయాన్తి = పొందుచున్నవి.

తాత్పర్యము : దుష్టరక్తమును స్రవింపజేయు పెక్కు ఉపాయములు ఇంతకు పూర్వము చెప్పబడినవి గదా! వానిలో, విరేచనాది ఉపక్రమములకు, రక్తస్రావణముచే సాధ్యమగు రోగముల చికిత్సలోను, సిరావ్యధనము ముఖ్యమైనది. పొలముయొక్క గట్టును

త్రెంచుటచే పైర్లు సమూలముగా ఎట్లు ఎండునో, అట్లు ఆవ్యాధులు సిరావేధచే సమూలముగా నశించును.

## శల్యతంత్రమున సిరావేధయొక్క ప్రాధాన్యత

**మూలము : తథా హి ।**

**సిరావ్యధశ్చికిత్సార్థం సంపూర్ణం వా చికిత్సితమ్ ।**
**శల్యతన్త్రేస్మృతో యద్వద్వస్తిః కాయ చికిత్సితే ॥**

ప్రతి పదార్థము : యద్వత్ = ఏవిధముగా, కాయచికిత్సితే = కాయ చికిత్సయందు, వస్తిః = వస్తికర్మ, చికిత్సార్థం = సగము చికిత్సగా, సంపూర్ణం చికిత్సితం వా = పూర్తి యగు చికిత్సగా గాని (చెప్పబడినదో), తద్వత్ = అట్లే, శల్యతన్త్రే = శల్యతంత్రమున, సిరావ్యధః = సిరావేధనము, స్మృతః = స్మరింపబడినది.

తాత్పర్యము : కాయ చికిత్సయందు ఏవివిధముగా వస్తికర్మకు సగము లేక పూర్తి చికిత్సగా ప్రాధాన్యతగలదో, అట్లే శల్య తంత్రమున సిరావేధన కర్మకు ప్రాధాన్యత గలదని చెప్పబడినది.

**మూలము : యథారక్తమధిష్ఠానం వికారాణాం వికారిణామ్ ।**
**అన్యన్నహి తథాదూష్యం కర్మేదం ప్రథమం తతః ॥**

ప్రతి పదార్థము : వికారిణాం = రోగులయొక్క, వికారాణాం = రోగములకు, రక్తం = రక్తము, యథా = ఏవిధముగా, అధిష్ఠానం = అధిష్ఠానమో, తథా = అట్లే, దూష్యం = దూష్యమును, అన్యత్ = మరొకటి, నహి = లేదు గదా! తతః = అందువలన, ఇదం = ఈ సిరావ్యధన కర్మ, ప్రథమం = మొదటిది (గాచెప్పబడుచున్నది).

తాత్పర్యము : సమస్త రోగులయొక్క రోగములకును ఏవిధముగా రక్తము అధిష్ఠానమో, అట్లే రక్తముదక్క దూష్యమును వేరులేదుగదా, అందుచే సిరావేధన కర్మ ప్రాధాన్యము వహించియున్నది.

## రక్త ఉత్పత్తి – స్వరూపము – ప్రయోజనము

**మూలము : తత్రామ్బు శారీరమాహారసారభూతం రసాఖ్యమవికృతమవికృతేన తేజసా రఞ్జితమిన్ద్రగోపాకారం చ శశశోణితగుఞ్జాఫలాలక్తక పద్మ సువర్ణవర్ణం ధౌతం చ విరజ్యమానం మధురమీషల్లవణం స్నిగ్ధమశీతోష్ణం గురు పిత్తైకచయ కోపోపశమనం సౌమ్యాగ్నేయం ప్రకృత్యా రక్తమాహుస్తదాదూష్యమ్ । దోషమితి కేచిత్ । ఉభయాత్మకమన్యే । తచ్చైవం విధమేవ విధివదాహార విహారాభ్యాసాద్విశుద్ధం బలవర్ణ సుఖాయుషాం యోనిః ।**

ప్రతిపదార్థము : తత్ర = అందు, శారీరం = శరీరమునందలి, ఆహార - సార భూతం = ఆహారముయొక్క సారభూతమైన, అంబు = నీరు, (ద్రవమగు), రసాఖ్యం = రసమను పేరుగలది, అవికృతం = వికృతిని బొందనట్టిది, అవికృతేన - తేజసా = వికృతిని బొందనట్టి అగ్నిచేత, రఞ్జితం = రంగుగలిగించబడి నట్టిదియు, ఇన్ద్రగోపాకారం - చ =

శశశోణిత = కుందేటి రక్తము, గుఞ్జాఫల = గురువింద గింజ, అలక్తక = లత్తుక, పద్మ = కమలము (వీనియొక్క), సువర్ణ = మంచివర్ణముతో సమానమైన, వర్ణం = రంగుకలదియు, ధౌతం చ = కడుగబడినదియై, విరజ్యమానం = రంగును కోల్పోవునదియు, మధురం = మధురరసము, ఈషత్-లవణం = కొంచెము లవణరసమును, స్నిగ్ధం = స్నిగ్ధముగాను, అ-శీత-ఉష్ణం = ఎక్కువ శీతోష్ణములు గానిదియు, గురు = గురు గుణము గలది, పిత్తైక చయ కోప ఉపశమనం = పిత్తమున కొక్కదానికేచయ, ప్రకోప, ప్రశమనములుకలిగించునదియు, ప్రకృత్యా = స్వాభావికముగానే, సౌమ్య-ఆగ్నేయం = సౌమ్యమును, ఆగ్నేయమును అయిన దానిని, రక్త = రక్తమని, ఆహుః = చెప్పుదురు, తదా = అప్పుడే (అట్టిదశయందే), దూష్యం = దూషింపబడునదిగా (చెప్పుదురు), కేచిత్ = కొందరాచార్యులు, ఉభయాత్మకం (ఇతి) = దోషముగాను, దూష్యముగాను (చెప్పుదురు).

తత్-చ = ఆరక్తమున్నూ, ఏవం-విధం = ఈవిధముగా, విధివత్ = శాస్త్రమున చెప్పబడిన రీతిన, ఆహార-విహార-అభ్యాసాత్ = ఆహార, విహారముల అభ్యాసముచేత, విశుద్ధం = పరిశుద్ధమైనదై, బల-వర్ణ-సుఖ-ఆయుషాం = బలము, శరీరవర్ణము, సుఖము, ఆయుస్సులకు, యోనిః = కారణము (అగుచున్నది).

**తాత్పర్యము :** భుజించిన ఆహారము యొక్క సారభూతమైన, ద్రవరూపమగు, అవికృతమైన రసము, అవికృతమగు జాఠరాగ్నిచే రంజనమునొంది; ఇంద్రగోపపురుగులు, కుందేటి రక్తము, గుంజాఫలము, లత్తుక, పద్మములవంటి వర్ణముగలదై, కడిగినచో రంగును కోల్పోవునదై; మధురము, కొంచెము లవణరసము గలిగినదై, స్నిగ్ధముగాను; అతి శీతల-అత్యుష్ణముగాక నుండి, గురుగుణము గలదై, పిత్తమునకొక్కదానికి చయ-ప్రకోప-ఉపశమనములు కలిగించునదియై స్వాభావికముగానే సౌమ్యమును, ఆగ్నేయమును అయినట్టిదానిని రక్తము అందురు. ఇట్టి స్థితియందు ఇది దూష్యముగా నుండును. కొందరు దీనిని దోషము అందురు. మరికొందరు ఉభయాత్మకముగా చెప్పుదురు. అనగా దోషముగాను, దూష్యముగాను, గూడ చెప్పుదురు. శాస్త్రవిధి ననుసరించిసేవించబడిన ఆహార విహారములవలన ఏర్పడు విశుద్ధరక్తము శరీరము యొక్క బల, వర్ణ సుఖ ఆయుస్సులకు కారణ మగుచున్నది.

**శశిలేఖ :** ధన్వంతరీయాదులు రక్తమును దోషముగా చెప్పిరి. ఏలనన వాతాదులవలె విశిష్టరోగ జనకత్వ గుణమును, విశిష్టమగు ఉపక్రమమును దీని విషయమున చెప్పబడినవి. వాతాదులచే నిది దూషింపబడునదగుటచే దూష్యముగా చరకాదులచే చెప్పబడినది. ఒక అంశము దుష్టమై మరియొక అంశమును దూషించుటచే దోషమును, దూష్యమును గూడ అగును.

వి. వ్యా. : అష్టాంగ హృదయమున శుద్ధరక్తముయొక్క లక్షణములను వర్ణించి దానిప్రయోజనమును తెలుపుచు దేహముయొక్క స్థితి రక్తముపై నాధారపడి యుండునని చెప్పబడినది. ఇంకను, పిత్త, శ్లేష్మములచే ఇది ప్రాయికముగ దూషింపబడుననియు తెలుపబడినది.

## రక్త వికృతిచే గలుగు వ్యాధులు

**మూలము :** ఇతరథాపునః శరత్కాల స్వభావాదేవ వా ప్రదుష్టమభిష్యన్దాదిమన్థశుక్రార్మ తిమిరరక్త రాజీ శిరస్తోదభేదదాహకణ్డూకర్ణ రోగముఖపాక పూతిఘ్రాణాస్యోపదేహ త్వగ్గుల్మప్లీహవిద్రధివీసర్పజ్వరరక్తపిత్తకుష్ఠపిటికాశ్లీపదోపదంశ శోఫవాతశోణిత రక్తమేహక్షుద్రరోగాగ్ని స్వరనాశాఙ్గ గౌరవసాదారోచకామ్లోద్గార లవణాస్యతా క్రోధమోహస్వేదమదమూర్ఛాసంన్యాసకమ్ప తన్ద్రాదీనామ్ (యోనిరితి పూర్వేణ సమ్బన్ధః) ।

ప్రతి పదార్థము : ఇతర థాపునః = పైజెప్పిన శుద్ధరక్తమునకు వ్యతిరేకముగానైతే, శరత్కాల స్వభావాత్-ఏవ-వా = శరత్కాల స్వభావమువలననే గాని, ప్రదుష్టం = దుష్టమైన రక్తము, అభిష్యన్ద = నేత్రాభిష్యందము, అధిమన్థ = అధిమంథము, శుక్ర = శుక్ర రోగము, అర్మ = అర్మవ్యాధి, తిమిరము = తిమిరవ్యాధి, రక్త-రాజీ = రక్తరాజియను రోగము; శిరస్తోద-భేద-దాహ-కణ్డూ = శిరస్సున పొడిచినట్లు, పగులగొట్టినట్లు బాధలు, మంట, దురద, కర్ణరోగ = కర్ణరోగములు, ముఖపాక = నోటిపూత, ముఖపూతి = నోటి దౌర్గంధ్యము, ఘ్రాణస్య-ఉపదేహ = ముక్కుయందు మలమేర్పడు, త్వక్ = చర్మరోగములు, గుల్మ-ప్లీహ-విద్రధి-వీసర్ప-జ్వర-రక్తపిత్త-కుష్ఠ-పిటికా-శ్లీపద-ఉపదంశ-శోఫ-వాత - శోణిత-రక్తమేహ-క్షుద్రరోగ = గుల్మము, ప్లీహము, విద్రధి, వీసర్పము, జ్వరము, రక్తపిత్తము, కుష్ఠము, పిటికా, శ్లీపదము, ఉపదంశము, శోధ, వాతరక్తము, రక్తమేహము; క్షుద్రరోగములు; అగ్ని-స్వర-నాశ- = అగ్నిమాంద్యము, స్వరభంగము, అంగగౌరవ-సాద = శరీరము బరువు, నొప్పి; అరోచకం = అరుచి, అమ్ల-ఉద్గార = పులిత్రేనుపులు, లవణ-ఆస్యతా = నోరు ఉప్పగానుండుట, క్రోధ-మోహ-స్వేద = కోపము, మోహము, స్వేదము గలుగుట, మద-మూర్ఛా-సంన్యాస-కమ్ప-తన్ద్రి-ఆదీనాం = మదము, మూర్ఛా, సంన్యాసము, కంపవాతము, కునికిపాట్లు మొదలగు వ్యాధులకు (కారణమగును).

**తాత్పర్యము :** శరత్కాల స్వభావముచే గాని లేక అన్యకారణమునచేగాని రక్తము దుష్టమై, అభిష్యన్దము, అధిమంథము, శుక్రము, అర్మను, తిమిరము, రక్తరాజీయను నేత్ర రోగములకు; శిరస్సున తోద, భేద, దాహ, కండువులకు; కర్ణరోగములకు; నోటి పూత, దుర్గంధములకు; నాసామల మధికముగ ఏర్పడుటకు; చర్మరోగములకు; గుల్మ, ప్లీహ, విద్రధి, వీసర్ప, జ్వర, రక్తపిత్త, కుష్ఠ, పిటికా, శ్లీపద, ఉపదంశ, శోఫ, వాతరక్త, రక్తమేహ, క్షుద్రరోగములకు, నోటియందు ఉప్పని రుచికి, క్రోధ, మోహ, స్వేదాధిక్యములకును; మద, మూర్ఛా, సంన్యాస, కంపవాతములకును, తంద్రా; మొదలగు రోగములకు కారణమగుచున్నది.

## సిరావేధన ఎప్పుడు చేయవలెను ?

**మూలము :** యే చ శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైః సర్వదోషప్రతిపక్షైః సమ్యగప్యుపక్రాన్తాః సాధ్యా అపి న సిధ్యన్తి తే చ రక్తప్రకోపజాస్తస్మాత్తేష్వత్యుద్రిక్తరక్తవిస్రావణాయ యథాస్వం సిరాం విధ్యేత్ ।

ప్రతిపదార్థము : యే చ = ఏ రోగములైతే, సర్వదోష ప్రతిపక్షైః = సర్వ దోషములకును ప్రతీకారములైన, శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్ష-అద్యైః = శీత, ఉష్ణ, స్నిగ్ధ, రూక్ష మొదలగు గుణములుగల ద్రవ్యముల ఉపయోగముచేత, సమ్యక్-ఉపక్రాన్తాః-అపి = బాగుగా చికిత్స చేయబడినవైనను, సాధ్యాః-అపి = సాధ్యములగు నవియైనను, నసిధ్యన్తి = సాధ్యములగుట లేదో, తే-చ = ఆ రోగములున్నూ, రక్తప్రకోపజాః = రక్త దోషప్రకోపము వలన జనించినవి, తస్మాత్ = అందుచేత, తేషు = ఆ రోగములయందు, అతి-ఉద్రిక్త-రక్త-విస్రావణాయ = మిక్కిలి ప్రకోపించిన రక్తమును స్రవింపజేయుటకు, యథాస్వం = రోగానుసారముగా సిరాం = సిరను, విధ్యేత్ = వేధింపవలెను.

తాత్పర్యము : సర్వదోషప్రతీకారములైన శీత, ఉష్ణ, స్నిగ్ధ, రూక్షాది ద్రవ్యోప యోగములచేతను, చికిత్సా కర్మాదులచేతను సాధ్యములగునట్టి వ్యాధులు గూడ శమించ కున్నచో అవి రక్తదోషము వలన జనించిన వ్యాధులుగా తెలుసుకొనవలెను. వానియందు అతి ఉద్రిక్తమైయుండు రక్తమును స్రవింపజేయుటకు తగు సిరను వేధించవలెను.

### సిరావేధనకు అనర్హులు

**మూలము : న తు స్నేహపీతకృతపఞ్చకర్మాన్యతమ గర్భిణీసూతికా జీర్ణికామలా క్లీబోనషోడశాతీతసప్తతి వర్షాభిఘాతాతిస్రుతరక్తాదుష్టరక్తాతి స్నిగ్ధాస్విన్నాతిఖిన్నా క్షేపకపక్షాఘాతాతిసారచ్ఛర్ది శ్వాసకాసోదర రక్తపిత్తార్శః పాణ్డురోగసర్వాఙ్గ శోఫ పీడితానామ్ ।**

ప్రతిపదార్థము : స్నేహపీత = స్నేహపానము చేసినవారికిని, కృతపఞ్చకర్మ-అన్యతమ = పంచకర్మలలో ఏదైన ఒకటి చేయబడినవారికిని, గర్భిణీ = గర్భవతులకు, సూతికా = బాలింతలకు, అజీర్ణి = అజీర్ణవ్యాధి గలవారికి, కామలా = కామలారోగము గల వారికి, క్లీబ = నపుంసకులకు, ఊనషోడశ-అతీతసప్తతి వర్ష = పదునారు సంవత్సరముల లోపు, డెబ్బదియేండ్లకెక్కువ వయస్సు గలవారికి, అభిఘాత = దెబ్బ తగిలినవారికి, అతిస్రుత రక్త = రక్తస్రావ మెక్కువగా అయినవారికి, అదుష్టరక్త = రక్తము దుష్టి జెందనివారికి, అతిస్నిగ్ధ = అతిస్నిగ్ధులగువారికి, అస్విన్న = స్వేదకర్మ చేయబడని వారికి, అతి ఖిన్న = అతి దుఃఖముతో నున్నవారికి, ఆక్షేపక-పక్షాఘాత-అతిసార-ఛర్ది-శ్వాస-కాస-ఉదర- రక్త పిత్త-అర్శః-పాణ్డురోగ-సర్వాఙ్గశోఫ పీడితానామ్ తు = ఆక్షేపకవాతము, పక్షాఘాతము, అతిసారము, ఛర్ది, శ్వాస, కాస, ఉదర, రక్తపిత్త, అర్శస్సు, పాండురోగము, సర్వాఙ్గ శోఫ-ఈ వ్యాధులచే పీడితులైన వారికిని అయితే, న (విధ్యేత్) = వేధింపరాదు.

తాత్పర్యము : స్నేహపానము చేసినవారికి, పంచకర్మలలో ఏదైన ఒకటి చేయించు కున్నవారికి, గర్భిణులకు, సూతికలకును, అజీర్ణులకు, కామలావ్యాధి గలవారికి, నపుంసకు లకు, పదునారు సంవత్సరముల లోపు, డెబ్భై సంవత్సరములు దాటిన వయస్సులు గల వారలకు, అభిఘాతము నొందినవారికి, అధిక రక్తస్రావము అయినవారికి, రక్తము దుష్టము గాకుండ నున్నవారికి, అతిస్నిగ్ధులకు, స్వేదకర్మ చేయబడని వారికి, దుఃఖితులకు, ఆక్షేపక, పక్షాఘాత, అతిసార, ఛర్ది, శ్వాస, కాస, ఉదర, రక్తపిత్త, అర్శో, పాండు

సర్వాంగశోఫ—ఈ వ్యాధులచే పీడితులగు వారికిని సిరావేధ జేయగూడదు.

వి. వ్యా. : బాలురు వృద్ధులందు క్రమముగా, ధాతువులు అసంపూర్ణములుగాను, క్షీణించియుండుటచేతను, రూక్ష-క్షతక్షీణులందు వాతప్రకోపభయమువలనను, భీరువులకు తమోధిక్యముగా నుండుటచేతను, రక్తమును చూచుటచే మూర్ఛ కలుగునను భయము చేతను; క్లైబ్యము గలవారి యందు ప్రధానధాతుక్షయము, అల్పసత్వము చేత వినాశము నిశ్చయమగుటచేతను; కృశులు-గర్భిణులలో ధాతుక్షీణభయముచేతను సిరావేధ నిషేధింప బడినదని డల్హణుని వివరణ.

## అవేధ్యసిరలు — అవేధ్యకాలము

**మూలము : న చావ్యధనీయా యన్త్రితానుత్థితాః సిరా న తిర్యక్ నచాతి శీతోష్ణ వాతాభ్రేషు ।**

*ప్రతిపదార్థము :* అవ్యధనీయ అయన్త్రితా-అనుత్థితాః = వేధన చేయగూడనివి, పైభాగమున యంత్రముచే బంధింపబడనివి, అట్లు బంధించినను పైకి ఎత్తుగా ఉబకనివి (అగు), సిరాః = సిరలను, న = వేధించరాదు, తిర్యక్-న-చ = (సిరలను) అడ్డముగా నున్నూ వేధించగూడదు.

అతిశీత-ఉష్ణ-వాత-అభ్రేషు = అతిశీతలముగా, అతివేడిగా, ఎక్కువ వాయు సంచారము-ఉన్నపుడు, మేఘావరణ మున్నపుడును, న-చ = చేయగూడదు.

**తాత్పర్యము :** అవేధ్యసిరలుగా చెప్పబడినవానిని, పైన యంత్రముచే బంధింపబడని వానిని, పైకి ఎత్తుగా ఉబికి రాని సిరలను వేధించగూడదు. సిరలను అడ్డముగా వేధించ గూడదు, అతిశీతల, అత్యుష్ణ కాలములందు, వాయు సంచారమధికముగా నున్నపుడు, ఆకసము మేఘావృతమైయున్నపుడును సిరావేధము చేయంజనదు.

**వి. వ్యా :** రోగము లేనపుడు గూడ సిరావేధము చేయకూడదని సుశ్రుత వచనము.

**మూలము : తత్ర స్నేహపీతాదిషు సమ్యగ్విద్ధా అపి సిరా నప్రవన్త్యతిస్రవన్తి వా । సమ్యక్‌స్నిగ్ధస్విన్నస్య పునర్నవీభూతా దోషాః శోణితమనుప్రవిష్టాః సమ్యక్ ప్రచ్యవన్తే । నత్వేవం నిషేధో విషసంపృష్టోపసర్గాత్యయిక వ్యాధిషు ।**

*ప్రతిపదార్థము :* తత్ర = అచట, స్నేహ పీతాదిషు = స్నేహపానము చేసిన వారు మొదలగువారిలో, సిరాః = సిరలు, సమ్యక్-విద్ధాః-అపి = బాగుగా వేధముచేయబడినను, న-స్రవన్తి = రక్తమును స్రసించవు, వా = లేక, అతిస్రవన్తి = అతిగా స్రవించును, సమ్యక్-స్నిగ్ధ-స్విన్నస్య = బాగుగా స్నేహ స్వేదములు చేయబడినవాని యొక్క, దోషాః = దోష ములు, పునః-నవీభూతాః = మరల క్రొత్తవియై, = శోణితం - అనుప్రవిష్టాః, రక్తమున ప్రవేశి చినవై, సమ్యక్ = బాగుగా, ప్రచవన్తే = బయటికి వెడలును, ఏవం నిషేధః = ఇట్టి నిషేధము, విషసంస్పృష్ట-ఉపసర్గ-ఆత్యయిక వ్యాధిషు = విషముల వలన కలుగు ఉపద్రవము లందును, ఆత్యయిక వ్యాధులందును, న = లేదు.

తాత్పర్యము : స్నేహపానము చేసినవారు మొదలగు నిషిద్ధుల యందు సిరావేధన బాగుగా చేయబడినను రక్తము స్రవించదు. లేక అతిగా స్రవించును స్నేహస్వేదములు బాగుగా చేయబడిన వారికి, సిరావేధనలన దోషములు నవీభూతములై - అనగా - క్రొత్తవానివలె - శోణితమున ప్రవేశించి, బయటకు బాగుగా వెడలును.

సిరావేధము పైన కొందరికి నిషేధింపబడినను, విషపీడితులకు, ఉపద్రవములు కలిగినపుడును, ఆత్యయిక వ్యాధులందును చేయవచ్చును.

వి. వా. : వినాశనమును గలిగించువ్యాధులు ఆత్యయికవ్యాధులు, ఉదాహరణ-అనన్య సాధ్యములగు విద్రధ్యాదులు అని డల్హణ వ్యాఖ్య.

### వివిధ రోగములందు వేధింపదగిన సిరలు

**మూలము :** ప్రతిరోగే తు వ్యధం ప్రతివిభాగః । శిరోనేత్రరోగేషు లలాట్యా ఉపనాస్యా పాఙ్గ్యావా । కర్ణరోగేషు పరితః కర్ణౌ । నాసారోగేషు నాసాగ్రే ప్రతిశ్యాయే తు నాసాలలాటస్థాః । ముఖరోగేషు జిహ్వోష్ఠతాలుహనుగాః । జత్రూర్ధ్వం గ్రన్థిషు గ్రీవాకర్ణశఙ్ఖమూర్ధగాః । అపస్మారే హనుసన్ధి మధ్యగాః । ఉన్మాదేతూరోఽపాఙ్గలలాటగాః । విద్రధౌ పార్శ్వశూలే చ పార్శ్వకక్షాస్తనాన్తరస్థాః । చతుర్థకే సకన్ధాధోగతానామన్యతర పార్శ్వాశ్రయామ్ । తృతీయకేఽంసయోరన్తరే త్రికసన్ధి మధ్యగతామ్ । ప్రవాహికాయాం శూలిన్యాం శ్రోణ్యోః సమన్తాద్ ద్వ్యఙ్గుళే । నిర్వృత్తోపదంశశుక్రవ్యాపత్సు మేఢ్రే । గలగణ్డ ఊరుమూల సంశ్రితామ్ । గృధ్రస్యాం జానుసన్ధేరుపర్యధో వా చతురఙ్గులే । అపచ్యామిన్ద్రబస్తే రధస్తాద్ ద్వ్యంగుళే । క్రోష్టుకశీర్షసక్థివాతరుజాసు గుల్ఫస్యోపరి చతురఙ్గులే । శ్లీపదేషు యథాస్వం వక్ష్యతే । పాదదాహహర్షచిప్పవాతశోణితవాతకణ్టకవిపాదికాపాదదారి ప్రభృతిషు పాదరోగేషు క్షిప్రమర్మణి ఉపరిష్టాద్ ద్వ్యంగుళే । ఏతేనేతరసక్థి బాహూచ వ్యాఖ్యాతౌ । విశేషతస్తు వామబాహ్వోభ్యన్తరతో బాహుమధ్యే ప్లీహోదరే । ఏవమేవ చ దక్షిణబాహౌ యకృదాఖ్యే । తథా కాసశ్వాసయో రప్యాదిశన్తి । గృధ్రస్యామివ విశ్వాచ్యామ్ । బాహుశోషాపబాహుకయోరప్యేతే । అదృశ్యమానాను చైతాస్వతిప్రవృద్ధవ్యాధేరన్యవ్యాధ్యుక్తానామపి యథాసన్నం వ్యధః ।

ప్రతి పదార్థము : ప్రతి రోగేతు = ఆయా ప్రత్యేక రోగము లందైతే, వ్యధం ప్రతి = సిరావేధమును గూర్చి, విభాగః = విభాగము (కథ్యతే = చెప్పబడుచున్నది)

శిరో-నేత్ర-రోగేషు = శిరోరోగ, నేత్రరోగములలో, లలాట్యా = లలాట ప్రదేశము నందలి సిర, ఉపనాస్యా = నాసికకు సమీపముననున్న సిర, వా = లేక, అపాఙ్గ్యా = అపాంగమునకు దగ్గరగల సిర; కర్ణరోగేషు = కర్ణరోగములందు, పరితఃకర్ణౌ = కర్ణముల చుట్టునుగల సిర; నాసారోగేషు = నాసికా రోగములందు, నాసాగ్రే = ముక్కు చివరనుండు సిర; ప్రతిశ్యాయే = ప్రతిశ్యాయ వ్యాధియందు, నాసా-లలాటస్థాః = నాసికపైన, లలాట ప్రదేశమున ఉన్నట్టివియు; ముఖరోగేషు = నోటియందలి రోగములలో, జిహ్వా-ఓష్ఠ-తాలు-హనుగాః = నాలుక, పెదవులు, దౌడలు, హనువుయందలి సిరలు; జత్రూర్ధ్వం = జత్రువులకు పైభాగమున గలిగిన, గ్రంథిషు = గ్రంథులందు, గ్రీవా-కర్ణ-శంఖ-మూర్ధగాః = మెడ,

చెవి, కణతలు, శిరస్సుయందలి సిరలు; అపస్మారే = అపస్మార వ్యాధియందు, హనుసంధి మధ్యగాః = హను సంధి మధ్యనున్న సిరలు; ఉన్మాదేతు = ఉన్మాదమునందైతే, ఉరః-అపాఙ్గ-లలాటగాః = ఉరోభాగము, అపాఙ్గములు, లలాటములందలి సిరలు; విద్రధౌ = విద్రధి యందును, పార్శ్వశూలే = పార్శ్వశూలయందు, పార్శ్వ-కక్ష-స్తనాన్తరస్థాః = పార్శ్వము, చంక, స్తనములకు మధ్యభాగమునను న్న సిరలు, చతుర్థికే = చాతుర్థిక జ్వరమున, స్కంధ-అధోగతానాం = మూపు క్రింది భాగమున నున్నవానిలో, అన్యతర-పార్శ్వ-ఆశ్రయాం = ఏదేని ఒకప్రక్కను ఆశ్రయించిన సిర; తృతీయకే = తృతీయకజ్వరమున, అంసయోః = అంసలయొక్క, అన్తరే = మధ్య, త్రికసంధి , మధ్యగతాం = త్రికసంధి మధ్య నున్న సిర; శూలిన్యాం - ప్రవాహికాయాం = శూలగలిగిన ప్రవాహిక వ్యాధియందు, శ్రోణ్యోః = శ్రోణియందు, సమన్తాత్ = అంతటను, ద్వ్యంగుళే = రెండంగుళముల ప్రదేశ మున నున్న సిర, నిర్వృత్త-ఉపదంశ-శుక్రవ్యాపత్సు = నిర్వృత్త, ఉపదంశ, శుక్రరోగముల యందు, మేఢ్రే = శిశ్నమునందలి సిర; గలగణ్డే = గలగండ వ్యాధియందు, ఊరుమూల సంశ్రితామ్ = తొడల మూలప్రదేశమునను న్న సిర; గృధ్రస్యాం = గృధ్రసీవాతరోగమున, జానుసంధేః = మోకాలి సంధికి, ఉపరి-వా-అధః = పైన లేక క్రింద, చతురంగుళే = నాలుగంగుళముల ప్రదేశమునగల సిర, అపచ్యాం = అపచీరోగముల, ఇంద్రవస్తేః = ఇంద్ర వస్తి మర్మకు, అధస్తాత్ = క్రింద, ద్వ్యంగుళే = రెండంగుళముల ప్రదేశమునగల సిర, క్రోష్టుకశీర్ష - సక్థివాత రుజాసు = క్రోష్టుకశీర్షము, సక్థివాతరోగములందు, గుల్ఫస్య - ఉపరి = చీలమండకుపైన, చతురంగుళే = నాలుగంగుళముల ప్రదేశమునను న్న సిర - (వేధింపవలెను).

శ్లీపదేషు = శ్లీపదరోగములందు, యథాస్వం = వానికి (వేధింప) దగిన సిరలు, వక్ష్యతే = ముందు చెప్పబడగలవు.

పాదదాహ-హర్ష-చిప్ప-వాతశోణిత - వాతకణ్టక-విపాదికా - పాదదారీ ప్రభృతిషు = పాదదాహము, పాదహర్షము, చిప్పము, వాత రక్తము, వాతకణ్టకము, విపాదికా, పాదదారీ మొదలగు పాదరోగములందు, క్షిప్రమర్మణాం = క్షిప్రమర్మకు, ఉపరిష్టాత్ = పైభాగమున, ద్వ్యంగుళే = రెండు అంగుళముల ప్రదేశమునగల సిరను (వేధింపవలెను), ఏతేన = దీనిచేత (ఇట్లే), ఇతర = తక్కిన సక్థి-బాహూ చ = సక్థి, బాహువులందును, వ్యాఖ్యాతా = వ్యాఖ్యా నించబడినది.

విశేషతః - తు = విశేషించియైతే, ప్లీహోదరే = ప్లీహోదర వ్యాధియందు, వామ - బాహ్వోభ్యం-తరతః = ఎడమబాహువు లోపల, బాహుమధ్యే = బాహువు మధ్య (సిరను వేధించవలెను).

కాస-శ్వాసయోః-అపి = కాస-శ్వాస రోగములందును, తథా = అట్లే, ఆదిశన్తి = ఆదేశించు చున్నారు.

అతి ప్రవృద్ధవ్యాధేః = ఎక్కువ ముదిరిన వ్యాధియందు, ఏతాసు = ఈ సిరలు, అదృశ్య-మానాసు = కనుబడనప్పుడు, అన్యవ్యాధి-ఉక్తానాంఅపి = ఇతరవ్యాధులందు చెప్పిన

వానిని, యథాసన్నం = సామీప్యమును బట్టి, వ్యధః = సిరావేధము (చేయవలెను).

తాత్పర్యము : ప్రత్యేక రోగములందు చేయదగిన సిరావేధను గూర్చి చెప్పబడు చున్నది.

శిరో, నేత్రరోగములందు లలాట ప్రదేశమునందలి సిర, లేక, నాసికకు సమీపమునకు గల సిర లేక అపాంగమునకు దగ్గరగల సిరను వేధింపవలెను.

కర్ణరోగములందు చెవులకు చుట్టును ఉండు సిర, నాసారోగములందు నాసాగ్రమున నుండునదియు, ప్రతిశ్యాయమున నాసిక-లలాటములందుండు సిర, ముఖరోగములందు జిహ్వా-ఓష్ఠ, తాలు, హనువులందుండు సిరలను, జత్రూర్ధ్వగ్రంథులందు, మెడ-చెవి-కణతలు-శిరస్సుయందలి సిరలు వేధింపవలెను.

అపస్మారమున హను సంధిమధ్య నుండు సిరలు, ఉన్మాదమున ఉరోభాగ, అపాంగ, లలాటమునందలి సిరలు వేధింప దగినవి.

విద్రధియందును, పార్శ్వశూలయందును, పార్శ్వము, చంకలు, స్తనములకు మధ్య భాగమున నున్న సిరలు వేధించవలెను.

చాతుర్థిక జ్వరమున స్కంధమునకు క్రిందనున్నవానిలో ఏదేని ఒకపార్శ్వమునాశ్రయించియున్న సిరను, తృతీయక జ్వరమున అంసము మధ్యల, నుండు సిరను వేధించవలెను.

శూలతో గూడి యున్న ప్రవాహిక యందు, శ్రోణియందంతట రెండంగుళముల ప్రదేశమున నుండు సిరను వేధించవలెను. ఉపదంశము వలన కలిగిన శుక్రవ్యాపత్తు లందు మేఢ్రము నందలి సిరను వేధించవలెను, గలగండ వ్యాధియందు ఊరుమూలము నందలి సిరను, గృధ్రసీ వ్యాధియందు జాను సంధికి పైన లేక క్రింద నాలుగంగుళముల ప్రదేశమున గల సిరను, అపచీ రోగమున జంఘము నందలి ఇంద్రవస్తిమర్మకు క్రింద రెండంగుళముల ప్రదేశమున గల సిరను, క్రోష్టుకశీర్ష, సక్థివాత రోగములందు చీలమండకుపైన నాలుగంగుళముల ప్రదేశముగల సిరయు వేధింపదగినవి. శ్లీపదరోగమున వేధింపదగిన సిరలు ముందు చెప్పబడును.

పాదదాహము, పాదహర్షము, చిప్పము, వాతశోణితము, వాతకంటకము, విపాదికా, పాదదాశీ మొదలగు రోగములందు పాదమండలి క్షిప్రమర్మకు పైభాగమున రెండంగుళముల ప్రదేశముగల సిరను వేధించవలెను. ఇతర సక్థి -బాహువు లందును ఇట్లే చేయవలెను.

విశేషించి, ప్లీహోదర వ్యాధియందు, ఎడమ బాహువున మధ్య నుండు సిరను; ఇట్లే యకృదోదర వ్యాధియందు దక్షిణ బాహువు నందలి సిరను వేధించవలెను. కాస - శ్వాస లందును వీనినే వేధించవలెను.

విశ్వాచీ రోగమున గృధ్రసీ యందు వలెనే సిరావేధ చేయవలెను. బాహుశోష - అపబాహుకవ్యాధులందు గూడ బాహువు లందలిపై జెప్పిన సిరలనే వేధజేయవలెనని కొందరు చెప్పెదరు.

వ్యాధులు ఎక్కువ ముదిరినప్పుడును, వేధించవలసిన సిరలు కనబడనప్పుడును, ఇతర వ్యాధులందు చెప్పబడిన వేధ్యసిరలను, సమీపమున నుండుటను బట్టి, వేధించవలెను.

వి. వ్యా. : అపస్మార వ్యాధియందు శిరమునందలి అన్ని సిరలను, లేక, హనువు నందలి సిరను వేధింపవలెనని అష్టాంగహృదయమున తెలుపబడినది.

సంధియందు శస్త్రప్రణిధానము నిషేధింపబడియుండుటచే, ఇచట సంధియనగా సంధి సమీప ప్రదేశమని గ్రహించవలెనని డల్హణ వివరణ.

### సిరావేధకు సమకూర్చుకొనవలసిన సంభారములు

**మూలము :** ప్రాగేవ చోపకల్పయేచ్ఛయ నాసనోదకుమ్భ వస్త్రపట్టాది । తథా యథా లాభం చ తగరైలా శీశివకుష్ఠపాఠావిడఙ్గ భద్రదారు త్రికటుకాగార ధూమ హరిద్రార్కాఙ్కురనక్తమాల చూర్ణమసృక్స్రావణాయ । అసృక్స్థాపనాయచ రోధ్రమధుకప్రియఙ్గు పత్తఙ్గగైరిక రసాఞ్జనశాల్మలీశఙ్ఖయవగోధూమ మాషచూర్ణమ్। వటాశ్వత్థాశ్వకర్ణ పలాశవిభీతక సర్జార్జునధన్వనధాతకీసాలసారారిమేదతిన్దుక త్వగఙ్కురనిర్యాస శ్రీవేష్టకమృత్కపాల మృణాలఞ్జనచూర్ణమ్ । క్షౌమమషీలాక్షా సముద్రఫేనచూర్ణం వా తథాన్యచ్చాతిస్రుతరక్త వ్యాపత్ప్రతీకారోపకరణమ్ । సజ్జోపకరణోహి నవైద్యో మోహమాప్నోతి ।

ప్రతిపదార్థము : ప్రాక్ ఏవ=(సిరావేధ చికిత్సకు) పూర్వమే, శయన=పడక, ఆసన=ఆసనము, ఉదకుద్భ=నీటికుండ, వస్త్ర=వస్త్రము, పట్ట-ఆది=పట్టి మొదలగు వానిని, ఉపకల్పయేత్=చేకూర్చుకొనవలెను.

తథా=అట్లే, యథాలాభం చ=దొరికినంతవరకున్నూ, తగరం=గ్రంథితగరము, ఏలా=ఏలకులు, శీతశివ=రాతిపువ్వు, కుష్ట=చెంగల్వకోష్టు, పాఠా=చిరుబొద్ది, విడఙ్గ=వాయు విడంగములు, భద్రదారు=దేవదారు, త్రికటుక=త్రికటుకములు, ఆగారధూమ=కరిదూపము, హరిద్ర=పసుపు, అర్క-అఙ్కుర=జిల్లేడు చిగుళ్లు, నక్తమూలా-చూర్ణ=క్రానుగు - వీనియొక్క చూర్ణము, అసృక్ - స్రావణాయ=రక్తమును స్రవింపజేయుటకై (సిద్ధపరచుకొనవలెను).

అసృక్ స్థాపనాయ - చ=రక్తస్రావమును ఆపుటకున్నూ, రోధ్ర=లొద్దుగ, మధుక=ఇప్ప, ప్రియఙ్గు=ప్రేంకణము, పత్తంగ=రక్తచందనము, గైరిక=గైరికము, రసాఞ్జన=రసాంజనము, శాల్మలీ=బూరుగ, శఙ్ఖ=శంఖము, యవ=యవలు, గోధూమ=గోధుమలు, మాష=మినుములు, చూర్ణం=(వీని) చూర్ణమును (సిద్ధపరచుకొన వలెను).

వట=మఱ్ఱి, అశ్వత్థ=రావి, అశ్వకర్ణ=ఏపి, (భేదము) పలాశ=మోదుగ, విభీతక=తాని, సర్జ=సర్జరసము, అర్జున=మద్ది, ధన్వన=తీటకసివెంద, ధాతకీ=ఆరె, సాలసార=ఏపి చేవ, అరిమీది=దుర్గంధచంద్ర, తిన్దుక=తుమికి - వీనియొక్క, త్వక్-అఙ్కుర - నిర్యాస=పట్ట, చిగుళ్ళు, బంకలను; శ్రీవేష్టక=నరల నిర్యాసగుగ్గులు, మృత్-

కపాల = మట్టి పెంకులు, మృణాల = తామరతూండ్లు, అఞ్జన = రసాంజనము, చూర్ణమ్ = వీని చూర్ణము (సిద్ధము చేయవలెను), క్షౌమ మషీ = పట్టు వస్త్రములు కాల్చిన మసి, లక్షా = లక్క, సముద్రఫేనచూర్ణం వా = సముద్రఫేనము (సౌరపి) చూర్ణమును గాని, తథా = అట్లే, అన్యత్ = తక్కిన, అతిస్రుత - రక్త-ప్రతీకార - ఉపకరణం చ = అధిక రక్తస్రావమునకు చేయదగిన చికిత్సా సాధనములున్నూ (ముందే సిద్ధము చేయవలెను).

సజ్జోపకరణః = సిద్ధపరచుకొన్న సాధన సామగ్రి గల, వైద్యః = వైద్యుడు మోహం = మోహమును (భ్రాంతిని), న-ఆప్నోతి-హి = పొందడుగదా!

**తాత్పర్యము :** సిరావేధన కర్మకు ముందే, వైద్యుడు ఈ క్రింది సామగ్రిని సిద్ధముగా నుంచుకొనవలెను.

రోగి కొరకు శయన, ఆసనములు, జలకుంభములు, వస్త్రములు, పట్టలు మొదలగునవి; గంధి తగరము, ఏలకులు, రాతిపువ్వు, చెంగల్వకోష్టు, చిరుబొద్ది, వాయు విడంగములు, దేవదారు, త్రికటుకములు, కరిధూపము, పసుపు, జిల్లేడుచిగుళ్ళు, క్రానుగ - వీని చూర్ణమును రక్తము స్రవింప జేయుటకును; రక్త స్థాపనకై లొద్దుగ, ఇప్ప, ప్రేంఖణము, రక్తచందనము, గైరికము, రసాంజనము, బూరుగ, శంఖము, యవలు, గోధుమలు, మినుములు, వీని చూర్ణమును; మఱ్ఱి, రావి, అశ్వకర్ణ, పలాశ, విభీతక, సర్జరస, అర్జున, ధన్వన, ధాతకీ, సాలసార, అరిమేద, తిన్దుక - వీనియొక్క పట్ట, చిగుళ్ళు, బంకయును; పట్టు వస్త్రములు కాల్చినమసి, లాక్షా, సముద్రఫేన చూర్ణము; ఇంకను ఇతరములగు రక్తస్రావ ప్రతీకార ఉపకరణములను దొరికినంతవరకు సిద్ధము చేసి వుంచుకొనవలెను.

తగిన సాధన సామగ్రి సిద్ధము చేసికొన్న యెడల వైద్యుడు మోహమును పొందదుగదా!

## సిరావేధకు పూర్వకర్మ

**మూలము :** అథ కృతస్వస్త్యయనమాతురం వ్యాధిబలసాత్మ్యాద్యపేక్ష్య స్నిగ్ధం జాఙ్గలరసం యవాగూంచ పాయయిత్వా ముహూర్తమాత్రమాశ్వాసితం పూర్వాహ్ణేఽపరాహ్ణే వాఙ్గారాతాపోష్ణ బాష్పాన్యతమస్విన్నం జానూచ్ఛ్రితే మృదావాసనే జానునిహితకూర్పరం సమస్థితపాదం ప్రత్యాదిత్యముపవేశయేత్ । కేశాన్తే చ ప్లోతచర్మవల్కపట్టాన్యతమేన బధ్నీయాత్ । తతశ్చాయతేన వస్త్రాఙ్గుష్ఠగర్భేణ ముష్టిద్వయేనా తురో యథాన్వం మన్యే నిపీడయేద్దన్తైశ్చ దన్తాన్ । గణ్డౌచాధ్మాపయేత్ । పురుషశ్చైనం పృష్ఠతో వస్త్రకృకాటికాన్తరన్యస్త వామ ప్రదేశినీకోనాతిగాఢం గ్రీవాయాం పరిక్షిప్య వేష్టయన్వస్త్రం ప్రాణానబాధమానో యన్త్రయేత్ । ఇత్యేషోఽన్తర్ముఖ వర్జ్యానాం సిరాణాం వ్యధనే యన్త్రవిధిః । తతశ్చాస్య వైద్యోఽఙ్గుష్ఠనిష్పీడయా మధ్యమాఙ్గుళ్యా సిరాం తాడయేత్ । ఉత్థితాం చ స్పన్దమానాం స్పర్శాదభిలక్ష్య వామహస్తేన కుఠారికామూర్ధ్వదణ్డాం కృత్వా సిరామధ్యేన్యస్య లక్షయిత్వా చ తత్రైవ మధ్యమాఙ్గుళ్యా తాడయేదఙ్గుష్ఠోదరేణ వా పీడయేత్ । గూఢ బహల త్వక్ ప్రతిచ్ఛన్నాయామఙ్గుష్ఠ పీడనాదున్నమన ముపలక్షయేత్ । ఉత్కాశనేన క్రోధ సంరమ్భేణ చాపూరయన్తే సిరాః ।

ప్రతిపదార్థము : (అథ = ఈ శబ్దము మంగళార్థము) కృత స్వస్త్యయనం = మంగళ హోమముతో గూడిన స్వస్తి వాచనము జేసినట్టి ఆతురం = రోగిని, వ్యాధి - బల - సాత్మ్య - ఆది - అవేక్ష్య = వ్యాధి, రోగిబలము, సాత్మ్యము మొదలగువానిని చూచి, జాఙ్గలరసం = జాంగల జంతుమాంస రసమును, యవాగూం - చ = యావాగువునున్నూ, పాయ యిత్వా = త్రాగించి, స్నిగ్ధం = స్నిగ్ధునిగా (చేయవలెను), ముహూర్తమాత్రం = ముహూర్త కాలము, ఆశ్వాసితం = ఊరడిల్లిన రోగిని, పూర్వాహ్ణే = దినముయొక్క పూర్వభాగమున గాని, అపరాహ్ణేవా = మధ్యాహ్నము తరువాతగాని, అఙ్గార - ఆతప - ఉష్ణ - బాష్ప - అన్యతమ మస్విన్నం = అగ్ని, ఎండ, వేడి, ఆవిరి - వీనిలో ఏదేని ఒకదానిచే స్వేదకర్మ చేయబడిన వానిని, జానూచ్ఛ్రితే = మోకాలి ఎత్తైన మృదువాసనే = మెత్తని ఆసనముపై, జానునిహిత-కూర్పరం = మోచేతులను మోకాళ్లపైనుంచిన వానిని, సమస్థితపాదం = పాదములు సమముగా నుంచినవానిని, ఆదిత్యం - ప్రతి = సూర్యునికెదురుగా, ఉపవేశయేత్ = కూర్చుండ బెట్టవలెను.

కేశాన్తే - చ = తలవెంట్రుకల చివరనున్నూ, క్షౌత - చర్మ - వల్కల - పట్ట - అన్యతమేన = మెత్తని వస్త్రము, చర్మము, నారవస్త్రము, పట్ట - వీనిలో ఏదైన ఒకదానిచేత, బధ్నీయాత్ = బంధి పవలెను, తతశ్చ = ఆతరువాతను, ఆయుతేన = పొడవైన, వస్త్రాఙ్గుష్ఠ గర్భేణ = వస్త్రము, అంగుష్ఠము లోపలగల, ముష్టిద్వయేన = రెండు పిడికిళ్లతో, ఆతురః = రోగి, యథాస్వం = తనశక్తి ననుసరించి తగు విధమున, మన్యే = మన్యలను, నిపీడయేత్ = వత్తవలెను, దన్తైః = దంతములతో, దన్తాన్ - చ = దంతములనున్నూ, పీడయేత్ = వత్తవలెను, గణ్డౌచ = చెక్కిళ్ళనున్నూ, ఆధ్మాపయేత్ = ఉబ్బింప జేయ వలెను.

పురషః చ = ఒక పురుషుడునూ, ఏనం = ఈ రోగిని, పృష్ఠతః = వెనుక ప్రక్కన, వస్త్ర - కృకాటికాన్తర - న్యస్త - వామప్రదేశినీకః = వస్త్రమునకు - కృకాటికా మర్మ ప్రదేశమునకు మధ్యనుంచిన ఎడమ చూపుడు వ్రేలుగలవాడై, గ్రీవాయాం = మెడయందు, న-అతిగాఢం = మిక్కిలి బిగువుగాక, పరిక్షిప్య = పట్టియుంచి, వస్త్రం = వస్త్రమును, వేష్ట యన్ = చుట్టుచు, ప్రాణాన్ = ప్రాణములను, అబాధమానః = బాధింపక, యన్త్రయేత్ = బంధింపవలెను, ఇతి - ఏషః = ఇయ్యది, అంతర్ముఖ వర్జ్యానాం = నోటిలోనివి వదలి తక్కిన, సిరాణాం = సిరలయొక్క, వ్యధనే = వేధించుటలో యన్త్రవిధిః = బంధించు విధానము.

తతః చ = ఆ తరువాతనున్నూ, అస్య = ఈ రోగియొక్క, సిరాం = సిరను, వైద్యః = వైద్యుడు, అంగుష్ఠ నిష్పఙ్ధయా = బొటన వ్రేలి చేత, తాడ-యేత్ = కొట్టవలెను, ఉత్థితాం = పైకుబికిన, స్పందమానాం = స్పందించుచున్నట్టియు (సిరను), స్పర్శాత్ = స్పర్శచేత, అభిలక్ష్య = గుర్తించి, వామహస్తేన = ఎడమచేతితో, కుఠారికాం = కుఠారికా శస్త్రమును, ఊర్ధ్వదణ్డాం = పిడి పైకి యుండునట్లుగా, కృత్వా = చేసి, సిరామధ్యే = సిరయొక్క మధ్యప్రదేశమున, లక్షయిత్వా చ = బాగుగా గుర్తించియు, తథా - ఏవ = అట్లే, మధ్యమాంగుళ్యా = నడిమి వ్రేలిచే, తాడయేత్ = కొట్టవలెను, వా = లేక, అఙ్గుష్ఠ - ఉదరేణ = బొటనవ్రేలి పొట్టతో, పీడయేత్ = వత్తవలెను.

గూఢ = లోతై, బహుల - త్వక్-ప్రతిచ్ఛన్నాయాం = మందముగానున్న చర్మముచే ప్పబడియున్న (సిరయందు), అఙ్గుష్ఠపీడనాత్ = బొటనవ్రేలితో వత్తుటచేత, ఉన్నమనం = రయొక్క పైకి వచ్చుటను, ఉపలక్షయేత్ = గుర్తించవలెను, ఉత్కాశనేన = దగ్గుటచేత, ోధ - సంరమ్భేణ-చ = ప్రకోపించిన సంరంభముచేతను, సిరాః = సిరలు, ఆపూర్యన్తే = ంపబడును.

**తాత్పర్యము :** తరువాత మంగళ - స్వస్తివాచనములను జేయించి, రోగియొక్క ్యధి, బలము, సాత్మ్యము మున్నగువాని ననుసరించి, జాంగల జంతువుల మాంసరసమును, ంవాగువులను త్రాగించి, స్నిగ్ధునిగా చేయవలెను. ముహూర్తకాలము విశ్రాంతి నొందించి, ార్వాహ్ణము లేక అపరాహ్ణమున, అగ్ని, ఎండ, బాష్పములలో నొకదానిచే స్వేద కర్మ మనర్చి, మోకాలి ఎత్తుననుండు మృదు ఆసనముపై కూర్చుండబెట్టవలెను, మోచేతులు ాకాళ్ళపైనుండి పాదములు సమముగా నుండవలెను. సూర్యుని కభిముఖముగా నుండునట్లు ార్చుండ బెట్ట వలెను. కేశములను మృదువస్త్రము - చర్మము - లేక వల్కలముచే కట్ట ెను. పొడవైన వస్త్రము, బిగించిన పిడికిళ్ళతో రోగి తన శక్తికొలది మన్యలను త్తవలెను, దంతములు బాగుగా కరచి పట్టవలెను. బుగ్గలను పూరించవలెను వెనుకనుండి పరిచారకుడు రోగి మెడపై కృకాటికామర్మ - వస్త్రముల నడుమ ఎడమచేతి చూపుడు లిని ఉంచి, ఎక్కువ బిగుతుగా లేకుండ, బాధ గలుగనట్లు మెడచుట్టు వస్త్రమును చుట్ట ెను. నోటి యందు తప్ప ఇతరములగు సిరల వేధించుటకు ఇది బంధన మము.

తరువాత వైద్యుడు తన బొటనవ్రేలియందు నడిమి వ్రేలును బిగించి సిరపై కొట్టినచో పైకు బికి, స్పందించుచు కనబడును ఎడమచేతితో కుఠారికా శస్త్రమును పిడిపైకి ండునట్లు పట్టుకొని, సిరయొక్క మధ్య ప్రదేశమున నడిమివ్రేలిచే కొట్టవలెను. లేక, టనవ్రేలితో వత్తవలెను. ఇది సిరోత్థాపన విధి. దగ్గు, ఒత్తుటచేత లోతుగానున్న లేక ందమగు చర్మముక్రింద నుండునట్టి సిరలు వింపబడి, వ్యధన కర్మకు బాగుగా బడును.

*శశిలేఖ :* ఉత్కాసనం అనగా "కంఠం నిష్పీడ్య కసనం"

**వి. వ్యా :** ద్రవప్రాయమగు రక్తము యొక్క ఉత్క్లేశము కొరకు ద్రవాధిక ారము నిడవలెను, సిరలు చంచల స్వభావము గల వగుటచేప మత్స్యముల వలె ఎగురు ుడును, అందుచేత వైద్యుడు జాగరూకుడై సిరల వేధించవలెనని సుశ్రుతమున తెలుప నది.

## వివిధ రోగములందు సిరా యంత్రణ — వేధన విధి

ులము : అఙ్గుష్ఠేన తు నాసాగ్రమున్నమయ్య వ్రీహిముఖేనోపనాసికాం విధ్యేత్ ।
ఉన్నమితవిదష్టాగ్ర జిహ్వాస్యాధోజిహ్వాయాః । వివృతాస్యస్య తాలుని దన్తమూలే
చ । గ్రీవా సిరాసు స్తనయోరుపరియన్త్రిమ్ । ఉదరోరసోః ప్రసారితోరస్కస్యో
న్నమిత శిరసః । బాహుభ్యామాలమ్బమానస్య పార్శ్వయోః ఉన్నమిత మేఢ్రస్య

**మేఢ్రే । శ్రోణిపృష్ఠ స్కన్ధేషూన్నమిత పృష్ఠస్యావాక్ శిరసి ఉపవిష్టస్య । విశ్వాచీగృధ్రసోర్యరనాకుఞ్చితే కూర్పరే జానుని వా సుఖోపవిష్టస్య గూఢాఙ్గుష్ఠబద్ధముష్టే ర్వ్యధనీయ ప్రదేశస్యోపరి చతురఙ్గులే ప్లోతాద్యన్యతమేన బద్ధ్వా హస్తసిరామ్ । ఏవమేకపాదం సుస్థితం స్థాపయిత్వాన్యపాదమీషత్సంకుచితం తస్యోపరి నిధాయ జానుసన్ధేరధో హస్తాభ్యామాగుల్ఫం నిపీడ్య పూర్వవద్బధ్వా పాదసిరాం వ్యధేత్ । తత్ర తత్ర చ తైస్తైరుపాయైర్వికల్ప్య యన్త్రయేత్ । తత్ర మాంసలేష్వవకాశేషు యవమాత్రం వ్రీహిముఖేన । అతోఽన్యథాఽర్ధయవమాత్రం వ్రీహిమాత్రం వా । అస్థ్నాముపరి కుఠారికయాఽర్ధయవమాత్రమ్ । సర్వత్ర చానుత్తానావగాఢ మృజ్వ సంకీర్ణం సమం మర్మాద్యనుపఘాతి సిరామధ్యే శస్త్రమాశు పాతయేత్ ।**

*ప్రతి పదార్థము :* అంగుష్ఠేన తు = బొటనవ్రేలితో, నాసాగ్రం = నాసికయొక్క కొనను ఉన్నమయ్య = పైకెత్తి, వ్రీహిముఖేన = వ్రీహిముఖ శస్త్రముతో, ఉపనాసికాం = నాసిక సమీపమందలి సిరను, విధ్యేత్ = వేధింపవలెను. ఉన్నమిత = పైకెత్తబడిన, విదష్ట = దంతములచే వత్తబడకనుండు, అగ్రజిహ్వస్య = నాలుక చివరగలిగిన వాని యొక్క, అధోజిహ్వాయాః = నాలుక క్రిందిభాగమునందలి (సిరను వేధించవలెను)-వివృత - ఆస్యస్య = తెరచిన నోటియొక్క, దన్తమూలే = దంతమూలమున, తాలుని = దౌడయందలి (సిరను వేధ జేయవలెను), గ్రీవా - సిరాసు = గ్రీవమునందలి సిరలలో వేధము చేయునపుడు, స్తనయోః - ఉపరి = స్తనముల పైభాగమున; యన్త్రిమ్ = బంధనము చేయవలెను, ఉదర - ఉరసోః = ఉదరము - రొమ్ములందు, ప్రసారిత - ఉరస్కస్య = విరిసిన రొమ్ము యొక్క సిరను; ఉన్నమిత శిరసః = శిరస్సు పైకెత్తబడిన వానియొక్క (సిరను), విధ్యేత్ = వేధింపవలెను, బాహుభ్యాం = రెండు బాహువులతో, ఆలంబమానస్య = పైకెత్తిన వానియొక్క, పార్శ్వయోః = పార్శ్వములందలి సిరలను (వేధింపవలెను),

శ్రోణీ - పృష్ఠ - స్కన్ధేషు = పిరుదులు, వీపు, మూపులందు (సిరావేధ చేయునపుడు) అవాక్ - శిరసః = వంచిన తలగల, ఉపవిష్టస్య = కూర్చున్న రోగియొక్క, ఉన్నమిత పృష్ఠస్య - పైకెత్తబడిన వీపునందలి (సిరను వేధింపవలెను).

విశ్వాచీ - గృధ్రస్యోః = విశ్వాచీ - గృధ్రసీ వ్యాధులందు, అనాకుఞ్చితే = ముడువకుండునట్టి కూర్పరే = మోచేతియందు, జానుని వా = మోకాలియందుగాని, సుఖోపవిష్టస్య = సుఖముగా కూర్చున్నట్టి, గూఢ - అంగుష్ఠబద్ధ - ముష్టేః = బొటనవ్రేలు దాగునట్లు పిడికిలి బిగించినట్టి, వ్యధనీయ ప్రదేశస్య = సిరావేధ చేయదగిన ప్రదేశముయొక్క, ఉపరి = పైభాగమున, చతురఙ్గులే = నాలుగంగుళముల మేర, ప్లోతాది - అన్యతమేన = వస్త్రాదులలో నొక దానిచేత, బధ్వా = బంధించి, హస్త - సిరాం = చేతియందలి సిరను (వేధింపవలెను).

ఏవం = ఇటులనే, ఏకపాదం = ఒకపాదమును, సుస్థితం = చక్కగా నుండునట్లు, స్థాపయిత్వా = ఉంచి, అన్యపాదం = మరొకపాదమును, ఈషత్ - సంకుచితం = కొద్దిగా ముడిచినదానిని, తస్య = ఆ మొదటి పాదముయొక్క, ఉపరి = పైన, నిధాయ = ఉంచి; జాను - సన్ధేః = మోకాలి సంధినుండి, ఆగుల్ఫం = చీలమండవరకు, హస్తాభ్యాం = రెండు

చేతులతో. నిపీడ్య = గట్టిగావత్తి, పూర్వవత్ = బాహువు యందు వలె, బద్ధ్వా = బంధించి, పాదసిరాం = పాదమునందలి సిరను,వ్యధేత్ = వేధించవలెను.

తత్ర తత్రచ = ఆయా శరీర భాగములందున్నూ, తైః - తైః - ఉపాయైః = ఆయా ఉపాయములచేత, వికల్ప్య = ఆలోచించి, యన్త్రయేత్ = బంధనము చేయవలెను.

తత్ర = అందు, మాంసలేషు = ఎక్కువ మాంసమున్న ప్రదేశములలో, వ్రీహి ముఖేన = వ్రీహిముఖశస్త్రముతో, యవమాత్రం = యవప్రమాణమున (సిరావేధము చేయవలెను).

తతః = పైదానికంటె, అన్యథా = వేరుగా ఉన్నచోట్ల, అర్థయవం = యవగింజలో సగ ప్రమాణమున, వ్రీహిమాత్రం - వా = వ్రీహిప్రమాణమునగాని (సిరావేధము చేయ వలెను).

అస్థ్నాం ఉపరి = ఎముకలకుపైన, కుఠారికయా = కుఠారికా శస్త్రముతో, అర్థయవమాత్రం = అర్ధయవ ప్రమాణమున (సిరావేధము చేయవలెను).

సర్వత్ర - చ = అన్ని సిరావేధలందును, శస్త్రం = శస్త్రమును, సిరామధ్యే = సిరామధ్యమునందు, అనుత్తాన - అవగాఢం = మిక్కిలి పైభాగమునగాక - మిక్కిలిలోతు గాక, ఋజు = సూటిగాను, అసంకీర్ణం = విరుపులు అతుకులేనట్టి, మర్మాద్యనుపఘాతి = మర్మస్థలము మొదలగు వానిని గాయపరచకుండునదిగాను, ఆశు = త్వరగా, పాతయేత్ = ప్రయోగించవలెను.

తాత్పర్యము : బొటనవ్రేలితో నాసిక కొనను పైకెత్తి ఉపనాసికయందలి సిరను అనగా నాసాసమీపసిరను వేధించవలెను. నాలుకను పైకెత్తియు, దంతములచే కొరకకుండు నట్లుగాను చేసి నాలుక క్రింది భాగమునందలి సిరను వేధించవలెను. తాలువు యందలి సిరను, నోరు బాగుగ తెరపించి, దంతమూలన వేధించవలెను. గ్రీవమునందలి సిరలను వేధచేయునపుడు స్తనముల పైభాగమున బంధము చేయవలెను. ఉదర - ఉరో భాగములందు సిరావేధజేయునపుడు శిరస్సు పైకెత్తియుంచి, రొమ్మును బాగుగా విరిచిపట్టి నట్లు చేయవలెను. పార్శ్వసిరావేధమున బాహువుల రెండింటిని పైకెత్తి యుంచవలెను. మేఢ్రమును పైకెత్తి మేఢ్రసిరయందు వేధన చేయవలెను.

శ్రోణి - పృష్ఠము - స్కంధములందు రోగిని కూర్చుండబెట్టి తలను వంచి, పృష్ఠమును పైకెత్తి సిరావేధ చేయవలెను.

విశ్వాచీ యను వాత వ్యాధియందు రోగిని సుఖముగా కూర్చుండ బెట్టి, మోచేయి ముడువ కుండ ఉంచి, బొటన వ్రేలు లోపలికుండునట్లు పిడికిలి బిగించి, సిరావేధచేయు భాగమునకు పైన నాలుగంగుళములమేర వస్త్రము మొదలగువానిలో దేనిచేతనైన బంధించి హస్తమునందలి సిరను వేధించవలెను.

గృధ్రసీవాతమున, ఇట్లే, ఒక పాదమును చక్కగా ఉంచి, రెండవ పాదమును కొద్దిగా ముడిచి, మొదటి పాదము పైనుంచి జానువునుండి గుల్ఫమువరకు రెండు చేతులతో

బాగుగా మర్దించి బాహువు నందలి విధమున బంధించి, పాదము సందలి సిరను వేధింప వలెను.

ఆయా శరీర భాగములందు సిరావేధచేయుటకు ఆలోచించి ఆయా ఉపాయముల చేత బంధనము చేయవలెను. అధికముగ మాంసముగల ప్రదేశములలో వ్రీహిముఖ శస్త్రముతో యవ ప్రమాణమున మాత్రము సిరావేధ చేయవలెను. ఇతర ప్రదేశములందు అర్ధయవ లేక వ్రీహి మాత్రమునయు అస్థులపై కుఠారికా శస్త్రముచే అర్ధయవ ప్రమాణమునయు సిరావేధ చేయవలెను.

సిరావేధ చేయునపుడు అన్నిచోట్లనుగూడ ఎక్కువపైకి - ఎక్కువలోతుగాకను, సూటి గాను, ఒకేసారిగను, మర్మప్రదేశములకు అభిఘాతము గలుగకుండగను త్వరగా శస్త్రమును ప్రయోగించవలెను.

*శశిలేఖ :* పార్శ్వ సిరలను వేధించు సమయమున బాహువులను పైకెత్తుట చేత సిరలు స్ఫుటముగా కనుబడును.

*వి. వ్యా :* వ్రీహి యనగా శూకధాన్యము, అందును రక్తశాలి యని డల్హణ వ్యాఖ్య.

## సమ్యగ్విద్ధ, దుర్విద్ధ, అతివిద్ధ లక్షణములు

**మూలము :** ఏకప్రహారాభిహతా ధారయా యా స్రవేదసృక్ ।
ముహూర్తరుద్ధా తిష్ఠేచ్చ సమ్యగ్విద్ధేతి తాం విదుః ॥
అల్పకాలం వహత్యల్పం దుర్విద్ధా తైల చూర్ణనైః ।
స శబ్దమతి విద్ధా తు స్రవేద్దుఃఖేన ధార్యతే ॥

*ప్రతి పదార్థము :* యా = ఏ సిర, ఏక - ప్రహార - అభిహతా = ఒకేదెబ్బచే వేధింపబడినదై, అసృక్ = రక్తమును, ధారయా = ధారగా, స్రవేత్ = స్రవించునో, ముహూర్తరుద్ధా = ముహూర్తకాలమున స్రావము ఆగుచు, తిష్ఠేత్ చ = ఉండునో, తాం = ఆసిరను, సమ్యక్ - విద్ధాం = బాగుగా వేధింపబడినదిగా, విదుః = తెలియుదురు.

(యా = ఏ సిర), తైల - చూర్ణనైః = తైలము, చూర్ణము - వీని ప్రయోగముచేత గూడ, అల్పకాలం = కొద్దికాలమే, అల్పం = చాలకొద్దిగా, వహతి = స్రావమును కలిగి యుండునో, (అది), దుర్విద్ధా = సరిగా వేధింపబడని సిరయని (తెలియుదురు).

(యా = ఏసిర) స - శబ్దం = శబ్దముతో గూడి, స్రవేత్ = స్రవించునో, దుఃఖేన = అతికష్టముగా, ధార్యతే చ = రక్తస్రావము నిలుపబడునో, (ఆసిర) అతి విద్ధా = ఎక్కువ, వేధింపబడినదిగా (తెలియుదురు).

*తాత్పర్యము :* ఒకే శస్త్రప్రయోగముచే సిర వేధింపబడి ధారగా రక్తము వెడలి, ఒక ముహూర్త కాలమునకు స్రావము ఆగునో అది సరియగు సిరావేధయనియు; వేధ చేయ బడియు, తైల, చూర్ణాదుల ప్రయోగముచే స్వల్ప కాలమే - స్వల్పముగా రక్తము

స్రవించినచో అది దుర్విద్ధమనియు, శబ్దముతో గూడి అధిక రక్తస్రావమై కష్టముచే స్రావముచే నిలిచినచో అది అతి విద్ధమనియు తెలియవలెను.

వ్యా. వా. : అష్టాంగ హృదయమునందు సమ్యగ్విద్ధ సిరాలక్షణమును తెలుపుచు యంత్రము (బంధము)ను తీసివేసినను రక్తము స్రవించక నిలిచి యుండుట గూడ చెప్పబడినది.

సుశ్రుతమున ఈ క్రింది ఇరువదియు దుష్టవ్యధలుగా చెప్పబడినవి:-

దుర్విద్ధము, అతి విద్ధము, కుంచితము, పిచ్చితము, కుట్టితము, అప్రస్రుతము, అత్యుదీర్ణము, అంతాభిహతము, పరిశుష్కము, కూణితము, వేపితము, అనుత్థితవిద్ధము, శస్త్రహతము, తిర్యగ్విద్ధము, అపవిద్ధము, అవ్యధ్యము, విద్రుతము, ధేనుకము, పునఃపున ర్విద్ధము, మాంస సిరాస్నాయ్వస్థి సంధి విద్ధము.

## సమ్యగ్విద్ధమున రక్తము స్రవించకుండుటకు కారణములు

**మూలము :** సమ్యగ్విద్ధానామపి చ సిరాణామవహనకారణాని మూర్ఛా భయం యన్త్రశైథిల్యమతి గాఢత్వమ త్యాశితతాక్షామత్వం కుణ్ఠశస్త్రవ్యధో మూత్రితోచ్చారితత్వం దుఃస్విన్నతా కఫావృతవ్రణద్వారతా చేతి ।

**ప్రతి పదార్థము :** (సిరావేధ సమయమున) మూర్ఛా = మూర్ఛ జెందుట, భయం = భయము, యన్త్రశైథిల్యం = బంధను వదలగుట, అతిగాఢత్వం = గట్టిగా కట్టు కట్టుట, అత్యాశితతా = ఎక్కువగా భుజించియుండుట, క్షామత్వం = దౌర్బల్యము, కుణ్ఠశస్త్రవ్యధః = మొండిశస్త్రముతో సిరా వ్యధ జేయుట, మూత్రితోచ్చారితత్వం = మలమూత్రాదులను విసర్జించుట, దుఃస్విన్నతా = దుఃఖముచే స్వేదము వెడలుట, కఫావృతవ్రణద్వారతా—చ = వ్రణద్వారము కఫముచే మూయబడియుండుటయు, ఇతి = ఇవి అన్నియు, సిరాణాం = సిరలకు, సమ్యక్—విద్ధానాం అపి = బాగుగా వేధ జేయబడినను, అ-వహనకారణాని = రక్తము ప్రవహించకుండుటకు కారణములు (అగును).

**తాత్పర్యము :** సిరావేధ సమయమున రోగి మూర్ఛిల్లుట, భయపడుట, కట్టు వదులుగా నుండుట, కట్టు ఎక్కువ బిగుతుగా నుండుట, రోగి అధికముగా భుజించియుండుట, అతి దుర్బలముగా నుండుట, మొండి శస్త్రముతో వేధ జేయుట, రోగి మలమూత్రాదుల విసర్జించుట, దుఃఖముచే చెమట బట్టి యుండుట, కఫము వ్రణద్వారమును మూయుట అను ఈ కారణములవలన సిరావేధ బాగుగా చేసినపుడు గూడ, రక్తము సరిగా స్రవించదు.

వి వ్యా. : అస్వేదము వలన గూడ రక్తము సరిగా స్రవించదని అష్టాంగ హృదయము తెలుపబడినది. కాగా- అస్వేదమనగా స్వేదాయోగమని అరుణదత్తుడును, దుఃస్విన్నతా అని చంద్రనందనుడును, అసమ్యక్ స్వేదమని హేమాద్రియు వ్యాఖ్యానించిరి.

## అందుకు ప్రతీకారము

**మూలము :** అథాప్రవృత్తికారణం యథాస్వముపలక్ష్య ప్రతికుర్యాత్ । తగరాదిచూర్ణేన చ తైలలవణ ప్రగాఢేన సిరాముఖమవచూర్ణయేత్ । పృష్ఠమధ్యేచాతురం

పీడయేత్ । ఏవం సాధు వహతి । సమ్యక్ప్రవృత్తే కఫానిలోపశమన రక్తావిచ్ఛేద నార్థముష్ణలవణతైల బిన్దుభిః సిరాముఖం సిఞ్చేత్ ।

ప్రతి పదార్థము : అథ = సిరావేధనానంతరము, అ-ప్రవృత్తికారణం = రక్తము వెడలకుండుటకు కారణమును, యథాస్వం = తగు విధముగా, ఉపలక్ష్య = గుర్తించి, ప్రతి కుర్యాత్ = ప్రతిక్రియ చేయవలెను.

తైల-లవణ-ప్రగాఢేన = తైలము, లవణము కలిపిన, తగరాదిచూర్ణేన = గ్రంథి తగరము మొదలగు ద్రవ్యముల చూర్ణముతో, సిరాముఖం = సిరాముఖమును, అవచూర్ణ యేత్ = చల్లవలెను, ఆతురం = రోగిని, పృష్ఠమధ్యే = పృష్ఠభాగమున మధ్యలో, పీడ యేత్ = ఒత్తవలెను, ఏవం = ఈ విధముగా చేయుట, సాధు = బాగుగా, వహతి = (రక్తము) స్రవించును, సమ్యక్ = బాగుగా, ప్రవృత్తే = రక్తము వెడలగా, కఫ-అనిల-ఉపశమన-రక్త-అవిచ్ఛేదన-అర్థం = శ్లేష్మము, వాయువు శమించుట కొరకు, రక్తస్రావము ఆగ కుండుటకును, ఉష్ణ-లవణ-తైల-బిందుభిః = వేడిగా నుండు లవణము, తైల బిందువులచే, సిరాముఖం = సిరయొక్క ముఖమును, సిఞ్చేత్ = తడుపవలెను.

తాత్పర్యము : సిరావేధనాంతరము రక్తము సరిగా వెడలకున్నచో అందుకు కారణ మును గుర్తించి తగు ప్రతిక్రియ చేయవలెను. గ్రంథి తగరము మొదలగు ద్రవ్యములను తైలము, లవణము కలిపి సిరాముఖమున చల్లవలెను. ఇంకను, రోగి వీపు మధ్యలో వత్త వలెను. వీనివలన రక్తము సరిగా వెడలును. అట్లు బాగుగా వెడలినపుడు శ్లేష్మము, వాయువు శమించుటకొరకును, రక్తస్రావము ఆగకుండ వెడలుటకొరకును, వేడిగానుండు లవణతైల బిందువులచే సిరాముఖమును తడుపవలెను.

### దుష్టరక్త, శుద్ధ రక్తములను తెలియు విధము

**మూలము : అగ్రే స్రవతి దుష్టాస్రం కుసుమ్భాదివ పీతికా ।**
**సమ్యక్ స్రుత్వా స్వయం తిష్ఠేచ్ఛుద్ధం తదితి నాహరేత్ ॥**

ప్రతి పదార్థము : కుసుమ్భాత్ = కుసుంభ పుష్పమునుండి పీతికా - ఇవ = పచ్చని ద్రవ్యమువలె, అగ్రే = మొదట, దుష్టాస్రం = దుష్టరక్తమును, స్రవతి = (వేధింపబడిన సిర) స్రవించును, సమ్యక్ = బాగుగా, స్రుత్వా = స్రవించి, స్వయం = తనంతటతానే, తిష్ఠేత్ = నిలిచిపోవునో, తత్ = ఆరక్తము, శుద్ధం - ఇతి = శుద్ధమైనదని (తెలిసికొని), న ఆహరేత్ = వెడలింపరాదు.

తాత్పర్యము : కుసుంభ పుష్పములనుండి పచ్చని ద్రవ్యము వెడలునట్లు, సిరావేధము చేయగానే మొదట దుష్టరక్తము స్రవించును. సరిగా స్రవించి తనంతట తానే ఆగినట్టి రక్తము శుద్ధమైనదని గ్రహించి, దానిని ఇక వెడలింపరాదు.

వివ్యా : అష్టాంగ హృదయ వ్యాఖ్యా కారుడగు చంద్రనందనుడు కుసుంభ పుష్ప ములలో ఎరుపు - పసుపు రంగుల ద్రవ్యములు మిశ్రమమై యున్నను, పచ్చని ద్రవ్యము వెడలునట్లుగా, శుద్ధ - దుష్ట రక్తములు మిళితములై యున్నను మొదట దుష్టరక్తమే స్రవించు

నని వ్రాసెను. ఇందుకు స్వభావమే కారణమని హేమాద్రి తెలిపినాడు.

మూర్ఛాది ఉపద్రవములు—చికిత్స

**మూలము :** యస్యతు స్రవతి రక్తే మూర్ఛాజాయతే తస్య విముచ్య యన్త్రం శీతసలిలార్ద్రపాణి స్పర్శేన వ్యజనవాయునా శ్రోత్ర సుఖేన వచసా చ సమాశ్వాసయన్నుపశమయ్య మూర్ఛాం పునఃస్రావయేత్ । పునర్మూర్ఛత్యపరేద్యుస్త్ర్యహేఽపి వా, పరన్తు రుధిరావసేచనప్రమాణం ప్రస్థః । అతోఽన్యథావ్యాధి దేహర్త్తుబలమపేక్షేత ।

*ప్రతిపదార్థము:* యస్య తు = ఎవనికైతే, రక్తే = రక్తము, స్రవతి (సతి) = స్రవించు చుండగా, మూర్ఛా = మూర్ఛ, జాయతే = కలుగునో, తస్య = అతనియొక్క, యన్త్రం = బంధించిన యంత్రమును, విముచ్య = వదిలించి, శీత - సలిల - ఆర్ద్ర - పాణి స్పర్శేన = చల్లని నీటితో తడిపిన చేతితో తాకుటచేత, వ్యజన వాయునా = విసనకర్ర గాలి చేతను, శ్రోత్రసుఖేన వచసా చ = వినుటకింపగు మాటలచేతను, సమాశ్వాసయన్ = ఊరడిల్ల జేయుచు, మూర్ఛాం = మూర్ఛను, ఉపశమయ్య = ఉపశమింపజేసి, పునః = మరల, స్రావయేత్ = స్రవింపజేయవలెను.

పునః = తిరిగి, మూర్ఛతి (చేత్) = మూర్ఛ జెందినచో, అపరేద్యుః = మరుసటి రోజు గాని, త్ర్యహే - అపి - వా = మూడవదినముననైనను (స్రావయేత్ = స్రవింప జేయవలెను), పరన్తు = కాని, రుధిర - అవసేచన - ప్రమాణం = రక్తమును స్రవింప జేయవలసిన ప్రమాణము, ప్రస్థః = ఒక ప్రస్థము, అతః - అన్యథా = అంతకంటె వేరైనచో, వ్యాధి - దేహ - ఋతు బలం = వ్యాధియొక్క, శరీరముయొక్క ఋతువుయొక్క బలమును, అపేక్షేత = గమనించవలెను.

**తాత్పర్యము :** రక్తము స్రవించునపుడు రోగి మూర్ఛిల్లినచో వెంటనే బంధించిన యంత్రమును వదలించి, చల్లని నీటితో తడిపిన చేతితో తాకుచు, విసనకర్రతో విసరుచు, మృదు వచనములచేతను ఊరడించి మూర్ఛను ఉపశమింప జేయవలెను. తరువాత మరల రక్తమును స్రవింప జేయవలెను. అప్పుడును మూర్ఛ జెందినచో, ఆనాటికి విరమించి, మరుసటి రోజుగాని మూడవరోజుగాని స్రవింప జేయవలెను. ఎప్పుడైనను స్రవింపజేయవలసిన రక్త ప్రమాణము ఒక ప్రస్థము. అంతకంటె వేరు ప్రమాణమున జేయవలెనన్నచో రోగి, రోగము, ఋతువులబలము ననుసరించి చేయవలెను.

**శశిలేఖ :** స్రవింప జేయదగిన రక్తప్రమాణ విషయమున కొందరు "వమనే చ విరేకే చ తథాశోణిత మోక్షణే। సార్ధత్రయోదశ పలం ప్రస్థమాహుర్మనీషిణః" అని వచింతురు.

వ్యాధి మొదలగు వాని బలము ననుసరించి రక్తము కొలదిగానో ఎక్కువగానో స్రవింప జేయవలెను.

వాతాది దూషిత రక్త లక్షణములు

**మూలము :** తత్ర ఫేనిలమరుణం శ్యావమచ్ఛం రూక్షమసక్కన్ది కషాయానురసం లోహగన్ధి వేగస్రావి శీతం చ రక్తం వాతాత్ । గృహధూమాఞ్జనోదక కృష్ణం పీతం హరితం

విస్రం మత్స్యగన్ధి కటుత్వాన్మక్షికానిష్ట మౌష్ణ్యాదస్కన్ది సచన్ద్రికం గోమూత్రాభం చ పిత్తాత్ । కోవిదారపుష్పగైరికోదకాపాణ్డుశీతం స్నిగ్ధం స్కన్ది ఘనం పిచ్ఛిలం తన్తుమద్ వ్రణద్వారావసాది లవణరసం వసాగన్ధి చ కఫాత్ । ద్వంద్వసంకీర్ణం సంసర్గాత్ । కంసనీలమావిలం దుర్గన్ధంచ సన్నిపాతాత్ । శుద్ధముక్తం ప్రాక్ ।

ప్రతిపదార్థము : తత్ర = అందు, వాతాత్ = వాతము వలన దూషితమైన, రక్తం = రక్తము, ఫేనిలం = నురుగుతో గూడినది, అరుణం = ఎఱ్ఱనిది, శ్యావం = శ్యావ వర్ణము గలది, అచ్ఛం = స్వచ్ఛమైనది, రూక్షం = రూక్షగుణముగలది, అస్కన్ది = గడ్డకట్టనిది, కషాయానురసం = కషాయ అను రసముగలది, లోహగన్ధి = ఇనుమువంటి వాసనగలది వేగస్రావి = వేగముగా స్రవించునది, శీతం - చ = చల్లనిదియు (అగును).

పిత్తాత్ = పిత్తమువలన దూషితమైన (రక్తము), గృహధూమ - అఞ్జన ఉదక - కృష్ణం = కరీధూపము, కాటుకనీరువలె నల్లనిది, పీతం = పసుపుపచ్చనిది, హరితం = ఆకు పచ్చనిది, విస్రం = దుర్గంధముగలది, మత్స్యగన్ధి = చేపవాసనగలది, కటుత్వాత్ = కటు రసముచేత, మక్షికానిష్టం = ఈగలు ముసరనిది, ఔష్ణ్యాత్ = వేడివలన, అస్కన్ది = గడ్డకట్టనిది, సచన్ద్రికం = మయూరపింఛ వర్ణముగలది, గోమూత్రాభం - చ = గోమూత్రము వలె ప్రకాశించునదియు (అగును).

కఫాత్ = కఫము వలన దూషితమైన (రక్తము), కోవిదారపుష్ప = ఎఱ్ఱకాంచన పుష్పమువలెను, గైరిక - ఉదక = గైరికము కలిసిన నీరువలెను, ఆపాణ్డు = మిక్కిలి తెల్లనిదిగను, శీతం = చల్లనిదిగను, స్కన్ది = గడ్డ కట్టునదిగను, ఘనం = గట్టిగాను, పిచ్ఛిలం = పిచ్ఛిలముగాను, తన్తుమత్ = దారములవలె సాగునదిగను, వ్రణద్వార - అవసాది = వ్రణద్వారమును అడ్డగించునదిగాను, లవణరసం = లవణరసము గలదియును, వసాగన్ధి చ = వసావంటి వాసన గలదియు (అగును).

సంసర్గాత్ = రెండు దోషములచే దూషితమగుట వలన (రక్తము), ద్వంద్వ సంకీర్ణం = రెండు దోషముల గుణములను కలిగియుండును, సన్నిపాతాత్ = త్రిదోషములచే దూషితమగుట వలన, (రక్తము), కంస నీలం = కంచువంటి వర్ణము గలదియు, ఆవిలం = మలినమైనదియు, దుర్గంధం చ = దుర్వాసన గలదియు (అగును), శుద్ధం = శుద్ధమగు రక్త లక్షణము, ప్రాక్ - ఉక్తం = ముందు చెప్పబడినది.

తాత్పర్యము : వాత దూషితమైన రక్తము నురుగుతో గూడియు, ఎరుపు శ్యావ వర్ణము గలిగియు, స్వచ్ఛముగను, రూక్షగుణము గలిగి, గడ్డకట్టక, కషాయరసము అను రసముగా గలిగియు, లోహపు వాసన గలిగియు, చల్లగాను, వేగముగా స్రవించునదిగాను ఉండును. పిత్తదూషితమైనపుడు కరి దూపము, కాటుక నీరువలె నల్లగాను, పసుపుపచ్చ, ఆకుపచ్చగాను, దుర్గంధము మత్స్యగంధము గలిగియు, కటు రసము గలిగియుండుటచే ఈగలు ముసరనిదియు, ఉష్ణగుణమువలన గడ్డ కట్టనిదియు, మయూర పింఛము వలెయు, గోమూత్రము వంటి కాంతి గలిగియు ఉండును. కఫదూషిత రక్తము ఎఱ్ఱకాంచన పువ్వువలెను, గైరికము కలిపిన నీరువలెను, ఎక్కువ తెల్లగాను, శీతలముగాను, గడ్డకట్టునదిగాను,

ఘనీభవించియు, పిచ్ఛిలముగాను, తీగలు సాగుచును, వ్రణద్వారమును అడ్డగించునదిగాను, లవణ రసమును గలిగియు, వసాగంధమును గలిగియు ఉండును.

సంసర్గమున రెండుదోషముల లక్షణములు గలిగియు, సన్నిపాతమున కంచువంటి రంగు గలిగి రక్తము కలుషితముగాను, దుర్వాసన గలిగియు ఉండును.

పశ్చాత్కర్మ - రక్తస్రావమును నిలుపు ఉపాయములు;
అతి రక్తస్రావ నిషేధము

మూలము : తతః స్రుత రక్తస్య వ్యధమనులోమమభ్యక్తేనోపరుధ్య శనైర్యన్త్రమపనీయాశ్వాసయేత్ । సతైలం చ ప్లోతం సిరాముఖేదత్వా బధ్నీయాత్ సంవేశయేచ్చైనమ్। అతిష్ఠతి రక్తే సిరాముఖం సంధాతుం పూర్వోక్తైశ్చూర్ణైరవ చూర్ణ్యాఙ్గుల్యగ్రేణ పీడయేత్ । శాల్యుపోదకాపిచ్ఛాంవా వ్రణముఖే దత్వా గాఢం బధ్నీయాన్మధూచ్ఛిష్ట ప్రలిప్తం వా పట్టమ్ । శీతామ్బునా వా సిఞ్చయేత్ । శీత మధురకషాయాన్నపానైః సేకప్రదేహప్రవాతవేశ్మభిర్వా సచన్దనాయోపచరేత్ । పద్మకాది క్వాథం శర్కరామధుమధురం క్షీరమిక్షురసమేణ హరిణోరభ్రమహిష వరాహాణామన్యతమస్య సిరాం విద్ధ్వా రుధిరమామం ఘృతభృష్టం వా పానం దద్యాత్ । తేనైవ వా దర్భపాదమృదితేనానువాసయేత్ । స్నిగ్ధైశ్చ యూషరసైర్భోజయేత్ । వ్యధాదనన్తరం వా పునస్తామేవ సిరాం విధ్యేత్ । సర్వథా చానవతిష్ఠమానే పాచనాయ క్షారం దద్యాత్ । సంకోచయితుం వా సిరాముఖం తప్తశలాకయా దహేత్ । న చక్షణమప్యుపేక్షేత । క్షీణ రక్తస్యహి వాయుర్మర్మాణ్యుపసంగృహ్యామూర్ఛాసంజ్ఞానాశ శిరః కమ్పభ్రమ మన్యాస్తమ్భాపతానకహనుభ్రంశ హిధ్మాపాణ్డుత్వ బాధిర్యధాతుక్షయాక్షేపకాదీన్ కరోతి మరణం వా ।

ప్రతిపదార్థము : తతః = ఆ తరువాత, స్రుతరక్త = రక్తముస్రవించిన రోగి యొక్క, వ్యధం = సిరావేధజేసిన స్థానమును, అనులోమం = క్రిందికి, అనురుధ్య = అడ్డి, శనైః = మెల్లగా, యన్త్రం అపనీయ = యంత్రించిన కట్టును తొలగించి, ఆశ్వాసయేత్ = ఊరడిల్ల జేయవలెను, స - తైలం = తైలముతోగూడిన, ప్లోతం = వస్త్రఖండమును, సిరాముఖే = సిరాముఖమున, దత్వా = ఉంచి, బధ్నీయాత్ = కట్టు కట్ట వలెను. (ఆ తరువాత) ఏనం = ఈ రోగిని, సంవేశయేత్ = పరుండబెట్టవలెను.

రక్తే = రక్తము, అతిష్ఠతి (సతి) = ఆగనిచో, సిరాముఖం = సిరాముఖమును, సంధాతుం = మూయుటకు, పూర్వోక్తైః = ముందు చెప్పిన, చూర్ణైః = చూర్ణములచేత, అవ చూర్ణ్య = చల్లి, అంగుళి - అగ్రేణ = బొటనవ్రేలిచివరిచేత, పీడయేత్ = వత్తవలెను.

వ్రణముఖే = వ్రణముయొక్క ముఖమున, శాలి - ఉపోదక - పిచ్ఛాం - వా = శాలి ధాన్యపుపిండి, బచ్చలి ఆకు, బూరుగు బంకనుగాని, మధూచ్ఛిష్ట ప్రలిప్తం = మైనము పూసిన, పట్టం - వా = పట్టీనిగాని, గాఢం = దట్టముగా, దత్వా = ఉంచి, బధ్నీయాత్ = కట్టుకట్టవలెను, శీతాంబునా - వా = లేక చల్లని నీటితో, సిఞ్చయేత్ = తడుప వలెను.

శీత - మధుర - కషాయ - అన్న - పానైః = శీతవీర్యము, మధుర - కషాయ రసములు గలిగియుండు ఆహార పానీయములచేత, సేక - ప్రదేహ - ప్రవాత - వేశ్మభిః - వా = తడుపుట, పట్టువేయుట, బాగుగా గాలి తగులునట్టి ఇంటిలో నుంచుట - వీనిచేతగాని, స్కందనాయ = రక్తము గడ్డకట్టుటకు, ఉపచరేత్ - ఉపచారము చేయవలెను.

పద్మకాది క్వాథం = పద్మకాది గణద్రవ్యములతో సిద్ధముచేసిన కషాయమును, శర్కరా - మధు - మధురం = చక్కెర, తేనెలచే మధురమైనట్టి, క్షీరం = పాలను, ఇక్షురసం = చెరకు రసమును. ఏణ - హరిణ - అజ - ఉరభ్ర - మహిష - వరాహాణాం = నల్ల ఇఱ్ఱి, జింక, మేక, పొట్టేలు, దున్నపోతు, పంది - వీనిలో; అన్య - తమస్య = ఒకదానియొక్క, సిరాం = సిరను, విద్ధ్వా = వేధనచేసి, ఆమం = పచ్చిదిగానుండు, రుధిరం = రక్తమును, వా = లేక, ఘృతభృష్టం = నేతితో పక్వము చేయబడిన రక్తమును, పానం = పానముగా, దద్యాత్ = ఇవ్వవలెను, దర్భపాదమృదితేన = దర్భమూలములతో మర్దించిన, తేన - ఏవ - వా = ఆ రక్తముచేతగాని, అనువాసయేత్ = అనువాసన వస్తికర్మ చేయించవలెను, స్నిగ్ధైః = స్నేహమును చేర్చిన, యూష - రసైః = యూషములు, మాంస రసములచేత, భోజయేత్ = భుజింపవలెను.

వ్యధాత్ - అనన్తరం = సిరావేధన తరువాత, తాం - సిరాం - ఏవ - వా = ఆ సిరనేగాని, విధ్యేత్ = వేధింపవలెను. సర్వాధా చ = అన్నివిధముల గూడను, అనవతిష్ఠమానే సతి = రక్తస్రావము ఆగనిది అగుచుండగా, పాచనాయ = పాచనమునకై, క్షారం = క్షారమును, దద్యాత్ = ఇవ్వవలెను, సిరాముఖం = సిరాముఖమును, సంకోచయితుం వా = సంకోచింప జేయుటకు, తప్తశలాకయా = కాల్చిన శలాకచే, దహేత్ = కాల్చవలెను, క్షణం - అపి = క్షణకాలము గూడ, న - ఉపేక్షేత = ఉపేక్షింపరాదు.

క్షీణ రక్తస్య = రక్తము క్షీణించిన వాని యొక్క, వాయుః = వాతము, మర్మాణి = మర్మస్థానములను, ఉపసంగృహ్య = చేరి, గట్టిగాపట్టుకొని, మూర్ఛా - సంజ్ఞానాశ - శిరః కంప - భ్రమ - మన్యాస్తంభ - అపతానక - హనుభ్రంశ - హిధ్మా - పాండుత్వ - బాధిర్య - ధాతుక్షయ - ఆక్షేపక - ఆదీన్ = మూర్ఛ, సంజ్ఞానాశము, శిరఃకంపము, భ్రమ, మన్యాస్తంభము, అపతానకము, హనుభ్రంశము, ఎక్కిళ్లు, పాండు, చెవుడు, ధాతు క్షయ, ఆక్షేపకవాతము మొదలగు రోగములను, కరోతి = కలిగించును, వా = లేక, మరణం = మరణమును, (కలిగించును).

తాత్పర్యము : ఆ తరువాత సిరావేధన చేసిన స్థానమున క్రిందిపైపునకు రుద్ది, కట్టును మెల్లగా తొలగించి, రోగిని ఊరడిల్ల జేయవలెను. తైలముతో వస్త్రఖండమును తడిపి, సిరాముఖముపై దానినుంచి కట్టుగట్టి, రోగిని పరుండబెట్టవలెను. రక్తస్రావము ఆగకున్నచో, సిరాముఖమును మూయుటకై పూర్వోక్త ద్రవ్య చూర్ణములను చల్లి, బొటనవ్రేలితో వత్తి యుంచవలెను. వ్రణముఖముపై శాలి ధాన్యపుపిండి, బచ్చలి ఆకు, బూరుగు బంకనుగాని, తేనె మైనము పూసిన వస్త్రమును గాని ఉంచి కట్టు కట్టవలెను. లేక చల్లని నీళ్ళతో తడుప వలెను. ఇంకను శీతవీర్య - మధుర - కషాయ రసములు గల్గియుండు ఆహార పానీయముల

చేతను, సేకము, ప్రదేహము, బాగుగా గాలి తగులు చోట రోగిని ఉంచుట మొదలగు ఉపచారములను, రక్తస్కందనము కొరకు చేయవలెను.

పద్మకాది గణద్రవ్యములతో సిద్ధము చేయబడిన క్వాథమును, శర్కర తేనెలచే గూడిన క్షీరమును, ఇక్షురసమునుగాని, నల్లఇఱ్ఱి, మేక, పొట్టేలు, దున్నపోతు, పంది, - వీనిలో ఒక జంతువు రక్తమును సిరావేధచే గ్రహించి, అట్టే పచ్చిదిగా గాని, ఘృతముతో పక్వముచేసిగాని త్రాగించవలెను. ఆ రక్తమునే దర్భమూలములతో మర్దించి, అనువాసనవస్తి యందుపయోగించవలెను. స్నిగ్ధములుగానుండు యూషములను, మాంస రసమును ఇవ్వవలెను.

సిరావేధ జేసిన తరువాత అదే సిరను మరల వేధించవలెను. ఎన్ని ఉపాయములచే నైనను రక్తస్రావము ఆగనిచో, పాచనార్థము క్షారమును ప్రయోగింపవలెను. తప్తశలాకాచే సిరా ముఖమును కాల్చవలెను. అంతేగాని క్షణకాలము గూడ ఉపేక్షింపరాదు.
శరీరమున రక్తము క్షీణించినవానికి వాతము మర్మస్థానములందు ప్రవేశించి, మూర్ఛా, సంజ్ఞానాశ, శిరఃకంప, భ్రమ, మన్యాస్తంభ, అపతానక, హనుభ్రంశ, హిక్కా, పాండు, బాధిర్య, ధాతుక్షయ, ఆక్షేపకాది రోగములనుగాని, మరణమును గాని కలిగించును.

*శశిలేఖ* : వ్యధనము జేసిన భాగమునకు వెనుక మరల వ్యధనము చేయవలెను.

## రక్తక్షీణతచే గలుగు అపాయము — అందుకు చికిత్స

**మూలము : ప్రాణాః ప్రాణ భృతాం రక్తం తత్క్షయా త్క్షీయతేఽనలః ।
వర్ధతే చానిలస్తస్మాద్యుక్త్యా బృంహణ మాచరేత్ ॥**

*ప్రతిపదార్థము :* ప్రాణభృతాం = ప్రాణులయొక్క, ప్రాణాః = ప్రాణములు, రక్తం = రక్తమును (ఆశ్రయించి యుండును) తత్ - క్షయాత్ = ఆరక్తము క్షీణించుట వలన, అనలః = జాఠరాగ్ని, క్షీయతే = క్షీణించును, అనిలః చ = వాయువునూ, వర్ధతే = వృద్ధిచెందును, తస్మాత్ = అందువలన, యుక్త్యా = ఉపాయముచేత, బృంహణం = బృంహణ క్రియలను, ఆచరేత్ = చేయవలెను.

*తాత్పర్యము :* ప్రాణములు విశేషముగా రక్తమును ఆశ్రయించి యుండును. అట్టి రక్తము క్షీణించుటచే జాఠరాగ్ని క్షీణించి, వాయువు వృద్ధిచెందును. అందుచే బృంహణ చికిత్స చేయవలెను.

## తిరిగి సిరావేధ జేయుటకు విధానము — దుర్వ్యధాదుల చికిత్స

**మూలము : అశుద్ధం తు రక్తమపరాహ్ణేఽన్యేద్యుర్వా పునః స్రావయేత్ । తతోఽపి శేషం సర్వథా వాఽస్య విస్రావ్య రక్తస్య శీతసేక ప్రదేహ విరేకోపవాస స్నిగ్ధ మధురాన్నపానైః ప్రసాదయేత్ । మాస - మాత్రం వా స్నేహాది ఖిరప చర్య పునర్విధ్యేత్ । దుర్వ్యధాతి వ్యధకుట్టిత తిర్యగ్వ్యధా । దేర్వ్యధ దోషాద్వ్యాపదో యా స్యుస్తా యథాస్వం సాధయే దితి ।**

*ప్రతి పదార్థము :* అశుద్ధం రక్తం తు = శుద్ధముగాని రక్తమునైతే, అపరాహ్ణే =

మధ్యాహ్నము దాటిన పిదపగాని, అన్యే - ద్యుః - వా = మరుసటి దినమునగాని, పునః = మరల, స్రావయేత్ = స్రవింప జేయవలెను.

తతఃఅపి = అప్పటికినీ, శేషం = మిగిలిన రక్తమును, సర్వథా = అన్ని విధములుగా, అస్య = ఈ, విస్రావ్యస్య - రక్తస్య = స్రవింప జేయదగిన రక్తముయొక్క, శీత - సేక - ప్రదేహ - విరేక - ఉపవాస - స్నిగ్ధ - మధుర - అన్నపానైః - వా = చల్లని సేకము, ప్రదేహములచేతను, విరేచనము, ఉపవాసములచేతను, విరేచనము, ఉపవాసముల చేతను, స్నిగ్ధ మధుర ఆహార పానీయముల చేతను గాని, ప్రసాదయేత్ = శుద్ధిజేయ వలెను.

మాసమాత్రం = ఒకనెలవరకు, స్నేహాదిభిః = స్నేహద్రవ్యములచేత, ఉపచర్య = ఉపచారముజేసి, పునః విధ్యేత్ = మరల సిరావేధ జేయవలెను.

దుర్వ్యధ - అతివ్యధ - కుట్టిత - తిర్యగ్వ్యధ - ఆదేః = దుర్వ్యధము, దుర్వ్యధము, అతివ్యధము, కుట్టితము, తిర్యగ్వ్యధము మొదలగునవి, వ్యధదోషాత్ = సిరావ్యధ దోషము వలన, యాః = ఏ, వ్యాపదః = ఉపద్రవములును, స్యుః = కలుగునో, తాః = వానిని, యథాస్వం = వానికి తగినట్లుగా, సాధయేత్ = చికిత్స చేయవలెను, ఇతి = అని (ఋషులు చెప్పుచున్నారు).

**తాత్పర్యము :** అశుద్ధ రక్తమును మధ్యాహ్నము తరువాతగాని, మరుసటి దినమున గాని మరల స్రవింపజేయ వలెను. ఇంకను అశుద్ధరక్తము శేషించి యున్నచో శీతలమగు సేకము - ప్రదేహములచేతను విరేక - ఉపవాసములచేతను, స్నిగ్ధ - మధురములగు అన్న పానాదులచేతను శుద్ధియగునట్లు చేయవలెను. ఒక మాసముకాలము స్నేహద్రవ్యములనిచ్చి తరువాత మరల సిరావేధ చేయవలెను.

సిరావేధనమున అతివ్యధ, దుర్వ్యధ, కుట్టిత, తిర్యగ్వ్యధములు ఇతర ఉపద్రవములు కలిగినచో వానికి తగు చికిత్స చేయవలెను.

వి. వా. : స్నేహద్రవ్య సేవనానంతరము ఒక పక్షము తరువాత మరల సిరావేధము చేయవలెనని అష్టాంగ హృదయమున తెలుపబడినది.

సిరావ్యధ చేయబడిన రోగికి పథ్యాదులు — విశుద్ధరక్త పురుష లక్షణము

మూలము : భవన్తి చాత్ర :

శ్లో. ఉన్మార్గగా యన్త్రనిపీడనేన
స్వస్థాన మాయాన్తి పునర్న యావత్ ।
దోషాః ప్రదుష్టా రుధిరం ప్రపన్నా -
స్తావద్ధి తాహార విహార భాక్ స్యాత్ ॥

నాత్యుష్ణ శీతం లఘు దీపనీయం
రక్తే ౾ పనీతే హితమన్నపానం ।
తదా శరీరం హ్యనవస్థితా సృ ।
గాగ్నిర్వి శేషాదితి రక్షితవ్యః ॥

ప్రసన్నవర్ణేంద్రియ మింద్రి యార్థా -
నిచ్ఛన్త మవ్యాహత పక్తృవేగమ్ ।
సుఖాన్వితం పుష్టి బలోప పన్నం
విశుద్ధర క్తం పురుషం వద న్తి ॥

*ప్రతి పదార్థము :* అత్ర = ఇట, (శ్లోకాః = శ్లోకములు) భవ న్తిచ = ఉన్న విగూడ, యన్త్రపీడనేన = యంత్రముయొక్క పీడనము వలన, రుధిరం = రక్తమును, ప్రపన్నాః = ఆశ్రయించిన, దోషాః = వాతాదిదోషములు, ప్రదుష్టాః = మిక్కిలిదుష్టములై, ఉన్మార్గగాః = చెడు మార్గములందు ప్రవేశించినవై, పునః = మరల, యావత్ = ఎంతవరకు, స్వస్థానం = తమ స్థానమును, న - ఆయాన్తి = పొందవో, తావత్ = అంతవరకు, (రోగి), హిత - ఆహార - విహార - భాక్ = హితమైన ఆహార విహారములను సేవించి వాడుగా, స్యాత్ = ఉండవలెను.

రక్తే = రక్తము, అపనీతే = తీసివేయబడగా, (రోగికి), న - అతి - ఉష్ణ - శీతం = ఎక్కువ వేడి, చల్లనిది గానియు, లఘు = లఘు గుణము గలదియు, దీపనీయం = అగ్ని దీపనము గల్గించునదియు (అగు), అన్న - పానం = ఆహార పానీయములు, హితం = హితమైనవి. తదా = రక్తస్రావమైనప్పుడు, అనవస్థిత - అసృక్ = రక్తములేని, శరీరం = శరీరము, విశేషాత్ = విశేషించి, అగ్నిః = జాఠరాగ్నియు, రక్షితవ్యః = రక్షింపదగినవి, ఇతి = అని (ఋషులు చెప్పుచున్నారు).

ప్రసన్న - వర్ణ - ఇంద్రియం = ప్రసన్నమగు శరీరవర్ణము, ఇంద్రియములు గలిగిన వాడును, ఇంద్రియార్థాన్ - ఇచ్ఛన్తం = ఇంద్రియార్థములను గోరువాడును, అవ్యాహత - పక్తృ - వేగం = జీర్ణశక్తి వేగము తగ్గని వాడును, సుఖాన్వితం = సుఖముతో గూడిన వాడును, పుష్టి - బల - ఉపపన్నం = శరీరపుష్టి, బలముతోగూడిన వాడును, (అగు), పురుషం = పురుషుని, విశుద్ధరక్తం = పరిశుద్ధమైన రక్తము గలవానిగ, (ఋషులు) వదన్తి = చెప్పుచున్నారు.

తాత్పర్యము : యంత్రపీడనము చేత రక్తమును ఆశ్రయించి యున్న వాతాది దోషములు, ప్రకోపించి, ఉన్మార్గములైనట్టివి - ఎప్పటివరకు తమ స్థానమునకు చేరవో, అంతవరకు రోగి హితములగు ఆహార విహారముల నాచరించవలెను.

రక్తస్రావమైన రోగికి అతివేడి, అతిశీతల పదార్థముల నివ్వరాదు. లఘువుగాను, దీపనీయముగాను ఉండు అన్నపానములు హితము. ఏలనన, రక్తస్రావమైన పిదప శరీరమును, జాఠరాగ్నిని విశేషించి రక్షింపవలయును అని ఋషులు చెప్పుచున్నారు.

ప్రసన్నమగు దేహవర్ణము, ఇంద్రియములు గలిగి, ఇంద్రియానుభవముల ననుభవించు కోర్కె, అవ్యాహతమగు జీర్ణశక్తి గలిగి సుఖాన్వితుడై, శరీర పుష్టి బలము గలిగిన వ్యక్తిని విశుద్ధ రక్తముగలవాడని ఋషులు చెప్పుచున్నారు.

**వి. వ్యా.** : రక్తము శరరమున కాధారము. అట్టిరక్తమునకు పిత్తముయు, పిత్తమునకు అగ్నియు ఆధారములు. అందుచే విశేషముగా అగ్నిని రక్షింపవలెనని అరుణదత్త వచనము. అతి ఉష్ణములగు ఆహార, పానీయములు రక్తమును దూషింప జేయుననియు, అతి శీతలములగునట్టివి అగ్నిని మందగింప జేయుననియు అందుచే ఇవి నిషిద్ధములనియు చంద్రనందనుడు వివరించెను.

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## ముప్పది ఏడవ అధ్యాయము

**మూలము : అథాతః శల్యాహరణ విధి నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ।
ఇతి హస్మాహు రాత్రేయాదయో మహర్షయః ॥**

*ప్రతి పదార్థము :* అథ = (సిరావ్యధ విధి యను అధ్యాయమును వివరించిన) తరువాత, అతః = శల్యాహరణ విజ్ఞానము కొరకు, శల్యాహరణ విధినామ - అధ్యాయం = శల్యాహరణ విధియను అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము, ఆత్రేయాదయః - మహర్షయః = ఆత్రేయాది మహర్షులు, ఇతి హ = ఇదేవిధముగా, ఆహుః స్మ = పలికిరి.

**తాత్పర్యము :** సిరావిధి అధ్యాయమును వివరించిన తరువాత, ఆత్రేయాదులు వివరించిన విధముననే శల్యాహరణ విధియను పేరుగల అధ్యాయమును వివరించెదము.

### శల్యము యొక్క త్రివిధగతులు — సశల్య వ్రణలక్షణములు

**మూలము : త్రివిధాగతిః శల్యానా మూర్ధ్వ మధస్తిర్యక్ చ । సాపునః ప్రత్యేకమృజు వక్రభేదేన ద్విధా । తత్ర ధ్యామం పిడికాచితం శోఫవేదనావన్తం ముహుర్ముహుః శోణితాస్రావిణం బుద్ బుదవదుద్గతం మృదుమాంసం చ వ్రణం సశల్యం విద్యాత్ ।**

*ప్రతి పదార్థము :* శల్యానాం = శల్యముల యొక్క, గతిః = మార్గము, ఊర్ధ్వం = పైకి, అధః = క్రిందికి, తిర్యక్ - చ = అడ్డముగాను (అని), త్రివిధా = మూడు విధములైనది. సా = ఆమార్గము, ప్రత్యేకం = ప్రతిఒక్కటియు, పునః = మరల, ఋజు - వక్రభేదేన = సరళ - వక్రభేదములచే, ద్వి - విధా = రెండు విధములైనది, తత్ర = అందు, ధ్యామం = మురికిగాను, పిడికాచితం = గడ్డకట్టిన వ్రణములతో కూడినదియు, శోఫ - వేదనావన్తం = వాపు - నొప్పితోకూడినదియు, ముహుః ముహుః = మాటి మాటికి, శోణిత - ఆస్రావిణం = రక్తమును స్రవించునదియు, బుద్, బుదవత్ = బుడగవలె, ఉద్గతం = పైకుబ్బినదియు, మృదుమాంసం చ = మృదువగు మాంసము గలదియును (అగు), వ్రణం = వ్రణమును, స - శల్యం = శల్యముతో గూడిన దానినిగా, విద్యాత్ = తెలియవలెను.

**తాత్పర్యము :** శల్యముల యొక్క మార్గము ఊర్ధ్వ - అధో - తిర్యగ్గతములను మూడు విధములుగ ఉండును. ఇందు ప్రతిదియు సరళ - వక్రభేదములచే రెండు విధములుగా నుండును. శల్యముతో గూడిన వ్రణమును మురికిగా నుండుట, గడ్డుకట్టిన వ్రణములతో గూడి యుండుట, వాపు - నొప్పిగలిగి మాటి మాటికిని రక్తమును స్రవించు

చుండుట, బుడగవలె పైకుబికియుండుట, మాంసము మృదువుగా నుండుట అను లక్షణములతో తెలియవలెను.

*శశిలేఖ :* ఉత్తమాంగాభి ముఖమైనది ఊర్ధ్వగతి; పాదాభిముఖమైనది అధోగతి; అంగపార్శ్వగమనము తిర్యగ్గతి. 'ఉద్గతం' అనగా ఉద్గత ఓష్ఠములు గలది. ఇది సశల్య వ్రణ సామాన్య లక్షణము.

*వి. వ్యా :* సుశ్రుతమున "శల - శ్వల - ఆశుగమనే ధాతుః - తస్య శల్యమితి రూపం" అని తెలుపబడినది. కొందరు శల - హింసాయాం; శల - రుజాయాం అనిగూడ చెప్పుదురని డల్హణుని వ్యాఖ్య. శల్యములు శారీర - ఆగంతు భేదములచే సుశ్రుతమున వర్ణింపబడినవి. సుశ్రుత, అష్టాంగ హృదయ తంత్రములందు శల్యముల గతి, ఊర్ధ్వ - అధో - అర్వాచీన - తిర్యక్ - ఋజు భేదములచే అయిదు విధములుగ చెప్పబడినది.

## త్వగ్గత శల్య లక్షణములు

**మూలము : విశేషతస్తు త్వగ్గ తే శల్యే వివర్ణః శోఫో భవత్యాయతః కఠినశ్చ ।**

*ప్రతి పదార్థము :* విశేషతః - తు = విశేషముగానైతే, శల్యే = శల్యము - త్వక్ - గతే = చర్మమును జేరియున్నచో, వివర్ణః = రంగుమారినదై, కఠినః = గట్టిదగు, ఆయతః = పొడవైన, శోఫః = వాపు, భవతి = కలుగును.

తాత్పర్యము : చర్మమున శల్యము చేరియున్నపుడు చర్మపురంగు మారి యుండుట, గట్టిగా పొడవుగా నుండు శోఫ కలుగును.

## మాంసగత, మాంసపేశీగత శల్య లక్షణములు

**మూలము : మాంసగతే శోఫాభివృద్ధిః శల్యమార్గానుపసంరోహః పీడనా సహిష్ణుతా చోషః పాకశ్చ । పేశ్యన్తరస్థే శోఫవర్జం - మాంసప్రాప్తవత్ ।**

*ప్రతి పదార్థము :* మాంసగతే = (శల్యము) మాంసమును జేరియున్నచో, శోఫ - అభివృద్ధిః = శోఫ చాల ఎక్కువగుట, శల్యమార్గ-అనుప సంరోహః = శల్యము ప్రవేశించిన మార్గము మానకుండుటయు, పీడన - అసహిష్ణుతా = ఒత్తిడిని సహించలేక పోవుటయు, చోషః = మంటతోగూడిన వాపు, పాకః చ = పుండగుటయు (భవతి = కలుగును), పేశీ - అన్తరస్థే = (శల్యము) మాంస పేశీలో చేరి యుండగా, శోఫ - వర్జం = వాపు తప్ప, మాంసప్రాప్తవత్ = మాంసమున చేరిన శల్య లక్షణములవలె (కలుగును).

**తాత్పర్యము :** శల్యము మాంసమున చేరియున్నపుడు అధికమగు శోఫ, శల్య ప్రవేశ మార్గముయొక్క వ్రణము మానకుండుట, ఒత్తిడిని సహింపలేకుండుట, మంటతో గూడినవాపు, పుండగుట - ఈలక్షణములు కలుగును. మాంస పేశీలందు శల్యముచేరినపుడు వాపు తప్ప మిగిలిన లక్షణము లన్నియు ఉండును.

*వి. వ్యా. :* చోష అనగా "చూష్యత ఇవ వేదనా విశేషః" అనియు; పిపాస అని కొందరి వ్యాఖ్య యనియు డల్హణుని వివరణ. అరుణ దత్తుడు చోష యనగా సర్వాంగమున అరతితో గూడి యుండు దాహము అని వ్రాసెను. పీల్చు చుండునట్లు బాధయని

హేమాద్రియు తెలిపెను. పేశీయనగా కఠినముగాను దీర్ఘముగాను ఉండు మాంసావయవ విశేషమని చంద్రనందనుని వివరణ.

సిరాగత శల్య లక్షణములు

**మూలము : సిరాగతే సిరాఽఽధ్మానం శూలం చ ।**

*ప్రతిపదార్థము* : సిరాగతే =(శల్యము) సిరను జేరియుండగా, సిరా - ఆధ్మానం = సిరలు నింపబడినట్లు ఉబ్బియుండుట, శూలంచ = నొప్పియును (కలుగును).

*తాత్పర్యము* : సిరలయందు శల్యము ప్రవేశించి యుండునపుడు సిరలు ఉబ్బి యుండుటయు, నొప్పియును కలుగును.

*వి. వ్యా.* : సిరాధ్మాన మనగా సిరలందు వాయువు నిండియుండుట యని హేమాద్రి వ్యాఖ్య.

స్నాయుగత శల్య లక్షణములు

**మూలము : స్నాయుగే స్రావ జాలావక్షేపణం సంరమ్భశ్చోగ్రరుక్ ।**

*ప్రతి పదార్థము* : స్నాయుగే =(శల్యము) స్నాయువును జేరి యుండగా, స్రావ - జాల - అవక్షేపణం = స్రావమును, స్నాయు జాలము సంకోచము నొందుట, సంరమ్భః = ఆవేగము, ఉగ్ర - రుక్ -చ = తీవ్రమగు వేదనయును (కలుగును).

**తాత్పర్యము** : శల్యము స్నాయువులందు జేరినపుడు అధికముగా స్రావము వెడలుట, స్నాయు జాలము సంకోచము నొందుట, ఆవేగము, తీవ్రమగు వేదన కలుగును.

***శశిలేఖ*** : అవక్షేపణ అనగా సంకోచము; సంరంభము అనగా ఆవేగము (uneasiness - anxiety).

*వి. వ్యా.* : సరంభము అనగా శ్వయధు అని డల్హణుని టీక; క్షోభము అని అరుణదత్తవ్యాఖ్య.

స్రోతోగత శల్య లక్షణములు

**మూలము : స్రోతోగతే స్రోతసాం స్వకర్మ గుణహానిః ।**

*ప్రతి పదార్థము* : స్రోతోగతే =(శల్యము) స్రోతస్సులందు జేరియుండగా, స్రోతసాం = స్రోతస్సులకు, స్వకర్మ - గుణహానిః = తమ కర్మలకు గుణములకు హాని (కలుగ జేయును).

*తాత్పర్యము* : శల్యము స్రోతస్సులందు జేరినపుడు స్రోతస్సులు వైగుణ్యమును జెంది తమ పనులను జేయలేకుండును.

ధమనీ గత శల్య లక్షణములు

**మూలము : ధమనీస్థే సఫేనం రక్తమీరయన్ననిలః స శబ్దో నిర్గచ్ఛత్యఙ్గ పీడా హృల్లాసశ్చ ।**

ప్రతి పదార్థము : ధమనీస్థే=(శల్యము) ధమనియందు జేరినచో, అనిలః =వాయువు, సశబ్దః =ధ్వనితో గూడినదై, సఫేనం=నురుగుతో గూడిన, రక్తం =రక్తమును, ఈరయన్ =త్రోయుచు, నిర్గచ్ఛతి= బయలు వెడలును, అఙ్గపీడా=శరీరాంగము లందు బాధ, హృల్లాసశ్చ = ఓకరింతలున్నూ (కలుగ జేయును).

తాత్పర్యము : శల్యము ధమనులందు చేరియున్నపుడు, శబ్దము, నురుగుతో గూడి రక్తమును బయటికి త్రోయుచు వాయువు వెడలును. ఇంకను శరీరము నందంతట బాధ, ఓకరింతలును కలుగును.

శశిలేఖ : హృల్లాసమనగా హృదయోత్క్లేశము.

## అస్థి గత శల్య లక్షణము

**మూలము : అస్థిగతే వివిధావేదనాః శోఫశ్చ ।**

ప్రతి పదార్థము : అస్థిగతే =(శల్యము) అస్థియందు జేరియున్నచో, వివిధాః - వేదనాః = పలురకముల బాధలు, శోఫః చ = వాపునూ (కలుగజేయును).

తాత్పర్యము : అస్థులందు శల్యము చేరియున్నపుడు పలు తెరగలు బాధలును, వాపును కలుగ జేయును.

## సంధిగత శల్య లక్షణము

**మూలము : సన్ధిగతే ఒ స్థివ చేష్టోప రోధశ్చ ।**

ప్రతి పదార్థము : సన్ధిగతే =(శల్యము) సంధియందు జేరియున్నచో, అస్థివత్ = అస్థులందు చేరియున్నపుడు కలుగు లక్షణములు కలుగును. చేష్టా - ఉపరోధః - చ = అవయవముల చేష్టలకు అవరోధమును (కలుగును).

తాత్పర్యము : శరీర అవయవ సంధులందు శల్యము జేరియున్నపుడు అస్థులందు చేరినపుడుండు లక్షణములే కలుగును. ఇంకను అవయవ చేష్టలకును అవరోధము గలుగును.

వి. వ్యా. : అస్థిసంధులకంటె శరీర సంధులు వేరయినవిగా తెలియవలెను.

## అస్థి సంధిగత శల్య లక్షణము

**మూలము : అస్థిసంధిగతే ఒ స్థిపూర్ణతా సంఘర్షో బలవాంశ్చ ।**

ప్రతి పదార్థము : అస్థిసన్ధిగతే = (శల్యము) అస్థి సంధులలో చేరియున్నపుడు, అస్థిపూర్ణతా =అస్థులు నిండి యుండుటయు, బలవాన్ - సంఘర్షః - చ =ఎక్కువ ఒరిపిడి యును (కలుగును).

తాత్పర్యము : అస్థిసంధులందు శల్యము జేరియున్నపుడు అస్థులు నిండియుండుటయు, తీవ్రమగు ఒరిపిడియు కలుగజేయును.

శశిలేఖ : సంఘర్షమ్ అనగా ఆకులత్వమ్.

వి. వా. : బలవాన్ సంఘర్షః అనగా దుఃసహ సంఘట్టనమ్ అని హేమాద్రి వివరణ.

### కోష్ఠ గత శల్య లక్షణములు

**మూలము : కోష్ఠగతే త్వాటోపానాహౌ మూత్రపురీషాహార దర్శనాని చ వ్రణ ముఖాద్భవన్తి ।**

*ప్రతి పదార్థము:* కోష్ఠగతేతు =(శల్యము) కోష్ఠమున జేరియుండగానైతే, ఆటోప - అనాహౌ = ఆటోపము, ఆనాహము, వ్రణముఖాత్ = వ్రణముఖమునుండి, మూత్ర - పురీష- ఆహార - దర్శనాని - చ = మూత్రము, పురీషము, ఆహారము ఇవి కనబడుటయున్నూ, భవన్తి = కలుగును.

తాత్పర్యము : శల్యము కోష్ఠమును జేరి యున్నపుడు ఆటోపము - ఆనాహము కలుగుట, వ్రణ ముఖమునుండి మూత్ర, మల, ఆహారములు వెడలుటయు అగును.

వి. వా. : ఆటోపము అనగా తోదముతో గూడిన వాత సంక్షోభము; ఆనాహమనగా వాత, మూత్ర, పురీషాది నిరోధము అని డల్హణుని వివరణ.

ఆటోపమునకు ఆంత్రకూజనము గుడగుడ యను శబ్దమనియు; ఆనాహము అనగా ఉదర ఆధ్మానమనియు చంద్రనందనుని వివరణ.

### మర్మ గత శల్య లక్షణములు

**మూలము : మర్మగతే మర్మవిద్ధవద్యథా యథం చోపదిష్టైః పరిస్రావైస్త్వగాదిషు శల్యము పలక్షయేత్ ।**

*ప్రతి పదార్థము :* మర్మగతే =(శల్యము) మర్మప్రదేశములందు జేరినచో, మర్మ విద్ధవత్ = మర్మవేధ జరిగినపుడు చెప్పిన లక్షణములే (కలుగజేయును), ఉపదిష్టైః = పూర్వము చెప్పబడిన, పరిస్రావైః = పరిస్రావములచేత, యథాయథం = ఏవిధముగా విచారించి తెలిసికొన బడినదో అట్లే, త్వక్ - ఆదిషు = చర్మము మొదలగు స్థానములందు, శల్యం = శల్యమును, ఉపలక్షయేత్ = గుర్తించవలెను.

**తాత్పర్యము :** శల్యము మర్మములందు చేరియున్నపుడు మర్మములందభిఘాత లక్షణములు కలుగును. చర్మము మొదలగు స్థలములందు పైచెప్పిన పరిస్రావాది లక్షణ ములచేత శల్యమును గుర్తించవలెను.

వి. వ్యా. : దేహము మొద్దుబారి యుండుట, గౌరవము, మోహము, శీతలములగు వానియందిచ్ఛ, స్వేదము, మూర్ఛ, వాంతి, శ్వాస యనునవి మర్మవిద్ధ లక్షణములు.

### సూక్ష్మ గతులు గల శల్య లక్షణములు

**మూలము : సూక్ష్మగతిషు శల్యేష్వే తాన్యేవ లక్షణాన్య విస్పష్టాని భవన్తి ।**

*ప్రతిపదార్థము :* సూక్ష్మగతిషు - శల్యేషు = సూక్ష్మగతి గల శల్యములందు, ఏతాని- లక్షణాని-ఏవ = ఈ లక్షణములే, అ-విస్పష్టాని = స్పష్టము గాకుండ, భవన్తి = ఉండును.

తాత్పర్యము : సూక్ష్మగతి గల శల్యములు దేహమున ప్రవేశించి యున్నపుడు పై లక్షణములే అస్పష్టముగా నుండును.

**మూలము : శుద్ధ దేహానామనులోమ సన్నివిష్టాన్యు పరుహ్యన్తే । దోష ప్రకోప వ్యధాభి ఘాతేభ్యశ్చ పునః ప్రచలితాని పునరా బాధయన్తి ।**

**ప్రతి పదార్థము :** శుద్ధ దేహానాం = (వమన విరేచనాదులచే) శుద్ధమైన శరీరము గల వారికి, అనులోమ - సన్నివిష్టాని = అనులోమముగా ప్రవేశించినట్టివి (శల్యములు), ఉప రుహ్యన్తే = అడ్డబడు చుండును, దోష, ప్రకోప - వ్యధ - అభిఘాతేభ్యః చ = దోషముల ప్రకోపము, సిరావేధము, దెబ్బతగులుట చేత నున్నూ, పునః = మరల ప్రచలితాని = కదిలినవై, పునః = మరల, ఆబాధయన్తి = మిక్కిలి బాధించును

**తాత్పర్యము :** వమన విరేచనాదులచే శుద్ధమైన దేహముగల వారిలో అనులోమముగా ప్రవేశించిన శల్యములు అచటనే అడ్డగింపబడి యుండును. దోషప్రకోప, సిరావేధ, అభిఘాత కారణములచే ఇవి కదలినవై మరల మిక్కుటమగు బాధను కలిగించును.

వి. వ్యా : శుద్ధదేహినులనగా వాతాదులు దూషింపబడని దేహము గలవారని డల్హణుని వివరణ.

## చర్మమున శల్యము నిగూఢమై యున్నపుడు కలుగు లక్షణములు

**మూలము : తత్ర త్వక్ప్రనష్టే స్నిగ్ధ స్విన్నాయాం మృన్మాషయవ గోధూమ గోమయ చూర్ణమర్దితాయాం త్వచి యత్ర సంరమ్భో వేదనావా భవతి । యత్ర వాస్త్యానం సర్పిర్నిహిత మాశు విలీయతే । ప్రలేపో వా శుష్యతి । తత్రశల్యం జానీయాత్ । మాంస ప్రనష్టే స్నేహాదిభిః క్రియాభిరాతుర ముపపాదయేత్ । కర్శితస్య చ శిథిలీభూత మనవబద్ధం క్షుభ్యమానం యత్రయత్ర సంరమ్భం వేదనాం వా జనయతి తత్ర శల్యమ్ ।**

**ప్రతి పదార్థము :** తత్ర = ఆ శల్యముల తెలియు విషయమున, త్వక్ - ప్రనష్టే = (శల్యము) చర్మమున దాగియున్నపుడు, స్నిగ్ధ - స్విన్నాయాం = స్నేహ స్వేదములు చేయబడి నట్టిదియు, మృత్ - మాష - యవ - గోధూమ - గోమయ చూర్ణమర్దితాయాం = మన్ను, మినుములు, యవలు, గోధుమలు, ఆవుపేడ - వీనిచూర్ణములచే మర్దించబడినదియు అగు, త్వచి = చర్మమునందలి, యత్ర = ఏభాగమున, సంరమ్భః = ఉష్ణతతో గూడిన వాపు, వేదనా - వా = నొప్పిగాని, భవతి = కలుగునో, యత్రవా = ఏభాగమునయితే, నిహితం = ఉంచబడిన, స్త్యానం - సర్పిః = పేరిన నేయి, ఆశు = శీఘ్రముగా, విలీయతే = కరుగునో, ప్రలేపః - వా = ఔషధ లేపముగాని, శుష్యతి = ఎండునో, తత్ర = ఆభాగమున, శల్యం = శల్యమును (ఉన్నట్లుగా), జానీయాత్ = తెలిసికొనవలెను.

మాంసప్రనష్టే = (శల్యము) మాంసమున దాగియున్నపుడు, ఆతురం = రోగిని, స్నేహాదిభిః - క్రియాదిభిః = స్నేహకర్మ మొదలగు వానిచే, ఉపపాదయేత్ = చికిత్సచేయవలెను.

కర్శితస్య చ = కృశించిన రోగి యొక్కయు, యత్ర = ఏ శరీర భాగమున, శిథిలీభూతం = సడలినదై, అనవబద్ధం = నిలువలేనిదై, క్షుభ్యమానం = క్షోభను కలిగించుచున్నదై, సంరమ్భం = వేడితో గూడిన వాపు, వేదనాం - వా = నొప్పిని గాని, జనయతి = కలిగించునో, తత్ర = అచట, శల్యం = శల్యము (ఉన్నట్లు తెలిసికొనవలెను).

తాత్పర్యము : చర్మమున శల్యమున్నపుడు, అచట స్నేహ స్వేదములు చేసి, మృత్తిక, మాష, యవ, గోధుమ, గోమయ చూర్ణములచే బాగుగా మర్దించినచో, వేడితో గూడినవాపు, వేదన కలుగును. పేరిన నెయ్యి దానిపై నుంచిన కరగును, ఔషధ ప్రలేపము ఎండును. మాంసమున శల్యమున్నపుడు రోగికి స్నేహ కర్మ మొదలగువానిచే చికిత్స చేయవలెను. కృశించిన వాని శరీరమున ఎచట శిథిలమై, అనవబద్ధమై, క్షోభను కలిగించుచు సంరంభము, నొప్పికలుగునో అచట శల్య మున్నట్లుగా తెలియవలెను.

వి. వ్యా. : 'కర్శితస్య' అను పదమునకు "ఆతురస్య" అని డల్హణుని టీక యున్నది.

## కోష్ఠ - అస్థి - పేశిలందలి శల్య లక్షణములు

**మూలము : ఏవం కోష్ఠాస్థి పేశీ వివరేష్వపి ।**

*ప్రతి పదార్థము :* ఏవం = ఇట్లే, కోష్ఠ - అస్థి - పేశీ - వివరేషు - అపి = కోష్ఠమున, అస్థులు, పేశిలు, వివరములందును (ఉన్న శల్యముల తెలియవలెను).

తాత్పర్యము : కోష్ఠమున, అస్థులందు, పేశిలందు, శరీరరంధ్రములందును నివిష్టములై యుండు శల్యములను ఇదేవిధముగా తెలిసికొనవలెను.

*శశిలేఖ :* కోష్ఠాదులందు స్పర్శ - వేదనలచేత, స్పర్శసహత్వాదులచేత తెలిసికొనవలెను.

## సిరా - స్రోతో - ధమనులందలి శల్యముల దెలియు నుపాయములు

**మూలము : సిరాస్రోతో ధమనీ స్నాయు ప్రణష్టే ఖణ్డచక్రమశ్వయుక్తం రథమారోప్యాతురం విషమేఽధ్వని శీఘ్రం నయేత్ । తతః సంరమ్భాదిభిర్జానీయాత్ ।**

*ప్రతి పదార్థము :* సిరా - స్రోతో - ధమనీ - స్నాయు ప్రణష్టే = సిర, ధమనీ, స్నాయువులలో (శల్యము) దాగియున్నపుడు, ఆతురం = రోగిని, ఖణ్డచక్రం - అశ్వయుక్తం - రథం = విరిగిన చక్రము గలిగి అశ్వములను బూన్చిన రథమును, ఆరోప్య = ఎక్కించి, విషమే - అధ్వని = ఎత్తు పల్లములు గల మార్గమున, శీఘ్రం = వేగముగా, నయేత్ = తోలుకొని పోవలెను, తతః = ఆతరువాత, సంరంభ - ఆదిభిః = సంరంభాదుల చేత, జానీయాత్ = శల్యస్థానమును తెలిసికొనవలెను.

తాత్పర్యము : శల్యము సిరాధమనీ స్నాయువులలో నిగూఢమై యున్నపుడు, విరిగిన చక్రముగల రథమునకు అశ్వములను బూన్చి, రోగిని అందు ఎక్కించి, ఎత్తు

పల్లములుగ నుండు మార్గమున వేగముగా తోలుకొని పోవలెను. అపుడు గలుగు సంరంభాదులచే శల్య స్థానమును తెలియవలెను.

### అస్థు లందును - సంధులందును గల శల్యములను దెలియు నుపాయములు

**మూలము :** సన్ధిప్రణష్టే స్నేహస్వేదోపపన్నం సన్ధిం ప్రసారణాకుఞ్చన బన్ధన పీడనైరుపచరన్ పూర్వవదవగచ్ఛేత్ । అస్థిప్రణష్టే స్నిగ్ధ స్విన్నాన్యస్థీని బన్ధన పీడనాభ్యాం భృశముప చరంస్తద్వదుప లక్షయేత్ ।

*ప్రతి పదార్థము :* సన్ధిప్రణష్టే = (శల్యము) సంధులందు నిగూఢమై యున్నపుడు, స్నేహ - స్వేద - ఉపపన్నాం - సన్ధిం = స్నేహ స్వేదములు చేయబడిన సంధిని, ప్రసారణ - ఆకుఞ్చన - బన్ధన - పీడనైః = చాచుట, ముడుచుట, బంధించుట, ఒత్తుట - వీనిచే, ఉపచరన్ = ఉపచారము జేయుచు, పూర్వవత్ = పైన చెప్పినట్లు బాధ, వేగములచే, అవగచ్ఛేత్ = (శల్యమును) తెలిసికొనవలెను, అస్థిప్రణష్టే = (శల్యము) అస్థులందు నిగూఢమైయున్నపుడు, స్నిగ్ధ - స్విన్నాని - అస్థీని = స్నేహ, స్వేదములు చేయబడిన అస్థులను, బంధన - పీడనాభ్యాం = బంధించుట, ఒత్తుటలచేత, భృశం - ఉపచరన్ = ఎక్కువ ఉపచరించుచు, తత్ - వత్ = పైదానివలెనే, ఉపలక్షయేత్ = (శల్యమును) గుర్తించవలెను.

**తాత్పర్యము :** సంధులందు శల్యము నిగూఢమై యున్నపుడు స్నేహస్వేదముల జేసి, ప్రసారణ - ఆకుంచన, బంధన, పీడనాదులచే ఉపచరించినచో శల్యముగల ప్రదేశమున గలుగు సంరంభ వేదనలచే దానిని తెలియవలెను. అస్థులందును ఇదేవిధముగ జేసి శల్యమును గుర్తించవలెను.

### మర్మ ప్రవిష్ట శల్యముల దెలియు నుపాయము

**మూలము :** మర్మప్రణష్టే త్వనన్య భావాన్మాం సాదిభ్యో మర్మణాముక్తం పరీక్షణం భవతి ।

*ప్రతి పదార్థము :* మర్మప్రణష్టే - తు = (శల్యము) మర్మస్థానములందు నిగూఢమై యున్నపుడైతే, మర్మణాం = మర్మములకు, మాంసాదిభ్యః = మాంసము మొదలగువానికంటె, అనన్యభావాత్ = వేరైయుండుట కానందున, ఉక్తం - పరీక్షణం = పూర్వము చెప్పబడిన పరీక్షించుట, భవతి = అగును.

**తాత్పర్యము :** మర్మస్థానములు మాంస సిరాస్నాయు అస్థిమయములే గాని వేరైనవి కానందున, మర్మములందు నిగూఢమైన శల్యములను తెలిసికొనుటకు పైచెప్పిన విధముననే పరీక్షించవలెను.

*శశిలేఖ :* మర్మములందు మాంసాదు లాశ్రయించి యుండుటచే మాంసాదులందు శల్యమున్నపుడు చెప్పబడిన లక్షణాదుల చేతనే గుర్తించవలెను.

## శల్య మున్నపుడు గలుగు సామాన్య లక్షణములు

**మూలము :** సామాన్యలక్షణం తూచ్ఛ్రిత హస్తి స్కన్ధాశ్వద్రుమారోహణ ద్రుతయాన లంఘన ప్లవన వ్యాయామైర్జృమ్భోద్గారకాసక్షవథు ష్ఠీవన హసన ప్రాణాయామైర్మల శుక్లోత్సర్గైర్వా యత్ర సంరమ్భో వేదనా వా భవతి । యత్ర వా స్వల్పే ఽప్యాయాసే స్వాపో గౌరవం ఘట్టనం శోఫోవా స్యాత్తత్ర శల్య మాదిశేత్ ।

*ప్రతి పదార్థము :* సామాన్య లక్షణం - తు = (శల్యము యొక్క ఉనికిని) సామాన్యముగా పరీక్షించు విధానమైతే (ఈవిధముగా నుండును). ఉచ్ఛ్రిత - హస్తి - స్కన్ధ - అశ్వ - ద్రుమ ఆరోహణ - ద్రుతయాన - లంఘన - ప్లవన - వ్యాయామైః = ఎత్తగు స్థలము, ఏనుగు, భుజములు, అశ్వము, వృక్షము - వీనిపై ఎక్కుట, వేగముగ నడచుట, దూకుట, ఈదుట, వ్యాయామములచే, జృంభ - ఉద్గార - కాస - క్షవథు - ష్ఠీవన - హసన- ప్రాణాయామైః = ఆవలింత, త్రేణుపు, దగ్గు, తుమ్ము, ఉమ్మివేయుట, నవ్వుట, ప్రాణాయామము - వీనిని చేయుటచేత, మల, - శుక్ల - ఉత్సర్గైః - వా = మలము, శుక్రము విడుచుటచే గాని, యత్ర = ఎచట, సంరమ్భోవేదనా వా = సంరంభము లేక బాధ, భవతి = కలుగునో, యత్ర - వా = లేక - ఎచట, ఆయాసే - స్వల్పే - అపి = స్వల్పమగు బాధ అయినను, స్వాపః = మొద్దుబారుట, గౌరవం = బరువు, ఘట్టనం = ఒరిపిడియు, శోఫః వా = వాపు గాని, స్యాత్ = కలుగునో, తత్ర = అచట, శల్యం - ఆదిశేత్ = శల్యమున్న దానినిగా చెప్పవలెను.

*తాత్పర్యము :* శరీరమున శల్యమును గుర్తించు సామాన్య లక్షణములీవిధముగా నుండును. ఎత్తగు స్థలమునెక్కుట, ఏనుగు, గుఱ్ఱము, వృక్షములు, భుజస్కంధములు - వీనిపైనెక్కుట, వేగముగ నడచుట, దూకుట, ఈదుట, వ్యాయామము చేయుట చేతను, ఆవులించుట, దగ్గుట, తుమ్ముట, కాండ్రించి ఉమ్మివేయుట, నవ్వుట, ప్రాణాయామము చేయుట చేతను, మల - శుక్ర విసర్జనముల వలనను శరీరమున సంరంభము, బాధ కలుగును. ఇంకను స్వల్పమగు బాధచే శల్యముగల స్థానమున మొద్దుబారుట, ఒరిపిడి, వాపు, బరువు కలుగును.

*శశిలేఖ :* ప్రాణాయామమనగా శ్వాస - ఉచ్ఛ్వాస నిరోధము.

*వి. వ్యా. :* డల్హణుడు ప్రాణాయామమునకు - ప్రాణ వాయువునకు అవరోధము కలిగించుట అని వ్యాఖ్యానించెను సుశ్రుతమున శల్యమున్నపుడు ఈ క్రిందిలక్షణము లుండునని తెలుపబడినది:- తోదము, సుప్తత, గురుత, రోగి ఆట్టిప్రదేశమున ఘర్షించు చుండుట, రక్షించుకొనుచుండుట. శల్యము లేనపుడుండు లక్షణములు:- అల్పబాధ లేక బాధలేకుండుట. ఉపద్రవములు లేకుండుట, ఎత్తుగాలేకుండుట, ఏషణీయంత్రముచే వెదకినను శల్యము లేకుండుట, ఆకుంచన ప్రసారణాదులచే బాధలేకుండుట యనునవి.

## ఆకృతిచే శల్య భేదములు

**మూలము :** సమాసతశ్చతుర్విధం శల్యం భవతి । వృత్త ద్విత్రిచతురస్ర భేదేన : తదదృశ్యమానం వృత్త - సంస్థానా దను మిమీ.త

ప్రతి పదార్థము : సమాసతః = సంగ్రహముగా, శల్యం = శల్యము, వృత్త - ద్వి - త్రి - చతురస్ర భేదేః = వృత్తము, ద్వికోణము, త్రికోణము, చతుష్కోణము అను భేదముల చేత, చతుర్విధం = నాలుగు విధములుగా, భవతి = అగును, అదృశ్యమానం = కనబడ కుండునట్టి, తత్ = ఆశల్యము, వ్రణ - సంస్థానాత్ = వ్రణముయొక్క ఆకృతిని బట్టి, అను మిమీత = ఊహి పవలెను.

తాత్పర్యము : వృత్త, ద్వికోణ, త్రికోణ, చతుష్కోణ భేదములచే శల్యము నాలుగు విధములని సంగ్రహముగా చెప్పబడినది. కనబడకుండు శల్యముల ఆకారమును వ్రణముయొక్క స్థితి - ఆకృతిల ననుసరించి ఊహింపవలెను.

## శల్యములను వెలికిదీయు నుపాయములు-తీయదగని శల్యములు

**మూలము :** సర్వశల్యానాం మహతా మాహరణే ద్వావేవోపాయౌ ప్రతిలోమోఽనులోమశ్చ । తత్ర ప్రతి - లోమమర్వాచీన మానయేదనులోమం పరాచీనమ్ । తిర్యగ్గతం యతః సుఖాహార్యం భవతి । తతః ఛిత్వాపహరేత్ । ప్రతిలోమ మనుత్తుణ్డితం ఛేదనీయం పృథుముఖం చ శల్యం నిర్ఘాతయేత్ । తథా కక్ష్యా వంక్షణోరః పరశు కాన్తర పతితాని । నైవ చాహరే ద్విశల్యఘ్నం మర్మప్రణష్టం వా శోఫవేదనం పాకవిరహితమ్ ।

ప్రతి పదార్థము : మహతాం = పెద్దవగు, సర్వశల్యానాం = అన్ని శల్యములయొక్క ఆహరణే - తు = లాగివేయుట యందైతే, ఉపాయౌ = ఉపాయములు, ప్రతిలోమః - అనులోమః చ = ప్రతిలోమము, అనులోమమని, ద్వౌ - ఏవ = రెండే, తత్ర = అందు, ప్రతిలోమం = ప్రతిలోమ శల్యమును, అర్వాచీనం = అధోమార్గముగ (వెనుకకు)ను, అను లోమం = అనులోమ శల్యమును, పరాచీనం = ఊర్ధ్వమార్గముగ (పైకి)ను, (లాగివేయవలెను), తిర్యక్‌గతం = అడ్డముగపోవు శల్యమును, యతః = ఏమార్గమున, సుఖాహార్యం = సుఖముగా లాగి వేయదగినది, భవతి = అగునో, తతః = ఆకారణమున, ఛిత్వా = (మాంసమును) ఛేదించి, ఉపహరేత్ = లాగివేయవలెను. ప్రతిలోమం = ప్రతిలోమముగా ప్రవేశించినదియు, అనుత్తుణ్డితం = కనుబడని ముఖము కలిగినది, ఛేదనీయం = ఛేదింపదగినది, పృథుముఖం = లావగు ముఖముగలదియునగు, శల్యం = శల్యమును, న - నిర్ఘాతయేత్ = నిర్ఘాతనము చేయ కూడదు, తథా = అట్లే, కక్షా - వంక్షణ - ఉరః - పరశుక - అన్తర - పతితాని = చంకలు, గజ్జలు, రొమ్ము, పర్శుకలలో బడిన శల్యములను, న - చ ఆహరేత్ = లాగి తీసివేయరాదు, విశల్యఘ్నమర్మ - ప్రవిష్టం = విశల్యఘ్న మర్మయందు ప్రవేశించినట్టి, ప్రవిష్టం వా = దాగియున్నట్టిగాని, శల్యం = శల్యమును, శోఫ - వేదనా - పాక - విరహితం = వాపు, నొప్పి, పాకము లేనట్టి దానివి, న - ఏవ - చ - ఆహరేత్ = లాగి తీసివేయనే కూడదు.

తాత్పర్యము : పెద్దవిగనుండు శల్యముల నన్నింటిని వెలికి లాగుటకు ఉపాయములు రెండే గలవు. అవి ప్రతిలోమము, అను లోమము. ప్రతిలోమ శల్యమును అర్వాచీనముగ అనగా అధోమార్గముగ (వెనుకకు)ను, అనులోమ శల్యమును పరాచీనముగ అనగా ఊర్ధ్వ మార్గముగ (పైకి)ను లాగివేయవలెను. తిర్యగ్గత శల్యమును ఏ విధమున సులభముగా లాగివేయదగునో అట్లు మాంస ఛేదనముగావించి లాగివేయవలెను. ప్రతిలోమముగా ప్రవేశించి

కనుబడనట్టి ముఖము గలిగియున్నట్టియు లావగు ముఖము గలదియు అగు ఛేదింపదగిన శల్యములను నిర్ఘాతనము చేయరాదు. కక్ష, వంక్షణ, ఉరో, పర్శుకలందు ప్రవేశించి యుండు శల్యములను గూడ పెకలించి తీయరాదు. విశల్యఘ్న మర్మలందు ప్రవేశించిన శల్యములను, కనబడినను - కనుబడకున్నను, శోఫ, వేదనా, పాకములు లేకున్నచో లాగి తీసివేయ గూడదు.

*శశిలేఖ :* ప్రవేశించిన మార్గముననే శల్యమును వెలికి దీయుట ప్రతిలోమము. అనులోమమనగా ప్రవేశించిన మార్గముగాక రెండవదానినుండి తీయుట. అర్వాచీనం అనగా ఊర్ధ్వగతి. పరాచీనం అనగా అథోగతి. ఉత్తుణ్డితం అనగా కనుబడు ముఖము గలది. అట్లు కనుబడనిది అనుత్తుణ్డితం.

వి. వ్యా : అనవబద్ధములగు శల్యముల వెడలించు నుపాయములు సుశ్రుతసంహిత యందీ విధమున తెలుపబడినవి:- స్వభావము, పాచనము, భేదనము, దారణము, పీడనము, ప్రమార్జనము, నిర్ధ్మాపనము, వమనము, విరేచనము, ప్రక్షాళనము, ప్రతిమర్శము, ప్రవాహణము, ఆచూషణము, అయస్కాంతము, హర్షము.

నిర్ఘాతనమనగా హస్తము లేక ముద్గరాదులచే శల్యము నటునిటు కదలించి పెకలించుట యని డల్హణుని వివరణ.

శారీర స్థానమున మర్మలగూర్చి చెప్పునపుడు విశల్యఘ్న మర్మల గూర్చి తెలుపబడినది. ఉత్క్షేపములు, స్థపనీ యనునవి విశల్యఘ్న మర్మలు. వీని యందు శల్యమున్నంత కాలము జీవించి యుండి, శల్యమును పెకలించినచో మరణము కలుగునని తెలుపబడినది.

## వివిధ శల్యముల వెలికిదీయు ఉపాయములు

**మూలము :** అథ హస్తప్రాప్యం శల్యం హస్తేనాహరేత్ । తదశక్యం యథాయథం యన్త్రేణ । తథాప్యశక్యం శస్త్రేణ విశస్య తతో నిర్లోహితం వ్రణం కృత్వాగ్ని ఘృత మధు ప్రభృతిభిః స్వేద యిత్వావ దహ్యాతర్పయిత్వా సర్పిర్మధుభ్యాం బద్ధ్వాచారిక మాదిశేత్ । సిరాస్నాయులగ్నం శలాకాగ్రేణాభి మోచ్యాహరేత్ । హృదయేఽభివర్తమానం శల్యం శీతజలాభి రుద్వేజితస్యా హరేత్ । యథామార్గం దురాహరమన్యతోఽప్యేవ మాహరేత్ ।

*ప్రతి పదార్థము:* అథ = అటు తరువాత, హస్తప్రాప్యం = చేతికి అందునట్టి, శల్యం = శల్యమును, హస్తేన = చేతితో, ఆహరేత్ = లాగివేయవలెను, తత్-అశక్యం = అందుకు సాధ్యముగాని దానిని, యథాయథం = తగినతీరున, యన్త్రేణ = యంత్రముతో (లాగివేయ వలెను), తథా-అపి = అట్లుగూడ, అశక్యం = శక్యముగాని దానిని, శస్త్రేణ = శస్త్రముచే, విశస్య = కోసి, తతః = ఆ తరువాత, వ్రణం = గాయమును, నిర్ - రోహితం - కృత్వా = రక్తము లేకుండునట్లుచేసి, అగ్ని-ఘృత-మధు-ప్రభృతిభిః = అగ్ని, ఘృతము, తేనె మొదలగు వానిచే, స్వేదయిత్వా = స్వేదకర్మ చేసి, అవదహ్య = దాహకర్మనుచేసి, సర్పిః-మధుభ్యాం = నేయి, తేనెలతో, తర్పయిత్వా = తర్పణముచేసి, బద్ధ్వా = కట్టుగట్టి, ఆచారికం = రోగి ఆచరించ దగు విధానమును, ఆదిశేత్ = ఆజ్ఞాపించి చెప్పవలెను, సిరా-స్నాయు లగ్నం = సిరా స్నాయువులందు లగ్నమైయున్న శల్యమును, శలాకా-అగ్రేణ = శలాకయొక్క

కొనతో, అభిమోచ్య = వదలునట్లు కదలించి, ఆహరేత్ = లాగివేయవలెను, హృదయే = హృదయమునందు, అభివర్తమానం = గుచ్చుకొనియున్నట్టి, ఉద్వేజితస్య = ఉద్వేగమును పొందిన వానియొక్క, శల్యం = శల్యమును, శీతజలాదిభిః = చల్లని నీరు మున్నగువానిచే (ఉపచరించి), ఆహరేత్ = లాగివేయవలెను, యథామార్గం = ఏ మార్గమున గుచ్చుకొన్నదో ఆ మార్గమున, దురాహారం-అపి = లాగివేయ వీలులేని దానిని గూడ, అన్యతః = వేరు మార్గమున, ఆహరేత్-ఏవ = లాగివేయవలెను.

తాత్పర్యము : శల్యము చేతితో లాగదగినట్లున్నచో చేతితోనే లాగివేయవలెను. అట్లు వీలుగాకున్నచో తగు యంత్రము నుపయోగించి లాగవలెను. అట్లు తీయుటకు వీలు గాకున్నయెడల శస్త్రముతో కోసి, శల్యమును తీసిన తరువాత, గాయమును రక్తము లేకుండునట్లు చేసి, అగ్ని-ఘృత-మధుల నుపయోగించి; స్వేదనము జేసి, అగ్నిచే దాహకకర్మ నొనరింపవలెను. అటు పిదప, ఘృతము, తేనెలచే తర్పణముజేసి, వ్రణబంధనము చేయవలెను. రోగికి ఆచరింపదగు ఆహార-విహారాదులను ఆదేశింపవలెను.

సిరా స్నాయువులందు లగ్నమైయుండు శల్యములను శలాకాగ్రముచే కదిలించి వెలికి తీయవలెను. శల్యము హృదయగతమైయుండి, ఉద్వేగమును పొందియున్న రోగికి శీత జలాదులచే ఉపశాంతి గలిగించి శల్యమును తీసివేయవలెను.

ఏ మార్గమున శల్యము శరీరమున ప్రవేశించెనో, ఆ మార్గమున దానిని వెలువరించ వీలు లేకున్నచో, వేరు మార్గమున దానిని వెడలింపవలెను.

### అస్థు లందలి శల్యములను తీయు ఉపాయము

**మూలము :** అస్థివివర ప్రణష్టమస్థివిదష్టం వావగృహ్య పద్భ్యాం పురుషం యన్త్రేణా పకర్షేత్ । అశక్యమేవం వా బలవద్భిః సుగృహీతస్య యన్త్రేణ గ్రాహయిత్వా శల్య వారంగం ప్రతిభుజ్య వా ధనుర్గుణై రేకతో బద్ధ్వాన్యతశ్చ పఞ్చాంగ్యా సు సంయతస్యాశ్వస్య వక్త్రకటకే బధ్నీయాత్ । అథైన మేవం కశ్యా తాడ యేద్యథోన్నమయఞ్ఛిరో వేగేన శల్యముద్ధరతి ।

ప్రతిపదార్థము : అస్థివివర ప్రణష్టం = అస్థుల రంధ్రములందు నిగూఢమైయున్న (శల్యమును), అస్థివిదష్టం - వా = అస్థులలో ఇరుకుకొనియున్న దానిని గాని (లాగుటకు), పురుషం = రోగిని, పద్భ్యాం = పాదములతో, అవగృహ్య = బిగించి పట్టుకొని, యంత్రేణ = యంత్రముతో, అపకర్షేత్ = లాగివేయవలెను, ఏవం = ఈ విధముగా, అశక్యం = సాధ్యము గాని దానిని, బలవద్భిః = బలవంతులగు పురుషులచేత, సంగృహీతస్య = బాగుగా (కదల కుండ) పట్టుకొనబడిన రోగియొక్క (శల్యమును), యన్త్రేణ = యంత్రముచేత (లాగివేయవలెను), వా = లేక, శల్య - వారంగం = శల్యముయొక్క కొనను, ప్రతిభుజ్య = కొద్దిగా వంచి, ఏకతః = ఒకవైపున, ధనుర్గుణైః = విల్లుయొక్క నారితో, బద్ధ్వా = బంధించి, అన్యతః - చ = మరియొకవైపునను, పంచాంగ్యా = పంచాంగీ బంధముచే, సు సంయు తస్య = బాగుగాకట్టబడిన, అశ్వస్య = గుఱ్ఱముయొక్క, వక్త్రకటకే = కళ్ళెమున, బధ్నీ యాత్ = బంధించవలెను. అథ = అటుతరువాత, ఏనం = ఈ గుఱ్ఱమును, యథా =

ఏవిధమున, వేగేన = వేగముతో, శిరః - ఉన్నమయన్ = తలను పైకెత్తుచు, శల్యం - ఉద్ధరతి = శల్యమును పెకలించునో, ఏవం = ఈవిధముగా, కశ్యా = కొరడాతో, తాడయేత్ = కొట్టవలెను.

తాత్పర్యము : అస్థుల రంధ్రములలోనికి లోతుగా దిగియుండు శల్యములను యంత్రముచే తీయవలెను. అట్లు వీలుకానిచో బలవంతులగు పురుషులచే రోగిని గట్టిగా పట్టుకొనునట్లు జేసి, యంత్రముతో లాగివేయవలెను. లేక శల్యపు కొనను వింటి నారితో కట్టి, మరియొకవైపు పంచాంగీ బంధముచే బాగుగా కట్టబడియుండు గుఱ్ఱముయొక్క నోటి కళ్లెములో ఆ విల్లుత్రాటిని కట్టి, ఆగుఱ్ఱము తలను పైకెత్తుకొని బలముచే శల్యమును పెకలికచుటకుగాను, దానిని కొరడాచే కొట్టవలెను.

## మరి యొక ఉపాయము

మూలము : దృఢాం వా వృక్షశాఖామవనమ్య తస్యాం పూర్వవత్ బద్ధ్వోద్ధరేత్ । దుర్బల వారంగం తు కుశాభిర్బద్ధ్వా।

ప్రతి పదార్థము : వా = లేక, దృఢాం = బలమైన, వృక్షశాఖాం = చెట్టుకొమ్మను, అవనమ్య = వంచి, తస్యాం = ఆ శల్యమును, పూర్వవత్ = పై జెప్పిన రీతిని, బద్ధ్వా = బంధించి, ఉద్ధరేత్ = పెకలించవలెను, దుర్బల-వారంగం-తు = బలహీనమగు వారంగం గల శల్యమునైతే, కుశాభిః = త్రాడు మొదలగువానిచే, బద్ధ్వా = కట్టి, (ఉద్ధరేత్ = పెకలించవలెను).

తాత్పర్యము : లేక ఆ శల్యమును ఒకవైపున పై జెప్పిన రీతిగను, మరియొక వైపున దృఢమగు వృక్షశాఖను వంచి దానికి కట్టవలెను. వృక్షశాఖ పైకి లేవగానే శల్యము పెకలింపబడునట్లు చేయవలెను. శల్యవారంగము దుర్బలముగా నున్నచో దానిని త్రాడు మొదలగువానిచే కట్టి పెకలించవలెను.

## భిన్న స్థితులందు శల్యములను వెలికిదీయు నుపాయములు

మూలము : శ్వయథుగ్రస్తవారఙ్గముత్పీడ్య శ్వయథుమ్ । అదేశోత్తుణ్డితమశ్మముద్గర ప్రహారేణ విచాల్య యథామార్గమేవ । కర్ణవత్తు యన్త్రేణ విమృదితకర్ణం కృత్వా నాడియన్త్రేణవా బహుముఖేన యథాస్వముప సంగృహ్య శలాకాయన్త్రేణానేన వా పూర్వవదాహరేత్ । అనులోమమకర్ణమనల్ప వ్రణముఖమయస్కాన్తేన పక్వాశయగతం విరేచనేన । వాతవిణ్మూత్ర గర్భసఙ్గం ప్రవాహణేన । దుష్టవాత విషస్తన్యాస్యవిషాణాది చూషణేన । కణ్ఠస్రోతోగతే శల్యే బిసానంసక్తం శల్యం సూత్రం కణ్ఠేప్రవేశయేత్ । అథతద్గృహీతం విజ్ఞాయ శల్యం సమమేవ సూత్రం బిసం చాక్షిపేత్ । బిసాభావే మృణాలేష్వయమేవ విధిః । జాతుషే తు కణ్ఠసక్తే కణ్ఠే నాడీం ప్రవేశయేత్తథాచాగ్నితప్తాం సూక్ష్మముఖీం శలాకాం । అథ తాం గృహీతశల్యాం శీతాభిరద్భిః పరిషిచ్య స్థిరీభూతా మాహరేత్ । అజాతుషేఽప్యేవమేవ తప్తాం జతుమధూచ్ఛిష్టాన్యతరప్రదిగ్ధాం శలాకామ్ । మత్స్యకణ్టకమన్యద్వా తాదృగస్థిశల్యం కణ్ఠేఽవలగ్నం సూత్రేణ సూత్రప్లోతేన వా వేష్టిత యాఽఙ్గుళ్యాఽపహరేత్ । అథవా కేశోన్డుకం దృఢదీర్ఘసూత్రబద్ధం ద్రవోప

హితం పాయయేద్వామయేచ్చ। వమతశ్చ శల్యైకదేశసక్తం సూత్రం సహసైవాక్షిపేత్ । మృదునా వా దన్తధకూర్చవసానాఖహరేత్ । ప్రణతో వా ప్రణుదేత్ । బాలోణ్ణే విలగ్నే తద్వత్కణ్టకమ్ । క్షతకణ్ఠశ్చ త్రిఫలాచూర్ణం మధుఘృతసితోపేతమనుకణ్ఠయన్ లిహ్యాత్ ।

ప్రతి పదార్థము : శ్వయథుగ్రస్త వారంగం=వాపుతో గూడిన వారంగమును, శ్వయథుమ్-ఉత్పీడ్య=వాపును ఒత్తి, పిండి (పైకి లాగివేయవలెను), ఆదేశోత్తుణ్ణితం=ఆ ప్రదేశమంతటితో గూడ పైకుబికియుండునట్టి శల్యమును, అశ్మ-ముద్గర-ప్రహారేణ=రాయి, ముద్గరముయొక్క దెబ్బతో, విచాల్య=కదిలించి, యథామార్గం-ఏవ=ప్రవేశించిన మార్గమునుండియే (తీయవలెను).

కర్ణవత్-తు=కర్ణిక (తీరము) గలిగిన శల్యమునైతే, యన్త్రేణ=యంత్రముతో, విమృదితకర్ణం=కర్ణికను మర్దించిన దానినిగా, కృత్వా=చేసి, నాడీయన్త్రేణ వా=నాడీయంత్రముచేగాని (తీసివేయవలెను), బహుముఖేన=నానాముఖములుగల నాడీయంత్రముతో, యథాస్వం=శల్యముఖముల ననుసరించి, ఉపసంగృహ్య=దగ్గరగా బిగియబట్టి, అనేన=ఈ, శలాకాయన్త్రేణ వా=శలాకా యంత్రముతోగాని, అహరేత్=లాగివేయవలెను.

అనులోమకర్ణం=అనులోమముగా నున్న కర్ణములు గల, అనల్పవ్రణం=పెద్ద వ్రణము గలిగినట్టి (శల్యమును), అయస్కాంతేన=అయస్కాంత లోహముతో (లాగివేయవలెను).

పక్వాశయగతం=పక్వాశయమునందున్న (శల్యమును), విరేచనే=విరేచనకర్మచేత (వెడలించవలెను).

వాత - విట్ - మూత్ర - గర్భ - సంగం=వాయువు, పురీషము, మూత్రము, గర్భాశయముల యందు చిక్కుకున్న శల్యమును, ప్రవాహణేన=ముక్కించి (వెడలింపవలెను).

దుష్టవాత విషస్తన్యాని=దుష్టమగు వాయువు, విషరూపముననున్న శల్యమును, ఆస్య - విషాణాది - చూషణేన=నోరు కొమ్ము మొదలగు వానిచే పీల్చుటచేత (వెడలింపవలెను).

కణ్ఠస్రోతోగతే శల్యే=కంఠస్రోతస్సున ప్రవేశించియున్న శల్య విషయమున, బిసాసంసక్తం=తామరతూడుతో గూడియున్న, శల్య - సూత్రం=శల్యమును కట్టు సూత్రమును, కణ్ఠే=కంఠమున, ప్రవేశయేత్=ప్రవేశింప జేయవలెను, అథ=అటుతరువాత, తత్ - గృహీతం=దానిచేపట్టుబడిన, శల్యం=శల్యమును, విజ్ఞాయ తెలిసికొని, సూత్రం=దారమును, బి సం - చ=తామర తూడునున్నూ, సమమేవ=ఒక్కసారే, ఆక్షిపేత్=లాగివేయవలెను, బిసాభావే=బిసములేని పక్షమున, మృణాళేషు=తామరతూండ్లయందు, అయం - ఏవ=ఇదియే, విధిః=విధానము.

జాతుషే=లక్క శల్యము, కంఠసక్తే - తు=కంఠమున తగిలియున్నపుడైతే,

కంఠే = కంఠమునందు, నాడీం = నాడీయంత్రమును, ప్రవేశయేత్ = ప్రవేశపెట్టవలెను, తథా = అట్లే, అగ్నితప్తాం = అగ్నిచే కాల్చబడినదియు, సూక్ష్మముఖీం = సూక్ష్మమగు ముఖముగలదియు నగు, శలాకాంచ = శలాకనున్నూ (ప్రవేశపెట్టవలెను), అథ = అటు తరువాత, గృహీతశల్యాం = పట్టుకొనిన శల్యముగల, తాం = ఆశలాకను, శీతాభిః-అద్భిః = చల్లని నీళ్ళతో, పరిషిచ్య = చిలుకరించి, స్థిరీభూతాం = కదలకుండ ఉండునట్టిదానిని, (శల్యమును), ఆహరేత్ = లాగివేయవలెను.

అజాతుషే - అపి = లక్క కంటె వేరగు శల్యమునందును, ఏవం - ఏవ = ఈవిధముననే, తప్తాం = కాచినదియు, జతు - మధూచ్ఛిష్ట - అన్యతర = లక్క, తేనెమైనములలో ఒకదానిచే, ప్రదిగ్ధాం = పూయబడిన, శలాకాం = శలాకాను (ప్రవేశింపజేసి శల్యమును లాగివేయవలెను).

మత్స్యకణ్టకం = చేపముల్లు, తాదృక్ = అటువంటి, అన్యత్ - వా = మరొకటిగాని యైన, కణ్ఠే - అవలగ్నం = కంఠమున చిక్కుకున్న, అస్థిశల్యం = అస్థిరూపశల్యమును, సూత్రేణ = దారముచేగాని, సూత్రప్లోతేన - వా = సన్నని దారపువస్త్రముతోగాని, వేష్టితయా-అఙ్గుళ్యా = చుట్టబడినవ్రేలిచేత, అపహరేత్ = లాగివేయవలెను, అథవా = అట్లుగానిచో, దృఢ-దీర్ఘసూత్రబద్ధం = దృఢమగు పొడవైన దారముతో చుట్టబడినదియు, ద్రవోపహితం = ద్రవముతో కలిపినదియు అగు, కేశ - ఉందుకం = వెండ్రుకల చెండును, పాయయేత్ = త్రాగించవలెను, వామయేత్ - చ = కక్కించవలెను గూడ, వమతః = కక్కుచున్నవాని యొక్క, శల్యైకదేశసక్తం = శల్యముయొక్క భాగమున తగులుకొనియున్న, సూత్రం = సూత్రమును, సహసా ఏవ = వెంటనే, ఆక్షిపేత్ = లాగివేయవలెను, మృదునా = మెత్తనిదగు, దన్తకూర్చేన = పలుదోముకుంచెతో, అభిహరేత్ = లాగివేయవలెను, ప్రణతః వా = వంగియున్నపుడుగాని, ప్రణుదేత్ = తీసివేయవలెను, బాలోద్దే = వెండ్రుకల ఉండలో, విలగ్నే = చిక్కుకొనియున్న, కణ్టకం = ముల్లును, తద్వత్ = అట్లే (లాగివేయవలెను).

క్షతకణ్ఠః చ = గొంతు అభిఘాతమునొంది వుండైయున్నచో, మధు - ఘృత - సితోపేతం = తేనె, నేయి, పంచదారలతో గూడిన, త్రిఫలాచూర్ణం = త్రిఫలా చూర్ణమును, అనుకణ్ఠయన్ = కంఠమున నిదానముగా జారునట్లు, లిహ్యాత్ = నాకవలెను.

తాత్పర్యము : వాపుతోగూడియున్న శల్యమున, వాపునొత్తి శల్యమును వెడలించవలెను. శల్యముగల ప్రదేశమంతయు వాచి పైకుబికియున్నచో రాతిముద్గరముచే శల్యమును బాగుగా కదలించి, ప్రవేశమార్గము నుండియే వెడలింపవలెను. అంచులుగల శల్యముయొక్క అంచులను బాగుగా మర్దించి (వంచి) నాడీయంత్ర సహాయమున తీసివేయవలెను. బహుముఖములుగల శల్యములను గూడ ఇట్లే జేసి, బహుముఖ నాడీ యంత్రములచేతను, శలాకాయంత్రసహాయముననను తీసివేయవలెను. శల్యపు అంచులు అనులోమములుగానుండి, పెద్ద వ్రణములు ఉన్నపుడు అయస్కాంతముచే వెలిపరచవలెను.

పక్వాశయమందలి శల్యములను విరేచనకర్మ చేయుటచేతను, వాత - విణ్మూత్ర-గర్భములందు చిక్కుకున్నవానిని ప్రవాహణము చేతను (ముక్కించి, విరేచనము ద్వారాను) వెడలింపవలెను.

దుష్టవాయు, దుష్టస్తన్యములను శృంగము మొదలగువాని సహాయమున ఆచూషణముచే వెడలింపవలెను. కంఠమున శల్యము ఇరుకుకొనియున్నపుడు తామరతూండ్ల రంధ్రముల ద్వారా గట్టి సూత్రమును కంఠమున ప్రవేశింపజేసి, ఆ సూత్రము శల్యమును పట్టుకొనునట్లు జేసి, సూత్రమును, తామరతూడును ఒక్కసారిగా లాగి శల్యమును బయటికి లాగవలెను.

లక్క సంబంధమైన శల్యమైనచో సూక్ష్మమగు తప్తశలాకాను నాడీయంత్రముద్వారా కంఠమున ప్రవేశింపజేసి, వేడిగా నుండు శలాక శల్యమును కరచుకొనగానే, కదలకుండునట్లుగా చల్లని నీళ్ళను చల్లి, లాగివేయవలెను. లక్కగాక వేరగు వానియందును, ఇదే విధముగా తప్త శలాకకు లక్క, మైనము మొదలగువానిని పూసి శల్యమును అతుకుకొనునట్లు జేసి లాగివేయవలెను. చేపముల్లు మొదలగు అస్థి శల్యములైనచో, వ్రేలికి దారము, సన్ననిబట్ట మొదలగువానిని చుట్టుకొని తీయవలెను. లేక పొడవగు దారమునకు కట్టిన వెంద్రుకల ఉండను ద్రవయుక్తముగ త్రాగించి, కక్కించవలెను. అట్లు వాంతి యగునపుడు, లేదా వంగియున్నపుడు దారమును లాగుటచే శల్యమును వెడలించవలెను. మృదువగు దంతకూర్చముచే గూడ వెడలింపవచ్చును.

కంఠము అభిఘాతము నొంది పుండై యున్నచో, ఘృత-మధు-సితములతో త్రిఫలా చూర్ణమును నాకించవలెను.

*శశిలేఖ* : కంఠము పుండైనపుడు అవలేహ్యమును త్వరగా కాక నెమ్మదిగా ఇవ్వవలెను.

## నీటిలో మునిగిన వానికి చికిత్స

**మూలము** : అపాం పూర్ణం పురుషమవాక్ శిరసమవపీడయేద్ధునుయాద్వామయేచ్చ భస్మరాశౌ వా నిఖన్యాదాముఖాత్ । అన్యథాహ్యున్మార్గగాభి రద్భిరాధ్మానకాసశ్వాస పీనసేన్ద్రియోపఘాతజ్వరాదయః శ్లేష్మవికారా మృత్యుశ్చ । తత్రయథాస్వం ప్రతికుర్యాత్ ।

*ప్రతి పదార్థము* : అపాం = నీళ్ళచేత, పూర్ణం = (కడుపులో) నిండిన, పురుషం = పురుషుని, అవాక్-శిరసం = తలక్రిందులు చేసినవానిని, అవపీడయేత్ = (పొట్టను, వెన్నును) వత్తవలెను, ధునుయాత్ = కదలించవలెను, వామయేత్-చ = కక్కించవలెనుగూడ, వా = లేక, భస్మరాశౌ = బూడిదకుప్పలో, ఆముఖాత్ = ముఖమువరకు, నిఖన్యాత్ = పాతవలెను, అన్యథా = అట్లు గానిచో, ఉన్మార్గగాభిః = ఉన్మార్గమున పోవు, అద్భిః = నీటివలన, ఆధ్మాన-కాస-శ్వాస-పీనస-ఇన్ద్రియోపఘాత-జ్వరాదయః = ఆధ్మానము, కాసము, శ్వాస, పీనసము, ఇంద్రియములకు హాని, జ్వరము మొదలగు రోగములును, శ్లేష్మ-వికారాః = శ్లేష్మ వ్యాధులును, మృత్యుః-చ = మరణమునూ, (కలుగును), తత్ర = ఆ విషయమున, యథాస్వం = రోగానుసారముగా, ప్రతికుర్యాత్ = చికిత్స చేయవలెను.

తాత్పర్యము : నీటిలో మునుగుటచే ఉదరము మొదలగుచోట్ల నీటితో నిండిన పురుషుని తలక్రిందులుజేసి, పొట్టపైనను, వెన్నుపైనను ఒత్తవలెను. ఇంకను కదిలించుటచే

గూడను వమనము చేయించియు, ఆనీటిని వెడలింప వలెను. లేక భస్మరాసియందు కంఠము వరకు పాతవలెను. ఇట్లు చేయనిచో నీరు ఉన్మార్గమున ప్రవేశించుటచే అధ్మానము, శ్వాస కాసలు, పీనసము, ఇంద్రియహాని, జ్వరము, శ్లేష్మవికారములును తుదకు మరణమును సంభవించును. అట్టి స్థితియందు రోగానుసారము చికిత్స చేయవలెను.

**ఆహారరూప శల్యము; అక్షి, వర్త్మగత శల్యముల వెడలించు చికిత్సలు**

**మూలము :** గ్రాసశల్యం మమ్బునా ప్రవేశయేత్ స్కన్ధేవా ముష్టినాఽభిహన్యాత్। కణ్ఠస్థం శ్లేష్మాణ మన్నలవం వా ప్రథమనోత్కాశనైర్నిర్వమేత్ । సూక్ష్మమక్షిశల్యం లేఖనోపధమన బాలజల వస్త్ర జిహ్వాభిరపనయేత్ । తథా నిర్భుజ్యవర్త్మ వర్త్మగతమపనీయ చోష్ణాంబుబాష్పస్వేదం సమధుమధుక క్వాథేన సర్పిషా చ పరిషేకం కుర్యాత్ ।

*ప్రతి పదార్థము :* గ్రాసశల్యం = ఆహారరూపమైన శల్యమును, అబ్బునా = నీటిచేత, ప్రవేశయేత్ = ప్రవేశింపజేయవలెను. వా = లేక, స్కంధే = మూపుయందు, ముష్టినా = పిడికిలిచే, అభిహన్యాత్ = కొట్టవలెను.

కణ్ఠస్థం = కంఠమునందున్న, శ్లేష్మాణం = శ్లేష్మమునుగాని, అన్నలవం - వా = ఆహారపుతునకమును గాని; ప్రథమన = గట్టిగా ఊదుట, ఉత్కాశన = బయటికి వెడలించుట, అపకాశనైః = లోనికిపోవునట్లు చేయుట - వీనిచేతను; నిర్వమేత్ = కక్కించవలెను.

సూక్ష్మం = సూక్ష్మమగు; అక్షిశల్యం = కంటియందలి శల్యమును, లేఖన-ఉపధమన-బాల-జల-వస్త్ర, జిహ్వాభిః = లేఖనకర్మ, దగ్గరగా ఊదుట, వెంట్రుకలు; జలము, వస్త్రము, నాలుక-వీనిచేత; అపనయేత్ = తొలగించవలెను.

తథా = అట్లే; వర్త్మ - నిర్భుజ్య = కనురెప్పను విరిచి, వర్త్మగతం = రెప్పయందున్న శల్యమును, అపనీయ = తొలగించి, ఉష్ణాంబు బాష్పస్వేదం = వేడినీటి ఆవిరిచే స్వేదకర్మయు, స-మధు-మధుక-క్వాథేన = తేనెతో గూడిన మధూక కషాయముతోను, సర్పిషా-చ = నేతితోను, పరిషేకం = తడుపుటను, కుర్యాత్ = చేయవలెను.

తాత్పర్యము : ఆహారరూపమగు కంఠమున అడ్డుకొని యున్నపుడు, నీటిని త్రాగించుట చేతను, మూపుపై పిడికిలిచే కొట్టుట చేతను దానిని ఉదరము లోనికి ప్రవేశింపజేయవలెను. అట్లే, శ్లేష్మము, ఆహారపు తునకలు ఉన్నపుడు గట్టిగా ఊదుట బయటకు వెడలునట్లో, లోనికి పోవునట్లో, వమనము చేయించుట యో చేయవలెను.

కంటియందు సూక్ష్మశల్యములను లేఖనకర్మ, ఊదుట వలన, వెంట్రుకలు, జలము, వస్త్రము, నాలుక నుపయోగించుట, వీనిచే తొలగించవలెను. కనురెప్పలలోనుండు సూక్ష్మ శల్యములను దీయుటకు రెప్పలను విడిచి పై ఉపాయ - సాధనముల నుపయోగింపవలెను. తరువాత వేడినీటి ఆవిరిచే స్వేదకర్మయు, తేనెకలిపిన మధూకక్వాథముతోను నేతితోను పరిషేకమును చేయవలెను.

*శశిలేఖ :* 'ఉత్కాసనం' అనగా 'బహిరీరణం'-బయటకు వెడలించుట (కాంద్రించుట) 'అపకసనం' అనగా అంతరీరణం' లోనికి పోవునట్లు చేయుట.

### శల్యము దానియంతట అదే పడిపోవచ్చుననుట

**మూలము :** స్వయమపి చ శల్యమశ్రుక్షవథు కాసోద్గార మూత్రపురీషానిలైర్నయనాదిభ్యోఽఙ్గావయవేభ్యః పతతి ।

*ప్రతి పదార్థము :* శల్యం = శల్యము, స్వయం - అపి - చ = తనకు తానై గూడ, అశ్రు - క్షవథు - కాస - ఉద్గార - మూత్ర - పురీష - అనిలైః = కన్నీరు, తుమ్ము, దగ్గు, త్రేనుపు, మూత్రము, పురీషము, వాయువుల చేత, నయనాదిభ్యః = నేత్రము మొదలగు, అఙ్గ - అవయవేభ్యః = అంగ, అవయవముల నుండి, పతతి = పడిపోవును.

*తాత్పర్యము :* శరీరాంగముల నుండి ఒక్కొక్కసారి శల్యము, కన్నీరు - తుమ్ము - దగ్గు - త్రేనుపు, మూత్రము, పురీషము, వాయువు వెడలునపుడు తనంతటతానే పడిపోవచ్చును.

### చెవినుండి కీటమును వెడలించు విధము

**మూలము :** కీటే కర్ణస్రోతః ప్రవిష్టే తోదో గౌరవం భరభరాయణం చ భవతి । స్పన్దమానే చాభ్యధికం వేదనా । తత్ర సలవణేనామ్బునా మధుసక్తేన మద్యేన వా సుఖోష్ణేన పూరణమ్ । నిర్గతే చ కీటే తదుత్సర్జనమ్ । తత్రైవ తు మృతే పాకకోథక్లేదా భవన్తి । తేషు కర్ణస్రావోక్తం కుర్యాత్ప్రతినాహోక్తం చ । తోయపూర్ణం కర్ణం హస్తోన్మథితేన తైలామ్బునా పూరయేత్ పార్శ్వావనతం వా కృత్వా హస్తే నాహన్యాన్నాడ్యా వా చూషేదితి ।

*ప్రతి పదార్థము :* కీటే = కీటము, కర్ణస్రోతఃప్రవిష్టే = కర్ణస్రోతస్సు నందు ప్రవేశించి యుండగా, తోదః = నొప్పియు, గౌరవం = బరువుగా నుండుటయు, భరభరాయణం చ = భరభరమను ధ్వనియు, భవతి = కలుగును, స్పన్దమానే చ = కీటము కదలుచుండగానున్నూ, అభ్యధికం వేదనా = చాల ఎక్కువ బాధ (కలుగును).

తత్ర = అందు, స - లవణేన - అమ్బునా = ఉప్పు కలిపిన నీటితో, వా = లేక, మధు సక్తేన మద్యేన = తేనె కలిపిన మద్యముతో, సుఖోష్ణేన = నులి వెచ్చగా నుండు దానిచే, పూరణం = కర్ణమును నింపుట (చేయవలెను), కీటే చ = కీటమున్నూ, నిర్గతే = బయటకు వెడలినచో, తత్ - ఉత్సర్జనమ్ = దానిని తీసిపారవేయుట (చేయవలెను). తత్రైవ = అచటనే, మృతే - తు = చచ్చినచో, పాక - కోథ - క్లేదాః = పుండు అగుట, కుళ్లుట, తడిగానగుట, భవన్తి = కలుగును.

తేషు = వాని యందు, కర్ణస్రావే ఉక్తం = కర్ణస్రావరోగమున చెప్పబడిన, ప్రతీనాహే ఉక్తం చ = కర్ణప్రతీనాహ రోగమునన్నూ చెప్పబడిన చికిత్సలను, కుర్యాత్ = చేయవలెను, తోయ పూర్ణం - కర్ణం = నీటితో నిండిన చెవిని, హస్త - ఉన్మథితేన = చేతితో మథించబడిన, తైల - అమ్బునా = నూనె - నీటితో, పూరయేత్ = నింపవలెను, పార్శ్వ - అవనతం - కృత్వా = (చెవిని) ప్రక్కకు వంచిన దానినిగా జేసి, హస్తే = హస్తముచే, ఆహన్యాత్ = కొట్టవలెను, వా = లేక, నాడ్యా = నాడీ యంత్రముచే, చూషేత్ = పీల్చవలెను, ఇతి = ఈ విధముగా (చెప్పబడినది).

తాత్పర్యము : కీటకము చెవిలో ప్రవేశించి నపుడు తోదము, గౌరవము, భరభర మను ధ్వనియు కలుగును. చెవిలో అది కదలుచున్నచో అధికమైన బాధకలుగును. అప్పుడు సుఖోష్ణముగా నుండు ఉప్పునీటితోగాని, తేనె గలిపిన మద్యముతోగాని కర్ణ పూరణము చేయవలెను. కీటము బయటకు వెడలినచో దానిని తీసిపార వేయవలెను. కర్ణమందే చచ్చి యున్నచో పాక, కోథ, క్లేదములు కలుగును. అట్టి స్థితి యందు కర్ణస్రావ - కర్ణప్రతీనాహ రోగములందు చెప్పబడిన చికిత్సలను జేయనలెను. చెవియందు నీరు చేరియున్నచో, తైలము-ఉదకము చేతితో బాగుగా మథించి, చెవిలో పోసి, ప్రక్కకు వంచి వేసి చేతితో మెల్లగా చెవిపై కొట్టవలెను, లేక నాడీయంత్రము ద్వారా పీల్చి తీసివేయవలెను.

## వివిధములగు శల్యముల దీయు విధము

భవన్తి చాత్ర :

**మూలము :** జాతుషం హేమ రూప్యాది ధాతుజం చ చిరస్థితమ్ ।
ఊష్మణా ప్రాయశః శల్యం దేహజేన విలీయతే ॥
విషాణ వేణు దార్వస్థి దన్తవాలోపలాని తు ।
శల్యాని న విశీర్యన్తే శరీరే మృన్మయాని చ ॥
విషాణ వేణ్వయస్తాల దారు శల్యం చిరాదపి ।
ప్రాయో నిర్భుజ్యతే తద్ధి పచత్యాశు పలాసృజీ ॥

ప్రతి పదార్థము : అత్ర = ఇచట, (శ్లోకములు), భవన్తి చ = ఉన్నవి గూడ. జాతుషం = లక్కదియగు, హేమ - రూప్యాది ధాతుజం చ = బంగారము, వెండి మొదలగు ధాతువు లవియును అగు, చిరస్థితం = చాలకాలము దేహము నందున్నట్టి, శల్యం = శల్యము, ప్రాయశః = సామాన్యముగా, దేహజేన = శరీరమున కలిగిన, ఊష్మణా = వేడిచేత, విలీయతే = కరగిపోవును, విషాణ = కొమ్ము, వేణు = వెదురు, దారు = చెక్క, అస్థి = ఎముక, దన్త = దంతము, వాల = వెంట్రుక, ఉపలాని = రాళ్లు, మృన్మయాని చ = మట్టివియును అగు, శల్యానితు = శల్యములైతే, న - విశీరన్తే = నశించవు (కరగవు).

విషాణ = కొమ్ము, వేణు = వెదురు, అయస్ = ఇనుము, తాల = తాటిచెట్టు యొక్క, దారు = చెక్కది అగు, శల్యం = శల్యము, చిరాదపి = చాలకాలమైనను, ప్రాయః = సామాన్యముగా, నిర్భుజ్యతే = విరుగును, తత్ - హి = అట్టి శల్యమును, పల - అసృజీ = మాంసమును, రక్తమును, ఆశు = త్వరగా, పచతి = పాకముచేయును.

తాత్పర్యము : లక్కవి, బంగరు, వెండి మొదలగు ధాతుజములును అగు శల్యములు చాలకాలము దేహము నందున్నచో శరీరపు వేడికి సామాన్యముగా కరిగి పోవును. కొమ్ము, వెదురు, మ్రాను, అస్థి, దంత శల్యములు, వెంట్రుకలు, రాళ్లను, మృణ్మయ శల్యములును అట్లు కరగవు. కొమ్ము, వెదురు, ఇనుము, తాటిమాను శల్యములు చాలకాలమైనను శరీరమున విరిగి మాంస రక్తములను పాకము నొందించును.

*శశిలేఖ :* 'భవన్తి చాత్ర' అనునది తన్త్రరీతి.

మాంసమున జేరిన శల్యమును దీయు విధము; శరీరమే శల్యమనుట

మూలము : శల్యే మాంసావగాఢే చే త్సదేశో న విదహ్యతే ।
తత స్త న్మర్దన స్వేదశుద్ధి కర్షణ బృంహణైః ॥
తీక్ష్ణోపనాహపానా న్న ఘన శస్త్ర పదాఙ్కనైః ।
పాచయిత్వా హరేచ్ఛల్యం పాటనైషణపీడనైః ॥
శల్యప్రదేశయన్త్రాణా మవేక్ష్య బహురూపతామ్ ।
తైస్తై రుపాయై ర్మతిమాన్ శల్యం విద్యా త్తథా హరేత్ ॥
వ్రణే ప్రసన్నే ప్రాన్తేషు నాతి స్పర్శాసహిష్ణుషు ।
అల్పే శోఫేచ తాపేచ నిః శల్యమితి నిర్దిశేత్ ॥
కాయ ఏవ పరం శల్యం నిజదోషమలావిలః ।
శల్యశల్యం శరాద్యం తు విశేషా త్తేన చిన్త్యతే ॥

ప్రతి పదార్థము : శల్యే = శల్యము, మాంసావగాఢేచేత్ = మాంసమున లోతుగా దిగియున్నచో, సః = ఆ ప్రదేశము, న - విదహ్యతే = మరుటకలుగదు, తతః = అందుచేతను, మర్దన - స్వేద - శుద్ధి - కర్షణ - బృంహణైః = మర్దనము, స్వేదకర్మ, శుద్ధికర్మలు, కృశింపజేయుట, బృంహణము - వీనిచేత, తీక్ష్ణ - ఉపనాహ - పాన - అన్న = తీక్ష్ణములగు పట్టులు, పానములు, ఆహారములచేతను, ఘన - శస్త్ర - పదాంకనైః = లోతగుశస్త్రపుగాట్ల తోనూ, పాచయిత్వా = పక్వముగావించి, పాటన - ఏషణ - పీడనైః = పాటనక్రియ, ఏషణక్రియపీడనక్రియలచేత, శల్యం = శల్యమును, ఆహరేత్ = లాగివేయవలెను.

శల్య - ప్రదేశ - యన్త్రాణాం = శల్యములు, అవి ప్రవేశించు ప్రదేశములు, యంత్రములు - వీని యొక్క, బహురూపతామ్ = అనేక రూపములుగా నుండుటను, అవేక్ష్య = గమనించి, మతిమాన్ = బుద్ధిమంతుడగు వైద్యుడు, తైః తైః ఉపాయైః = ఆయా ఉపాయముల చేత, శల్యం = శల్యమును, యథా - విద్యాత్ = ఎట్లు తెలిసి కొనునో, తథా - ఆహరేత్ = అట్లేలాగివేయవలెను.

వ్రణే = వ్రణము, ప్రసన్నే = ప్రశాంతముగా నున్నచో, ప్రాంతేషు = వ్రణ పరిసర ప్రదేశములందు, న - అతిస్పర్శా - అసహిష్ణుషు = అతి స్పర్శను సహించ లేకున్నచో, శోఫే - తాపే - చ - అల్పే = వాపు, మంటయు స్వల్పముగా నున్నచో, నిః శల్యం = (అట్టి దానిని) శల్యము లేని దానినిగా, నిర్దిశేత్ = చెప్పవలెను.

నిజ - దోష - మలావిలః = తన దోషముల చేత, మలముల చేత కలుషితమైన, కాయః - ఏవ = దేహమే, పరం = ముఖ్యమైన, శల్యం = శల్యము, శరాద్యం - తు = శరము మొదలగునవైతే, శల్య - శల్యం = శల్యమునకు శల్యమైనది, తేన = ఆకారణము చేత, విశేషాత్ = విశేషముగా, కాయః = దేహము, చిన్త్యతే = (సంరక్షణకై) విచారింపబడు చున్నది.

తాత్పర్యము : మాంసమున శల్యము లోతుగా యున్నపుడు అచట మంటయుండదు. అందుచే మర్దన, స్వేదన, శోధన, కర్షణ, బృంహణ; తీక్ష్ణ ఉపనాహ, పానీయ, ఆహారాదులను; లోతగు శస్త్ర పదాంకములచేతను వ్రణమును పాచనము జేసి, పాటన, ఏషణ, పీడన క్రియలచే శల్యమును వెడలింపవలెను.

శల్యములు, అవి శరీరమున ప్రవేశించు ప్రదేశములు, వానిని వెలువరించు యంత్రములును బహురూపములుగా నుండును. అందుచే వైద్యుడు ఆయా ఉపాయములచే శల్యముల దెలిసికొని వివిధోపాయములచే వానిని వెలువరించవలెను.

వ్రణముగల ప్రదేశము ప్రసన్నముగా నుండుట, పరిసరమున అతిస్పర్శను సహించలేకుండుట, శోఫ, తాపము స్వల్పముగా నుండుట — వీని వలన అట శల్యము లేదని గ్రహించవలెను.

తనయందలి దోషములు మలములతో గూడి కలుషితమైన కాయమే ముఖ్యమగు శల్యము (అనగా అట్లు బాధించును). ఈ శల్యమునకు శరాదులు శల్యములగును. ఆ కారణమున శరీరము సంరక్షణకై చింతింపబడుచున్నది.

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## ముప్పది ఎనిమిదవ అధ్యాయము

**మూలము : అథాతః శస్త్రకర్మవిధిం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ।**
**ఇతిహస్మాహు రాత్రేయాదయో మహర్షయః ॥**

*ప్రతి పదార్థము :* అథ = శల్యాహరణ విధి యను అధ్యాయమును వివరించిన తరువాత, శస్త్ర కర్మ - విధింనామ అధ్యాయం = శస్త్ర కర్మ విధియను అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము, ఇతిహ = ఈ విధముగానే, ఆత్రేయాదయః మహర్షయః = ఆత్రేయుడు మొదలగు మహర్షులు, ఆహుః స్మ = చెప్పియుండిరి.

**తాత్పర్యము :** శల్యాహరణ విధి అను అధ్యాయమును వివరించిన తరువాత, శస్త్ర కర్మ విధియను అధ్యాయమును, ఆత్రేయాది మహర్షులు తెలిపిన విధముగా వివరించెదము.

### శస్త్ర కర్మ ప్రయోగము

**మూలము : ద్వి విధే హి వ్యాధావుపాయాపేక్షే నిజ ఆగన్తౌ వా భేషజ విషయా తీతే శస్త్ర కర్మ ప్రయుజ్యతే ।**

*ప్రతి పదార్థము :* నిజే = నిజరూపమైనదియు, ఆగన్తౌ - వా = ఆగంతు రూపమైనది గాని అయినా, ద్వివిధే = రెండు విధములైన, వ్యాధౌ - ఉపాయాపేక్షే = వ్యాధుల చికిత్సోపాయములను అపేక్షించనవై, భేషజ విషయా తీతే = ఔషధ చికిత్సా విషయమునకు మించినవిగా, శస్త్ర కర్మ = శస్త్ర కర్మ ప్రయుజ్యతే = ప్రయోగింపబడును

తాత్పర్యము : నిజ - ఆంగతుకములగు రెండువిధములైన వ్యాధులందును, ఔషధ చికిత్సకు అతీతమైనపుడు శస్త్ర కర్మ చేయబడును.

### శోఫను శమింపజేయుటకు శస్త్ర కర్మకు పూర్వము ఆచరించదగు విధానము

**మూలము : స చామయః ప్రాయేణ శ్వయథు పూర్వకో భవత్యతః శోఫావస్థస్యైవ వాత పిత్త కఫ - రక్త సంసర్గ సన్ని పాతాత్మకతా ముపలక్ష్య పాకభయాదృ ఖాస్వ ముపవాన లేప సేకాసృఙ్మోక్ష - కషాయ మృతపాన శోధనాని ప్రయుఞ్జీత ।**

*ప్రతి పదార్థము :* స - ఆమయః - చ = ఆ వ్యాధియు, ప్రాయశః = సామాన్యముగా, శ్వయథు పూర్వకః = వాపుతో గూడినదియై, భవతి = అగును, అతః = అందుచేత, శోఫావస్థస్య - ఏవ = శోఫావస్థయందే యున్న ఆవ్యాధి యొక్క, వాత - పిత్త - కఫ - రక్త-సంసర్గ-సన్నిపాతాత్మకతాం = వాత, పిత్త, కఫ, రక్తదోషముల యొక్కయు, వీనిలో రెండింటి కలయికలను, అన్ని దోషముల యొక్క కలయికను, ఉపలక్ష్య = గమనించి, పాక

భయాత్ = శోఫ పక్వమగునను భయము-వలన, యథాస్వర = వ్యాధిననుసరించి, ఉపవాస = లంఘనము, లేప = లేపముచేయుట, సేక = తడుపుట, అస్రుక్ - మోక్ష = రక్తమోక్షణము, కషాయ - ఘృతపాన = కషాయములను, ఔషధ సిద్ధ ఘృతములను త్రాగించుట, శోధనాని = దోషములను బయటకు వెడలించుట - వీనిని, ప్రయుఞ్జీత = ప్రయోగించవలెను.

తాత్పర్యము : సామాన్యముగా శస్త్రకర్మకు సంబంధించిన వ్యాధులు శోథతో గూడినవియై ఉండును. అందువలన శోఫావస్థయందే ఆ వ్యాధి యొక్క దోషమును - వాత, పిత్త కఫ, రక్త, సంసర్గ సన్నిపాతములను - గుర్తెరింగి, ఆ శోఫ పక్వముగాక పూర్వమే, లంఘనము, లేపములు, సేకములు, రక్త మోక్షణము, - కషాయ - ఘృతపానములను, శోధన క్రియలను తగురీతిన ప్రయోగించవలెను.

శశిలేఖ : శోఫ పక్వమగుటకు ఉపవాసాదులను సేవింప జేయవలెను.

## విలయన – ఉపనాహ చికిత్సలు

**మూలము : తథాప్యను శామ్యతి ప్రవిలయనమ్ । అవిలీయమానే చోపనాహనమ్ ।**

*ప్రతి పదార్థము :* తథా - అపి = అట్లైనను, అనుప శామ్యతి (సతి) = ఉపశమించకున్నచో, ప్రవిలయ - నమ్ = (ముందు చెప్పబోవు) విలయన చికిత్స (చేయదగినది), అవిలీయమానే చ = విలయనము కాకున్నపుడును(కరుగకున్నచో), ఉపనాహనమ్ = ఉపనాహ చికిత్స (చేయదగినది).

**తాత్పర్యము :** పై జెప్పిన ఉపాయములచే శోఫ శమించకున్నచో, ముందు చెప్పబోవు విలయన చికిత్స చేయవలెను. దాని వలనను కరుగకున్నచో ఉపనాహ చికిత్స చేయవలెను.

## ఆమ శోఫ లక్షణములు

**మూలము : తత్ర శోఫస్యామలక్షణ మల్పతా చాల్పోష్మరుజత్వం త్వక్ సవర్ణతా స్థైర్యంచ ।**

*ప్రతి పదార్థము :* తత్ర = అచట, అల్పతా = వాపుచిన్నదిగా నుండుట, అల్ప - ఊష్మ - రుజత్వం = శోఫపై వెచ్చదనము, బాధ కొద్దిగా-యుండుట, త్వక్ - సవర్ణతా = చర్మముతో సమానమగు వర్ణము, స్థైర్యం చ = స్థిరత్వము గలిగి యుండుటయు (ఇవి), ఆమ శోఫస్య లక్షణం = ఆమావస్థ యందున్న శోఫయొక్క లక్షణములు.

తాత్పర్యము : స్వల్పమగు శోఫ యుండుట, శోఫపై స్వల్పమగు వేడి, స్వల్పబాధ, శోఫ వివర్ణతను బొందక చర్మపు వర్ణమే కలిగియుండుట, స్థిరముగానుండుట - అనునవి శోఫ ఆమావస్థయందున్నపుడుండు లక్షణములు.

వి. వ్యా. : స్థిరత్వమనగా మెల్లగా వృద్ధి నొందుట యని హేమాద్రి వివరణ.

## పచ్యమాన శోఫ లక్షణములు

మూలము : పచ్యమానస్తు వివర్ణో వస్తిరి వాతతః । సంరమ్భ శూలరాగ దాహోషారు చి తృష్ణా జ్వరా - రతి స్పర్శా సహత్వా నిద్రతా సమన్వితో విష్యన్దయతి సర్పిః శోష యతి ప్రదేహం సర్షపకల్క-ప్రలిప్త ఇవ చిమి చిమాయతే పిపీలికాభిరివ సంసర్ప్యతే పీడ్యత ఇవ పాణినా ఘట్యత ఇవాంగుల్యా తాడ్యత ఇవ దణ్డేన తుద్యత ఇవ సూచీభిర్భిద్యత ఇవ శక్తిభిశ్ఛిద్యత ఇవ శస్త్రేణ దశ్యత ఇవ వృశ్చికైర్దహ్యత ఇవాగ్నిక్షారాభ్యాం మథ్యత ఇవోల్ముకేన ।

ప్రతిపదార్థము : పచ్యమానః-తు = (శోఫః) పక్వమగుచున్నపుడైతే, వివర్ణః = రంగు మార్పు జెంది, వస్తిః ఇవ = వస్తివలె, ఆతతః = విశాలమై యుండును. సంరమ్భ = వేగము, శూల = నొప్పి, రాగ = ఎరుపు వర్ణము, దాహ = మంట, ఓష = కొంచెము మంట, అరుచి = నోటికి రుచి లేకుండుట, తృష్ణా = దప్పిక, జ్వర = జ్వరము, అరతిః = అనిచ్ఛ (తోచ కుండుట), స్పర్శ - అసహత్వం = స్పర్శను సహింపలేకుండుట, అనిద్రతా = నిద్ర లేమి, (వీనితో) సమన్వితా = కూడినదై, సర్పిః = నేతిని, విష్యన్దయతి = కరిగించును, ప్రదేహం = (పైనవేసిన) పట్టును, శోషయతి = ఎండింపజేయును, సర్షప కల్క - ఉపలిప్తః ఇవ = ఆవాల పట్టు వేసిన దానివలె, చిమిచిమాయతే = చిమచిమ లాడును; పిపీలికాభిః - ఇవ = చీమలచేతవలె, సంసర్ప్యతే = ప్రాకబడినట్లు ఉండును, పాణినా = అరచేతితో, పీడ్యత ఇవ = పిసికినట్లు ఉండును, అంగుల్యా = చేతివ్రేళ్లచే, ఘట్యత - ఇవ = కలియబెట్టినట్లు ఉండును, దణ్డేన = కర్రతో, తాడ్యత - ఇవ = కొట్టబడి నట్లుండును. సూచీభిః = సూదులచే, తుద్యత - ఇవ = గ్రుచ్చినట్లుండును. శక్తిభిః = శక్తిగల వానిచే, భిద్యత - ఇవ = పగులగొట్ట బడినట్లుండును, శస్త్రేణ = శస్త్రము చేత, ఛిద్యత - ఇవ = ఛేదించినట్లుండును, వృశ్చికైః = తేళ్లచేత, దశ్యత ఇవ = కరచినట్లుండును, అగ్ని-క్షారాభ్యాం = నిప్పు-క్షారములచేత, దహ్యత ఇవ = కాల్చినట్లుండును, ఉల్ముకేన = కొరివితో, మథ్యత - ఇవ = మథించినట్లుండును.

తాత్పర్యము : శోఫ పక్వమగు చున్నపుడు వివర్ణత నొంది, వస్తివలె విశాలముగా నగును. ఇంకను సంరంభము, నొప్పి, దాహము, వేడి, ఎరుపు, మంటగలిగి, అరుచి, దప్పిక, జ్వరము, అరతి, స్పర్శా సహత్వము, నిద్రలేమి వీనితోకూడినదై, దానిపై నుంచిన పేరిన నేతిని కరిగించునదిగాను యుండును. దానిపై వేయబడిన పట్టును ఎండింపజేయును. ఆవాలపట్టు వేసినట్లుగా చిమచిమలాడుట, చీమలు ప్రాకినట్లు, అరచేతితో పిసికినట్లు, వ్రేళ్ళతో కలియ బెట్టినట్లు, కర్రతో కొట్టినట్లు, సూదులచే గ్రుచ్చినట్లు, శక్తివంతములగు వానిచే పగుల గొట్టి నట్లు, శస్త్రములచే ఛేదించినట్లు, తేళ్లు కుట్టినట్లు, అగ్ని - క్షారములచే దహించినట్లు, కొరివితో మథించినట్లు బాధలు కలుగును.

వి. వ్యా : "వస్తిరివాతతః" యను దానికి వాయువుతో నిండిన వస్తివలె యుండుట యనియు; సంరంభము అనగా చెప్పుటకు వీలుగాక, అనుభవింపబడు అనేక రూపములుగల అంగ పీడన విఘట్టన, భేదన, దంశనాది బాధలు కలుగుట యనియు అరుణ దత్తుడు వివ రించెను. సంరంభము అనగా త్వరగా వృద్ధి పొందుట అని హేమాద్రి వ్యాఖ్య.

## పక్వమైన శోఫ లక్షణములు

**మూలము :** పక్వే తు గతవేగత్వం ప్రమ్లానతా త్వక్శిథిలతా వలీప్రాదుర్భావః పాణ్డుతా మధ్యోన్నతతాంగుళ్యవపీడితమున్తే ప్రత్యున్నమనం వస్తావివోదకస్య పూయస్య సఞ్చరణం కణ్డూః సంరమ్భశూలాద్యుపశమశ్చ ॥

ప్రతి పదార్థము : పక్వేతు = శోఫ పక్వమైనపుడైతే, గతవేగత్వం = వేగమును కోల్పోవుట, ప్రమ్లానతా = వాడిపోవుట, త్వక్ శిథిలతా = చర్మము యొక్క బిగువు సడలుట, వలీప్రాదుర్భావః = ముడుతలు ఏర్పడుట, పాణ్డుతా = తెల్లగానగుట, మధ్యోన్నతా = నడుమ ఎత్తుగా నుండుట, అంగుళ్యవ పీడితమున్తే = వ్రేలితో వత్తి విడిచినపుడు, ప్రత్యున్నమనమ్ = గుంట మరల నిండి ఎత్తుగా నగుట, వస్తౌ = వస్తియందు, ఉదకస్య - ఇవ = నీటి యొక్కవలె, సఞ్చరణం = కదలుట, కణ్డూః = దురద, సంరంభశూలాది - ఉపశమనః - చ = పూర్వము చెప్పిన సంరంభము, శూలమొదలైనవని శమించుటయు (లక్షణములు అగును).

తాత్పర్యము : పక్వమైన శోఫయందు వేగము కోల్పోవుట, వాడుట, చర్మశైథిల్యము, ముడుతలుపడుట, తెల్లగానగుట, నడుమ ఎత్తుగా నుండుట, వ్రేలితో వత్తి విడిచినచో గుంటపడి తిరిగి నిండుట, సంచిలో నీరు కదలినట్లు కదలిక, దురద, కలుగుట, పూర్వము చెప్పిన సంరంభాది బాధలు శమించుట అను లక్షణములు కలుగును.

## శోఫయందు త్రిదోషముల సంబంధము

**మూలము :** శ్లో॥ శూలం నర్తేఽనిలాద్దాహః పిత్తాచ్ఛోపః కఫోదయాత్ ।
రాగో రక్తాచ్చపాకః స్యాదతో దోషైః స శోణితైః ॥

ప్రతి పదార్థము : అనిలాత్ ఋతే = వాతములేక, శూలమ్ = శూల, న = లేదు, పిత్తాత్ ఋతే = పిత్తములేక, దాహః = మంట, న = లేదు, కఫోదయాత్ ఋతే - కఫము యొక్క పుట్టుక లేక, శోఫః = వాపు, న = లేదు, రక్తాత్ ఋతే = రక్తములేక, రాగః = ఎరుపు వర్ణము, న = లేదు, అతః = అందువలన, స - శోణితైః - దోషైః = రక్తముతో గూడిన త్రిదోషములచేత, పాకః = పాకము (అగును).

తాత్పర్యము : వాత దోషము లేక శూలయు, పిత్త దోషము లేక మంటయు కఫ దోషములేక వాపును, రక్త దోషములేక ఎరుపు రంగును శోఫ యందు కలుగ నేరవు. కనుక త్రిదోషములును రక్తముతో గూడి శోఫను కలిగించి పక్వమగునట్లు చేయును.

## పక్వానంతర లక్షణము

**మూలము :** పాకేఽతివృత్తే సుషిరస్తనుత్వగ్దోష భక్షితః ।
వలీభిరాచితః శ్యావః శీర్యమాణ తనూరుహః ॥

ప్రతి పదార్థము : పాకే = వ్రణపాకము, అతివృతే = జరిగిపోగా, సుషిరః = రంధ్రము, తను త్వక్‌దోష - భక్షితః = పలుచని చర్మము, చీముచే దూషితమైనదై, వలీభిః -

ఆచితః = ముడుతలతో గూడి, శ్యావః = శ్యామవర్ణము నొంది, తనూరుహాః = వెంట్రుకలు, శీర్యమాణ = నశించిపడిపోవుచున్నదిగా (అగును).

తాత్పర్యము : పక్వానంతరము శోఫ శమించుచుండగా లోపల శూన్యోదరము గలదై (లొట్టపడి), చీమువలన దూషితము కాగా చర్మము పలుచనై ముడుతలు పడి, శ్యామ వర్ణమును బొంది, అచట గల వెంట్రుకలు నశించిపోవును.

శశిలేఖ : ఇచట దోషమనగా పూయము.

## రక్తపాకము యొక్క లక్షణము

**మూలము : కఫజేషు తు శోఫేషు కేషుచిత్ గమ్భీరత్వాద్రక్తమేవ విపచ్యతే । తతశ్చా స్పష్టం పక్వలిఙ్గం భవతి । యత్ర హి త్వక్ సావర్ణ్య శీతశోఫతాల్పరుజతాశ్మవచ్చ ఘనతా । న తత్ర మోహ ముపేయాత్ । తం రక్తపాక మిత్యాచక్షతే ।**

ప్రతి పదార్థము : కేషుచిత్ = కొన్ని, కఫజేషు-శోఫేషు-తు = కఫజశోఫలందైతే, గమ్భీరత్వాత్ = లోతుగా నుండుటచేత, రక్తం-ఏవ = రక్తమే, విపచ్యతే = పక్వము చేయ బడును, తతః = ఆ తరువాత, అస్పష్టం = స్పష్టముగా నుండునట్టి, పక్వలిఙ్గం = పక్వమగు లక్షణము, భవతి = కలుగును, యత్ర-హి = దేనియందైతే, త్వక్-సావర్ణ్యే = చర్మముతో సమానమగు వర్ణము, శీతశోఫతా = చల్లని స్పర్శ గలిగిన వాపు, అల్పరుజతా = స్వల్పమగు బాధ, అశ్మవత్ ఘనతా = రాయివలె గట్టిదనము (కలుగునో అట్టిది అపక్వలక్షణములు గలది యని యర్థము), తత్ర = అచట, మోహం = మోహమును (భ్రాంతిని), న ఉపేయాత్ = పొందరాదు, తం = దానిని, రక్తపాకం ఇతి = రక్తపాకము అని, ఆచక్షతే = చెప్పుదురు.

తాత్పర్యము : కొన్ని కఫజశోఫలందు గంభీరత్వము వలన రక్తమే పక్వమై అస్పష్టమైన పక్వ లక్షణములను కలిగియుండును. వానియందు చర్మముతో సమానమగు వర్ణము, స్పర్శకు చల్లగా నుండునట్టి వాపు, స్వల్పమైన బాధ, రాయివలె గట్టిగా నుండుట- ఈ లక్షణములు కలుగును. అట్టి స్థితియందు దానిని అపక్వశోఫగా భ్రమించరాదు. దానిని రక్తపాకమని చెప్పుదురు.

## ఔషధోపయోగముచే శోఫ చికిత్సచేయ దగిన వారు

**మూలము : అథైనం సమ్యక్పక్వమవధార్య భీరువృద్ధబాలదుర్బల క్లీబ క్షీణ గర్భిణీ విషార్దితశస్త్రక్షామేషు పాకోద్ధతదోషేషు చ పిణ్డితేషు సన్ధిమర్మాశ్రితేష్వల్పేషు వా శోఫేషు తీక్ష్ణద్రవ్యైర్దారణం కుర్వీత । ఇతరేషు తు పాటనమ్ ।**

ప్రతి పదార్థము : అథ = ఇక, ఏనం = దీనిని, సమ్యక్-పక్వం = బాగుగా పక్వ మగుటను, అవధార్య = గమనించి, భీరు = పిరికివారు, వృద్ధ = ముసలివారు, బాల = బాలురు, దుర్బల = దుర్బలులు, క్లీబ = నపుంసకులు, క్షీణ = ధాతువులు క్షీణించినవారు, గర్భిణీ = గర్భిణులు, విషార్దిత = విష పీడితులు, శస్త్రక్షామేషు = శస్త్రకర్మచే క్షీణించినవారి యందు, పాకోద్ధత దోషేషుచ = పాకము వలన ప్రకోపించిన దోషములు గలవారియందును, వా = లేక, పిణ్డితేషు = గడ్డ కట్టినవారి యందును, సన్ధి-మర్మ-ఆశ్రితేషు = సంధి, మర్మలను

ఆశ్రయించి జనించిన వానియందును, అల్పేషు = స్వల్పములగు, శోఫేషు = శోఫలందు, తీక్ష్ణ-ఉష్ణ-ద్రవ్యైః = తీక్ష్ణములును, ఉష్ణములును అగు ద్రవ్యములచే, దారణం = చీల్చుటను, కుర్వీత = చేయవలెను. ఇతరేషు-తు = మిగిలినవానియందైతే, పాటనమ్ = దీర్ఘచ్ఛేదనమును (చేయవలెను).

**తాత్పర్యము :** శోఫ బాగుగా పక్వమగుటను గమనించి, భీరువులు, వృద్ధులు, బాలురు, దుర్బలులు, నపుంసకులు, క్షీణులు, గర్భిణులు, విషపీడితులు, శస్త్రకర్మ చేయబడి క్షీణించినవారు, పాకము నొందుటచే ప్రకోపించిన దోషములు గలవారికిని, సంధి-మర్మ ప్రదేశములందు జనించిన శోఫలందు, స్వల్పమగు శోఫలందును, తీక్ష్ణ-ఉష్ణ ద్రవ్యముల నుపయోగించి, ఆ శోథను పగులునట్లు చేయవలెను. శస్త్రకర్మ చేయరాదు. ఇతరములగు వాని యందు పాటనము చేయవలెను

*శశిలేఖ :* పాటనం అనగా దీర్ఘచ్ఛేదము.

**వి. వ్యా :** గుగ్గులు, అతసీ, గోదంత, స్వర్ణక్షీరీ, కపోతవిష్టము, క్షారౌషధములు, క్షారములు అనునవి పక్వశోఫను దారణము చేయు ద్రవ్యములు.

దారణం అనగా క్షారాదుల నుపయోగించి ద్వారమును కలిగించుట యని హేమాద్రి వివరణ.

## అపక్వ శోఫయందు పాటనము చేయుటచే కలుగు ఉపద్రవములు

**మూలము : ఆమపాటనే సిరాస్నాయు వ్యాపాదనం శోణితాతిప్రవృత్తిర్వేదనాతి వృద్ధి రవదరణం క్షత విసర్పో వా స్యాత్ ।**

*ప్రతి పదార్థము :* ఆమపాటనే = అపక్వశోథను ఛేదించినచో, సిరా-స్నాయు-వ్యాపాదనం = సిరలు, స్నాయువులు తెగుట, శోణిత-అతిప్రవృత్తిః = అధిక రక్తస్రావము, వేదన—అభివృద్ధిః = నొప్పి ఎక్కువగుట, అవదరణం = చర్మము తెగిపోవుట, క్షత విసర్పః-వా = క్షతజ విసర్ప వ్యాధిగాని, స్యాత్ = కలుగును.

తాత్పర్యము : అపక్వశోథయందు పాటనము చేసినచో సిరలు, స్నాయువులకు హాని, అతిరక్తస్రావము, బాధ ఎక్కువగుట, చర్మము తెగుట లేక క్షతజ విసర్పము కలుగును.

## పక్వశోఫయందు చీమును పూర్తిగా వెడలించవలెనుట

**మూలము : భవన్తి చాత్ర.**

**శ్లో॥ తిష్ఠన్ పక్వే పునః పూయః సిరాస్నాయ్వసృగామిషమ్ ।**
**వివృద్ధో దహతి క్షిప్రం తృణోలపమివానలః ॥**

*ప్రతి పదార్థము :* పక్వే = పక్వమగు శోఫ యందు, తిష్ఠన్ = ఉండుచూ, పూయః = చీము, పునః = మరల, వివృద్ధః = వృద్ధిచెందినదై, అనలః = అగ్ని, తృణ-ఉపలమ్-ఇవ = గడ్డిపొదనువలె, సిరా = సిరలను, స్నాయు = స్నాయువులను, అసృక్ = రక్తమును, ఆమిషమ్ = మాంసమును, క్షిప్రం = త్వరగా, దహతి = దహింపజేయును.

తాత్పర్యము : పక్వమగు శోఫయందు పూయము శేషించియున్నచో మరల వృద్ధి నొంది, అగ్ని గడ్డిని కాల్చునట్లు, సిరా-స్నాయు-రక్త-మాంసములను త్వరగా దహింప జేయును. (కావున పూయమును నిశ్శేషముగా వెడలింపవలెనని భావము.).

శోఫలందు పక్వ అపక్వభేదమును తెలియలేని వైద్యుల నిరసన

**మూలము : శ్లో॥** యశ్ఛినత్త్యామమజ్ఞానాద్యశ్చ పక్వముపేక్షతే ।
శ్వపచావివ విజ్ఞేయౌ తావనిశ్చితకారిణౌ ॥

*ప్రతి పదార్థము :* యః = ఎవడు, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, ఆమమ్ = అపక్వ శోధను, ఛినత్తి = ఛేదించునో, యఃచ = ఎవడూన్నూ, పక్వమ్ = పక్వమైనశోఫను, ఉపేక్షేతే = (చికిత్స చేయక) ఉపేక్షించునో, అనిశ్చితకారిణౌ-తౌ = నిశ్చయ జ్ఞానము లేక చికిత్సకు పూనుకొను వారిరువురును, శ్వపచౌ - ఇవ = కుక్కమాంసమును తినువారి (చండాలుర) వలె, విజ్ఞేయౌ = తెలియదగినవారు.

**తాత్పర్యము :** అపక్వమగు శోఫను అజ్ఞానముచే ఛేదించు వైద్యుడును, పక్వశోఫను అజ్ఞానముచే చికిత్స చేయక ఉపేక్షించు వైద్యుడును, నిశ్చయజ్ఞానము లేక చికిత్సకు పూనుకొను వీరిరువును చండాలురతో సమానము (కువైద్యులనుట).

శస్త్ర కర్మకు పూర్వకర్మ

**మూలము :** ప్రాక్ శస్త్రాద్భోజయేదిష్టం తీక్ష్ణం మద్యం చ పాయయేత్ ।
న మూర్ఛత్యన్నసంయోగాన్మత్తః శస్త్రం న బుధ్యతే ॥

*ప్రతి పదార్థము :* శస్త్రాత్-ప్రాక్ = శస్త్రకర్మకు పూర్వము, ఇష్టం = (రోగికి) ఇష్టమైన ఆహారమును, భోజయేత్ = తినిపించవలెను. తీక్ష్ణం-మద్యం-చ = తీక్ష్ణమగు మద్యమునున్నూ, పాయయేత్ = త్రాగించవలెను, (ఎందువలననగా) అన్నసంయోగాత్ = అన్నము తిన్నందుచేత, న - మూర్ఛతి = మూర్ఛనొందదు. మత్తః = మత్తుచెందినవాడై, శస్త్రం = శస్త్రచికిత్సవలన కలుగు బాధను, న - బుధ్యతే = తెలియదు.

**తాత్పర్యము :** శస్త్రకర్మచేయుటకు ముందు రోగిచే ఇష్టమైన ఆహారమును భుజింప జేసి, తీక్ష్ణమగు మద్యమును ద్రావింపవలెను. ఆహారము భుజించుటచే మూర్ఛనొందదు. మద్యమువలన కలుగు మత్తుచే శస్త్రకర్మవలన కలుగు బాధ తెలియకుండును.

**మూలము : అన్యత్ర మూఢగర్భోదరాశ్మరీ ముఖరోగేభ్యః ।**

*ప్రతి పదార్థము :* (ఏతత్ = ఇది) మూఢగర్భ = మూఢగర్భము (ప్రసవ సమయ మందు గలుగు వికారము), ఉదర = ఉదరవ్యాధి, అశ్మరీ = అశ్మరీవ్యాధి, ముఖరోగేభ్యః = నోటియందు గలుగు వ్యాధులకంటె, అన్యత్ర = వేరగు రోగములందే (చేయవలెను).

తాత్పర్యము : పై జెప్పిన శస్త్రకర్మకు పూర్వభోజనము మూఢగర్భ, ఉదర, అశ్మరీ, ముఖరోగములందు తప్ప, మిగిలిన రోగములందు మాత్రమే చేయవలెను.

**వి. వ్యా :** మూఢగర్భాదులందు భోజనము తరువాత శస్త్రకర్మ చేసినచో భోజనాదుల వలన కష్టము లేక మరణము కలుగవచ్చును. వాతప్రకోపమును కలుగును.

## శస్త్రప్రయోగ విధి

**మూలము :** అథోపహృత యన్త్రశస్త్రక్షారాగ్ని జామ్బవౌష్ఠపిచుప్లోతపత్రసూత్రచర్మపట్ట మధుస్నేహకషాయాలేపకల్కసేకోదకకుమ్భ శీతోష్ణదకకటాహవ్యజనాదివ్రణోపయోగి సర్వోపకరణమాస్తృత శయనీయ ముపస్థిత స్థిరస్నేహబలవదవలమ్బక పురుషమిష్టేఽహని ముహూర్తే చ దధ్యాక్షతాన్నపానరుగ్మ రత్నార్చితవిప్రం ప్రణతేష్టదేవతం కృతమఙ్గలం భుక్తవన్తమాతురం ప్రాఙ్ముఖముపవేశ్య సంవేశ్య వా యన్త్రయిత్వా ప్రత్యఙ్ముఖో వైద్యో మర్మసిరాస్నాయు సన్ధ్యస్థిధమనీః పరిహరన్ననులోమనం శస్త్రం నిదధ్యాదాపూయదర్శనాత్ సకృదేవాహరేచ్ఛస్త్రమాశు చ।

*ప్రతి పదార్థము :* అథ = అటుతరువాత, ఉపహృత = సమీపమునకు తెచ్చుకొన్న, యన్త్ర = యన్త్రము, శస్త్ర = శస్త్రము, క్షార = క్షారము, అగ్ని = అగ్ని, జామ్బవౌష్ఠ = జామ్బవౌష్ఠయంత్రము, పిచు = దూది, ప్లోత = వస్త్రము, పత్ర = ఆకులు, సూత్ర = దారము, పట్ట = పట్టము, మధు = తేనె, స్నేహ = తైలాది స్నేహములు, కషాయ = కషాయములు, ఆలేప = లేపన ద్రవ్యములు, కల్క = ఔషధకల్కములు, సేక = సేకద్రవములు, ఉదకకుమ్భ = నీటికుండలు, శీత — ఉష్ణోదకకటాహ = చల్లని, వేడి నీరుగల గోలెములు, వ్యజన-ఆది = విసనకర్ర మొదలగు, వ్రణోపయోగి = వ్రణ చికిత్సయందుపయుక్తములగు, సర్వ-ఉపకరణం = అన్ని ఉపకరణములు కలిగినవానిని, ఆస్తృతశయనీయమ్ = పరచిన పడక కలవానిని, స్నేహబలవదవలమ్బకం పురుషం = స్నేహితులై, బలవంతులును, రోగిని గట్టిగా పట్టుకొనదగు పురుషులు, ఉపస్థిత = సమీపమున ఉన్నవానిని, ఇష్టే = అనుకూలమైన, అహని = దినమున, ముహూర్తేచ = నియమించబడిన ముహూర్తముననూ, దధి-అక్షత-అన్న-పాన-రుక్మ-రత్న-అర్చిత-విప్రం = పెరుగు, అక్షతలు, అన్నము పానములు, బంగారము, రత్నములచే పూజింపబడిన బ్రాహ్మణులు గలవానిని, ప్రణతేష్ట దేవతం = నమస్కరించిన ఇష్టదేవతలు గలవానిని, భుక్తవన్తం = భుజించినవాడును అయిన, ఆతురం = రోగిని, ప్రాఙ్ముఖం = తూర్పుముఖము గలవానినిగా, ఉపవేశ్య = కూర్చుండజేసి, సంవేశ్య-చ = పరుండబెట్టియు, యన్త్రయిత్వా = బంధించి, వైద్యః = వైద్యుడు, ప్రత్యఙ్ముఖః = పడమటివైపు ముఖము గలవాడై, మర్మ-సిరా-స్నాయు-సంధి-అస్థి-ధమనీః = మర్మ ప్రదేశములను, సిరలను, సంధులను, అస్థులను, ధమనులను, పరిహరన్ = విడుచుచు; ఆపూయదర్శనాత్ = చీము కనుబడువరకు, శస్త్రం = శస్త్రమును, అనులోమం = రోమముల క్రమమున, నిదధ్యాత్ = ఉంచవలెను, (ప్రయోగించవలెను), సకృత్-ఏవ = ఒక్కమారు, ఆశు = వెంటనే, ఆహరేత్ = శస్త్రమును తీసివేయవలెను.

తాత్పర్యము : యంత్ర, శస్త్ర, క్షార, అగ్ని, జామ్బవౌష్ఠములు, దూది, వస్త్రము, పత్రములు, దారము, పట్ట, తేనె, స్నేహద్రవ్యములు, కషాయములు, ఆలేపన-సేకద్రవ్యములు, కల్కములు, నీటికుండలు, శీతల-ఉష్ణోదకము, విసనకర్ర మొదలగు వ్రణచికిత్సా పరికరములును, పరచిన శయ్య కలిగినవానిని, పట్టుకొనుటకు-ఇష్టులై బలవంతులగు పురుషులు గలవానిని- అనుకూలముగ నుండు దినమున, నియమించిన ముహూర్తమున విప్రులను దధి, అక్షత, అన్నపాన, హేమ రత్నాదులచే అర్చింపజేసి, ఇష్టదేవతలకు నమస్కరింపజేసి, భుజింపజేసి, రోగిని తూర్పుదెసకు ముఖముండునట్లు కూర్చుండజేయవలెను,

లేక పరుండజేయవలెను. వైద్యుడు అతనికి ఎదురుగా, పడమటిదిక్కు ముఖము గలవాడై, మర్మ - సిరా - స్నాయు - సంధి - అస్థి - ధమనులను వర్జించి, రోమముల క్రమముననే శస్త్రమును ప్రయోగించి చీము కనిపించువరకు లోతుగా కోయవలెను. కోయు నపుడు వెంటనే ఒక్కమారుగా కోయవలెను. శస్త్రమును ఒక్కమారుగా తీయవలెను.

వి. వ్యా. : జాంబవౌష్ఠము అనగా జంబుఫల సదృశ ముఖాగ్ర కృష్ణపాషాణ రచిత వర్తి శస్త్రములను ప్రతిలోమముగా - అనగా రోమముల కెదురుగా - ప్రయోగించినచో, శస్త్ర ధార ప్రతిహతమై కుణ్ఠితమగును ఇంకను బాధయు కలిగించును.

అనులోమం - అనగా యథాక్రమం (శాస్త్రమున చెప్పిన రీతిన) అని హారాణచంద్రుడు వ్యాఖ్యానించెను.

చీము కనుబడిన తరువాత కోయుట నిషేధమని చక్రదత్తుని వివిరణ.

## శస్త్రపదప్రమాణ నిర్ణయము — వ్రణములోతు దెలియు నుపాయము

**మూలము :** మహత్స్వపి చ పాకేషు ద్వ్యఙ్గులం శస్త్రపదముక్తం । ద్వ్యఙ్గులాన్తరం త్ర్యఙ్గులాన్తరం వాభిసమీక్ష్య వివృతే ప్రదేశే వామప్రదేశిన్యైషయిత్వా నాతి వివృతే గమ్భీరమాంసలేచైషణ్యా । విపరీతే కరీరాదినాలేనాతి సంవృతే సూకర వాలేన వా ।

*ప్రతి పదార్థము :* మహత్సు - పాకేషు - అపి - చ = పెద్దవియగు పక్వశోఫ లందును, శస్త్రపదం - శస్త్రస్థానము (అనగా శస్త్రముతో కోయదగినలోతు), ద్వ్యఙ్గులం - ఉక్తం - రెండంగుళములుగా చెప్పబడినది, వివృతే - ప్రదేశే = తెరువబడిన ప్రదేశమున, వామప్రదేశిన్యా = ఎడమ చూపుడు వ్రేలితో, ద్వ్యఙ్గులాన్తరం = రెండంగుళములలోతో, త్ర్యఙ్గులాన్తరం వా = మూడంగుళములలోతో, అభిసమీక్ష్య = బాగుగా కనుగొని (శస్త్రపదము చేయవలెను), గమ్భీరే = లోతైనది, మాంసలే-చ = మాంసమధికముగా గల ప్రదేశ మందును, ఏషణ్యా = ఏషణీయను శస్త్రముతో (లోతు తెలిసికొనవలెను), విపరీతే = (పై జెప్పినదానికి) వ్యతిరేకముగా నున్నచోట, కరీరాది నాళేన = వెదురు మొలకల నాళములచేతను, అతిసంవృతే = ఎక్కువ ముడుచుకొన్నచోట, సూకర వాలేన = సూకరవాల శస్త్రముతోను (లోతు తెలిసికొనవలెను).

**తాత్పర్యము :** పెద్దవిగానుండు శోఫలందు రెండంగుళముల శస్త్రపదమే చేయ వలెనని చెప్పబడినది. శస్త్రముచే చీల్చిన తరువాత వ్రణపు లోతు రెండంగుళములో- మూడంగుళములో ఎడమచేతి చూపుడువ్రేలితో తెలిసికొని శస్త్రపదము చేయవలెను. ఎక్కువ లోతుగా నున్నను, లేక మాంసమధికముగా నున్నచోట్లను ఏషణి నుపయోగించి వ్రణపు లోతును తెలిసికొనవలెను. వెదురు మొలకల నాళములచేతను, సూకరవాల శస్త్రసహాయము నను గూడ వ్రణపులోతును తెలియవలెను.

## వ్రణమును ఛేదించు విధము

**మూలము : శ్లో॥** యతోగతాం గతిం విద్యాదుత్సఙ్గో యత్రయత్ర చ ।
తత్రతత్ర వ్రణం కుర్యాత్ సువిభక్తం నిరాశయమ్ ॥
ఆయతం చ విశాలం చ యథాదోషో న తిష్ఠతి ।

ప్రతి పదార్థము : యతః = ఎటనుండి, గతాం = లోనికి పోయినదానినిగా, గతిం = శలాకగతిని, విద్యాత్ = తెలియునో, యత్ర-యత్ర-చ = ఎచట ఎచటను, ఉత్సఙ్గః = వాపు ఉండునో, తత్ర-తత్ర = అచట అచట, సువిభక్తం = బాగుగా విభజించి (హీన-అతి దోషములు లేకుండునట్లు), నిరాశయం = చీము లేని విధముగా, వ్రణం = వ్రణమును, కుర్యాత్ = చేయవలెను.

యథా = ఏ విధమున, దోషః = దోషము, న-తిష్ఠతి = ఉండదో, తథా = అవిధమున, ఆయతం-చ = పొడవైనదిగను, విశాలం-చ = వెడల్పైనదిగను (వ్రణమును చేయవలెను).

తాత్పర్యము : శలాకగతిని గమనించి ఆ మార్గమున, ఎచట వాపు ఉండునో అచట చీము లేకుండునట్లు, దోషము వెడలునంత పొడవు-వెడల్పుగ వ్రణమును చేయవలెను.

వి. వ్యా. : సు విభక్తము అనగా ఉత్సంగాది దోషరహితము అని చక్రదత్తుని వివరణ. నిరాశ్రయం అనగా అంగుళీ అవమర్దనము చేత ఉన్మీలితాశేష పూయాశ్రయము అని హారాణచంద్రుని వ్యాఖ్య.

ఉత్సంగము :–"ఉత్-ఊర్ధ్వం పూయస్య సంగ ఉత్సంగ" అని కొందరి వ్యాఖ్య. "పూయస్ఖలన స్థానమ్" అని హేమాద్రి వ్యాఖ్య.

## శస్త్ర వైద్యుని కుండవలసిన గుణములు

మూలము : శౌర్యమాశుక్రియా తీక్ష్ణం శస్త్రమస్వేదవేపథూ ।
అసమ్మోహశ్చ వైద్యస్య శస్త్రకర్మణి శస్యతే ॥

ప్రతి పదార్థము : శస్త్రకర్మణి = శస్త్రకర్మ చేయుటయందు, వైద్యస్య = వైద్యునకు, శౌర్యం = శూరత్వము (భయము లేకుండుట), ఆశుక్రియా = శీఘ్ర శస్త్ర ప్రయోగ చాతుర్యము, తీక్ష్ణం-శస్త్రం = వాడియగు శస్త్రము, అస్వేద-వేపథూ = చెమట, వణుకు లేకుండుట, అ-సంమోహః-చ = మోహము లేకుండుట, శస్యతే = ప్రశంసించబడును.

తాత్పర్యము : శస్త్రకర్మ చేయుటయందు వైద్యుడు శౌర్యమును గల్గియుండుట, శీఘ్రముగా శస్త్రప్రయోగము చేయగలుగు నైపుణ్యమును గలిగియుండుటయు, చెమట-వణుకు లేనివాడుగ నుండుట, సునిశితముగ శస్త్రకర్మచేయుట యనునవి ప్రశస్తమైన లక్షణములు.

## తిర్యక్ ఛేదనము చేయవలసిన ప్రదేశము – శస్త్ర కర్మానంతర విధి

మూలము : తత్ర భ్రూగణ్డ లలాటాక్షి కూటౌష్ఠదన్తవేష్టమన్యాకక్షాజత్రు కక్షా కుక్షి వఙ్క్షణేషు తిర్యక్ఛేద ఇష్టః । అన్యత్ర తు సిరాస్నాయూపఘాతోఽతివేదనా చిరాద్ వ్రణసంరోహో మాంసకన్దీ చ తిర్యక్ఛేదాద్భవన్తి । తతః శస్త్రమవచార్య శీతాభి రద్భిరాతురమాశ్వాస్య సమన్తాత్పరిపీడ్యాఙ్గుళ్యా వ్రణమభిప్రక్షాళ్య కషాయేణ వ్రణాత్ప్లోతేనామ్భోఽపనీయ వేదనా రక్షోఘ్నైర్గుగ్గుల్వగురు సర్జరసావచా గౌర సర్షపహింగులవణ నిమ్బపత్రైః సఘృతైర్వ్రణం ధూపయిత్వా యథాస్వమౌషధేన మధుఘృత తిలకల్కైశ్చ దిగ్ధాం వర్తిం ప్రణిధాయకల్కేన పూరయిత్వా నాతి

ఘృష్టయవసక్తుభిర్ఘృతాక్తైర్భాజనాన్తేఒమ్భసా దక్షిణాఙ్గులీభిః సుమృదితైరవచ్ఛాద్య ఘనాం కవలికాం దత్త్వా సవ్య దక్షిణాన్యతరపార్శ్వే మృదుమనావిద్ధమసంకుచిత మృజుపట్టం నివేశ్య బధ్నీయాత్ ।

శ్లో॥ వాతశ్లేష్మోద్భవాంస్తత్ర ద్విస్త్రిర్వా వేష్టయేద్వ్రణాన్ ।
సకృదేవ పరిక్షిప్య పిత్తరక్తాభిఘాతజాన్ ॥

ప్రతి పదార్థము : తత్ర = అచట, భ్రూ = కనుబొమలు, గణ్డ = చెక్కిళ్ళు, లలాట = నుదురు, అక్షికూట = నేత్రగోళములు, ఓష్ఠ = పెదవులు, దన్తవేష్ట = చిగుళ్ళు, మన్యా = మన్యాసిరలు, కణ్ఠ = కంఠము, జత్రు = మెడకొంకులు, కక్షా = చంకలు, కుక్షి = కడుపు, వంక్షణేషు = గజ్జలు-వీనియందు, తిర్యక్-ఛేదః = అడ్డముగా కోయుట, ఇష్టః = కోరబడినది (చేయదగినది), అన్యత్ర-తు = ఇతరములైన చోట్లనైతే, తిర్యక్-ఛేదాత్ = అడ్డముగా కోయుటచేత, సిరాస్నాయూపఘాతః = సిరలు, స్నాయువులు తెగుట, అతి వేదనా = మిక్కుటమగు బాధ, చిరాత్-వ్రణ సంరోహః = చాలకాలమునకు వ్రణము మొలచుట, మాంసస్కన్దీ-చ = మాంసము గడ్డవలె పెరుగుటయును, భవన్తి = కలుగును, తతః = ఆ కారణమున, శస్త్రం = శస్త్రమును, అవచార్య = క్రిందుగా కోయుచు (శస్త్రచికిత్స చేసి), శీతాభిః-అద్భిః = చల్లని నీళ్ళచే, ఆతురం = రోగిని, ఆశ్వాస్య = ఊరడింపజేసి, వ్రణమ్ = వ్రణమును, సమన్తాత్ = అంతట, అఙ్గుళ్యా = వ్రేలిచేత, ప్రతిపీడ్య = ఎదురుగా ఒత్తి, కషాయేణ = కషాయముతో, అభిప్రక్షాళ్య = కడిగి, వ్రణాత్ = వ్రణమునుండి, ప్లోతేన = వస్త్రముతో, అంభః = నీటిని, అపనీయ = తుడిచి, వేదనా-రక్షోఘ్నైః = వేదనా హరములును, రక్షోఘ్నములును అగు, సమృతైః = నేతితో గూడినవియగు, గుగ్గులు-అగురు-సర్జరసా-వచా-గౌరసర్షప-హింగు-లవణ-నిమ్బపత్త్రైః = గుగ్గులు, అగురు, సర్జరసము, వస, తెల్లావాలు, ఇంగువ, సైంధవలవణము, వేపాకులచే, వ్రణం = వ్రణమును, ధూప యిత్వా = ధూపము వేయించి, యథాస్వం = తగినట్టి, ఔషధేన = ఔషధముచేత, మధు-ఘృత-తిలకల్కైః-చ = తేనె, నేయి, నువ్వుల కల్కము చేతను, దిగ్ధాం-వర్తిం = పూయ బడిన వత్తిని, ప్రణిధాయ = చేసి, కల్కేన = కల్కముచే, పూరయిత్వా = నింపి, భాజనాన్తే = పాత్రలో, అంభసా = నీటిచేత, దక్షిణాఙ్గులీభిః = కుడిచేతి వ్రేళ్ళతో, సుమృదితైః = బాగుగా మర్దింపబడినవియైన, న-అతిఘృష్ట-యవ-సక్తుభిః = కొద్దిగా వేయించబడిన యవలపిండిని, అవచ్ఛాద్య = నింపి, ఘనాం = దట్టమగు, కవలికాం = బహువస్త్రముల పుటములతో ఏర్పరచిన కవలికను, దత్త్వా = ఇచ్చి, సవ్య-దక్షిణ-అన్యతర-పార్శ్వే = కుడి-ఎడమలలో ఏదైన ఒకప్రక్కన, మృదుం = మెత్తనిదియు, అనావిద్ధం = గ్రుచ్చుకొననిదియు, అసంకుచితం = ముడుతలు పడనిదియు అగు, ఋజుపట్టం = చక్కని పొడవగు వస్త్రమును, నివేశ్య = ఉంచి, బధ్నీయాత్ = బంధింపవలెను.

తత్ర = అందు, పిత్త-రక్త-అభిఘాతజాన్ = పిత్త-రక్త దోషములవలన, అభి ఘాతము వలన కలిగిన, వ్రణాన్ = వ్రణములను, సకృత్-ఏవ = ఒక వరుసనే, పరిక్షిప్య = ఉంచి, వేష్టయేత్ = చుట్టి కట్టవలెను. వాత-శ్లేష్మ-ఉద్భవాన్ = వాతము, శ్లేష్మమువలన కలిగిన, వ్రణాన్ = వ్రణములను, ద్విః = రెండు, వా = లేక, త్రిః = మూడు (వరుసలుగా), పరిక్షిప్య = (వస్త్రమును) ఉంచి, వేష్టయేత్ = చుట్టికట్టవలెను.

తాత్పర్యము : కనుబొమలు, చెక్కిళ్లు, నుదురు, అక్షికూటము, పెదవులు, పంటి చిగుళ్లు, మన్యలు, కంఠము, జత్రువులు, చంకలు, డొక్కలు, గజ్జలు— వీనియందు అడ్డముగా ఛేదింపవలెను. ఇవి గాక ఇతర ప్రదేశములందు అడ్డముగా ఛేదించినచో సిరాస్నాయువులు తెగుట, మిక్కిలి బాధ, వ్రణము తిరిగి జనించుట, మాంసము గడ్డవలె పెరుగుట యనునవి కలుగును.

శస్త్రచికిత్స చేసిన తరువాత, చల్లని నీళ్ళచే రోగి నూరడించి, వ్రణమును వ్రేలితో బాగుగ ఒత్తి, కషాయముచే కడిగి, వస్త్రముచే తుడిచి, వేదనాహరములు, రక్షోఘ్నములును అగు గుగ్గులు, అగురు, సర్జరసము, వచా, తెల్ల ఆవాలు, ఇంగువ, సైంధవలవణము, వేపాకులచే ధూపము వేయించవలెను. తరువాత తగిన ఔషధములచేతను, మధు-ఘృత—తిల కల్కములచేతను పూయబడిన వర్తిని తయారుచేసి కల్కముతోనింపి, వ్రణమునందుంచి- ఒక పాత్రలో కొద్దిగా వేయించబడిన యవలసక్తును నీళ్ళతో బాగుగా పిసికి-దానిని గూడ వ్రణముపై నుంచి, దట్టమైన వస్త్రమును— అనేక పొరలతో—కవలికను చేసి, వ్రణముపై వేసి, పొడవగు వస్త్రమును ముడుతలు లేకుండ వేసి, చుట్టి, కట్టు కట్టవలెను.

అందు, పిత్త-రక్త దోషములవలన, అభిఘాతజవ్రణములందు ఒక వరుస చుట్టియు, వాతజ-శ్లేష్మజ వ్రణములందు రెండు లేక మూడు వరుసలుగాను వస్త్రమును చుట్టి కట్టు కట్టవలెను.



*శశిలేఖ* : కవలికా యన వ్రణముపై వేయబడునది.



వి. వ్యా. : "కవలయతి-క్రీడీకరోతీతి-వా-కవలికా" యని చక్రదత్తుడును; "ఔషధ వస్త్రయోరన్తరే యాదీయతే ఔషధ సంస్థాపనార్థం ఔదుంబరాది త్వక్ పత్రాణి వా స కవలికేత్యుచ్యతే" అని డల్హణుడును నిర్వచించిరి.

అష్టాంగ హృదయమున వ్రణమునకు వామ, దక్షిణ పార్శ్వములందు కట్టువేయవలెను గాని ఊర్ధ్వ, అధో భాగములందు వేయరాదని చెప్పబడినది.



బాధను శమింపజేయుట; రోగి ఆచరించవలసిన విధి

**మూలం :** శస్త్రక్షత రుజాయాం తు ప్రతతాయాం యష్టిమధుక సర్పిషోష్ణేన వ్రణం సిఞ్చేత్ । ఉదకుమ్భాచ్చాపో గృహీత్వా ప్రోక్షన్ పరితోవికిర్య పర్ణ సర్షపాది శిరస్య రక్షాం కుర్యాద్రక్షోభిభవనిషేధార్థమ్ । తేభ్యశ్చ బలిముపహరేత్ । ధార యేచ్చ శిరసా :

లక్ష్మీం గుహామతిగుహాం జటిలాం బ్రహ్మచారిణీమ్ ।
వచాం ఛత్రామతిచ్ఛత్రాం దూర్వాం సిద్ధార్థకానపి ॥

గుగ్గుల్వాదిభిరేవ శయనాసనాది ద్విరహ్నోధూపయేత్ । తథాస్నేహోక్తం దిన చర్యోక్తం చాచారమనువర్తేత । విశేషతశ్చ దివాస్వప్నాద్ వ్రణే శోఫ కణ్డూ రాగరుక్ పూయవృద్ధిః ।

ప్రతి పదార్థము : శస్త్రక్షత రుజాయాం = శస్త్రచికిత్సయందు బాధ, ప్రతతాయాం-తు = ఎక్కువ అయినపుడైతే, ఉష్ణేన = వెచ్చగానుండు, యష్టీమధుక-సర్పిషా = యష్టి మధుకము కలిపిన తేనెచేత, వ్రణమ్ = వ్రణమును, సిఞ్చేత్ = తడుపవలెను.

ఉదకుమ్భాత్ = నీటికుండనుండి, ఆపః = నీటిని, గృహీత్వాచ = గ్రహించియున్నూ, ప్రోక్షన్ = చల్లుచు, పర్ణసర్షపాదిభిః = ఆకులు, ఆవాలు మొదలగువానిచే, పరితః = చుట్టును, వికీర్య = పరిచి, అస్య = ఈ వ్రణమునకు, రక్షోభిభవనిషేధార్థం = రాక్షస తిరస్కారము నివారించుటకు, రక్షాం = రక్షను, కుర్యాత్ = చేయవలెను, తేభ్యః = వారికి, బలిం = బలిని, ఉపహరేత్-చ = ఇవ్వవలెను కూడ.

లక్ష్మీం = బుద్ధిని, గుహాం = పృశ్నిపర్ణిని, అతిగుహాం = శాలిపర్ణిని, జటిలాం = జటా మాంసిని, బ్రహ్మచారిణీం = బ్రాహ్మిని, వచాం = వసను, ఛత్రాం = శ్వేతకపోలికాగడ్డను, అతిచ్ఛత్రాం = శతావరిని, దూర్వాం = గరికను, సిద్ధార్థకాన్-అపి = తెల్ల ఆవాలనున్నూ, శిరసా = శిరస్సుచే, ధారయేత్-చ = ధరింపజేయవలెను గూడ.

ఏవం = ఇట్లే, అహ్నః = దినమునకు, ద్విః = రెండుసార్లు, గుగ్గులు-ఆదిభిః = గుగ్గులు మొదలగువానిచే, శయన-ఆసనాది = రోగియొక్క పడక-ఆసనములు మొదలగు వానిని, ధూపయేత్ = ధూపము వేయవలెను, తథా = అట్లే, స్నేహోక్తం = స్నేహవిధియందు చెప్పబడిన, దినచర్యోక్తం = దినచర్యయందు చెప్పబడిన, ఆచారం-చ = ఆచరింపదగిన వానినున్నూ, అనువర్తేత = అనుసరింపవలెను

దివాస్వాపాత్ = పగటి నిద్రవలన, వ్రణే = వ్రణమునందు, విశేషతః-చ = విశేష ముగా, శోఫ-కణ్డూ-రాగ-రుక్-పూయ-వృద్ధిః = వాపు, దురద, ఎరుపు, బాధ, చీము ఇవి ఎక్కువగును.

తాత్పర్యము : శస్త్రచికిత్స వలన బాధ ఎక్కువగా యున్నచో యష్టిమధుకమును నేతిని కలిపి వేడిగా వ్రణముపై సేకము చేయవలెను. రాక్షస తిరస్కారము లేకుండుటకై నీటిని చల్లి, ఆకులు, ఆవాలు రోగియున్న ప్రదేశము చుట్టును పరచవలెను. రాక్షసులకు బలిని కూడ ఇవ్వవలెను. ఇంకను రోగి శిరస్సుపై బుద్ధి, పృశ్నిపర్ణీ, శాలిపర్ణీ, జటామాంసీ, బ్రాహ్మి, వసా, శ్వేతకపోలికా, శతావరీ, గరిక, తెల్ల ఆవాలు– వీనిని ధరింపజేయవలెను. దినమునకు రెండుమార్లు రోగియొక్క శయన ఆసనాదులను గుగ్గులు మొదలగు వాని ధూపమును వేయించవలెను. ఇంకను, స్నేహకర్మయందు చెప్పబడిన విధిని, దిన చర్య యందు చెప్పబడిన విధిని అనుసరింపజేయవలెను. వ్రణితుడు పగలు నిద్రించినచో వ్రణము నందు వాపు, దురద, ఎరుపు, నొప్పి, చీము– ఇవి ఎక్కువగును. కాన పగటి నిద్ర వ్రణితునకు నిషేధము.

వి. వ్యా. : చంద్రనందనుడు లక్ష్మీ యనగా శమీ యనియు, ఛత్రా యనగా శత పుష్పికా యనియు, అతిచ్ఛత్రా యనగా విషాణిక యనియు వివరించెను.

## వ్రణితునకు వర్జనీయములు

**మూలము :** స్త్రీణాం తు స్మృతి - సంస్పర్శ - దర్శనైశ్చలితే స్రుతే ।
శుక్రే వ్యవాయజాన్ దోషాన సంసర్గేప్య వాప్నుయాత్ ॥
(వ్రణే శ్వయథురాయాసాత్స చ రాగశ్చ జాగరాత్ ।
తౌ చ రుక్ చ దివాస్వాపాత్తాశ్చ మృత్యుశ్చ మైథునాత్ ॥)

*ప్రతి పదార్థము :* స్త్రీణాం = స్త్రీలయొక్క, స్మృతి-సంస్పర్శ-దర్శనైః = స్మరణ, స్పర్శ, చూచుటచేత, చలితే = చలించినదియు, స్రుతే = స్ఖలించినదియు అయిన, శుక్రే = శుక్రము, అసంసర్గే-అపి = స్త్రీ సంసర్గము లేకున్నను, వ్యవాయజాన్-దోషాన్ = సంభోగము వలన కలుగునట్టి దోషములను, అవాప్నుయాత్ = పొందింపజేయును.

(ఆయాసాత్ = శ్రమవలన, వ్రణే = వ్రణమునందు, శ్వయథుః = వాపు కలుగును, జాగరాత్ = రాత్రి నిద్ర లేనందున, సః-చ = ఆ వాపును, రాగః-చ = ఎరుపెక్కును, దివాస్వాపాత్-చ = పగలు నిద్రించినందుననున్నూ, తౌ-చ = ఆవాపు-ఎరుపు రెండును, రుక్-చ = నొప్పియు కలుగును, మైథునాత్-చ = మైథునము వలన, తాః-చ = వాపు, ఎరుపు నొప్పియును, మృత్యుః-చ = మరణమున్నూ కలుగును).

*తాత్పర్యము :* వ్రణితునకు స్త్రీయొక్క స్మృతి, స్పర్శ, దర్శనముల వలన శుక్రము చలించి, స్ఖలనమైనచో, సంభోగము లేకున్నను, సంభోగము వలన కలుగు దోషములను కలిగించును. ఇంకను వ్రణితునకు శ్రమచే వ్రణమున శోథయు, రాత్రి జాగరణముచే వ్రణమున ఎరుపును, దివాస్వప్నముచే ఆ రెండును, ఇంకను నొప్పియు కలుగును మైథునము జరిపినచో వాపు, ఎరుపు నొప్పితోబాటు మరణమునూ కలుగును. కాన ఇవి విసర్జింపవలెను.

## వ్రణితునకు భోజనవిధి

**మూలము :** భోజయేచ్చైనం యథాసాత్మ్యం సమాతీతశాలిషష్టిక యవగోధూమాన్యతమం ముద్గమసూరాఢకీసతీనయూషజాఙ్గల రసోపేతం జీవన్తీసునిషణ్ణ తన్దులీయకవాస్తుక వార్తాక పటోల కారవేల్లక బాలమూలకశాకాయుక్తం దాడిమామలకసైన్ధవ సహితం సర్పిః స్నిగ్ధం లఘ్వల్పముష్ణోదకోత్తరం చ । ఏవమన్యనమ్యగశితం జరాముపైతి ।

*ప్రతి పదార్థము :* ఏనం = శస్త్ర చికిత్స చేయబడిన ఈ రోగిని, యథాసాత్మ్యం = సాత్మ్యము ననుసరించి, సమాతీత - శాలి - షష్టిక - యవ - గోధుమ - అన్యతమం = సంవత్సరము ప్రాతవియగు శాలి, షష్టిక, యవ, గోధుమలలో ఒక ధాన్యమును, ముద్గ - మసూర - ఆఢకీ - సతీన యూష = పెసలు, చిరుసెనగలు, కందులు, లంకలు - వీనిలో ఒకదాని యూషముతోనూ, జాంగల రసోపేతం = జాంగల జంతు మాంస రసముతో గూడిన దానిని, జీవన్తీ - సునిషణ్ణక - తన్దులీయక - వాస్తుక - వార్తాక - పటోల - కారవేల్లక - బాల మూలక - శాక యుక్తమ్ = పాలకూర, నీరుచెంచలి, చిల్లికూర, చక్రవర్తికూర, వంకాయ, చేదుపొట్ల, కాకర, లేతముల్లంగి - వీనిలో ఒక కూరతో గూడినదియు, దాడిమ - ఆమలక - సైంధవ - సహితం = దానిమ్మ పండ్ల రసము, ఉసిరిక పండ్ల రసము, సైంధవ

లవణములతో కూడినదియు, సర్పిః స్నిగ్ధమ్ = నేతితో స్నిగ్ధమయినదియు, లఘు = లాఘవముగా (అల్ప ప్రమాణము గలదియు), ఉష్ణోదకోత్తరం - చ = తరువాత వేడినీరు సేవించునట్లుగా, భోజయేత్ - చ = భుజింపజేయవలెను, ఏవం = ఈ విధముగా, అస్య = ఈ రోగి యొక్క, సమ్యక్ - అశితం = బాగుగా భుజింపబడినది, జరామ్ = జీర్ణతను, ఉపైతి = పొందును.

**తాత్పర్యము :** శస్త్ర చికిత్స చేయబడిన రోగికి, అతని సాత్మ్యము ననుసరించి, ఒక సంవత్సరము ప్రాతవియగు శాలి - షష్టిక - యవ - గోధుమలలో నొక ధాన్యపు భోజనమును, పెసలు, చిరుసెనగలు, కందులు, లంకలలో ఒక పప్పుధాన్యము యొక్క యూషముతోను, జాంగల జంతు మాంస రసముతోను, పాలకూర, నీరుచెంచలి, చిట్టికూర, చక్రవర్తి కూర, వంకాయ, చేదుపొట్ల, కాకరకాయ, లేత ముల్లంగిలలో ఒక కూరను, దాడి మామ్ల ఆమలకీరస, సైంధవ లవణములతోనూ, ఘృతయుక్తమగు ఆహారమును అల్పప్రమాణమున భుజింపజేయవలెను. భోజనానంతరము ఉష్ణోదక పానము చేయించవలెను. ఇట్టి భోజనము త్వరగా రోగికి జీర్ణమగును.

వి. వ్యా. : యవాదులు అన్నార్థమును, మసూరముద్గాదులు యూషములకొరకును, తువర-ఆఢకీ-జీవంతీ, సునిషణ్ణకాదులు శాకములుగా ఉపయోగింపబడుటకును, దాడిమ-ఆమలకీ సైంధవలవణములు సంస్కారార్థమును, తప్త-హిమ-క్వథితజలములు పానీయార్థమును ఉపదేశింపబడినవని చంద్రనందనుని వ్యాఖ్య.

## అజీర్ణమును కలుగనీయ రాదనుట

**మూలము : అజీర్ణాదనిలాదీనాం విభ్రమో బలవాన్ భవేత్ ।
తతః శోఫ రుజాపాక దాహానాహా నవాప్నుయాత్ ॥**

*ప్రతి పదార్థము :* అజీర్ణాత్ = అజీర్ణము వలన, అనిలాదీనామ్ = వాతాది దోషముల యొక్క, విభ్రమః = క్షోభ, బలవాన్ = బలిష్ఠమైనది, భవేత్ = కలుగును, తతః = దాని వలన, శోఫ = వాపు, రుజా = బాధ, పాక = పుండు, దాహ = మంట, ఆనాహ = ఆనాహమును, అవాప్నుయాత్ = పొందును.

తాత్పర్యము : రోగికి అజీర్ణము కలిగినచో వాతాదిదోషములు క్షోభను పొందును. దానివలన వాపు, బాధ, పాకము, దాహము, ఆనాహమును కలుగును.

## వర్జనీయ ఆహారములు

**మూలము : నవధాన్య మాషకలాయ కులుత్థనిష్పావ శిమ్బీ శీతామ్బుమద్యేక్షుక్షీర పిష్ట తిలవికృతిశుష్కశాకపిశితహరితకామ్లలవణకటుకక్షారానూపామిషాణి వర్జయేత్ ।**

*ప్రతి పదార్థము :* నవధాన్య = క్రొత్తవి యగు ధాన్యములు, మాష = మినుములు, కలాయ = బటాణీలు, కులుత్థ = ఉలవలు, నిష్పావ = అనుములు, శిమ్బీ = శింబీధాన్యము, శీతామ్బు = చల్లని నీరు, మద్య = మద్యము, ఇక్షు = చెరకు, క్షీర = పాలు, పిష్ట = పిండి (వంటలు), తిల వికృతి = నువ్వులతో చేయబడిన పదార్థములు, శుష్కశాక = ఎండినకూరలు,

పిశిత = మాంసము, హరితక = పచ్చి ద్రవ్యములు, అమ్ల - లవణ - కటుక - క్షార = అమ్ల, లవణ, కటురస పదార్థములు, క్షారములు, అనూప - ఆమిషాణి = అనూప జంతువుల మాంసము, వర్జయేత్ = విడువవలెను.

తాత్పర్యము : శస్త్ర చికిత్స చేయబడిన రోగి, క్రొత్తధాన్యములను, మినుములు, బటాణీలు, ఉలవలు, అనుములు, శింబీధాన్యము, చల్లనినీరు, మద్యము, చెరకు, క్షీరము, పిండి వంటలు, తిలవికృతులు, ఎండు కూరలు, మాంసము పచ్చివస్తువులు, అమ్ల - లవణ - కటురస పదార్థములు, క్షారములు అనూప జంతువుల మాంసము, — వీనిని వర్జించవలెను.

వి. వా. : వ్రణితునకు వర్జనీయములలో ఇంకను విష్టంభకర - విదాహికర ద్రవ్యములు గూడ అష్టాంగ హృదయమున చెప్పబడినవి.

మూలము : వర్గోయం నవధాన్యాదిర్వ్రణినః సర్వదోషకృత్ ।
మద్యం తీక్ష్ణోష్ణరూక్షామ్లమాశు వ్యాపదయేద్వ్రణమ్ ॥
బాలోశీరైశ్చ వీజ్యైత న చైనం పరిఘట్టయేత్ ।
న తుద్దేన్నచ కణ్డూయేచ్చేష్టమానశ్చ పాలయేత్ ॥
స్నిగ్ధవృద్ధ ద్విజాదీనాం కథాః శృణ్వన్మనః ప్రియాః ।
ఆశావాన్వ్యాధిమోక్షాయ క్షిప్రం వ్రణమపోహతి ॥

ప్రతి పదార్థము : అయం = ఈ, నవధాన్యాదిః వర్గః = క్రొత్త ధాన్యములు మొదలగు వాని సమూహము, వ్రణినః = వ్రణముగల వానికి, సర్వదోషకృత్ = అన్ని దోషములను ప్రకోపింప జేయును, మద్యః = మద్యము, తీక్ష్ణ - ఉష్ణ - రూక్ష - అమ్లం = తీక్ష్ణ - ఉష్ణ - రూక్షగుణములు, అమ్లతసము గలిగినట్టిది (అది) వ్రణం = వ్రణమును (వ్రణితుని), ఆశు = శీఘ్రముగా, వ్యాపాదయేత్ = చంపును.

ఏనం = ఈ వ్రణమును, బాల - ఉశీరైః - చ = లేతవియగు వట్టి వేళ్లచేతనున్నూ, వీజ్యేత = వీచవలెను, సుపరిఘట్టయేత్ = రుద్దరాదు, న - తుద్దేత్ = పిండరాదు, న - కణ్డూయేత్ - చ = గోకరాదు గూడ, చేష్టమానః = కదలికలు గలవాడై, పాలయేత్ - చ = వ్రణమును (రక్షించవలెను)

మనః ప్రియాః = మనస్సునకు ప్రియమునైన, స్నిగ్ధ - వృద్ధ - ద్విజ-దీనాం = స్నేహితుల, పెద్దల, బ్రాహ్మణుల మొదలగు వారి యొక్క, కథా = కథలను, శృణ్వన్ = వినుచు, వ్యాధిమోక్షాయ = వ్యాధి తగ్గుటకు, ఆశావాన్ = ఆశావంతుడై (ఉండుట), క్షిప్రం = త్వరగా, వ్రణం - అపోహతి = వ్రణమును పోగొట్టును.

తాత్పర్యము : పైజెప్పిన నవధాన్యాది వర్గము వ్రణితునకు సర్వదోషములను ప్రకోపింప జేయును, మద్యము తీక్ష్ణ - ఉష్ణ - రూక్షగుణములు, అమ్లరసము గలిగి - అందుచే ఇవి వ్రణితుని చంపును. కాన వర్జనీయములు.

శస్త్ర చికిత్సయనంతరము వ్రణమును వట్టి వేళ్ల వీవనచే వీచవలెను. దానిని రుద్దుట, వత్తుట, గోకుట, పనికిరాదు. ఈగలు మొదలగునవి వ్రాలకుండ అప్పుడప్పుడు కొంచెము కదల్చుచు ఆ వ్రణమును జాగ్రత్తగా చూడవలెను.

మనః ప్రియములగు స్నేహితుల, వృద్ధుల, ద్విజుల కథలను వినుచు, వ్యాధి తగ్గుటకు ఆశావంతుడై - అనగా మనోధైర్యముకలిగి - యున్నచో వ్రణము త్వరగా తగ్గును.

వి. వ్యా. : వ్రణితునకు మద్యపానము నిషిద్ధమేయైనను, అరుణ దత్తుడు, చంద్ర నందనుడును తంత్రాంతర శ్లోకమును దాహరించి, మార్ద్వీక మద్యము స్నేహయుక్తమై, మధురప్రాయమై, అతి తీక్ష్ణత్వ - అతి కర్కశత్వములు లేక యుండి ఉత్తమమైనదిగా నుండుటచే కొలది ప్రమాణమున త్రాగించవచ్చు ననిరి.

## కట్టు విప్పుటకు నియమము

**మూలము : పునశ్చ తృతీయేఽహని ప్రక్షాళనాది పూర్వవద్ వ్రణకర్మ కుర్యాత్ । ద్వితీయ దివసే మోక్షణాదాదౌ విగ్రథితో వ్రణశ్చిరాదుపరోహత్యుగ్రరుజశ్చ భవతి । న చవికేశికామౌషధం వాఽతిస్నిగ్ధరూక్షమతిశ్లథగాఢమశ్లక్ష్ణం దుర్న్యస్తం చ దద్యాత్ । అతిస్నేహాత్క్లేదః । అతిరౌక్ష్యాచ్ఛేదో వేదనా చ । అతిశ్లథత్వా దపరిశుద్ధిః । గాఢతయా సంరమ్భః । అశ్లక్ష్ణత్వాద్దుర్న్యాసాచ్చ వ్రణవర్త్మోపఘర్షణమ్ ।**

ప్రతి పదార్థము : పునః చ = మరియును, తృతీయే - అహని = మూడవ దినమున, పూర్వవత్ = పూర్వమువలె, ప్రక్షాళనాది - వ్రణకర్మ = కడుగుట మొదలగు వ్రణ చికిత్స కర్మను, కుర్యాత్ = చేయవలెను, ద్వితీయే - దివసే = రెండవ దినమున, ఆదౌ = ముందు, మోక్షణాత్ = కట్టువిప్పుట వలన, విగ్రథితః = గడ్డకట్టని (గట్టిపడని), వ్రణః = వ్రణము, చిరాత్ = చాల కాలమునకు, ఉపరోహతి = మానును, ఉగ్రరుజః - చ = తీవ్రమైన నొప్పి గలదియును, భవతి = అగును, (వ్రణము నందు), వికేశికాం = సూక్ష్మములగు సూత్రములు గల వర్తినిగాని, అతిస్నిగ్ధం = ఎక్కువ స్నేహముతో గూడిన, అతిరూక్షం = అతిరూక్షమైన, అతిశ్లథ = ఎక్కువ వదులైన, అతి గాఢ = మిక్కిలి దట్టముగా, అశ్లక్ష్ణం = గరుకుగా గాని (ఉండు), ఔషధం = ఔషధము, వా = లేక, దుర్న్యస = దుష్ప్రవేశమును, న - దద్యాత్ - చ = వేయగూడదు, అతిస్నేహాత్ = ఎక్కువ స్నేహము నుపయోగించుట వలన, క్లేదః = తడి; అతిరౌక్ష్యాత్ = ఎక్కువరూక్ష ద్రవ్యముల నుపయోగించుట చేత, ఛేదః = తెగుటయు, వేదనా - చ = నొప్పియును; అతిశ్లథత్వాత్ = ఎక్కువ వదులుగా నుండుటచేత, అపరిశుద్ధిః = అపరిశుద్ధతయు, గాఢతయా = దట్టముగా నుండుట చేత, సంరమ్భః = వ్రణమున శోథయు, అశ్లక్ష్ణత్వాత్ = గరుకుగా నుండు ద్రవ్యముల నుపయోగించుటచేత, దుర్న్యాసాత్ = దుష్ప్రవేశమువలన, వ్రణవర్త్మ = వ్రణము యొక్క అంచులకు, ఉపఘర్షణమ్ - చ = రాపిడియున్ను (కలుగును).

తాత్పర్యము : శస్త్ర కర్మ చేసిన మూడవదినమున కట్టువిప్పి, పూర్వమువలెనే వ్రణ ప్రక్షాళనాదికము చేయవలెను. రెండవ దినముననే కట్టువిప్పుట వలన వ్రణము గట్టిపడక త్వరగా మానదు. అందువలన తీవ్రమగు నొప్పిగూడ గలుగును. వ్రణమునందుంచు వికేశిక గాని, ఔషధముగాని, అతిస్నిగ్ధముగాని, అతిరూక్షముగాని, అతిశ్లథముగాని అతిగాఢము గాగానిడుండకూడదు. అతిస్నిగ్ధమైనందున క్లేదమధికనుగును. అతిరౌక్ష్యమువలన ఛేదనమగును.

బాధగూడ ఎక్కువగును. అతిశ్లథత వలన వ్రణమున అపరిశుద్ధత యగును. అతిగాఢమైనచో శోథ గలుగును. గరుకుగ నుండు ఔషధము వలన, అనుచిత ఔషధ ప్రయోగము వలన, వ్రణముఖమునకు అంచులకు రాపిడి కలుగును.

*శశిలేఖ :* వికేశికాయనగా అంతర్వర్తి. వ్రణమునందుంచబడు ఔషధయుక్తవర్తి.

*వి. వ్యా. :* విగ్రథితః అనగా విషమ సంస్థానః అని హేమాద్రి వ్యాఖ్య.

## వికేశికా ప్రయోగము

**మూలము :** అవశ్యం సాశయే వ్రణే వికేశికాం దద్యాత్ ।
సపూతిమాంసం సోత్సఙ్గం సగతిం పూయగర్భిణం ॥
వ్రణం శోధయతే శీఘ్రం స్థితాహ్యన్తర్వికేశికా ।

*ప్రతి పదార్థము :* స-ఆశయే = అవకాశము గలిగిన, వ్రణే = వ్రణము నందు, అవశ్యం = తప్పక, వికేశికాం = అంతర్వర్తిని, దద్యాత్ = ఇవ్వవలెను, అన్తః = లోపల, స్థితా = ఉన్నట్టి, వికేశికా = వికేశిక, స-పూతి-మాంసం = దుర్గంధయుక్తమగు మాంసము గలదియు, స-ఉత్సంగం = ఉబ్బినదియు, స-గతిం = వివిధములగు మార్గములను గలిగినదియు, పూయ గర్భిణం = లోపల చీము గలిగినదియునగు, వ్రణం = వ్రణమును, శీఘ్రం = త్వరగా, శోధయతే = శుద్ధిజేయును.

*తాత్పర్యము :* లోపల ఖాళీ ప్రదేశ మేర్పడిన వ్రణమునందు వికేశికను తప్పక ప్రయోగించవలెను. దీనివలన దుర్గంధముతో గూడిన మాంసముతో నున్నట్టి, ఎత్తుగానున్నట్టి, వివిధ గతుల వ్యాపించినట్టి, చీముతో నున్నట్టి వ్రణము త్వరగా శుద్ధి యగును.

*శశిలేఖ :* సాశయ వ్రణమనగా అంతర్విస్తీర్ణవ్రణము.

*వి. వ్యా. :* వికేశికా–"తిలకల్కమధుఘృతాక్త వస్త్రస్య సూత్రస్యవా వికేశికా సాచ సపూతిమాంసోత్సంగ గతి పూయగర్భేషు వ్రణేషు నిక్షిప్యతే" అని డల్హణవచనము.

## అపక్వశోఫ ఛేదనమున చేయదగిన విధి

**మూలము :** వ్యమ్లం తు పాటితం శోఫం పాచనైః సముపాచరేత్ ।
భోజనై రుపనాహైశ్చ నాతి వ్రణవిరోధిభిః ॥

*ప్రతి పదార్థము :* పాటితం = చీరిన, వ్యమ్లం = అపక్వమైన, శోఫం-తు = శోఫనైతే, న-అతి-వ్రణ విరోధిభిః = వ్రణమునకు మిక్కిలి విరోధములుగాని, పాచనైః = వ్రణమును పరిపక్వముచేయు, భోజనైః = భోజనములచేత, ఉపనాహైశ్చ = లేపముల చేత, సముపాచరేత్ = చక్కగా ఉపచారము చేయవలెను.

*తాత్పర్యము :* అపక్వ శోఫలను ఛేదించినప్పుడు వ్రణితునకు పథ్యమగు ఆహారముల చేతను, లేపనముల చేతను చికిత్స చేయవలెను.

*శశిలేఖ :* వ్యమ్లం అనగా కొంచెము పక్వమైన అని యర్థము.

వి. వ్యా. : వ్యమ్లం అనగా విదగ్ధం – ఇచట రక్తమున అమ్లరసము లేకుండును అని హేమాద్రి వివరణ.

## సీవ్యకర్మ విధానము

**మూలము : యత్ర సీవ్యో వ్రణస్తత్ర చలాస్థి శల్యపాంశు తృణరోమశుష్కరక్తాదీన్యపోహ్య విచ్ఛిన్నం ప్రవిలమ్బిమాంసం సన్ధ్యస్థీని చ యథాస్థానే సమ్యక్ స్థాపయిత్వా స్థితే రక్తే యథార్హం సూచ్యోపహితేన స్నాయుసూత్రబాలాన్యతమేన సీవ్యేత్ । శణాశ్మన్తకమూర్వాఽతసీనాం వా వల్కలైః ।**

*ప్రతి పదార్థము :* యత్ర = ఎచట, వ్రణః = వ్రణము, సీవ్యః = కుట్టదగినదిగా యుండునో, తత్ర = అదట, చలాస్థి-శల్య-పాంశు-తృణ-రోమ-శుష్కరక్తాదీని = విరిగి విడి వడిన ఎముకలు, శల్యములు, దుమ్ము, గడ్డి, వెండ్రుకలు, ఎండిన రక్తము మొదలగువానిని, అపోహ్య = తీసివైచి, విచ్ఛిన్నం = తెగిపోయి, ప్రవిలంబి = వ్రేలాడునట్టి, మాంసం = మాంసమును, సంధి-అస్థీని = సంధులను, ఎముకలను, యథాస్థానే = వానివాని స్థానములలో, సమ్యక్ = సరిగా, స్థాపయిత్వా = ఉంచి, రక్తే = రక్తము, స్థితే = నిలచినదగుచుండగా, యథార్హం = తగు విధమున, సూచ్యా = సూదితో, ఉపహితేన = కూడిన, స్నాయు-సూత్ర-బాలాన్యతమేన = స్నాయువులు, దారము, వెండ్రుకలు-వీనిలో నేదైన ఒకదానితో, సీవ్యేత్ = కుట్టవలెను, వా = లేక, శణ = జనుము, అశ్మంతక = పాషాణభేది, మూర్వ = చాగ, అతసీనాం = అవిసె–వీనియొక్క, వల్కలైః = నారలచేత, సీవ్యేత్ = కుట్టవలెను.

**తాత్పర్యము :** కుట్టదగిన వ్రణములందు మొదట వ్రణమునందలి విరిగిన ఎముకల ముక్కలు, అన్య పదార్థములు, తృణ-రోమములు–దుమ్ము-ఎండినరక్తము మొదలగువానిని తీసివేసి తెగి వ్రేలాడు మాంసమును, సంధి–అస్థులను యథాస్థానమున నుంచి, రక్తస్రావము ఆగిన తరువాత స్నాయువు-దారము వెండ్రుకలతో దేనినైన సూదిలో గ్రుచ్చి కుట్టవలెను. లేక జనపనార, పాషాణభేది, చాగ, అవిసె నారల నుపయోగించి కుట్టవలెను.

**వి. వ్యా :** కుట్టదగిన వానిలో సద్యోవ్రణము, కర్ణపాళులు, శిరస్సు, అక్షికూటము, నాసిక, ఓష్ఠములు, చెక్కిళ్ళు, చెవులు, తొడలు, హస్తములు, కంఠము, లలాటము, వృషణములు, పిరుదులు, మేఢ్రము, గుదము, ఉదరము, గంభీర ప్రదేశములు, మాంసల ప్రదేశములును గలవని అష్టాంగ హృదయమున వివరింపబడినవి.

## సీవ్యకర్మ భేదములు

**మూలము : సీవన వికల్పాస్తు సమాసేన చత్వారః । తద్యథా– గోష్ఫణికా, తున్నసేవనీ, వేల్లితకం, రజ్జుగ్రన్థి బన్ధనమితి । తేషాం నామభిరేవాకృతి విభాగః ప్రహారవశాచ్చోపయోగః ।**

*ప్రతి పదార్థము :* సీవన వికల్పాః–తు = కుట్ల భేదములైతే, సమాసేన = సంగ్రహముగా, చత్వారః = నాలుగు, తద్యథా = అవిఎట్లనగా, గోష్ఫణికా = గోఫణము, తున్నసేవనీ = తున్నసేవని, వేల్లితకం = వేల్లితకము, రజ్జుగ్రన్థిబన్ధనం = రజ్జుగ్రంథిబంధనము, ఇతి = అని,

తేషాం = వానిలో, నామభిః-ఏవ = పేర్లతోనే, ఆకృతి విభాగః = ఆకార విభాగము; ప్రహార వశాత్ = శస్త్రప్రహారము ననుసరించి, ఉపయోగః = ఉపయోగము (భవతి = అగును).

తాత్పర్యము : సంగ్రహముగా కుట్లు నాలుగు విధములు. అవి-గోష్ఫణికా, తున్న సేవనీ, వేల్లితికం, రజ్జుగ్రన్థిబన్ధనము. వాని పేర్లవలననే ఆకృతి తెలియును. శస్త్ర ప్రహారము ననుసరించి వీనిలో ఏది ఉచితమో దానిని ఉపయోగింపవలెను.

శశిలేఖ : కాకపదాకృతిన యుండు వ్రణమున నాలుగు కోణములందు కుట్టబడు కుట్టు గోష్ఫణికము; అతి నికటములుగ నుండు రెండు వ్రణములను ఏకకాలమున ఒకే సూత్రముచే ప్రాతబట్టను కుట్టినట్లు కుట్టబడునది తున్నసేవనీ; వ్రణ ఓష్ఠములను చుట్టునట్లుగా కుట్టబడు కుట్టు వేల్లితికం; ఒక వరుస దారముతో కుట్టబడునది రజ్జుగ్రన్థి బన్ధనము.

## సీవనవిధి

మూలము : నవాఽతి సన్నికృష్టాం విప్రకృష్టామత్యల్పం బహుగ్రాహిణీం వా సూచీం పాతయేత్ ।

ప్రతి పదార్థము : అతి సన్నికృష్టాం = అతి దగ్గరగాగాని, విప్రకృష్టాం = దూరముగా గాని, అత్యల్పం = చాల తక్కువగా గాని, బహుగ్రాహిణీం వా = చాల ఎక్కువగా గాని, సూచీం = సూదిని, న-పాతయేత్ = ప్రయోగించరాదు.

తాత్పర్యము : కుట్టునపుడు అతి దగ్గరగా గాని, అతి దూరముగా గాని, చాల తక్కువగా గాని, చాల ఎక్కువగా గాని కుట్టకూడదు.

## సీవనాంతర విధి

మూలము : ఏవం సమ్యక్ స్యూతమవేక్ష్య మధుఘృతయుక్తైరఞ్జన మధుకనిమ్బలోధ్ర ప్రియఙ్గుసల్లకీఫలక్షౌమమషీచూర్ణైరవకీర్య పూర్వవద్బన్ధాదీన్ ప్రయోజయేత్ ।

ప్రతి పదార్థము : ఏవం = ఈ విధముగా (వ్రణమును), సమ్యక్-స్యూతం = బాగుగా కుట్టబడినదానిగా, అవేక్ష్య = పరిశీలించి చూచి, మధుఘృతయుక్తైః = తేనె, నెయ్యి వీనితో గూడిన, అఞ్జన-మధుక-నిమ్బ-లోధ్ర-ప్రియఙ్గు-సల్లకీఫల-క్షౌమమషీ-చూర్ణైః = స్రోతోంజనము, యష్టిమధుకము, వేప, లొద్దుగ, ప్రేంఖణము, సల్లకీఫలము, అవిశెనారబట్ట కాల్చినమసిపొడి వీనిచే, అవకీర్య = చల్లి, పూర్వవత్ = పూర్వము వలె, బన్ధాదీన్ = కట్లు మొదలగువానిని, ప్రయోజయేత్ = ప్రయోగింపవలెను.

తాత్పర్యము : ఈ విధముగా కుట్టిన తరువాత స్రోతోంజనము, యష్టిమధుకము, వేప, లొద్దుగ, ప్రేంఖణము, సల్లకీఫలము, అవిశెనారబట్ట కాల్చిన మసి, వీనిని తేనె-నెయ్యితో కలిపి వ్రణముపై వేసి, పూర్వము చెప్పిన విధముగా కట్టుకట్టవలెను.

## సీవనకర్మ నిషేధము

మూలము : అసీవ్యా వఙ్క్షణ వక్షఃకక్షాదిషు ప్రచలేష్వల్పమాంసేషు చ వాయునిర్వాహిణోఽన్తర్లోహితశల్యా విషాగ్నిక్షారకృతాశ్చ వ్రణాః ।

ప్రతి పదార్థము: ప్రచలేషు = ఎక్కువ కదలునట్టి స్థలములందును, అల్పమాంసేషు = మాంసము స్వల్పముగా గల ప్రదేశములందును, వాయునిర్వాహిణః = వాయువు సంచరించు నవకాశము గలిగినట్టియు, అన్తర్లోహిత శల్యాః = రక్తములో గల శల్యములు గలవియు, విష-అగ్ని-క్షార-కృతాః-చ-వ్రణాః = విషము, అగ్నిక్షారములచే కలిగిన వ్రణములును, అసీవ్యాః = కుట్టదగనివి.

తాత్పర్యము : ఎక్కువ కదలునట్టి ప్రదేశములు, స్వల్పమాంసముగల ప్రదేశములు, వంక్షణ - వక్ష - కక్షాది ప్రదేశములు, వాయువు అధికముగా సంచరించు ప్రదేశములు, రక్తములో శల్యమున్న వ్రణములు, విష - అగ్ని - క్షారముల వలన కలిగిన వ్రణములును కుట్టదగనివి.

## సీవనకర్మ చేయదగినవి

మూలము : సీవ్యాస్తు మేదస్సముత్థాః భిన్నలిఖితాః కఫగ్రన్థిరల్పపాలికః కర్ణః సద్యో వ్రణాశ్చ । శిరోలలాటాక్షికూటకర్ణనాసాగణ్డౌష్ఠ కృకాటికాబాహూదరస్ఫిక్‌పాయు ప్రజననముష్కాదిష్వచలేషు మాంసవత్సు చ ప్రదేశేషు ।

ప్రతి పదార్థము : మేదస్సముత్థితాః = మేదస్సు వలన జనించినవియు, భిన్న లిఖితాః = లేఖనము చేయబడిన ఛిన్న వ్రణములును, కఫగ్రన్థిః = కఫజగ్రంథియు, అల్ప పాలికః - కర్ణః = చిన్నదగు కర్ణపాలి, సద్యోవ్రణాః - చ = సద్యోవ్రణములును, సీవ్యాః = కుట్ట దగినవి. (ఇంకను) శిరస్ = తల, లలాట = నుదురు, అక్షికూట = నేత్రగోళము, కర్ణ = చెవి, నాసా = ముక్కు, గణ్డ = చెక్కిళ్లు, ఓష్ఠ = పెదవులు, కృకాటికా = గ్రీవమునకు వెనుక భాగము, బాహు = బాహువులు, ఉదర = ఉదరము, స్ఫిక్ = పిరుదులు, పాయు = గుదము, ప్రజనన = జననేంద్రియములు, ముష్కాదిషు = వృషణములు మొదలగు ప్రదేశము లందు, అచలేషు = కదలనివియగు, మాంసవత్సు - ప్రదేశేషు = మాంసమధికముగా గల ప్రదేములందును (వ్రణములు కుట్టదగినవి).

తాత్పర్యము : మేదోజములగు వ్రణములు, లేఖన కర్మచేయబడిన భిన్నవ్రణములు, కఫజ గ్రంధి, చిన్నదిగా నుండు కర్ణపాలి, సద్యోవ్రణములు వీనియందు సీవన కర్మచేయ దగును. ఇంకను శిరస్సు, లలాటము, అక్షికూటములు, కర్ణము, నాసిక, గణ్డప్రదేశములు, పెదవులు, గ్రీవము యొక్క వెనుక భాగము, బాహువులు, ఉదరము, పిరుదులు, గుదము, జననేంద్రియములు, వృషణములు, మాంసము అధికముగా నుండి చలించు ప్రదేశములు - వీని యందును సీవనము చేయదగును.

## పదునైదు బంధన ప్రకారములు

మూలము : కోశదామోత్సఙ్గస్వస్తికానుకావేల్లితముత్తోలీమణ్డలస్థగికాయమకఖట్వాచీనవిబన్ధ వితానగోష్పణాః పఞ్చాఙ్గీ చేతి పఞ్చదశ బన్ధవిశేషాః । తేషాం నామభిరేవా కృతయః ప్రాయేణవ్యాఖ్యాతాః ।

ప్రతి పదార్థము : కోశ = కోశము, దామ = దామము, ఉత్సఙ్గ = ఉత్సంగము,

స్వస్తిక = స్వస్తికము, అనువేల్లితమ్ = అను వేల్లితము, ముతోలీ = ముతోలీ, మణ్డల = మండలము, స్థగికా = స్థగిక, యమక = యమకము, ఖట్వా = ఖట్వము, చీన = చీనము, విబన్ధ = విబంధము, వితాన = వితానము, గోష్ఫణాః = గోష్ఫణము, పఞ్చాఙ్గీ = పంచాంగి, ఇతి = అని, బన్ధవిశేషాః = బంధముల రకములు, పఞ్చదశ = పదునైదు, తేషాం = వాని యొక్క, నామభిః-ఏవ = పేర్లతోనే, ఆకృతయః = ఆకారములు, ప్రాయేణ = సామాన్యముగా, వ్యాఖ్యాతాః = వివరింపబడినవి.

తాత్పర్యము : కోశము, దామము, ఉత్సఙ్గము, స్వస్తికము, అనువేల్లితము, ముతోలీ, మండలము, స్థగికా, యమకము, ఖట్వము, చీనము, విబంధము, వితానము, గోష్ఫణిక, పంచాంగీ యను పదునైదును బంధ విశేషములు. వీని పేర్ల ననుసరించియే ఆకృతి తెలియును.

వి. వ్యా : ఉష్ణవీర్యముగల ఆవికాజినము (మేక చర్మము), కౌశేయము (పట్టు వస్త్రము); శీతవీర్యముగల క్షౌమము (వెలిపట్టు); తూల సంతానము (బూరుగ దూది దారములచే నిర్మితము) ప్రత్తి నూలు వస్త్రము, స్నాయు నిర్మితము, పట్టులచే నిర్మితములైనవి—శీతోష్ణ వీర్యము గలవి. ఇవి వ్రణ బంధనమున కుపయోగించును.

మేదస్సు, కఫము అధికముగా నున్నపుడు తామ్రము, ఇనుము, తగరము, సీసములను లేఖనార్థ ముపయోగింపవలెను.

విరిగిన అంగములను బంధించుటలో కొయ్య పలకలు, చర్మ కుశ వల్కాలాదుల నుపయోగించ వలెనని అష్టాంగ హృదయమున తెలుపబడినది.

### బంధన ప్రయోగములు

**మూలము :** తత్ర కోశమఙ్గులి పర్వసు విదధ్యాత్ । దామ సంబాధేఽఙ్గే । ఉత్సఙ్గం విలమ్బిని । స్వస్తికం సన్ధికూర్చభ్రూస్తనాన్తరకక్షాఽక్షి కపోల కర్ణేషు । అను వేల్లితం శాఖాసు । ముత్తోలీ గ్రీవామేఢ్రయోః । మణ్డలం వృత్తేఽఙ్గే । స్థగికామఙ్గుష్ఠాఙ్గులి మేఢ్రాగ్రమూత్రవృద్ధిషు । యమకం యమలవ్రణయోః । ఖట్వాం హనుశఙ్ఖగణ్డేషు । చీనమపాఙ్గయోః । విబన్ధముదరోరు పృష్ఠే । వితానం మూర్ధాదౌ విపులేఽఙ్గే । గోష్ఫణం నాసౌష్ఠచిబుకసన్ధిషు । పఞ్చాఙ్గీ జత్రూర్ధ్వమితి । యో వా యస్మిన్ ప్రదేశే సునివిష్టో భవతితం తస్మిన్ కుర్వీత న తు వ్రణస్యోపరి గ్రన్థిర్బాధాకరో యథాస్యాత్ ।

*ప్రతి పదార్థము :* తత్ర = అచట, కోశమ్ = కోశబంధమును, అఙ్గులిపర్వసు = వ్రేళ్ళ కణుపులయందు, విదధ్యాత్ = బంధింపవలెను, దామ = దామమును, సంబాధే-అఙ్గే = బాధ మిక్కుటముగా గల అంగమున; ఉత్సఙ్గం = ఉత్సంగమును, విలమ్బిని = వ్రేలాడు స్థలములందు, స్వస్తికం = స్వస్తిక బంధమును, సంధి-కూర్చ-భ్రూ-స్తనాన్తర-కక్షా-అక్షి-కపోల-కర్ణేషు = సంధులు, కూర్చము, కనుబొమలు, స్తనముల మధ్యభాగము, చంకలు, కన్నులు, చెక్కిళ్ళు, చెవులు-వీనియందు; అనువేల్లితం = అనువేల్లితమును, శాఖాసు = కాలు, చేతులందును; ముత్తోలీ = ముత్తోలీ బంధమును, గ్రీవా-మేఢ్రయోః = మెడ, మేఢ్రము

లందును; మణ్డలం = మండలమును, వృత్తే-అఙ్గే = వృత్తాకారమున నుండు అంగములందును; స్థగికాం = స్థగికాబంధమును, అఙ్గుష్ఠ-అఙ్గుల - మేఢ్రాగ్ర - మూత్రవృద్ధిషు = బొటనవ్రేలు, వ్రేళ్ళు, శిశ్నము-వీనియొక్క చివరి భాగములందు, మూత్రవృద్ధియందును; యమకం = యమక బంధము, యమల వ్రణయోః = జంటగా నుండు వ్రణములందును, ఖట్వామ్ = ఖట్వమును, హను-శఙ్ఖ-గణ్డేషు = హను, శంఖ, గండ ప్రదేశములందు; చీనమ్ = చీన బంధమును, అపాఙ్గయోః = కంటి బయటి కొలుకులందు; విబన్ధం = విబంధమును, ఉదర-ఊరు-పృష్ఠే = కడుపు, తొడలు, వీపుయందు; వితానం = వితానమును, మూర్ధాదౌ = తల మొదలగు, విపులే అఙ్గే = విశాలమైన అంగమునందు; గోష్పణం = గోష్పణబంధమును, నాసా-ఓష్ఠ-చిబుక-సక్థిషు = నాసిక-పెదవులు-గడ్డము-కాళ్ళయందు; పఞ్చాఙ్గీం = పంచాంగీ బంధమును, జత్రూర్ధ్వమ్ = జత్రువులకు పై ప్రాంతమునందును (బంధింపవలెను), ఇతి = అని, యో వా = ఏదైతే, యస్మిన్ = ఏ, ప్రదేశే = ప్రదేశమున, సు-నివిష్టః = బాగుగా కుదిరికగా బంధించునదై, భవతి = అగునో, తం = ఆ బంధమును, తస్మిన్ = ఆ స్థలమున, కుర్వీత = చేయవలెను, వ్రణస్య = వ్రణముయొక్క, ఉపరి = పైన, గ్రన్థిః = కట్టుయొక్క ముడి, బాధాకరః = బాధను కలిగించునదిగా, యథా = ఏ విధముగా, న-స్యాత్ = ఉండదో (ఆ విధముగా బంధనము చేయవలెను).

**తాత్పర్యము :** పై చెప్పబడిన బంధములలో వ్రేళ్ళకణుపులపై కోశబంధమును, బాధగల అవయవములపై దామబంధమును; వ్రేలాడు అవయవములపై ఉత్సంగబంధమును, సంధులు - కూర్చము, కనుబొమలు - స్తనాంతరప్రదేశము - చంకలు - కన్నులు - చెక్కిళ్ళు - కర్ణములు వీనిపై స్వస్తికబంధమును; ఊర్ధ్వ, అధోశాఖల యందు అనువేల్లితమును; గ్రీవము, మేఢ్రములపై ముత్తోలీ బంధమును, వృత్తాకార అంగములపై మండల బంధమును; అంగుష్ఠము, అంగుళులు, మేఢ్రము - వీని అగ్రభాగములపైన, మూత్ర వృద్ధి యందును స్థగికా బంధమును; రెండు వ్రణములను కలిపి బంధించుటకై యమక బంధమును; హను - శంఖ - గండ స్థలములపై ఖట్వమను బంధమును; అపాంగము లందు చీన బంధమును; ఉదర - ఊరు - పృష్ఠములపై విబంధబంధమును; తల మొదలగు విశాల ప్రదేశములపై వితాన బంధమును; నాసిక, పెదవులు, గడ్డపుకొన, కాళ్ళు - వీనిపై గోష్పణ బంధమును మెడ కొంకుల పైభాగమున పంచాంగీ బంధమును, ఉపయోగించి కట్టు కట్టవలెను.

వీనిలో ఏ ఏ ప్రదేశములపై ఏది చక్కగా అమరునో అచట దాని నుపయోగింపవలెను. కట్టుయొక్క ముడి వ్రణముపై బడి బాధ కల్గించునట్లు వేయరాదు.

***శశిలేఖ :*** కీటము యొక్క కోశ ఆకారమున నుండునది కోశము.

స్వస్తికము పైన కుడి వైపునకు పోయి క్రింద ఎడమ వైపునకు వచ్చి, చుట్టి, క్రింద దక్షిణము వైపునకు పోయి, పైకి వామభాగమునకు పోవునట్లు కట్టబడునది. ఇది సంధి ప్రదేశము లందు పయుక్తము.

అనువేల్లితము పొడవుగా నుండి చుట్టబడునది.

స్థగికా యనగా వ్రేలాడు తాంబూలపు కరకము.

ఖట్వాయనగా చతుర్బాహో పట్టకము.

చీనం యనగా కొంచెము విస్తీర్ణముగా వెడల్పుగా నుండు పట్టీ.

గోష్పణ - కృషీవలురు పక్షినివారణార్థ ముపయోగించు పాషాణ ధారణము.

(వడిసెల) ఈ ఆ కారమున నుండు పట్టీ.

పంచాంగీ - నాలుగు బాహువులు - ఒక ఊర్ధ్వ పట్టికా గలిగిన పట్టీ.

దోషానుసారము బంధన విధి

మూలము : బన్ధస్త్విష్టోఽనిలే దుష్టే దష్టే భగ్నే వ్రణేషు చ ।
తత్రాన్త్యయోర్ద్విధా బన్ధః సవ్యదక్షిణభేదతః ॥
త్రివిధస్త్వేవ సర్వత్ర గాఢశ్లథసమత్వతః ।
కఫవాతే ఘనో గాఢః పిత్తరక్తే తనుశ్లథః ।
వాతపిత్తే సమో బన్ధః కఫపిత్తవ్రణేషు చ ॥

*ప్రతి పదార్థము :* అనిలే = వాయువు, దుష్టే = దుష్టముకాగా, దష్టే = విష సర్పాదులు కరచిన, భగ్నే = విరిగినచోట, వ్రణేషు-చ = వ్రణములందును, బన్ధః-తు = కట్టు అయితే, ఇష్టః = కోరబడినది (సమ్మతమైనది, తత్ర = అందును, అన్త్యయోః = చివరి వానియందు (భగ్న, వ్రణములందు), బన్ధః = కట్టు, సవ్య-దక్షిణ భేదతః = సవ్యము, దక్షిణము అను భేదములతో, ద్విధా = రెండు విధములు.

సర్వత్ర-తు = అంతటను అయితే, గాఢ-శ్లథ-సమత్వతః = గట్టిది, వదులైనది, అంతగట్టి, వదులుగానిది అని, బంధః-తు = కట్టు అయితే, త్రివిధః = మూడు విధములైనది, కఫవాతే = కఫ-వాత వ్రణములందు, ఘనః = దట్టమై, గాఢః = గట్టిదియగు బంధము (ఉండవలెను), పిత్తరక్తే = పిత్త, రక్త వ్రణమందు, తనుశ్లథః = కొద్దిగా వదులు బంధము (ఉండవలెను), వాతపిత్తే = వాత, పిత్త వ్రణమున, సమః = అతిశ్లథము-అతి దృఢముగాని, బంధః = బంధము (ఉండవలెను). కఫ-పిత్త వ్రణేషు-చ = కఫ, పిత్త వ్రణములందైతే, సమః బంధః = సమమగు బంధము (ఉండవలెను)

తాత్పర్యము : వాతము దూషితమైనపుడును, సర్పదష్టాది విషవ్రణములందును, అస్థిభగ్నమైనపుడును, వ్రణములందును కట్లు కట్టవలెను. వానిలో చివరి రెండింటియందును (అనగా భగ్నములందు, వ్రణములందు) సవ్య-దక్షిణ భేదములచే కట్లు రెండు విధములు గట్టిగా నుండునది, వదులుగా నుండునది, అంతగట్టి-అంత వదులు గానిది అని కట్లు మూడు విధములు. వీనిలో కఫ వాత వ్రణములందు దట్టమై గట్టిగా నుండు కట్టును; పిత్త రక్త వ్రణములందు కొంచెము వదులుగా నుండు కట్టును; వాత పిత్త వ్రణములందు సమబంధమును ఉపయోగింపవలెను.

*శశిలేఖ :* సర్పాది దష్టవ్రణము లందు విషముపైకి పోకుండ దంశమునకు పైన బంధము చేయవలెను. దీని వలన సిరాదుల నుండి విషము పైకి ఎక్కదు.

అస్థి భగ్నాదులందు వ్రణము లేకున్నను బంధము చేయవలెను.

ఒక్కొక్కప్పుడు వామ పార్శ్వమున, ఒక్కొక్కప్పుడు దక్షిణపార్శ్వమున బంధనము చేయవలెను.

బంధన విషయము లందు మూడు విధములగు బంధనములు చెప్పబడినవి. అవి : గాఢ - శిథిల - సమ బంధనములు. సమమనగా అనతిగాఢ శిథిలము

## దేహమున వివిధ ప్రదేశములందు బంధన విధి

**మూలము : తథా స్ఫిక్ కక్షా వఙ్క్షణోరు శిరస్సు గాఢం బధ్నీయాత్ । శాఖావదన కర్ణ కంఠ మేఢ్రముష్కపృష్ఠపార్శ్వోదరోరస్సు సమమ్ । అక్ష్ణోః సంధిషు చ శిథిలమ్ । వాతశ్లేష్మజేషు తు శిథిలస్థానే సమమ్, సమస్థానే గాఢమ్ । గాఢస్థానే గాఢతరమ్। తథా శీతవసన్తయోస్త్ర్యహాత్ । పిత్త రక్తజేతు గాఢస్థానే సమమ్; సమస్థానే శిథిలమ్ తత్స్థానేనైవ । యథా శరద్గ్రీష్మయోః సాయంప్రాతః స్యాత్ ।**

*ప్రతి పదార్థము :* తథా = అట్లే, స్ఫిక్ = పిరుదులపై భాగములు, కక్షా = చంకలు, వంక్షణ = గజ్జలు, ఊరు = తొడలు, శిరస్సు = తల - వీనియందు, గాఢం = గట్టిగా, బధ్నీయాత్ = కట్టవలెను, శాఖా = కాలుచేతులు, వదన = ముఖము, కర్ణ = చెవులు, కంఠ = కంఠము, మేఢ్ర = శిశ్నము, ముష్క = వృషణములు, పృష్ఠ = వీపు, పార్శ్వ = ప్రక్కలు, ఉదర = కడుపు, ఉరస్సు = రొమ్ము - వీనియందు, సమమ్ = అంత గట్టి అంత వదులుగా నట్టి (బంధమును చేయవలెను), అక్ష్ణోః = కన్నులందు, సంధిషు = అస్థిసంధులందును, శిథిలమ్ = వదులుగా (బంధనము చేయవలెను), వాతశ్లేష్మజేతు = వాతశ్లేష్మముల వలన గలిగిన వ్రణములందు, శిథిలస్థానే = వదులుగానున్నచోట, సమం = సమబంధమును (కట్టవలెను), సమస్థానే = సమస్థానమున, గాఢం = గాఢబంధమును, గాఢస్థానే = గాఢమగు స్థానమున, గాఢతరం = మిక్కిలి గాఢమైన బంధమును (కట్టవలెను), తథా = అట్లే, శీత-వసన్తయోః = శిశిర, వసంత ఋతువులలో, త్ర్యహాత్ = మూడు దినముల తరువాత; పిత్త రక్తజే-తు = పిత్త జరక్త జవ్రణములందైతే, గాఢస్థానే = గాఢమైన చోట, సమం = సమ బంధమును; సమస్థానే = సమమైనచోట, శిథిలం = శిథిలబంధమును, తత్స్థానే = శిథిల స్థానమున, నైవ = బంధమే ప్రయోగింపరాదు, తథా = అట్లే, శరత్-గ్రీష్మయోః = శరత్-గ్రీష్మ ఋతువులలో, సాయం = సాయంకాలమున, ప్రాతః = ప్రాతఃకాలమున, స్యాత్ = ఉండును (అనగా కట్టు విప్పి మరల కట్టవలెను).

*తాత్పర్యము :* పిరుదుల పైభాగము, చంకలు, గజ్జలు, ఊరువు, శిరస్సు-ఈభాగము లందు కట్టు గట్టిగా కట్టవలెను. కాలు చేతులు, ముఖము, చెవులు, కంఠము, మేఢ్రము, వృషణములు, వీపు, పార్శ్వములు, ఉదరము, ఉరోభాగము లందు అంత గట్టిగాను - అంతవదులుగాను లేకుండునట్లు కట్టవలెను. కన్నులందును, సంధులందును వదులుగా కట్టవలెను. వాతశ్లేష్మ వ్రణములందు శిథిలస్థానమున సమ బంధమును, సమస్థానమున గాఢ బంధమును, గాఢస్థానమున అతిగాఢముగ బంధనమును చేయవలెను. పిత్త, రక్తజ వ్రణములందు గాఢస్థానమున సమబంధము, సమస్థానమున శిథిల బంధమును చేయవలెను. శిథిలస్థానమున బంధనమే చేయరాదు.

శిశిర, వసంత ఋతువులలో మూడు దినముల కొక మారు కట్టుకట్టవలెను. శరద్ - గ్రీష్మ ఋతువులలో ఉదయము, సాయంత్రము కట్టు కట్టవలెను.

## వ్రణమున బంధనము చేయకున్నచో గలుగు అపాయము

**మూలము : అబధ్యమానః పునర్దంశమశకతృణకాష్ఠపాంశు శీతవాతాతపాది సంపర్కా-ద్వివిధోపద్రవోపద్రుతో దుష్టతా ముపైతి । స్నేహశ్చాత్ర న చిరం తిష్ఠతి భేషజ మచిరాచ్ఛుష్యతి కృచ్ఛ్రేణ రోహతిరూఢే చ వైవర్ణ్యం భవతి ।**

*ప్రతి పదార్థము :* అబధ్యమానః = కట్టుకట్ట బడనిదై (వ్రణము), దంశ - మశక - తృణ - కాష్ఠ - పాంశు - శీత - వాత-ఆతప - ఆది సంపర్కాత్ = ఈగలు, దోమలు, గడ్డి పోచలు, సన్నని పుల్లలు, దుమ్ము, చలి, గాలి, ఎండ మొదలగు వాని యొక్క సంపర్కము వలన, పునః = మరల, వివిధ - ఉపద్రవ -ఉపద్రుతః = అనేకములగు ఉపద్రవములచే పైన ద్రవించినదై, దుష్టతాం = దుష్టతను, ఉపైతి = పొందును, అత్ర = ఈ కట్టుకట్టని వ్రణ మందు, స్నేహః - చ = స్నేహమును, చిరం = చాలకాలము, న- తిష్ఠతి = నిలువదు, భేషజం = ఔషధము, అచిరాత్ = త్వరగా, శుష్యతి = ఎండిపోవును, కృచ్ఛ్రేణ = అతి కష్ట ముగా, రోహతి = మానును, రూఢేచ = అట్లు అతికష్టముగా మానినను, వైవర్ణ్యం = రంగు మార్పు, భవతి = కలుగును.

తాత్పర్యము : వ్రణమునకు కట్టు కట్టకపోవుటచేత ఈగలు, దోమలు, గడ్డిపోచలు, పుల్లలు, దుమ్ము, చలి, గాలి, ఎండ మొదలగువాని సంపర్కముచేత అనేకవిధములగు ఉప ద్రవములు గలిగి, అది దుష్టమగును. ఇంకను అచట వైచిన స్నేహము నిలువదు. ఔషధము, త్వరగా ఎండిపోవును. కష్టము మీదగాని మానదు. మానినను, అచట చర్మముపై రంగు మారును. అందుచేత వ్రణములకు బంధనము చేయవలయును.

## వ్రణమునకు బంధనము చేయుటచే గలుగు అప్రయోజనము

**మూలము : అపి చ—**

చూర్ణితం మథితం భగ్నం విశ్లిష్టమథపాటితమ్ ।
అస్థి స్నాయుసిరాచ్ఛిన్నమస్థిబన్ధేన రోహతి ।
ఉత్తానశయనాద్యాను సర్వేహాసు న పీడ్యతే ।
ఉద్వృత్తౌష్ఠస్సముత్సన్నో విషమః కఠినోఽతిరుక్ ॥
సమో మృదు రరుక్ శీఘ్రం వ్రణశుద్ధ్యతి రోహతి ।
స్థిరాణా మల్పమాంసానాం రౌక్ష్యాదనవరోహతమ్ ॥
ప్రచ్ఛాద్య మౌషధం ప్రత్త్రైర్యథాదోషం యథర్తు చ ।
అక్షీర్ణ తరుణాచ్ఛిద్రైః సమన్తాత్సునివేశితైః ॥
ధౌతైరకర్కశైః క్షీరి భూర్జార్జునకదంబజైః ।

*ప్రతి పదార్థము :* చూర్ణితం = చూర్ణమైనదియు, మథితం = నజ్జునజ్జుగానైనదియు' భగ్నం = విరిగినదియు, విశ్లిష్టం = సంధులనుండి జారి విడివడినదియు, అథ = మరియు, పాటితం = చీల్చబడినదియు, అస్థి-స్నాయు-సిరాచ్ఛిన్నమ్ = ఎముకలు, స్నాయువులు,

సిరలు తెగినట్టిదియు అగు, అస్థి = ఎముక, బన్ధేన = కట్టు కట్టుటచేత, రోహతి = మానును, ఉత్థాన-శయానాద్యాసు = లేచుట, పరుండుట మొదలగు, సర్వేహాసు = అన్ని చేష్టలవలన, న-పీడ్యతే = బాధింపబడదు.

ఉద్వృత్తౌష్ఠః = (వ్రణముయొక్క) అంచులు పైకి వచ్చినదియు, సముత్సన్నః = పైకి ఉబ్బినదియు, విషమః = విషమమైనదియు, కఠినః = కఠినమైనదియు, అతి రుక్ = మిక్కుటమగు బాధ గలదియు (అగువ్రణము కట్టుకట్టుటచేత), సమః = సమమైనదై, మృదుః = మెత్తనైనదై, అరుక్ = నొప్పిలేనిదై, వ్రణః = వ్రణము, శీఘ్రం = త్వరగా, శుద్ధ్యతి = పరిశుద్ధమగును, రోహతి = మానును, స్థిరాణాం = స్థిరములును, అల్పమాంసానాం = స్వల్పముగా మాంసము గల వ్రణములు, రౌక్ష్యాత్ = రూక్షతవలన, అనవరోహతాం = మానకుండుటను (పొందును), (అట్టి వ్రణములకు) యథాదోషం = దోషము ననుసరించియు, యథా ర్తు-చ = ఋతువు ననుసరించియు, అజీర్ణ-తరుణ-అచ్ఛిద్రైః = లేతవి, చిరుగనివి, రంధ్రములు లేనివి, ధౌతైః = కడిగినవి, అకర్కశైః = గరుకుగా లేనివి, సమన్తాత్ = వ్రణ మంతటను, సు-నివేశితైః = బాగుగా చుట్టబడినవియగు, క్షీరి-భూర్జ-అర్జున-కదంబజైః-పత్రైః = క్షీరివృక్ష, భూర్జ, అర్జున, కదంబ పత్రములచేత, ఔషధం = మందు, ఆచ్ఛాద్యం = కప్పదగినది.

తాత్పర్యము : వ్రణమునందలి అస్థి చూర్ణమైనను, నజ్జునజ్జుగానైనను, విరిగినను, సంధినుండి జారినను, చీల్చబడినను, సిరా-స్నాయ్వాదులు తెగినను, కట్టు కట్టుటచేత అట్టి అస్థి మరల పెరిగి వ్రణము మానును.

వ్రణమున అంచులు పైకి వచ్చినను, వ్రణము ఉబ్బినను, విషమముగా నున్నను, కఠినముగా నున్నను, ఎక్కువ బాధ ఉన్నను, కట్టు కట్టుటవలన సమమై, మృదుత్వమును బొంది, నొప్పి తగ్గి, త్వరగా పరిశుద్ధత నొంది మానును.

స్వల్ప మాంసము గలిగి, స్థిరముగా నుండు వ్రణములు రూక్షముగ నుండుటచేత త్వరగా మానవు. అట్టివానియందు దోషము ననుసరించియు, ఋతువు ననుసరించియు, క్షీరీ వృక్షములయొక్కయు, భూర్జ, అర్జున, కదంబపత్రముల చేతను వ్రణముపై నుండు ఔషధమును కప్పవలెను. అట్టి పత్రములు చిరుగనివి, లేతవి, రంధ్రములు లేనివిగా నుండి, చక్కగా కడిగి ఉపయోగింపబడవలెను.

## బంధనము చేయదగని వారు

మూలము : కుష్ఠినామగ్నిదగ్ధానాం పిటికా మధుమేహినాం ।
కణికా శ్చోన్దుర విషయే క్షారదగ్ధా విషాన్వితాః ॥

మాంసపాకే న బద్ధవ్యా గుదపాకే చ దారుణే ।
శీర్యమాణాః సరుగ్దాహాః శోఫావస్థావిసర్పిణః ॥

*ప్రతి పదార్థము :* కుష్ఠినాం = కుష్ఠ రోగుల వ్రణములు, అగ్ని దగ్ధానాం = అగ్ని చే కాలిన వ్రణములు, మధు - మేహినాం - పిటికా = మధుమేహ రోగులకు జనించు పిటికలు, ఉన్దుర విషే = ఎలుక విషముచే కలిగిన వ్రణములు, క్షారదగ్ధాః = క్షారముచే కాలి ఏర్పడిన వ్రణములు, విషాన్వితాః = విషముతో గూడిన వ్రణములు, కణికాః = కణికలుగా నున్న వ్రణములు, మాంసపాకే = మాంసము పుండైన వ్రణములు, దారుణే-గుదపాకే = తీవ్రమగు గుదపాకము, శీర్యమాణాం = కుళ్లినవి, సరుక్ దాహాః = నొప్పి, మంటతో గూడినవి, శోఫావస్థాః = వాపుతోనున్న వ్రణములు, విసర్పిణః = విసర్ప వ్యాధియందలి వ్రణములు, న - బద్ధవ్యాః = కట్టు కట్టదగినవి.

*తాత్పర్యము :* కుష్ఠరోగమందలి వ్రణములు, అగ్నిదగ్ధ, క్షారదగ్ధవ్రణములు, మధుమేహ పిటికలు, ఎలుక విషముచే కలిగినవి, విషముతో గూడినవి, కణికలుగా నున్నవి, మాంసము పుండైనవి, తీవ్రమగు గుదపాకము, కుళ్ళిన వ్రణములు, ఎక్కువ నొప్పి - మంటలతో గూడినవి, శోఫావస్థ యందున్నవి, విసర్ప వ్రణములు - వీని యందు బంధనము చేయరాదు.

## వ్రణమున క్రిమి నిర్హరణము

**మూలము :** అరక్షయా వ్రణేయస్మిన్ మక్షికానిక్షిపేత్ కృమీన్ ।
తే భక్షయన్తః కుర్వన్తి రుజాశోఫాస్ర సంస్రవాన్ ॥
సురసాదిం ప్రయుఞ్జీత తత్ర ధావన పూరణే ।
సప్తపర్ణ కరఞ్జార్కనిమ్బరాజాదన త్వచః ॥
గోమూత్ర కల్కితో లేపః సేకః క్షారాంబునాహితః ।
ప్రచ్ఛాద్య మాంస పేశ్యావా వ్రణం తానాశు నిర్హరేత్ ॥

*ప్రతి పదార్థము :* అ - రక్షయా = వ్రణమును సరిగా రక్షింపక పోవుట చేత, యస్మిన్ వ్రణే = ఏ వ్రణమునందు, మక్షికా = ఈగలు, కృమీన్ = సూక్ష్మక్రిములను, నిక్షిపేత్ = పడవేయునో, తే = ఆ క్రిములు, భక్షయన్తః = వ్రణమును తినుచున్నవై, రుజా - శోఫ - అస్ర - సంస్రవాన్ = నొప్పి, వాపు, రక్తస్రావములను, కుర్వన్తి = కలుగజేయును, తత్ర = అందు, ధావన - పూరణె = (వ్రణమును) కడుగుటకు, నింపుటకు, సురసాదిం = సురసాది గణ ద్రవ్యమున చెప్పబడిన ఔషధ ద్రవ్యములను, ప్రయుఞ్జీత = ప్రయోగించవలెను, సప్తపర్ణ - కరఞ్జ - అర్క - నిమ్బ-రాజాదనత్వచః = ఏడాకుల అరటి, కానుగు, జిల్లేడు, వేప, రాజాదన చెట్లయొక్క పట్టలను, గోమూత్ర కల్కితం = గోమూత్రముతో నూరి కల్కము చేయబడిన, లేపః = లేపముయు, క్షారాంబునా = క్షారోదకముచేద, సేకః = తడుపుటయు, హితః = హితమైనవి, వా = లేక, మాంస పేశ్యా = మాంసపేశి చే, వ్రణం = వ్రణమును, ప్రచ్ఛాద్య = కప్పి, తాన్ = ఆసూక్ష్మక్రిములను, ఆశు = త్వరగా, నిర్హరేత్ = పోగొట్టవలెను.

**తాత్పర్యము :** వ్రణమునకు సరియగు రక్షణ లేకపోవుటచే ఈగల వలన సూక్ష్మ క్రిములు వ్రణములందు చేర్చబడును. ఈ క్రిములు వ్రణమును తినుచు, బాధను - వాపును -

రక్త స్రావమును కలిగించును. అట్టి స్థితియందు సురసాది గణ ద్రవ్యముల నుపయోగించి వ్రణమున ధావన - పూరణములు చేయవలెను. ఇంకను, సప్త పర్ణ - కరంజ - అర్క - నింబ - రాజాదన వృక్షముల పట్టల చూర్ణమును గోమూత్రముతో కల్కముగా నూరి లేపము చేయుట, క్షారోదకముచే సేకము చేయవలెను. లేక వ్రణమును మాంస పేశిచే కప్పి క్రిము లను త్వరగా పోగొట్టవలెను.

వి. వ్యా. : సురసాది గణము సూత్రస్థానము 18వ అధ్యాయమున వివరించబడినది. మాంసపేశిని వ్రణముపై ఆచ్ఛాదన చేయుటచే అచట క్రిములన్నియు ఆకర్షితములై చేరును. అపుడామాంసపేశిని వ్రణముపై ఆచ్ఛాదన చేయుటచే అచట క్రిములన్నియు ఆకర్షితములై చేరును. అపుడా మాంసపేశిని తొలగించుటచే క్రిమి నిర్హరణము చేయవలెను.

### వ్రణ చికిత్సా సూత్రములు — వ్రణితునకు వర్జనీయములు

**మూలము : ఉత్పద్యమానాసు తాసుతాస్వవస్థాసు దోషాదీనవేక్ష్య యథాస్వము ప్రక్రమైరు పక్రమేత్ । నీ చైనం త్వరమాణః సాన్తర్దోషముపసంరోహయేత్ । సహ్యాల్పే నాప్యపచారేణాన్తరు-త్సఙ్గం కృత్వా భూయో వికురుతే। తస్మాత్సుశుద్ధం రోపయేత్ । రూఢేప్యజీర్ణ - వ్యాయామ వ్యవాయాదీన్ వివర్జయేత్ ।**

**మాంసాన్ షట్ సప్తావా నృణాం విధిరేషప్రశస్యతే ।**
**ఇతీదం వ్రణమా శ్రిత్య దిఙ్మాత్రము పదర్శితమ్ ॥**
**ఉత్తరే విస్తరస్తస్య వక్ష్యతే సాధనం ప్రతి ॥**

*ప్రతి పదార్థము :* ఉత్పద్యమానాసు = కలుగుచున్న, తాసు - తాసు - అవస్థాసు - చ = ఆయా దశలందున్నా, దోషాదీన్ = దోషములు మొదలగు వానిని, అవేక్ష్య = చూచి, యథాస్వం = తగు విధమున, ఉపక్రమైః = ప్రారంభ చికిత్సా క్రియలచేత, ఉపక్రమేత్ = చికిత్సింపవలెను. (అంతేగాని), స - అన్తర్దోషం = లోపల దోషమున్న, ఏనం = ఈ వ్రణమును, త్వరమాణః = త్వరపడినవాడై, న - ఉప సంరోహయేత్ - చ = మానుపరాదు, సః = ఆ వ్రణము, అల్పేన = స్వల్పమైన, అపచారేణ - అపి = అపచారముచేత గూడ, అన్తః = లోపల, ఉత్సఙ్గం = వాపును, కృత్వా = కలిగించి, భూయః = మరల, వికురుతే = వికారములను చేయును, తస్మాత్ = ఆ కారణము చేత, సు - శుద్ధం = బాగుగా శుద్ధమైన వ్రణమును, రోపయేత్ = రోపణము చేయవలెను, రూఢే అపి = మానినను, అజీర్ణ-వ్యాయామ-వ్యవాయాదీన్ = అజీర్ణ కర భోజనములను, వ్యాయామమును, సంభోగము మొదలగు వానిని, వివర్జయేత్ = వర్జించవలెను.

నృణాం = మానవులకు, ఏషః - విధిః = ఈ విధి, షట్ - వా - సప్త = ఆరులేక ఏడు, మాసాన్ = నెలల పర్యంతము, ప్రశస్యతే = చెప్పబడినది.

ఇతి = అని, ఇదం = ఈ చెప్పబడినది, వ్రణం - ఆశ్రిత్య = వ్రణమును గూర్చి, దిఙ్మాత్రం = సూచన ప్రాయముగా, ఉపదర్శితమ్ = చూపబడినది, ఉత్తరే = ఉత్తర స్థానమున, తస్య = వ్రణ చికిత్స యొక్క, సాధనం - ప్రతి = సాధించు విషయమును గూర్చి, విస్తరః = వివరము, వక్ష్యతే = చెప్పబడనున్నది.

**తాత్పర్యము :** వ్రణము కలుగు చున్నపుడే దాని అవస్థావిశేషమును, దోషదూష్యము లను గమనించి, యథానుసారము చికిత్స ప్రారంభించవలెను. అంతర్దోషము గల వ్రణమును త్వరపడి మాన్పినచో స్వల్పమగు అపచారము వలన గూడ లోపల వాపును కలిగించి నానా విధ వికారములను కలిగించును. అందుచే శుద్ధవ్రణమునే రోపణము చేయవలెను. వ్రణము మానిన పిదప గూడ ఆరు - ఏడు మాసముల వరకు అజీర్ణకర భోజనములను, వ్యాయామ మును, సంభోగము మొదలగు వానిని వ్రణితుడు విసర్జించవలెను.

ఈ విధముగా వ్రణచికిత్స ఈ అధ్యాయమున సూచనాప్రాయముగా చెప్పబడినది. ఉత్తర స్థానమున విస్తరింపబడును.

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## ముప్పది తొమ్మిదవ అధ్యాయము

**మూలము :** అథాతః క్షారపాక విధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః ।
ఇతి హస్మాహు రాత్రేయాదయో మహర్షయః ॥

*ప్రతి పదార్థము :* అథ = అటు తరువాత (శస్త్రకర్మవిధి అను అధ్యాయమును వివరించిన పిదప), అతః = ఇందువలన, క్షారపాక విధిం అధ్యాయం = క్షారపాక విధిని తెలిపెడు అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము, ఇతి హ = ఈ విధముగానే, ఆత్రేయాదయః మహర్షయః = ఆత్రేయుడు మొదలగు మహర్షులు, ఆహుః స్మ = చెప్పి యుండిరి.

*తాత్పర్యము :* శస్త్రకర్మవిధి అను అధ్యాయమును వివరించిన తరువాత, క్షారపాక విధిని తెలిపెడు అధ్యాయమును, ఆత్రేయాది మహర్షులు తెలిపిన విధముగా వివరించెదము.

(క్షారపాక క్రమము, క్షార కర్మ విధానము గూడ ఇచట వివరించబడును).

### క్షార గుణములు - ఉపయోగింపబడు వ్యాధులు

**మూలము :** క్షారోహి నా మౌషధ సమవాయ నిర్వృత్తేః సర్వరసాధిష్ఠానం కటుక లవణ భూయిష్ఠ- స్తీక్ష్ణో దహనః పాచనోఽవదారణో విలయనః శోధనో రోపణః కృమ్యా మమేదో విషా పహః సర్వశస్త్రాను శస్త్రాణాం చ వరిష్ఠశ్ఛేదన భేదనపాటనలేఖన కరణాద్యతశ్చ సంబాధావ కాశజేషు దుఃఖావచరణీయ శస్త్రేషు నాసార్శోఽర్బుదా దిషు శస్త్రేణ చాసిద్ధ్యత్సు దుష్టవ్రణేషు బహుశః ప్రకోపిషు ప్రయుజ్యతే ।

*ప్రతి పదార్థము:* క్షారోహినామ = క్షారమనగా, ఔషధసమవాయ నిర్వృత్తేః = ఔషధ ములయొక్క సమూహము చేత సిద్ధమగుట చేత, సర్వరసాధిష్ఠానః = అన్నిరసములకు అధిష్ఠానమైనది, కటు క లవణ- రసభూయిష్ఠః = కటు, లవణరసములతో నిండినది, తీక్ష్ణః = తీక్ష్ణమైనది, దహనః = కాల్చునట్టిది, పాచనః = పచనము చేయునట్టిది, అవదారణః = చీల్చు నట్టిది, విలయనః = కరగించునది, శోధనః = శుద్ధిజేయునది, రోపణః = వ్రణములను మాన్పు నట్టిది, క్రిమి - ఆమ - మేదో - విషాపహః = క్రిమి రోగము, ఆమదోషము, మేదోరోగము, విషములు - వీనిని బోగొట్టునది, యతః = ఎందు వలన, ఛేదన = తెగగొట్టుట, భేదన = పగుల గొట్టుట, పాటన = చీల్చుట, లేఖన - కరణాత్ = గీకుట - వీనిని చేయునదగుట వలన, సర్వ - శస్త్ర - అను శస్త్రానాం చ = అన్ని శస్త్రములు, అనుశస్త్రములలోనూ, వరిష్ఠః = శ్రేష్ఠమైనదో, (అందువలన), సంబాధావకాశజేషు = బాధగల ప్రదేశము లందు, దుఃఖావచరణీయ శస్త్రేషు = శస్త్రముల నుపయోగించుటకు కష్టమగునపుడును, నా

సార్శోఒర్బుదా దిషు = నాసార్శస్సు, అర్బుదము మొదలగు వ్యాధు లందును, శస్త్రేణ - అసిద్ధ్యత్సు - చ = శస్త్రముల వలన సాధ్యము గానపుడును, బహుశః = పలువిధములుగా ప్రకోపిషు = (దోషములు) ప్రకోపించిన, దుష్టవ్రణేషు = దుష్ట వ్రణములందు, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నది.

తాత్పర్యము : క్షారమనునది వివిధములగు ఔషధముల కలయిక చేత సిద్ధమగుటచే సర్వరసములకు అధిష్ఠానమైనది. అయినను కటు - లవణ రసములను ఎక్కువగా కలిగి యుండి, తీక్ష్ణమైనదై, దహన, పాచన, అవదారణ, విలయన, శోధన, రోపణ కర్మలను చేయునదై, క్రిమి, ఆమ, మేదో విషములను హరించునదై యుండును. ఛేదన, భేదన, పాటన, లేఖన కర్మలను చేయునదగుటచే శస్త్ర-అను శస్త్రములలో శ్రేష్ఠమైనది. అందుచే ఇట్టి క్షారము ఎక్కువ బాధగల ప్రదేశములందు, శస్త్రముల నుపయోగించుట కష్టమైనపుడు, నాసార్శస్సు-అర్బుదము మొదలగు వ్యాధులందు, శస్త్రకర్మకు అసాధ్యమగు వ్యాధులందును, బహుదోష ప్రకోపము గల దుష్ట వ్రణములందును ఉపయోగించబడుచున్నది.

*శశిలేఖ* : సంబాధావ కాశజములు అనగా సంకట ప్రదేశములందు జనించిన వ్యాధులు. వీనియందు శస్త్రకర్మ చేయుట కష్టము.

వి. వ్యా. : సుశ్రుతుడు, "తత్ క్షరణాత్ - క్షణనాద్వా - క్షారః" అనగా దుష్టత్వ జ్మాంసాదులను చాలనము చేయుటచేత - లేక హింసనము చేయుట చేత క్షారమనబడునని తెలిపెను. క్షారము ఛేదనము గనుకను, అగ్ని - జలౌకములకు అట్టి గుణము లేకుండుటచే క్షారము వాని కంటె శ్రేష్ఠము. పిత్తజార్శస్సు నందు ప్రత్యేకముగ ఉపయోగింపదగిన దగుట చేత, విశేషక్రియావచరణము దీనియందా పాదింపబడినదని డల్హణుని వ్యాఖ్య.

## క్షార భేదములు - అవి ఉపయోగింపబడు వ్యాధులు

మూలము : సద్వివిధో బాహ్యాన్తః పరిమార్జనేన । తత్రార్శోఒర్బుద భగన్దర గ్రన్థి దుష్ట వ్రణ నాడీ-చర్మకీల వర్త్మముఖ రోగకుష్ఠ కిలాసతిలకాలకాదిషు బహిః పరిమార్జనేన। అన్తః ప్రమార్జనేన తు గుల్మగరోదరాగ్ని సాదశూలానాహాశ్మరీ శర్కరాదిషు । స యథాస్వమేవోప దేక్ష్యతే ।

*ప్రతి పదార్థము* : సః = ఆక్షారము, బాహ్య - అభ్యన్తర - పరిమార్జన భేదేన = బాహ్యపరిమార్జనక్షారము, అంతః పరిమార్జన క్షారము అను భేదముల చేత, ద్వి విధః = రెండు విధములు.

తత్ర = అచట, బహిః పరిమార్జనేన = బాహ్యప్రయోగ క్షారముచేత, అర్శ = అర్శస్సు, అర్బుద = అర్బుదము, భగన్దర = భగందరము, గ్రన్థి = గ్రంథి, దుష్టవ్రణ = దుష్ట వ్రణము, నాడీ = నాడీవ్రణము, చర్మకీల = చర్మకీలము, వర్త్మ - ముఖరోగ = కనురెప్పల, నోటి వ్యాధులు, కుష్ఠ = కుష్ఠము, కిలాస = కిలాసము, తిలకాలకాదిషు = తిలకాలకము మొద రోగములందు, (చికిత్స చేయబడును).

అన్తః ప్రమార్జనేన-తు = అంతఃప్రమార్జనముచేతనైతే, గుల్మ = గుల్మము, గర = గరవిషము, ఉదర = ఉదరము, అగ్నిసాదము = అగ్నిమాంద్యము, మలసఙ్గ = మలావరోధము, శూల = శూల, ఆనాహ = ఆనాహము, అశ్మరీ = అశ్మరీ, శర్కరాదిషు = శర్కరా మొదలగు వ్యాధులందు (చికిత్స చేయబడును).

సః = అట్టి చికిత్సావిధానము, యథాస్వమేవ = ఆయారోగముల చికిత్సా వివరణయందు, ఉపదేక్ష్యతే = ఉపదేశింపబడును.

**తాత్పర్యము :** ఆక్షారము బాహ్య పరిమార్జన క్షారము అంతః పరిమార్జన క్షారము అని రెండువిధములు అందు, అర్శస్సు, అర్బుదము, భగందరము, గ్రంథి, దుష్టవ్రణము, నాడీవ్రణము, చర్మ కీలము, వర్త్మరోగము ముఖరోగము లందును, కుష్ఠము, కిలాసము, తిలకాలకము మొదలగు చర్మ వ్యాధులందును బాహ్యపరి మార్జన క్షారముపయోగించబడును.

గుల్మము, గర విషము, ఉదరము, అగ్ని మాంద్యము, మలావరోధము, శూల, ఆనాహము, అశ్మరీ, శర్కరా మొదలగు రోగములందు అంతఃపరిమార్జన క్షారముపయోగింపబడును. (అనగా క్షారము లోనికి ఇవ్వబడును). ఈ క్షార ప్రయోగవిశేష వివరణము ఆయా వ్యాధుల విశేష చికిత్సలలో తెలుపబడును.

వి. వ్యా. : సుశ్రుతమున ప్రతిసారణీయ - పానీయ భేదములతో ఇదియే వివరించబడినది.

## క్షారకర్మకు అనర్హులు

**మూలము : న తూభయోఽపి యోజ్యో భీరుదుర్బలక్షామ వాతపిత్తార్దితజ్వరాతిసారపాణ్డు శిరోహృదయ రోగమేహాక్షిపాకతిమిరారోచకాతుర కృతవమన విరేకర్తుమతీగర్భిణ్యుద్వృత్త ఫల యోని సర్వాఙ్గశూల విషమద్యపీతేషు ।**

*ప్రతి పదార్థము :* భీరు = భయపడుస్వభావము గల వారికి, దుర్బల = బలహీనులకు, క్షామ = ధాతుక్షయము గల వారికి, వాత - పిత్త = వాయువు, పిత్తము ప్రకోపించిన వారికి, అర్దిత = అర్దితవాతము, జ్వర = జ్వరము, అతిసార = అతిసారము, పాణ్డు = పాండు వ్యాధి శిరో-హృదయ రోగ = శిరో, హృదయ రోగములు గలవారికి, మేహ = మేహరోగము, అక్షిపాక = అక్షిపాకము, తిమిర = తిమిరము, అరోచక - ఆతుర = అరోచకముగల రోగులకు, కృత - వమన-విరేక = వమన, విరేచన కర్మలు చేయించుకున్న వారికి, ఋతుమతీ = బహిష్ఠు అయిన వారికి, గర్భిణీ = గర్భిణులకు, ఉద్వృత్త ఫలయోని = ఉద్వృత్తఫలయోని అను యోనివ్యాపత్తుగల వారికి, సర్వాఙ్గ-శూల = శరీరమందంతట నొప్పులుగల వారికి, విష-మద్య - పీతేషు = విషార్తులు, మద్యమును త్రాగిన వారికిని, ఉభయః అపి = రెండు విధములైన క్షారములును, న - తు - యోజ్యః = ప్రయోగింపదగినవి కావు.

**తాత్పర్యము :** భీరువులు, దుర్బలురు, ధాతుక్షయ గలవారు, వాత- పిత్తదోషములు ప్రకోపించినవారు, అర్దిత వాతము, జ్వరము, అతిసారము, పాండు వ్యాధి గలవారు, శిరో -

హృద్రోగములు గలవారు, మేహము, అక్షిపాకము, తిమిరము, అరోచకము - గలవారు, వమన - విరేచన కర్మలు చేయించుకున్నవారు, ఋతు మతి - గర్భిణి యగు స్త్రీలు, ఉద్వృత్త ఫలయోని అను యోని వ్యాధిగల స్త్రీలు, సర్వాంగములందు శూలగలవారు, విషార్తులు, మద్యపానము చేసినవారు-వీరందరును రెండు విధములగు క్షార ప్రయోగమునకు అనర్హులు.

వి. వ్యా. : ఉద్వృత్త ఫలయోని = వాతము వేగముగ చుట్టుటచే యోనిని పీడించు నురుగుతో గూడి యుండు రజస్సును బహుకష్టముగా స్రవింప జేయునట్టి ఉదావర్త రోగము.

## క్షారకర్మకు నిషిద్ధ ప్రదేశములు

**మూలము : మర్మసిరాస్నాయు సన్ధి తరుణాసన్థి సేవనీధమనీగలనాభి నఖాన్తరముష్కశేఫః స్రోతః స్వల్ప-మాంసేషు చ దేశేష్వక్ష్ణోశ్చాన్యత్ర వర్త్మరోగాత్ ।**

ప్రతి పదార్థము : మర్మ = మర్మప్రదేములందు, సిరా = సిరలయందు, స్నాయు = స్నాయువులందు, సన్ధి = సంధులందు, తరుణాస్థి = తరుణాస్థులందు, సేవనీ = సేవనులందు, ధమనీ = ధమమలందు, గళ = కంఠ ప్రదేశమున, నాభి = నాభిప్రదేమున, నఖాన్తర = గోళ్ల లోపలి భాగములందు, ముష్క = వృషణములందు, శేఫః = మేఢ్రమున, స్రోతః = స్రోతస్సులందు, స్వల్పమాంసేషు దేశేషు = స్వల్పము మాంసముండు ప్రదేశములందు, వర్త్మరోగాత్ = కనురెప్పల వ్యాధులకంటె, అన్యత్ర = ఇతరములగు, అక్ష్ణోః - చ = కంటి వ్యాధులందును (న తు యోజ్యః = క్షారము ప్రయోగింపదగినది కాదు).

తాత్పర్యము : మర్మ ప్రదేశములందు, సిరా, స్నాయు, సంధి, తరుణాస్థి, సేవనీ, ధమనీ, కంఠ ప్రదేశ, నాభి ప్రదేశములందు, గోళ్లక్రింద, వృషణ మేఢ్రములందు, స్రోతస్సులందు, స్వల్పమాంసముండు చోట్ల, వర్త్మరోగములు తప్ప మిగిలిన నేత్రవ్యాధులందును క్షార కర్మ నిషిద్ధము.

## క్షారా నర్హ కాలము

**మూలము : తథాతిశీతోష్ణ వర్షదుర్దిన ప్రవాతేషు చ ।**

ప్రతి పదార్థము : తథా = అట్లే, అతి = ఎక్కువగా, శీత = చలి, ఉష్ణ = ఎండ వేడి, వర్ష = వర్షము, దుర్దిన = మేఘావృతమైయున్న దినములందు, ప్రవాతేషు చ = అధికముగా వాయువులు వీచుచుండు సమయమునను (న. తు. యోజ్యః = క్షారకర్మ చేయదగినది కాదు).

తాత్పర్యము : ఇంకను, ఎక్కువ చలి, ఎండవేడి, వర్షము గల సమయమున, ఆకాశము మేఘావృతమైయున్న దినములందును, అధికముగా వాయువులు వీచుచుండు సమయములందును క్షార కర్మ చేయరాదు.

## బహిః పరిమార్జన క్షార భేదములు

**మూలము : అథ బహిః పరిమార్జన స్త్రివిధో మధ్యోమృదు స్తీక్ష్ణశ్చ ।**

ప్రతి పదార్థము : అథ = అటు తరువాత, మధ్యః = మధ్యమముమృదువైనది, తీక్ష్ణః-చ = తీక్ష్ణమైనదియును, (అని), బహిః పరిమార్జనః = బాహ్యప్రయోగ క్షారము, త్రివిధః = మూడు విధములు.

తాత్పర్యము : బాహ్య ప్రయోగక్షారము మృదు - మధ్య - తీక్ష్ణ భేదముచే మూడు విధములుగ నుండును.

## మధ్యమ క్షారపాక విధి

**మూలము :** తస్యపాకవిధిః – శరదిశుచిరుపోషితః శుక్లవాసా ప్రశస్తేఽహని ప్రశస్తదేశ జాతం మధ్యమ వయసమనుపహతం మహాన్తం కాలముష్కకం సురావలల సుమనోఽక్షతాదిభిశ్చతు రిశం దత్త్వా (కృత్వా) ప్రదక్షిణం చాభ్యర్చ్యైన మధివాసయేత్ ।

ప్రతి పదార్థము : తస్య = క్షారము యొక్క, పాకవిధిః = పాకముచేయువిధి (చెప్పబడుచున్నది), శరది = శరత్కాలమున, శుచిః = పరిశుద్ధుడై, ఉపోషితః = ఉపవసించినవాడై, శుక్లవాసా = తెల్లని వస్త్రములు ధరించినవాడై, ప్రశస్తే - అహని = శుభదినమున, ప్రశస్త దేశజాతం = ప్రశస్తమగు దేశమున మొలిచినట్టిది, మధ్యమ వయసం = మధ్యవయస్సు గలిగినది, అనుపహతం = తెగగొట్టబడనది, మహాన్తం = గొప్పవివరలు గలిగినది, (ఎత్తైనది), కాలముష్కకం = కాలముష్కక వృక్షమును (నల్లపుష్పములు గల మొక్కపు చెట్టును); సురా = మద్యముచేత, వలల = మాంసముచేత, సుమనః = పుష్పములచేత, అక్షతాదిభిః = అక్షింతలు మొదలగు వానిచేత, చతుర్దిశం = నాలుగుదిక్కులందు, బలిందత్త్వా = బలి ఇచ్చి, ప్రదక్షిణం - చ = ప్రదక్షిణమున్నూ చేసి, అభ్యర్చ్య = అర్చించి, ఏనం = ఈ వృక్షమును, అధివాసయేత్ = ఎక్కవలెను.

తాత్పర్యము : క్షారపాక విధానము చెప్పబడుచున్నది - శరత్కాలమున వైద్యుడు పరిశుద్ధుడై, ఉపవసించి, తెల్లని వస్త్రములు ధరించి, ప్రశస్తమగు దినమున, ప్రశస్తమైన దేశమున మొలిచి యున్నట్టిది, మధ్యవయసులో నున్నది, తెగకొట్టబడకుండునది, ఎత్తైనది అగు మొక్కపు చెట్టును సమీపించి ఆ వృక్షమును అర్చించి దానిపై నెక్కవలెను.

వి. వ్యా. : ప్రశస్త దేశము అనగా జాంగల దేశమున జనించిన వృక్షమని కొందరందురు మొక్కపు చెట్టు కృష్ణ–శ్వేత పుష్పములచే రెండు విధములు. అందు ఇచట నల్లని పువ్వులు గలదానినే ఉపయోగింపవలెను.

**మూలము :** దైవతేభ్యో నమస్తేభ్యో నివసన్తీహ యేశ్రితాః ।
గన్తుమర్హన్త్య సంక్రుద్ధాస్త్యక్త్వేమం వాసమవ్యయం ॥
భేషజార్థం గ్రహీష్యామి సర్వప్రాణభృతామిమమ్ ।
వృక్షం న లోభాన్నక్రోధాద్ బ్రాహ్మణార్థే విశేషతః ॥

ప్రతి పదార్థము : ఇహ = ఈ వృక్షముపై, యేశ్రితాః = ఎవరైతే ఆశ్రయించి, నివసన్తి = నివసించుచున్నారో, తేభ్యః-దేవతేభ్యః = దేవతలగు మీకు, నమః = నమస్కారము, ఇమం = ఈ, అవ్యయం = క్షీణించనట్టువంటి, వాసం = నివాసమును, త్యక్త్వా = వదలి,

అసంక్రుద్ధాః = కోపములేనివారై, గన్తుం = వెళ్లుటకు, అర్హన్తి = తగియున్నారు, ఇమం = ఈ, వృక్షం = వృక్షమును, లోభాత్ - న = లోభముచేతకాదు; క్రోధాత్ - న = కోపము చేతకాదు, సర్వప్రాణభృతా = అన్నిప్రాణుల, భేషజార్థం = ఔషధము కొరకు, విశేషతః = విశేషముగా, బ్రాహ్మణార్థం = బ్రాహ్మణుల కొరకు, గ్రహిష్యామి = గ్రహించుచున్నాను.

తాత్పర్యము : "ఈ వృక్షమును ఆశ్రయించి నివసించు దేవతలారా! మీకు నమస్కారము - లోభ క్రోధములచే గాక సర్వప్రాణుల ఉపయోగార్థము, విశేషించి బ్రాహ్మణులకు ఔషధము కొరకు ఈ వృక్షమును గ్రహించుచున్నాను. ఈ నివాసమును కోపము లేకుండ వదలి వెళ్ళుదురుగాక" అని ఆ వృక్షమును అర్చించవలెను.

**మూలము :** అథాపరేద్యుస్తత్ర యద్యద్భుతం వైకృతం వా కిఞ్చిన్నపశ్యేత్తతో యుగమాత్రమారూఢే సవితరి బ్రాహ్మణాన్ వాచయిత్వా తం పాదపం పూర్వాగ్రముత్తరాగ్రం వా పాతయేత్ । ఏవం చ పారిభద్రపలాశాశ్వకర్ణ రాజవృక్షమహావృక్షవృక్షకేన్ద్రవృక్షాస్ఫోతసప్తచ్ఛద నక్తమాల తిల్వకకదళీవిభీతకాశ్వమారకపూతీకచిత్రకార్క కాకజంఘాపామార్గాగ్నిమన్థాన్ వసన్తే సంగృహీతాంశ్చ యవాన్ సశూకనాళాంశ్చ తస్రశ్చకోశాతకీః సర్వాన్ సమూలఫలపత్రశాఖాన్ ఖణ్డశః కల్పయిత్వా నాతిశుష్కాన్ శిలాతలస్థాన్ నివాతే పృథక్ నిచయింకృత్య ముష్కకనిచయే చ సుధాశర్కరాః ప్రక్షిప్య తిలకుతశైరాదీపయేత్ । దగ్ధ్వా చ శాన్తేఽగ్నౌ పృథక్ సుధాశర్కరాభస్మకృత్వేతరత్ సర్వక్షారద్రోణమధికముష్కకం సలిలపలసహస్రేణ గవాదిమూత్రపల సహస్రేణ చాలోడ్య మహతా వస్త్రేణ పరిస్రావయేత్ । యావదచ్ఛోరక్తస్తీక్ష్ణః పిచ్ఛిలశ్చ జాతస్తదాతం క్షార నిష్యన్దం గృహీత్వా భస్మవివర్జయేత్ । తతః స్నేహపాకవిధినా పాచయేత్ । పచ్యమానే చ తస్మింస్తాః సుధాభస్మశర్కరాః క్షీరబంకం శంఖనాభిం చాయసేపాత్రేఽగ్నివర్ణాన్ కృత్వా తత్క్షారాచ్చ కుడువమాత్రే నిర్వాప్య తేనైవ చ సుశ్లక్ష్ణం పిష్ట్వా ప్రతీవాపందద్యాత్। తతశ్చ సుతరాం దర్వ్యావఘట్టయన్ విపచేత్ యావచ్చ సబాష్పైర్బుద్బుదైః సముత్తిష్ఠేత్ సాన్ద్రతయాచ దర్వీప్రలేపే స్యాత్తదైనమవతార్యాయోఘటే యవరాశౌ సుగుప్తం స్థాపయేత్ । ఏష మధ్యమః క్షారః ॥

ప్రతిపదార్థము : అథ = తరువాత, అపరేద్యుః = రెండవ రోజున, తత్ర = అచట, అద్భుతం = (ఉత్పాతము మొ॥) ఆశ్చర్యకర విషయము, వైకృతం వా = వికృతముగాని, కిఞ్చిత్ = కొంచెము, న - పశ్యేత్ - యది = చూడబడకున్నచో, తతః = ఆ తరువాత, సవితరి = సూర్యుడు, యుగమాత్రం = రెండు బారలు, ఆరూఢే = ఎక్కిన వాడగు చుండగా, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, వాచయిత్వా = స్వస్తివాచనములను పఠింపజేసి, తం - పాదపం = ఆచెట్టును, పూర్వాగ్రం = తూర్పువైపు కొనలు గలదిగనో, ఉత్తరాగ్రంవా = ఉత్తరపువైపు కొనలుగలదిగనో, పాతయేత్ = పడగొట్టవలెను.

ఏవం - చ = ఈ విధముగానే, పారిభద్ర = బాడిద, పలాశ = మోదుగ, అశ్వకర్ణ = పలాశభేదము, రాజవృక్ష = ఆరగ్వధము, మహావృక్ష = తెల్లచంద్ర, వృక్షక = మహానింబము, ఇన్ద్రవృక్ష = కొడిశపాల, వృషా = వాస, ఆస్ఫోత = శారిబా, సప్తచ్ఛదా = ఏడాకుల పొన్న, నక్తమాలా = కానుగ, తిల్వక = లొద్దుగ, కదళీ = అరటి, విభీతక = తాని,

అశ్వమారక = తెల్లగన్నేరు, పూతిక = పూతీకరంజము, చిత్రక = చిత్రమూలము, అర్క = జిల్లేడు, కాకజంఘా = వెలమసంధి, అపామార్గ = ఉత్తరేణి, అగ్ని - మంథాన్ = నెల్లి, చెట్లను, వసన్తే = వసన్తకాలమున, సంగృహీతాం చ = తీసికొనబడిన వానిని, స-శూకనాళాన్ పొట్టుతో గూడిన, యవాన్ = యవలను, కోశాత కీ - చతస్రః = నాలుగు విధములగు బీర లను, సర్వాన్ = అన్నింటిని, స - మూల - ఫల - పత్ర - శాకాన్ = వేళ్ళు, పండ్లు, ఆకులు, కొమ్మలతో గూడ, ఖండశః = ముక్కలు ముక్కలుగా, కల్పయిత్వా = చేసి, న - అతిశుష్కాన్ = ఎక్కువ ఎండనట్టి వానిని, నివాతే = గాలిలేని స్థలమున, శిలా తలస్థాన్ = శిలాతలముపై నున్న వానిని, నివాతే = గాలి లేని స్థలమున, శిలా తలస్థాన్ = శిలాతలముపై నున్నవానిని, పృథక్ = వేరుగా; నిచయీకృత్య = కుప్పలుగా ఉంచి, ముష్కక నిచయే-చ = మొక్కపు చెట్టుయొక్క భాగముల కుప్పయందును, సుధాశర్కరాః = సున్నపు రాళ్ళను, ప్రక్షిప్య = ఉంచి, తిలకుతశైః = నువ్వు కట్టెలచేత, ఆదీపయేత్ = వెలిగించవలెను.

దగ్ధ్వా = కాలి, అగ్నౌ = అగ్ని, శాంతే-చ = శాంతించినదికాగా, సుధాశర్కరా భస్మ = సున్నపుచూర్ణము, భస్మము, పృథక్-కృత్వా = వేరుచేసి, ఇతరత్ = మిగిలిన, అభ్యధికముష్కకం = ఎక్కువ ముష్కకము గల, సర్వక్షారద్రోణం = సమస్తక్షారముయొక్క ద్రోణ పరిమాణమును, సలిలపలసహస్రేణ = వేయిపలముల నీటిచేత, దవాదిమూత్రపల సహస్రేణ = గోవు మొదలగు వాని మూత్రము వేయిపలముల చేతను, ఆలోడ్య = బాగుగా కలిపి, మహతా-వస్త్రేణ = పెద్ద వస్త్రముతో, పరిస్రావయేత్ = వడగట్టవలెను, యావత్ = ఎంతలో, అచ్ఛః = స్వచ్ఛము, రక్తః = ఎఱ్ఱనిది, తీక్ష్ణః = తీక్ష్ణమైనది, పిచ్ఛిలః = జిగట యైనది, జాతః = అగునో, తదా = అప్పుడు, తం-క్షారనిష్యందం = ఆ క్షారద్రవమును, గృహీత్వా = స్వీకరించి, భస్మ = భస్మమును, వివర్జయేత్ = వదలివేయవలెను, తతః = ఆ తరువాత, స్నేహపాక విధినా = స్నేహపాక విధిప్రకారము, పచేత్ = పాకముచేయవలెను, తస్మిన్-పచ్యమానే = ఆ పాకమగుదానియందు, తాః-సుధాభస్మశర్కరాః = ఆ సున్నపుభస్మ చూర్ణమును, క్షీరపాకం = క్షీరపాకమును, శంఖనాభ్యశ్చ = శంఖనాభులను, ఆయసేపాత్రే = ఇనుపపాత్రలో, అగ్నివర్ణాన్-కృత్వా = ఎఱ్ఱగా అగునట్లు కాచి, తత్క్షారాచ్ఛం = ఆ అచ్ఛ క్షారమును, కుడువమాత్రే = పాత్రయందే, నిర్వాప్య = చల్లార్చి, తేన-ఏవ-చ = దానిచేతనే, సు-శ్లక్ష్ణం = చిక్కగా, పిష్ట్వా = పిండి, ప్రతీవాపం దద్యాత్ = ప్రతీవాపము చేయవలెను, తతః-చ = ఆ తరువాతనున్నూ, దర్వ్యా = గరిటచేత, సుతరాం = పూర్తిగా, ఘట్టయేత్ = గట్టిగా రుద్దుచు కలుపవలెను. యదా-చ = ఎప్పుడైతే, స-బాష్పైః = ఆవిరితో గూడిన, బుద్బుదైః = బుడగలతో, సముద్గిష్ఠేత్ = పైకి పొంగునో, సాంద్రతయాచ = చిక్కదనము చేత, దర్వీ = గరిట, ప్రలేపీ = పూయబడినట్టిది (అంటుకొనునట్లు), స్యాత్ = అగునో, తదా = అప్పుడు, ఏనం = ఈ పాకమును, అవతార్య = దించి, అయోఘటే = ఇనుప పాత్రలో, యవరాశౌ = ధాన్యపురాశిలో, సుగుప్తం = కనబడకుండునట్లు, స్థాపయేత్ = ఉంచవలెను, ఏషః = ఇది, మధ్యమక్షారః = మధ్యమక్షారము (చేయు విధను).

తాత్పర్యము : తరువాత రెండవరోజున అచట ఉత్పాతాది వికృతులేమియు లేకుండుట గమనించి, సూర్యుడు రెండు బారలు ఎక్కిన తరువాత, బ్రాహ్మణులచే స్వస్తి

వాచనములను చేయించి, ఆ చెట్టుయొక్క తూర్పు-లేక ఉత్తరమున కొనలుగల కొమ్మను తెగకొట్టవలెను.

ఇట్లే, పారిభద్ర, పలాశ, అశ్వకర్ణ, రాజవృక్ష, మహావృక్ష, వృక్షక, ఇన్ద్రవృక్ష, వృషా, ఆస్ఫోత, సప్తచ్ఛదా, నక్తమాలా, తిల్వక, కదళీ, విభీతకీ, అశ్వమారక, పూతీక, చిత్రక, అర్క, కాకజంఘా, అపామార్గ, అగ్నిమంథములను వసంతకాలమున సేకరించి, యవలను, నాలుగు విధములగు బీరలను—అన్నింటిని వేళ్ళు, పండ్లు, ఆకులు, కొమ్మలతో గూడ తీసికొని ముక్కలు ముక్కలుగా చేయవలెను. వీనిని ఎక్కువ ఎండించకుండ, గాలి లేని స్థలమున ఒక రాతి ఫలకముపై నుంచి, మొక్కపుచెట్టు ఖండములను సున్నపుచూర్ణమును కూడ ఉంచి నువ్వు కట్టెలచే వెలిగించవలెను. అవి బాగుగా కాలి నిప్పు చల్లారిన పిదప సున్నపుచూర్ణమును తీసివేసి, ద్రోణ ప్రమాణ క్షార చూర్ణమును వేయిపలముల నీటితోను, గోమూత్రము మొదలగు మూత్రములు వేయి పలములతోను బాగుగా కలిపి, విశాలమైన వస్త్రముతో వడగట్టవలెను. అది స్వచ్ఛముగను, ఎఱ్ఱగను, తీక్ష్ణముగను, జిగురుగను అగునో అపుడు ఆ క్షారద్రవమును స్వీకరించి, భస్మమును వర్జించవలెను. తరువాత దానిని స్నేహపాకవిధిచే పక్వము చేయవలెను. ఆ పాకమగు దానియందు ఆ సున్నపు భస్మ చూర్ణమును, క్షీరపాకమును, శంఖనాభులను ఇనుపపాత్రలో ఎఱ్ఱగా అగునట్లు కాల్చి వేయ వలెను. ఆ స్వచ్ఛమగు క్షారమును పాత్రయందే చల్లార్చవలెను. దానిని చక్కగా పిండి ప్రతీవాపము చేయవలెను. తరువాత గరిటతో ఉండగట్టని రీతిగా పొడుచుచు కలుపవలెను. ఎప్పుడు ఆవిరితో గూడి బుడగలతో పైకి పొంగునో అపుడీ పాకమును దించి, ఇనుపపాత్రలో వేసి, యవధాన్యపు రాశిలో సురక్షితముగ దాచవలెను. ఇది మధ్యమక్షారవిధి.

వి. వ్యా : నువ్వుల కట్టెల నుపయోగించుట చేత శక్తి అధికమగును.

అశ్వకర్ణము అనగా పిప్పల సదృశమగు గన్ధముణ్ణమని డల్హణుని వివరణ; సర్జ భేదమని చక్రదత్తుడును, శాలభేదమని హారాణచంద్రుడును వివరించిరి.

కోశాతకీ (ఘోషము)—బృహత్ఫలా, అల్పఫలా, పీతపుష్పా, శ్వేతపుష్పా యని నాలుగు విధములని డల్హణ వ్యాఖ్య.

క్షార ద్రోణమనగా రెండు భాగములు ముష్కక భస్మము, కుటజాదిభస్మ మొక భాగము గ్రహించవలెను.

21 మార్లు వస్త్రముతో వడగట్టవలెనని సుశ్రుత మతము.

లోహపాత్ర నుపయోగించుటచే క్షారశక్తి వృద్ధిపొందునని చక్రదత్తుని వ్యాఖ్య. "ప్రతీవాపః" ప్రతీవాపే ఇతిక్షిప్తే ఆవాపే పునరపరద్రవ్యప్రక్షేపః—అని డల్హణుని వివరణ—అనగా తయారైన దానియందు తిరిగి ఇతర ద్రవ్యములను వేయుట.

ద్రవద్రవ్యమున శ్లక్ష్ణముగా నుండు మరియొక ద్రవ్యముయొక్క పిష్టమును చేర్చుట యని అరుణదత్తుని వివరణ.

చక్రదత్తుడు క్షారము సప్రతీవాపము—అప్రతీవాపము అని రెండు విధములుగా

తెలిపెను. ఆవాపానంతరము శక్తి వృద్ధి నొందించుటకు చేయునది ప్రతీవాపము. సప్రతీవాపము పాక్యము అనబడును. ఇది తీక్ష్ణమైనది. అప్రతీవాపము మృదువుగా నుండి సంవ్యూహిమము అనబడును.

సుశ్రుతుడును అప్రతీవాపము మృదువుగా నుండి సంవ్యూహిమ మనబడునని తెలిపెను.

## మృదుక్షారపాక విధి

**మూలము :** మృదౌ శర్కరాదీన్నిర్వ్యాప్యాపనయేన్న తు పిష్ట్వా క్షిపేత్ । తీక్ష్ణేతు దన్తీ చిత్రకలాఙ్గలికాపూతీకప్రవాళతాలపత్రీ విడస్వర్జికాకనకక్షీరీ హింగువచాతివిషాః శ్లక్ష్ణచూర్ణీకృతా దగ్ధాశ్చ శంఖశుక్తీః పూర్వవత్ ప్రతివాపం దద్యాత్ ।

*ప్రతి పదార్థము :* మృదౌ = మృదుక్షారపాకమునందు, శర్కరాదీన్ = చూర్ణము మొదలగువానిని, నిర్వ్యాప్య = ముంచి, అపనయేత్ = తీయవలెను, పిష్ట్వాతు = పిష్టమునైతే, న-క్షిపేత్ = వేయదగదు, తీక్ష్ణేతు = తీక్ష్ణక్షారపాకమునందైతే, శ్లక్ష్ణచూర్ణీకృతాః = మెత్తగా చూర్ణము చేయబడిన, దన్తీ = నేపాళము, చిత్రక = చిత్రమూలము, లాఙ్గలికా = పొత్తిదుంప, పూతీక = నెమలడుగు, ప్రవాళ = ప్రవాళము, తాలపత్రీ = సదాప, విడ = బిడాలవణము, స్వర్జికా = సర్జక్షారము, కనకక్షీరీ = హేమమాక్షికము, హింగు = ఇంగువ, వచా = వస, అతివిషాః = అతివస-వీనిని, దగ్ధాః = కాల్చినవియగు, శంఖశుక్తీః-చ = శంఖము, ముత్యపు చిప్పలను, పూర్వవత్ = పూర్వమువలెనే, ప్రతీవాపం-దద్యాత్ = ప్రతీవాపమును చేయవలెను.

*తాత్పర్యము :* మృదుక్షారపాకమున చూర్ణము మొదలగువానిని ముంచి తీయవలెను. పిండి వేయగూడదు. తీక్ష్ణక్షారపాకమునందు నేపాళము, చిత్రమూలము, పొత్తిదుంప, నెమలడుగు, ప్రవాళము, సదాప, బిడాలవణము, సర్జక్షారము, హేమమాక్షికము, ఇంగువ, వస, అతివస-వీనిని మెత్తగా చూర్ణించి ఆ చూర్ణమును, కాల్చిన శంఖము ముత్యపుచిప్పలను, పూర్వమువలెనే ప్రతీవాపము చేయవలెను.

## క్షారమునకు తిరిగి శక్తి గలిగించు విధము

**మూలము :** తాంశ్చ వ్యాధిబలతః సప్తరాత్రాదూర్ధ్వం ప్రయుఞ్జీత । క్షీణబలేతు బలాధానార్థం పునః క్షారజలమావపేత్ ।

*ప్రతి పదార్థము :* వ్యాధిబలతః = రోగముయొక్క బలము ననుసరించి, తాం-చ = మధ్యమ, మృదు, తీక్ష్ణక్షారములను, సప్తరాత్రాదూర్ధ్వం = ఏడు రాత్రుల తర్వాత, ప్రయుఞ్జీత = ప్రయోగించవలెను.

క్షీణబలే-తు = (క్షారము యొక్క) బలము క్షీణించినపుడైతే, బలాధానార్థం = బలమును కలిగించుటకొరకు, పునః = తిరిగి, క్షారజలం = క్షారజలమును, ఆవపేత్ = పోయవలెను.

*తాత్పర్యము :* రోగబలము ననుసరించి మధ్యమ, మృదు, తీక్ష్ణక్షారములను ఏడు రాత్రుల తరువాత ప్రయోగింపవలెను. క్షారముయొక్క శక్తి తగ్గినపుడు దానికి శక్తి కలిగించుటకు దానిపై క్షారజలమును తిరిగి పోయవలెను.

వి. వ్యా. : క్షార జలమును పోసి తిరిగి పక్వము చేయవలెనని సుశ్రుతుని మతము.

## క్షారగుణములు

**మూలము :** తత్ర నాతితీక్ష్ణో నాతిమృదుః శ్వేతః శ్లక్ష్ణః శీఘ్రః పిచ్ఛిలః శిఖరీ సుఖ నిర్వాప్యోఽల్పరుగనభిష్యన్దీ చేతి దశక్షారస్యగుణాః ।

ప్రతిపదార్థము : తత్ర = అచట, న-అతి తీక్ష్ణః = ఎక్కువ తీక్ష్ణముగా లేకుండుట, ని-అతిమృదుః = ఎక్కువ మృదువుగా లేకుండుట, శ్వేతః = తెలుపు, శ్లక్ష్ణః = నునుపు, శీఘ్రః = త్వరగా పనిచేయు గుణము, పిచ్ఛిలః = జిగురు, శిఖరీ = (పడినచో, ఘనత్వము చేత) శిఖరాకారము గలదిగానుండుట, సుఖనిర్వాప్యః = సుఖముగా శమింపజేయునదిగా యుండుట, అల్పరుక్ = స్వల్పమగు బాధను కలిగించునదిగా నుండుట, అనభిష్యన్దీ-చ = అభిష్యన్ది కాకయుండుటయును, ఇతి = ఈ విధముగా, క్షారస్య = క్షారముయొక్క, దశగుణాః = పది గుణములు (అయి ఉన్నవి).

తాత్పర్యము : ఎక్కువ తీక్ష్ణముగా లేకుండుట, ఎక్కువ మృదువుగాకుండుట, తెలుపు, నునుపు, శీఘ్రముగా పనిచేయుట, జిగురుగా నుండుట, శిఖరములు గలదిగా యుండుట, సుఖముగా శమింపజేయదగినదిగా యుండుట, స్వల్పమగు బాధను కలిగించునదిగా యుండుట, అనభిష్యన్ది అను పదియును క్షారము యొక్క గుణములు.

వి. వ్యా : తీక్ష్ణత్వమనగా నూరు అక్షరము లుచ్చరించు కాలములో దహించు శక్తి గలది. అట్టిది శ్రేష్ఠము.

సుశ్రుతమున అతి తీక్ష్ణముగాకుండుట అతి మృదువుగాకుండుట, అతి శుక్లము గాకుండుట, శ్లక్ష్ణముగా నుండుట, పిచ్ఛిలముగా నుండుట, అభిష్యంది, శివ (సౌమ్యముగా నుండుట), శీఘ్రకారీ యను ఎనిమిదియు క్షారగుణములుగా చెప్పబడినవి.

## క్షారదోషములు

**మూలము :** దశైవ చ దోషాః । తద్యథా—అత్యుష్ణోఽతిశీతోఽతి తీక్ష్ణోఽతి మృదురతి తనురతి ఘనోఽతిపిచ్ఛిలోవిసర్పీ హీనౌషధో హీనపాకశ్చేతి ।

ప్రతి పదార్థము : దోషాః-చ = (క్షారముయొక్క) దోషములును, దశ ఏవ = పదియే, తత్-యథా = అది ఎట్లనగా:- అత్యుష్ణః = ఎక్కువ వేడిని కలిగించుట, అతిశీతః = ఎక్కువ చల్లదనమును కలిగించుట, అతి తీక్ష్ణః = ఎక్కువ తీక్ష్ణముగా నుండుట, అతి మృదుః = ఎక్కువ మృదువుగా నుండుట, అతి తనుః = ఎక్కువ తేటగా నుండుట, అతి ఘనః = ఎక్కువ గట్టిగా నుండుట, అతి పిచ్ఛిలః = ఎక్కువ జిగురుగా యుండుట, విసర్పీ = వ్యాపించు స్వభావము గలిగియుండుట, హీనౌషధః = ఔషధహీనమై యుండుట, హీనపాకః = పాకము సరిగా కానట్టిది, ఇతి = అని.

తాత్పర్యము : ఎక్కువ వేడిని, ఎక్కువ చల్లదనమును కలిగించుట, ఎక్కువ తీక్ష్ణముగా నుండుట, ఎక్కువ మృదువుగా, ఎక్కువ తేటగా, ఎక్కువ గట్టిగా, ఎక్కువ జిగురుగా యుండుట, వ్యాపించు స్వభావము కలిగియుండుట, ఔషధహీనమై యుండుట, సరిగా పాకము కాకుండుట అను పదియు క్షారమునకు దోషములు.

### క్షారకర్మయందు పయుక్త సాధనములు

**మూలము :** తత్ర క్షారకర్మణ్యుపహరేత్ పిచువర్తిశలాకాదర్వ్యఞ్జలికా ఘృతమధుశుక్తతుషోదకమస్తు క్షీరోదకశీతప్రదేహ శయనాసనాదీని ।

*ప్రతి పదార్థము :* తత్ర = అచట, క్షారకర్మణి = క్షార కర్మయందు, పిచు = దూది, వర్తి = వత్తి, శలాకా = శలాక, దర్వీ = గరిట, అఞ్జలికా = చిన్నమూష, ఘృత = నేయి, మధు = తేనె, శుక్త = శుక్తము, తుషోదక = బియ్యపు కడుగు, మస్తు = పెరుగుమీది తేట, క్షీర = పాలు, ఉదక = నీరు, శీతప్రదేహ = చల్లనిపట్టులు, శయన = పరుండుటకు సాధనము, ఆసన-ఆదీని = కూర్చుండుటకు సాధనములు మున్నగువానిని, ఉపహరేత్ = సమకూర్చుకొనవలెను.

### క్షారకర్మ విధి

**మూలము :** అథ క్షారార్హ స్యోపవిష్టస్య సంవిష్టస్య వాప్త పరిచారక గృహీతస్య వ్యాధిం ఛిత్వావలిఖ్య ప్రచ్ఛాయ వా పిచుప్లోతాన్యతరావగుణ్ఠితయా శలాకయా క్షారం పాతయేత్ । తతో మాత్రాశతముపేక్షేత ।

*ప్రతి పదార్థము :* అథ = తరువాత, ఉపవిష్టస్య-వా = కూర్చొనియున్నట్టి గాని, సంవిష్టస్య = పరుండియున్నట్టి, ఆప్త-పరిచారక - గృహీతస్య = ఆప్తులైనవారిచేత, పరిచారకులచేత పట్టుకొనబడినట్టియు, క్షారార్హస్య = క్షారకర్మకు అర్హుడైన వానియొక్క, వ్యాధిం = వ్యాధి గల ప్రదేశమును, ఛిత్వా = ఛేదించి, అవలిఖ్యవా = గీకివాని, ప్రచ్ఛాయవా = కప్పిగాని, పిచు = దూది, ప్లోత = వస్త్రము, అన్యతర = వీనిలో నొకదానిచే, అవగుణ్ఠితయా = చుట్టబడిన, శలాకయా = శలాకచేత, క్షారం = క్షారమును, పాతయేత్ = వేయవలెను, తతః = ఆ తరువాత, మాత్రాశతం = నూరు మాత్రల కాలము, ఉపేక్షేత = ఊరకుండవలెను.

### వర్త్మరోగములందు క్షారకర్మ విధి

**మూలము :** వర్త్మ రోగే తు నిర్భుజ్య వర్త్మనీ పిచునామధూచ్ఛిష్టేన వా కృష్ణభాగం ప్రచ్ఛాద్య పద్మపత్రతనుః క్షారలేపః ।

*ప్రతి పదార్థము :* వర్త్మరోగే తు = కనురెప్పల వ్యాధులందైతే, వర్త్మనీ = రెప్పలను, నిర్భుజ్య = విరిచి, కృష్ణభాగం = నల్లగుడ్డును, పిచునా = దూదిచేత, వా = లేక, మధూచ్ఛిష్టేన = తేనె మైనముచేత, ప్రచ్ఛాద్య = కప్పి, పద్మపత్ర తనుః = తామరాకు అంత పలుచగా, క్షారలేపః = క్షారమును లేపము చేయుట (తగును).

**తాత్పర్యము :** కనురెప్పల వ్యాధులందు, రెప్పలను విరిచి, నల్లగుడ్డుకు హాని కలుగకుండ దూది లేక తేనె మైనముతో కప్పి, తామర ఆకు అంత పలుచగా క్షారమును వ్యాధిగల ప్రదేశముపై లేపము చేయవలెను.

### నాసా రోగములందు క్షారకర్మ విధి

**మూలము :** ఘ్రాణజేషు త్వర్శోఽర్బుదాదేష్వాది త్యాభిముఖస్యోన్నమయ్య నాసికాముపేక్షేత్ పఞ్చాశన్మాత్రాః ।

*ప్రతిపదార్థము :* ఘ్రాణజేషు = నాసికయందు జనించిన, అర్శో-అర్బుదాదిషు-తు = అర్శస్సు, అర్బుదము మొదలగు వ్యాధులందైతే, ఆదిత్యాభిముఖస్య = సూర్యుని కెదురుగా కూర్చున్నవానికి, నాసికాం = ముక్కును, ఉన్నమయ్య = పైకెత్తి, (క్షారలేపః కార్యః = క్షారలేపము చేయదగినది), పఞ్చాశన్మాత్రాః-చ = ఏబది మాత్రల కాలమున్నూ, (ఉపేక్ష్యాః ఊరకుండదగినవి).

తాత్పర్యము : నాసికయందు జనించిన అర్శస్సు, అర్బుదము మొదలగు వ్యాధులలో, రోగిని సూర్యుని కెదురుగా కూర్చుండజేసి, ముక్కును పైకెత్తి, క్షారమును లేపము చేసిన పిదప ఏబది మాత్రలకాలము ఊరకుండవలెను.

## కర్ణ రోగములందు క్షారకర్మ విధి

**మూలము : తద్వచ్ఛ్రోత్రజేషు ।**

*ప్రతి పదార్థము :* శ్రోత్రజేషు = కర్ణవ్యాధులందు, తత్-వత్ = అదే విధముగ (క్షారకర్మ చేయవలెను).

తాత్పర్యము : కర్ణవ్యాధులలో గూడ క్షారకర్మ పై విధముగానే చేయవలెను.

## గుదార్శస్సునందు క్షారకర్మ విధి

**మూలము : గుదార్శస్సు పాణినా యన్త్రద్వారం పిధాయ ధారయేన్మాత్రాశతమేవ ।**

*ప్రతి పదార్థము :* గుదార్శస్సు = గుదమునందలి అర్శోవ్యాధియందు, యన్త్రద్వారం = యంత్రము యొక్క ద్వారమును, పాణినా = అరచేతితో, పిధాయ = అడ్డగించి, (క్షారమును ప్రయోగించిన తరువాత), మాత్రాశతం-ఏవ = నూరు మాత్రల కాలమే, ధారయేత్ = ధరింపజేయవలెను (క్షారమును ఉంచవలెను)

తాత్పర్యము : గుదార్శస్సులో యంత్రద్వారమును అరచేతితో మూసి క్షారమును నూరు మాత్రలకాలము అచట యుండునట్లు చేయవలెను.

## క్షారకర్మానంతర విధి

**మూలము : తతః ప్రమార్జనేన ప్రమృజ్యక్షారం సమ్యగ్దగ్ధమవేక్ష్య నిర్వాపయేత్సర్పిర్మధుభ్యాం శుక్తతుషోదకమస్తుక్షీరాదిభిశ్చ । తతఃపరం శీతమధురైః సఘృతైః ప్రదిహ్యాత్ । అభిష్యన్దీని భోజ్యాని క్లేదనాయ చ । స్థిరమూలత్వాత్తు యదిక్షారదగ్ధం న విశీర్యతే తతో ధాన్యామ్లబీజమధుయష్టికాయుక్తైస్తిలైరాలేపయేత్సువర్ణక్షీరియుతైర్వా త్రివృద్విలఙ్గసారవద్భిర్వామాలతీ వృషాఙ్కోల నిమ్బసోప్తపటోలీకరవీరపత్రక్వాథేనవ్రణప్రక్షాళనమ్ । ఏషామేవ చ కల్కక్వాథేసిద్ధం సర్పిస్తైలం వారోపణమ్ । నాగపుష్ప మఞ్జిష్ఠాచన్దన తిలపర్ణికాసు వా । యథావ్యాధి దోషం చవ్రణముపక్రమేత్ । తిలాఃస యష్టిమధుకాః రోపణేచాస్యపూజితాః ।**

*ప్రతి పదార్థము :* తతః = తరువాత, ప్రమార్జనేన = ప్రమార్జనముచేత, క్షారం = క్షారమును, ప్రమృజ్య = తుడిచివేసి, సమ్యగ్దగ్ధం = బాగుగా దగ్ధమగుటను, అవేక్ష్య = గమనించి, సర్పిః-మధుభ్యాం = నేయి, తేనెలచేత, శుక్త = ఆరనాళము, తుషోదక = బియ్యపుకడుగు, మస్తు = పెరుగుమీది తేట, క్షీరాదిభిః-చ = పాలు మొదలగు వానిచేతను, నిర్వాపయేత్ = కడుగవలెను.

తతఃపలం = ఆ తరువాత, స-ఘృతైః = నేతితో గూడినట్టి, శీతమధురైః = శీతల, మధుర ద్రవ్యములచే, ప్రదిహ్యాత్ = పట్టు వేయవలెను, క్లేదనాయ-చ = క్లేదనము కొరకును, అభిష్యన్దీని భోజ్యాని = అభిష్యందికరములగు భోజనములను, భోజ్యాని = భుజింపజేయవలెను.

యది = ఒకవేళ, క్షారదగ్ధం-తు = క్షారముచే కాల్చబడినదైతే, స్థిరమూలత్వాత్ = మూలము స్థిరముగా నుండుటచేత, న-విశీర్యతే = విడిపడదో, తతః = అప్పుడు, ధాన్యామ్ల బీజ = ధాన్యామ్లమున అడుగున నుండు పదార్థము, మధుయష్టికా యుక్తైః = యష్టిమధుకముతో గూడినవి, వా = లేక, సువర్ణక్షీరీయుతైః = స్వర్ణక్షీరితో గూడిన, తిలైః నువ్వులచేత, ఆలేప యేత్ = లేపనము చేయవలెను, త్రివృత్ = తెగడ, విలఙ్గ = వాయు విడంగము, సారివాదిభిః = సుగంధిపాల మొదలగువానితో, వా = కాని, మాలతీ = జాజి, వృష = అడ్డసరము, అంకోల = ఊడుగు, నిమ్బ = వేప, అస్ఫోత = విష్ణుక్రాంతము, పటోలీ = చేదుపొట్ల, కరవీర = గన్నేరు (వీనియొక్క), పత్రక్వాథేన = ఆకుల కషాయము చేత, వ్రణ ప్రక్షాళనమ్ = వ్రణములను కడుగుట, (కుర్వీత = చేయవలెను).

ఏషాం-ఏవ = వీనియొక్కయే, కల్కక్వాథే = కల్కకషాయమునందు, సిద్ధం = తయారుచేయబడిన, సర్పిః-తైలం-వా = నేయి లేక తైలము, రోపణం = వ్రణమును మానుపుటకు (ఉపయోగింపవలెను), వా = లేక, నాగపుష్ప = నాగపుష్ప, మఞ్జిష్ఠా = మంజిష్ఠ, చన్దన = చందనము, తిలపర్ణికాసు = తిలపర్ణికా – (వీనితో సిద్ధము చేయబడిన ఘృతము లేక తైలమును ఉపయోగింపవలెను).

వ్రణం = వ్రణమును, యథా వ్యాధి దోషం = వ్యాధి, దోషము ననుసరించి, ఉపక్ర మేత్ = చికిత్సింపవలెను.

అస్య-రోపణే = ఈ వ్రణమును మాన్పుటయందు, స-యష్టిమధుకాః = యష్టి మధుకముతో గూడినట్టి, తిలాః = నువ్వులు, పూజితాః = శ్రేష్ఠమైనవిగా చెప్పబడినవి,

తాత్పర్యము : తరువాత (నియమిత కాలమునకు పిదప), ఆ క్షారమును తుడిచివేసి, వ్యాధిగల ప్రదేశము బాగుగా దగ్ధమగుటను గమనించి, ఘృతము, మధు, ఆరనాళము, చిన్యాపు కడుగు, పెరుగుమీది తేట, పాలు మొదలగువానిచే ప్రక్షాళనము చేయవలెను. ఆపైన శీత మధుర ద్రవ్యములను నేతితో కలిపి పట్టు వేయవలెను. శరీరమున క్లేదనము కలుగుటకై అభిష్యందకర భోజనములను తినిపింపవలెను.

ఒకవేళ మూలము స్థిరముగా నుండుటచే క్షార దగ్ధమైనచోట వ్యాధి శమించకున్నచో ధాన్యామ్లము, యష్టిమధుకము, స్వర్ణక్షీరీ మొదలగువాటితో నువ్వులను నూరి అచట లేపము చేయవలెను. ఇంకను తెగడ, వాయువిడంగము, సుగంధిపాల మొదలగువానితో గాని, లేక జాజి, అడ్డసరము, ఊడుగు, వేప, విష్ణుక్రాంతము, చేదుపొట్ల, గన్నేరు వీని ఆకుల కషాయముతో గాని వ్రణప్రక్షాళన చేయవలెను. వీనిచే సిద్ధము చేయబడిన ఘృతము లేక తైలములను ఉపయోగింపవలెను. లేక నాగపుష్ప, మంజిష్ఠ, చందనము, తిలపర్ణికలతో సిద్ధము చేయబడిన ఘృత, తైలములను ఉపయోగింపవలెను.

వ్రణమును వ్యాధి-దోషముల ననుసరించి చికిత్స చేయవలెను. వ్రణరోపణమున యష్టి మధుకముతో గూడిన నువ్వులు శ్రేష్ఠమైనవిగా చెప్పబడినవి.

### క్షార సమ్యగ్దగ్ధ లక్షణములు

**మూలము :** తత్ర పక్వజామ్బవ సంకాశ మవసన్న మీషద్యథాస్వవికారోపశాన్తౌ చ సమ్యగ్దగ్ధం భవతి ।

*ప్రతి పదార్థము :* తత్ర = ఆ వ్రణమునందు, పక్వజామ్బవసంకాశం = నేరేడు పండువలె నల్లనగుట, ఈషత్ = కొద్దిగా, అవసన్నం = క్రుంగుట, యథాస్వ-వికార-ఉపశాన్తౌ = తన వికారము శమించుటయు (జరిగినచో), సమ్యగ్దగ్ధమ్ = బాగుగా దగ్ధమైనట్లు, భవతి = అగును.

**తాత్పర్యము :** క్షారకర్మ బాగుగా జరిగినపుడు వ్రణముగల స్థానము నేరేడుపండు వలె నల్లనగుట, కొంచెము క్రుంగినట్లుండుట, అచటగల వికారము శమించుటయు అగును.

వి. వ్యా. : వ్యాధిగల ప్రదేశము కృష్ణవర్ణము నొందిన సమ్యగ్దగ్ధమైనట్లు తెలియవలెనని సుశ్రుతుని వచనము.

### క్షార దుర్దగ్ధ లక్షణములు

**మూలము :** తద్విపర్యయేణ తోదకణ్డూజాడ్యాదిశ్చ దుర్దగ్ధం । తత్రపునః పాతయేత్ ।

*ప్రతి పదార్థము :* తత్-విపర్యయేణ = పై జెప్పిన లక్షణములు లేనపుడు, తోద = నొప్పి, కణ్డూ = దురద, జాడ్య = మొద్దుబారినట్లుండుట, ఆదిశ్చ = మొదలగువానిచేనున్నా, దుర్దగ్ధం = సరిగా దగ్ధము కానిది (అగును) తత్ర = ఆ వ్రణమునందు, పునః = మరల, పాతయేత్ = క్షారమును ప్రయోగింపవలెను.

**తాత్పర్యము :** పై జెప్పిన లక్షణములు లేక నొప్పి, దురద, మొద్దుబారి నట్లుండుట మొదలగు లక్షణములున్నచో, దానిని దుర్దగ్ధముగా తెలిసికొని, తిరిగి క్షార ప్రయోగము చేయవలెను.

### క్షారాతిదగ్ధ లక్షణములు

**మూలము :** ఊషాదాహరాగశోఫ జ్వరపాకవిసర్పశిరోరోగ వాతపిత్తకోపై రతిదగ్ధమ్ ।

*ప్రతి పదార్థము :* ఊషా = వేదనతో గూడిన మంట, దాహ = మంట, రాగ = ఎరుపు, శోఫ = వాపు, జ్వర = జ్వరము, పాక = పుండగుట, విసర్ప = విసర్పవ్యాధి కలుగుట, శిరోరోగ = శిరోరోగము, వాత-పిత్త కోపైః = వాత, పిత్త ప్రకోపములచేతను, అతి దగ్ధమ్ = ఎక్కువగా దగ్ధమగుటను (తెలిసికొనవలెను).

**తాత్పర్యము :** క్షారకర్మ చేసిన స్థలమున వేదనతోగూడిన మంట, మంటపుట్టుట, ఎరుపు వర్ణము, వాపు కలుగుట, జ్వరము, పుండగుట, విసర్పము, శిరోరోగము గలుగుట, వాత, పిత్త దోషముల ప్రకోప లక్షణములును కలిగినచో అతి దగ్ధమైనట్లు తెలియవలెను.

### క్షారాతిదగ్ధమున గలుగు వికారములు

**మూలము :** అపిచ । నేత్రేఽతియోగాద్వర్త్మ నిర్భేదనేన్ద్రియభ్రంశః । ఘ్రాణే నాసావంశ తరుణాస్థిదరణం సంకోచోగన్ధాజ్ఞానం చ । తద్వచ్ఛ్రోత్రాజిహ్వపి చ యథాస్వం వ్యాపత్ । గుదే విణ్మూత్రరోధోఽతీసారః పుంస్త్వోపఘాతో గుదవిదారణాచ్చ

మృత్యుర్వా సర్వదా వా శోఫ తోదవేదనాస్రావాః । శకృన్మూత్రవాతవిధారణాశక్తిర్వా । తమతిప్రవృత్తమాశు పూర్వోక్తైరేవ నిర్వాపణైః పునః పునర్నిర్వాపయేత్ । అతశ్చ దాహ్యమతిప్రమాణం న సకృదేవ దహేదితి ।

*ప్రతి పదార్థము :* అపి చ = ఇంకను, నేత్రే = కంటియందు, అతి యోగాత్ = క్షారకర్మ ఎక్కువగా జరిగినచో, వర్త్మ నిర్భేదన = కనురెప్పలు పగిలినట్లగుట, ఇంద్రియ భ్రంశః = నేత్రేంద్రియము నశించుట (కలుగును).

ఘ్రాణే = ముక్కునందు (క్షారకర్మ ఎక్కువగా జరిగినచో), నాసావంశ తరుణాస్థి దరణం = నాసికయందలి తరుణాస్థి చీలుట, సంకోచః = ముడుచుకొనిపోవుట, గన్ధాజ్ఞానం చ = గంధ గ్రహణ శక్తి నశించుటయు (కలుగును).

తద్వత్ = అటులనే, శ్రోత్రాదిషు-అపి-చ = చెవి మొదలగువాని యందును, యథాస్వం = తదనుగుణముగా, వ్యాపత్ = విశేషమగు బాధలు (కలుగును).

గుదే = గుదమునందు (క్షారకర్మ ఎక్కువగా జరిగినచో), విట్-మూత్ర-రోధః = పురీష మూత్రములు అడ్డగింపబడుట, అతీసారః = అతిసారము, పుంస్త్వోపఘాతః = పుంస్త్వము కోల్పోవుట, గుద విదారణాత్-చ = గుదము చీలుటచేతను, మృత్యుఃవా = మరణముగాని, సర్వదా = ఎల్లపుడు, శోఫ = వాపు, తోద = నొప్పి, వేదనా = బాధ, స్రావాః = స్రావములు (కలుగును). వా = లేక, శకృత్-మూత్ర-వాత-విధారణ-అశక్తిః = పురీషము, మూత్రము, వాయువులను నిలుపునట్టి శక్తి లేకపోవుట (కలుగును).

అతిప్రవృత్తం = ఎక్కువగా ప్రయోగింపబడిన, తం = ఆ క్షార ప్రయోగమును, పూర్వోక్తైః = ఇంతకుముందు చెప్పబడిన, నిర్వాపణైః-ఏవ = ఉపశమన క్రియలచేతనే, పునఃపునః = మరల మరల, నిర్వాపయేత్ = శమింపజేయవలెను. అతః చ = అందువలననే, దాహ్యం = క్షారముచే దహింపదగినదానిని, సకృత్-ఏవ = ఒక్కమారే, అతి ప్రమాణం = ఎక్కువగా, న-దహేత్ = కాల్చరాదు. ఇతి = అని (భావము).

*తాత్పర్యము :* కన్నుపై ఎక్కువగా క్షారకర్మ చేసినచో కనురెప్పలు పగిలినట్లగుట, నేత్రేంద్రియశక్తి నశించుటయు; ముక్కులో అయినచో తరుణాస్థి నశించుట, ముడుచుకొనిపోవుట, ఘ్రాణగ్రహణ శక్తి నశించుటయు; ఇట్లే చెవి మొదలగువానియందును ఇంద్రియ గ్రహణశక్తి నశించుటయు, ఇతరములగు బాధలును కలుగును. గుదమునందైనచో మల మూత్రము లడ్డగింపబడుట, అతీసారము, పుంస్త్వనాశనమును కలుగును. గుదము చీల్చబడినచో మరణము కలుగవచ్చును, లేక ఎల్లప్పుడు వాపు, నొప్పి, స్రావములు కలుగును. లేక-వాత మూత్ర, పురీషములను నిలుపుశక్తి నశించును.

క్షారముయొక్క ప్రయోగము అధికమైనపుడు కలుగు ఉపద్రవములను ఇంతకు పూర్వము చెప్పబడిన ఉపశమన క్రియలచే శమింపజేయవలెను. క్షారకర్మ చేయునపుడు ఎక్కువ క్షారమును ప్రయోగింపరాదని తెలియవలెను.

**వి. వ్యా. :** క్షారము తన వేగమువలన శరీరమున పీల్చుచున్నట్లు, పీడించుచున్నట్లు

ఉండును. శరీరము నందంతట వ్యాపించి దోషములను సమూలముగ వెడలించును. ఇట్లు తన కృత్యమును నిర్వర్తించి, రోగము నశించగానే, స్వయముగా శమనమును చెందును అని అష్టాంగ హృదయమున క్షార కృత్యము తెలుపబడినది.

మూలము : భవంతి చాత్రః—

శ్లో॥ అమ్లో హి శీతః స్పర్శేన క్షారస్తేనోపసంహితః ।
యాత్యాశు స్వాదుతాం తస్మాదమ్లై ర్నిర్వాపయేత్తరామ్ ॥
జ్వరాతిసారతృణ్మోహ మూర్ఛా హృద్వేదనార్తిభిః ।
కక్షం దహత్యగ్నిరివ శరీరం క్షార విభ్రమః ॥
పాయయేతాతియోగేఽత స్తం శీఘ్రం స ఘృతం దధి ।
సగుడం వా దధిసరం తైలం వా ససితోపలమ్ ॥
ధాత్రీఫల కపిత్థామ్ల దాడిమ స్వరసే ఘృతమ్ ।
ద్విగుణే సాధితం పానసేకైః క్షారాతి రుగ్ఘరమ్ ॥
దాడిమామలకామ్రాత కపిత్థకరమర్దకాన్ ।
ఆమ్రాచ్చ మాతులుఙ్గాచ్చ రసం మృదగ్నినా పచేత్ ॥
తతోఽతి వృత్తక్షారాయ దద్యాన్మాత్రాం యథాబలమ్ ।
క్షారో నివర్తతే తేన ప్రసాదం త్వక్ చ గచ్ఛతి ।
శోతాతి ప్రవృణిత్తౌ తు బాహ్యాన్తః శిశిరో విధిః ॥
ఇతి క్షారవిధిర్నామైకోన చత్వారింశోఽధ్యాయః ॥

ప్రతి పదార్థము : అమ్లః = అమ్లము, స్పర్శేన = స్పర్శచేత, శీతః-హి = చల్లనైనది గదా! తేన = అట్టి అమ్లముచేత, ఉపసంహితః = కూడిన, క్షారః = క్షారము, ఆశు = శీఘ్రముగా, స్వాదుతాం = మధురత్వమును, యాతి = పొందును. తస్మాత్ = అందువలన, అమ్లైః = అమ్లములగు పదార్థములచేత, నిర్వాపయేత్తరామ్ = మిక్కిలి బాగుగా చల్లార్పవలెను.

జ్వరః = జ్వరము, అతిసార = అతిసారము, తృట్ = దప్పిక, మోహ = మోహము, మూర్ఛా = మూర్ఛ, హృత్-వేదనా = హృదయమునందు బాధ, ఆర్తిభిః = బాధలచేత, క్షార విభ్రమః = క్షారకర్మయందలి విభ్రమము, అగ్నిః = అగ్ని, కక్షం ఇవ = శరీరమును, దహతి = దహింపజేయును.

అతః = అందువలన, అతియోగే = క్షారాతియోగమున, తం = ఆ రోగిని, శీఘ్రం = త్వరగా, స-ఘృతం = నేతితోగూడిన, దధి = పెరుగును, వా = లేక, సగుడం = బెల్లముతో గూడిన, దధిసరం = పెరుగుమీది తేట గాని, స-సితోపలమ్ = కలకండతో గూడిన, తైలం-వా = తైలమునుగాని, పాయయేత్ = త్రాగించవలెను.

ధాత్రీఫల = ఉసిరికపండ్లు, కపిత్థ = వెలగపండ్లు, దాడిమామ్ల = దానిమ్మ, స్వరసే = స్వరసమునందు, సాధితం = సిద్ధము చేయబడిన, ద్విగుణే-ఘృతం = రెండు రెట్ల నేయిని, పాన = త్రాగించుట, సేకైః = తడుపుట చేతను, క్షార-అతి-రుక్-హరం = అతి క్షారకర్మ

వలన కలిగిన బాధలను పోగొట్టునది (అగును).

దాడిమ = దానిమ్మ, ఆమలక = ఉసిరిక, ఆమ్రాత = మామిడి, కపిత్థ = వెలగ, కరమర్దకాత్ = కరమర్దకము-వీనినుండి; ఆమ్రాత్-చ = మామిడిపండునుండియు, మాతులుంగాత్-చ = మాదీఫలమునుండియు (తీసిన), రసం = రసమును, మృదు-అగ్నినా = మందాగ్నితో, పచేత్ = వండవలెను.

తతః = ఆ తరువాత, యథాబలం = బలము ననుసరించి, మాత్రాం = ప్రమాణమును, అతి వృత్త-క్షారాయ = అధిక క్షారకర్మ జరిగినవానికి, దద్యాత్ = ఇవ్వవలెను, తేన = దాని చేత, క్షారః = క్షారము (యొక్క మంట), నివర్తతే = శమించును. త్వక్-చ = చర్మమున్ను, ప్రసాదం = స్వచ్ఛతను, గచ్ఛతి = పొందును. శోణిత-అతి-ప్రవృత్తౌ-తు = రక్తము అధికముగా స్రవించినపుడైతే, బాహ్య—అంతః = లోపల-బయట, శిశిరః-విధిః = శీతలోపచారముల క్రమము (చేయవలెను).

తాత్పర్యము : అమ్లరసము స్పర్శచే చల్లనైనది గదా! అట్టి అమ్లముతో కలిసినచో క్షారముల శీఘ్రముగా మధురత్వమును బొందును. అందుచే క్షారాతియోగమున అమ్లపదార్థము నుపయోగించి శమింపజేయవలెను.

జ్వరము, అతిసారము, దప్పిక, మోహము, మూర్ఛ, హృదయబాధలును క్షారాతియోగమున కలుగును. వీనియందు నేతితో గూడిన పెరుగు లేక బెల్లమును పెరుగుమీద తేటతోగాని, కలకండతో గలిపిన తైలమునుగాని త్రాగించవలెను.

ఉసిరికపండ్లు, వెలగపండ్లు, దానిమ్మపండ్లు-వీని రసమునకు రెండింతలు ఘృతమును గలిపి త్రాగించవలెను. దానిమ్మ, ఉసిరిక, మామిడి, వెలగ, కరమర్దకము, వీనిని మామిడి పండు రసము, మాదీ ఫలరసముతో మృద్వగ్నిపై పాకముచేసి, బల-మాత్రా-ప్రమాణము ననుసరించి ఇవ్వవలెను. దీనివలన క్షారముచే గలుగు దాహము శమించును. చర్మమునకు ప్రసాదత్వము గలుగును.

అధిక రక్తస్రావము అయినపుడు—లోనికి శీతల పదార్థముల నిచ్చి బాహ్యముగ శీతలోపచారములను చేయవలెను.

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## నలుబదియవ అధ్యాయము

**మూలము : అథాతోఽగ్నికర్మ విధి మధ్యాయం వ్యాఖ్యాస్యామః**
**ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః ।**

ప్రతి పదార్థము : అథ = అటు తరువాత, అతః = ఇందువలన (క్షారవిధి అధ్యాయానంతరము), అగ్ని-కర్మ విధిమధ్యాయం = అగ్నికర్మను గురించి తెలిపెడు అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరించెదము. ఆత్రేయాదయో మహర్షయః = ఆత్రేయాది మహర్షులు, ఇతి హ = ఈ విధముగా, ఆహుస్మ = పలికిరి.

తాత్పర్యము : క్షారవిధి అధ్యాయము తరువాత అగ్నికర్మను గూర్చి తెలుపునట్టి అగ్నికర్మవిధి అధ్యాయమును వివరించెదమని ఆత్రేయాది మహర్షులు పలికిరి.

వి. వ్యా. : "అగ్నినా కృతం యత్కర్మ", "అగ్నేః సంబంధి వా యత్కర్మ" తదగ్నికర్మ అని డల్హణుడి వివరణ.

క్షారముకంటె అగ్నికర్మయొక్క శ్రేష్ఠత

**మూలము : అగ్నిః క్షారాదపి గరీయానౌషధశస్త్రక్షారై రసిద్ధానాం తద్దాహసిద్ధే రపునర్భవాచ్చ।**

ప్రతి పదార్థము : ఔషధ = ఔషధములవలన, శస్త్ర = శస్త్రములవలన, క్షారైః = క్షారములవలన, అసిద్ధానాం = సాధ్యముగానట్టి వ్యాధులు, తత్-దాహసిద్ధేః = అట్టి అగ్నికర్మచే శమించుట వలనను, అపునర్భవాత్-చ = తిరిగి ఆ వ్యాధులు పుట్టకుండుట వలనను, అగ్నిః = అగ్నికర్మ, క్షారాదపి = క్షారముకంటెను, గరీయాన్ = గొప్పది

తాత్పర్యము : ఔషధ, శస్త్ర, క్షార కర్మలచే సాధ్యముగానట్టి వ్యాధులు అగ్నికర్మచే సాధ్యమగుట చేతను, తిరిగి పుట్టకుండుటచేతను, అగ్నికర్మ క్షారకర్మకంటె శ్రేష్ఠమైనది.

శశిలేఖ : ఔషధములకంటె క్షారము శ్రేష్ఠమైనదైనను, క్షారముకంటె అగ్ని గొప్పది. అగ్నికర్మ త్వక్ మొదలగువానియందు చేయబడును.

వి. వ్యా. : కర్మలందేగాని గుణములందు క్షారముకంటె అగ్నికర్మకు శ్రేష్ఠత్వము లేదని డల్హణుని వివరణ. ఔషధసాధ్యముగాని రోగములకు శస్త్రకర్మయు, దానికి సాధ్యముగాని రోగములకు క్షారకర్మయు, దానికిని సాధ్యముగానిచో అగ్నికర్మయు చేయవలెను. అందువలన అగ్నికర్మ బలీయమైనది. కాల్చబడిన వృక్షాదులు తిరిగి ఓగిరించనట్లు, అగ్ని

కర్మ చేయబడిన వ్యాధులు తిరిగి జనించకుండును.

## అగ్నికర్మ చేయదగు స్థానములు

**మూలము :** తత్రాగ్నికర్మ త్వచి మాంసే సిరాస్నాయు సన్ధ్యస్థిషు చ ప్రయుజ్యతే।

ప్రతి పదార్థము : తత్ర = అందు, అగ్నికర్మ = అగ్నికర్మ, త్వచి = చర్మమునందు, మాంసే = మాంసమునందు, సిరా-స్నాయు-సన్ధి-అస్థిషు-చ = సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులందును, ప్రయుజ్యతే = ప్రయోగించబడును.

తాత్పర్యము : చర్మము, మాంసము, సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు-వీనియందు అగ్నికర్మ చేయబడును.

## చర్మముపై అగ్నికర్మ చేయదగు వ్యాధులు, అందుకు సాధనములు

**మూలము :** తత్ర మశతిలకాలక చర్మకీల సరుక్ స్తబ్ధ ప్రమ్లానాఙ్గాభిష్యన్దాధి మన్థ శిరోభ్రూ శంఖ లలాట రుజార్దితేషు సూర్యకాంత పిప్పల్యజా శకృద్ గోదంత శరశలాకాభి స్త్వగ్దాహో యథాస్వమభిష్యన్దాదిషు తు భ్రూ శంఖ లలాట దేశేషు।

ప్రతి పదార్థము : తత్ర = అందు, మశ = మశరోగమున, తిలకాలక = తిలకాలక రోగమున, చర్మకీల = చర్మకీల రోగమున, స-రుక్-స్తబ్ధ-ప్రమ్లాన-అఙ్గ = నొప్పితో గూడినట్టి, స్తబ్ధముగా నుండునట్టి, వాడిపోయినట్లున్న శరీర భాగములందు; అభిష్యన్ద-అధిమంథ = అభిష్యంద, అధిమంథములను నేత్రరోగములందు, శిరో-భ్రూ-శంఖ-లలాట రుజ-అర్దితేషు = తల, కనుబొమలు, కణతలు, నుదురు-వీని నొప్పులందు, అర్దిత వ్యాధియందు, సూర్యకాంత = సూర్యకాంతమను మణి, పిప్పలీ = పిప్పళ్ళు, అజాశకృత్ = మేక పెంటిక, గోదన్త = ఆవుయొక్క దంతము, శర = బాణము, శలాకాభిః = శలాకలు-వీనిచేత, యథాస్వం = తగినవానిచే, అభిష్యన్దాదిషు = పై జెప్పిన అభిష్యందాది రోగములందు, భ్రూ-శంఖ-లలాటదేశేషు = కనుబొమలు, కణతలు, నుదురు అనుచోట్ల, త్వగ్దాహః = చర్మముపై అగ్నికర్మ (కర్తవ్యః = చేయదగినది).

తాత్పర్యము : మశ, తిలకాలక, చర్మకీలరోగములందును, శరీరాంగములు బాధతో గూడినపుడును, స్తబ్ధములై యున్నపుడును, వాడినట్లుగా నున్నపుడును, అభిష్యంద-అధిమంథములను నేత్రవ్యాధులందును, శిరస్సు, కనుబొమలు, కణతలు, నుదురు-వీనియందు నొప్పులున్నపుడు, అర్దితవ్యాధియందును, చర్మముపై అగ్నికర్మ చేయవలెను. అందులకు సూర్యకాంతమణి, పిప్పళ్ళు, మేకపెంటికలు, గోదంతము, శరము, శలాక ఉపయోగించును. వీనిలో ఏ ఏ వ్యాధికేది ఉపయోగించునో దాని నుపయోగించి, పైన చెప్పిన అభిష్యందాది రోగములందు, కనుబొమలు, కణతలు, నుదురులపై గల చర్మముపై అగ్నికర్మ చేయవలెను.

వి. వ్యా. : వర్త్మ రోగములందు దృష్టిని ఆర్ద్రమగు లక్తుకచే మూసి, రెప్పలందలి రోమ కూపములందు అగ్నికర్మ చేయవలెనని సుశ్రుతుడు తెలిపెను. శంఖ ప్రదేశమనగా భ్రూ-కర్ణమధ్యప్రదేశము-కణత. అర్దితమనునది ముఖాశ్రితమగు వాతవ్యాధి. శిరో-భ్రూ-

శంఖ-లలాటములందలి వాతము ప్రేరితమై వక్త్రమున తీవ్రమగు వ్యథను కలిగించును. కాన ఈ వాత సంచార నాడీస్థానమును గుర్తెరిగి, అందు అగ్నికర్మ చేయవలెను.

### మాంసముపై అగ్నికర్మ చేయదగు వ్యాధులు, అందుకు సాధనములు

**మూలము :** గ్రంథ్య ర్బుదార్శో భగందర గణ్డ గణ్డమాలా శ్లీపదాన్త్రవృద్ధి దుష్ట వ్రణగతి నాడ్యవగాఢ పూయ లసీకేషు జామ్బవౌష్ఠ సూచీశలాకా ఘృతగుడ మధు మధు యష్టితైల వసా హేమతామ్రాయో రూప్యకాంస్యై ర్మాంస దాహః।

ప్రతి పదార్థము : మాంసదాహః = మాంసముపై అగ్నికర్మ, గ్రంథి = గ్రంథి, అర్బుద = అర్బుదము, అర్శః = అర్శస్సు, భగందర = భగందరము, గణ్డ = గండ రోగము, గణ్డమాలా = గండమాల, శ్లీపద = శ్లీపదము, ఆన్త్ర-వృద్ధి = ఆంత్రవృద్ధి, దుష్ట వ్రణగతి = దుష్టవ్రణముల మార్గములు, నాడీ = నాడీవ్రణము, అవగాఢ పూయ లసీకేషు = చీము, లసిక లోతుగా నున్నపుడును, జామ్బవౌష్ఠ = జాంబవౌష్ఠమను యంత్రము, సూచీ = సూది, శలాకా = శలాక, ఘృత = నేయి, గుడ = బెల్లము, మధు = తేనె, మధుయష్టి = యష్టిమధుకము, తైల = తైలము, వసా = వస (క్రొవ్వు), హేమ = బంగారము, తామ్ర = రాగి, అయః = ఇనుము, రూప్య = వెండి, కాంస్యైః = కంచులచే (చేయవలెను).

తాత్పర్యము : గ్రంథి, అర్బుదము, అర్శస్సు, భగందరము, గణ్డ, గణ్డమాలా, శ్లీపదము, ఆంత్రవృద్ధి, దుష్టవ్రణ మార్గములు, నాడీవ్రణము, చీము, లసిక లోతుగానున్న వ్రణముల దు , మాంసముపై అగ్నికర్మ చేయవలెను. ఇందులకు జాంబవౌష్ఠ యంత్రము, సూది, శలాక, నెయ్యి, బెల్లము, తేనె యష్టిమధుకము, తైలము, వస, బంగారము, రాగి, ఇనుము, వెండి, కంచు—వీనిలో ఏది ఎచట తగునో అచట నుపయోగించి చేయవలెను.

వి. వ్యా. : జాంబవౌష్ఠమనగా నేరేడుపండువంటి ముఖాగ్రములుగల నల్లరాతి నిర్మితమగు యంత్రవిశేషమని డల్హణుని వివరణ. "వసా" యనగా శుద్ధమాంసము యొక్క క్రొవ్వు పదార్థము.

### సిరాదులందు అగ్నికర్మ చేయదగు వ్యాధులు—అందుకు సాధనములు

**మూలము :** సిరాస్నాయు సన్ధ్యస్థిఛేద శోణితాతి ప్రవృత్తి దన్త నాడీశ్లిష్టవర్త్మోపపక్ష్మక లగణలింగనాశా సమ్యగ్వ్యధేషు జామ్బవౌష్ఠశలాకా సూచీ మధూచ్ఛిష్ట మధుగుడ స్నేహైః సిరాదిదాహః।

ప్రతి పదార్థము : సిరాదిదాహః = సిరలపై అగ్నికర్మ, సిరా - స్నాయు- సన్ధి - అస్థి-ఛేద = సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు తెగినపుడు, శోణిత-అతిప్రవృత్తి = అధిక రక్తస్రావమైనపుడు, దన్తనాడీ - శ్లిష్టవర్త్మ - ఉపపక్ష్మక - లగణ - లింగనాశ - అసమ్యక్ - వ్యధేషు = దంతనాడీ, స్లిష్టవర్త్మ, ఉపపక్ష్మక, లగణ, లింగనాశములను వ్యాధు లందు సిరావేధ సరిగా జరగనపుడు; జామ్బ వౌష్ఠ = జాంబవౌష్ఠయంత్రము, శలాకా = శలాక, సూచీ = సూది, మధూచ్ఛిష్ట = తేనెమైనము, మధు = తేనె, గుడ = బెల్లము, స్నేహైః = ఘృతాది స్నేహములచేత (చేయవలెను).

**తాత్పర్యము :** సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు తెగినపుడును, అధికరక్త స్రావమగుచున్నపుడును, దంతనాడీ, శ్లిష్టవర్త్మ, ఉపపక్ష్మక, లవణ, లింగనాళ వ్యాధు అందు సరిగా సిరావేధ జరుగనపుడును, జాంబవౌష్ఠ యంత్రము, శలాక, సూది, మైనము, తేనె, బెల్లము, నేయి మొదలగు స్నేహ పదార్థములను ఉపయోగించి సిరాదులపై అగ్నికర్మ చేయవలెను.

**శశిలేఖ :** "సిరాది" అనుచోట అది శబ్దముచే స్నాయు, సన్ధి, అస్థులని గ్రహించ వలెను.

**వి. వ్యా. :** సిరా, స్నాయు, సంధి, అస్థి, మర్మలందు దంశముచే ఉత్కర్తనము, గ్నిచే దాహకర్మచేయరాదని కాశ్యపముని మతము. ప్రస్తుత తంత్రమున నిషిద్ధముకాదు. అభద్రశౌనకుడు "త్వఙ్మాంస సాశ్రితమగు వాయువు త్వగ్దాహము చేతనే శమించుననియు, సిరా స్నాయు, సంధి, అస్థులందలి వాయువు మాంసదగ్ధము చేతనే శమించు"ననియు తెలిపెను.

## అగ్నికర్మకు అనర్హులు

**మూలము :** న తు దహేద్భిన్నకోష్ఠమన్తః శోణిత మనుద్ధృతశల్య మనేకవ్రణపీడిత ముష్ణే చ కాలే తథాక్షారానర్హం చ । అత్యయికే తు వ్యాధౌ కృతోష్ణప్రతీకారస్య పిచ్ఛిలమన్నమశితవతోఽగ్నికర్మ కుర్యాత్ ।

**ప్రతి పదార్థము :** భిన్నకోష్ఠం = (విరేచనకర్మలేక అతిసారాదుల వలన) కోష్ఠము భిన్నమైన వారి యందు, అన్తః శోణితం = రక్త పిత్త వ్యాధిలేక రక్తదోషము ప్రకోపించిన వారి యందు, అనుద్ధృత శల్యం = శల్యము (శరీరము నుండి) వెడలింపబడని వారియందు, అనేక వ్రణపీడితం = అనేక వ్రణములు కలిగి బాధింపబడుచున్న వారియందు, ఉష్ణేకాలేచ = ఉష్ణకాలమందును, క్షారానర్హం చ = క్షారకర్మకు అనర్హులైన వారియందును, న - దహేత్ - తు = అగ్నికర్మ చేయరాదు. అత్యయికే వ్యాధౌ తు = అత్యయిక రోగములందైతే, కృత - ఉష్ణప్రతీకారస్య = ఉష్ణప్రతీకారములు చేయబడిన వానికి, పిచ్ఛిలాన్న భోజనము చేసినవానికి, అగ్నికర్మ కుర్యాత్ = అగ్నికర్మ చేయవలెను,

**తాత్పర్యము :** విరేచన కర్మచేగాని, లేక అతిసార గ్రహణీ వ్యాధులచేగాని కోష్ఠము భిన్నమైన వారికి, రక్తపిత్త వ్యాధి కలిగిన వారు లేక రక్తదోషము ప్రకోపించిన వారికి, శరీరము నుండి శల్యము వెడలింప బడక యున్నవారికి, అనేక వ్రణములు కలిగి బాధపడు చున్న వారికి, పూర్వాధ్యాయమున వివరింపబడిన క్షార అనర్హులకు అగ్నికర్మ చేయగూడదు. ఇంకను ఉష్ణకాలమున చేయగూడదు. అత్యయిక వ్యాధులందు తప్పని సరిగ అగ్నికర్మ చేయ వలసి వచ్చినచో, ఉష్ణ ప్రతీకారముల గావించియు, పిచ్ఛిలమగు ఆహారమును భుజింపజేసియు చేయవలెను.

**శశిలేఖ :** భిన్నకోష్ఠము మొదలగు వానియందు క్షారకర్మ నిషిద్ధము కనుక అగ్ని కర్మయు నిషిద్ధమే. ఉష్ణ ప్రతీకారము అనగా ధారాగృహము మొదలగు పిత్త చికిత్సలు.

వి. వ్యా. : శరద్గ్రీష్మ ఋతువులు తప్ప మిగిలిన నాలుగు ఋతువు లందును అగ్ని కర్మ చేయవచ్చును. వాని యందును తప్పని సరియగుచో ఆయా ఋతువులకు విరుద్ధములైన శీతలోప చారాదులను చేసిన అనంతరము అగ్నికర్మ చేయవలెనని సుశ్రుతుని యభిప్రాయము. ఇంకను పిత్తప్రకృతి గలవారు, దుర్బలురగు బాలురు, వృద్ధులు, భీరువులు, స్వేదకర్మా నర్హులు, (పాండు, ప్రమేహము, రక్తపిత్తము, తృష్ణలచే బాధపడు వారు) అగ్నికర్మకు అనర్హులు. ఆత్యయిక వ్యాధులనగా ఆశుప్రాణ వినాశకములగు నవియని డల్హణుని వివరణ.

సామాన్యముగా భోజనాత్పూర్వమే అగ్నికర్మ చేయవలెను. ఏలనన భోజనము చేయుటచే ఊర్ధ్వ అధోవేగముల వలన కర్మవిఘాతము గలుగవచ్చును. పిచ్ఛిల, శీత, మృదు ఆహారములు పిత్తహరములగుటచే వానిని భుజింపజేయవలెను.

## అగ్నికర్మ విధానము

మూలము : అథ దాహార్హ మాతురం కృతస్వస్త్యయనముపహృతసర్వోపకరణం ప్రాక్ శిరా సంవిష్ట మాప్తావలంబితం కృత్వా వైద్యో నిర్ధూమ బృహత్స్థిర దీప్తఖదిర బదరాద్యఙ్గారైరయో ఘటన ప్రకారేణ భస్త్రానిలా ధ్మాతైర్వ్యజనేన చోర్ధ్వానిర్గచ్ఛజ్జ్వాలతయాపాదితాపాద్యమాన భాసురాగ్ని వర్ణైర్జామ్బవౌష్ఠాదిభిర్వ్యాధిప్రదేశ వశాద్వలయార్ధచన్ద్ర స్వస్తికాష్టాపద బిందు రేఖాప్రతిసారణ వికల్పేనముహుర్ముహుర్హితోపహితాభిర్వాగ్భి రద్భిశ్చాతురమాశ్వాసయన్ దహే దా సమ్యగ్దాహలి ఙ్గోత్పత్తేః। ఉచ్చానసుషిరప్రలూనదన్తనాడీసజన్తుదుష్టవ్రణేషుతు స్నేహమధూచ్ఛిష్ట మధుగుడైః పూరయిత్వా దహేత్। సమ్యగ్దగ్ధే చ మధుసర్పిషీ దద్యాచ్ఛీత స్నిగ్ధాంశ్చ ప్రదేహాన్। సమ్యగ్దగ్ధ లిఙ్గం పునః న శబ్దం దహనం దుర్గన్ధిత్వం త్వక్సం కోచశ్చ।

ప్రతిపదార్థము : అథ = తరువాత, కృతస్వస్త్యయనం = మంగళాచరణము చేయించినట్టి, ఉపహృత సర్వోప కరణ = అన్ని ఉపకరణములు కలిగినవానిని, ప్రాక్ శిరా స్సంవిష్టం = తూర్పుదిశగా శిరస్సుండునట్లు కూర్చుండిన వానిని, దాహార్హం-ఆతురం = అగ్ని కర్మకు అర్హుడైన రోగిని, ఆప్తావలంబితం కృత్వా = ఆప్తులగు వారిచే పట్టుకొనచేసి, వైద్యః = వైద్యుడు, అయోఘటన ప్రకారేణ = లోహములను కరగించు విధముగా, భస్త్ర - అనిల - ఆధ్మాతైః = చర్మపుతిత్తితో గాలి ఊదుటచేత, వ్యజనేనచ = విసనకర్రచేతను, బృహత్ - స్థిర - దీప్త = పెద్దగా నిలిచి మండునట్టి, ఖదిర-బదరాది - అఙ్గారైః = చంద్ర, రేగు మొదలగు కట్టెల నిప్పులచే, ఊర్ధ్వానిర్గచ్ఛజ్జ్వాలతయా = మంట పైకి రాకుండునట్లు తాపము కలిగించి, ఆపాదితాపాద్యమాన = కలిగించిన, కలిగించుచున్న, భాసురాగ్ని వర్ణైః = ప్రకాశించుచుండు నిప్పువంటి రంగుగల, జామ్బవౌష్ఠాది సాధనములచేత, ముహుర్ముహుః = మాటిమాటికి, హితోపహితాభిః వాగ్భిః = హితోపహితములగు మాటలచేత, అద్భిశ్చ = నీళ్ళ చేతను, ఆతురం = రోగిని, ఆశ్వాసయన్ = ఊరడించుచు, వ్యాధి ప్రదేశవశాత్ = వ్యాధిగల ప్రదేశము ననుసరించి, వలయ = గుండ్రముగా, అర్ధచన్ద్ర = అర్ధ చంద్రాకారముగా, స్వస్తిక = స్వస్తికాకారముగా, అష్టాపద = అష్టపదముగా, బిందు = బిందువువలె, రేఖా = రేఖవలె, ప్రతిసారణ వికల్పేన = రుద్దునట్లుగానో, ఆ సమ్యక్ దాహలిఙ్గోత్పత్తేః = సమ్యగ్దాహ చిహ్నములు ఏర్పడువరకు, దహేత్ = కాల్చవలెను, ఉచ్చాన =

పైకి ఎత్తుగా ఉబ్బినపుడు, సుషిర = రంధ్రములున్నపుడు, ప్రలూన = తెగియున్నపుడు, దన్తనాడీ = దంతనాడీ రోగమున, స - జన్తు - దుష్టవ్రణేషు తు = క్రిములు గల దుష్టవ్రణములందును అయితే, స్నేహ = స్నేహద్రవ్యములచేత, మధూచ్ఛిష్ట = తేనెమైనము, మధు = తేనె, గుడైః = బెల్లములచే, పూరయిత్వా = నింపి, దహేత్ = కాల్చవలెను, సమ్యగ్దగ్ధేచ = బాగుగా దగ్ధమైనపుడును, మధు - సర్పిషీ = తేనె,నెయ్యి, దద్యాత్ = ఇవ్వవలెను (లేపనము చేయవలెను), శీతస్నిగ్ధాం - ప్రదేహాన్ - చ = చల్లనైన స్నిగ్ధములగు పట్టులను, దద్యాత్ = ఇవ్వవలెను (పైన వేయవలెను), పునః = ఇంక, స - శబ్దం దహనం = కాలునపుడు శబ్దముతో గూడి యుండుట, దుర్గన్ధిత్వం = దుర్గంధము కలుగుట, త్వక్ - సంకోచః - చ = చర్మము ముడుచుకొనుటయును, సమ్యక్ - దగ్ధ - లిఙ్గం = బాగుగా అగ్నికర్మ జరిగిన చిహ్నములు.

తాత్పర్యము : అటు తరువాత స్వస్తి వాచనము మొదలగు మంగళాచరణములు చేయించినట్టియు, అగ్నికర్మకు కావలసిన సామగ్రిని కలిగినట్టియు, దాహకర్మకు అర్హుడును అయిన రోగిని, హితులగు వారిచే పట్టుకొనునట్లు చేసి తూర్పుదిక్కునకు తల ఉండునట్లుగా పరుండబెట్టవలెను. లోహములను కరగించు విధముగా చంద్ర, రేగు నిప్పులను పొగలేకుండ మంటపైకి రాకుండ స్థిరముగా నుండునట్లు చర్మపుతిత్తిచేగాని, విసనకర్రచేగాని మండించి, జాంబవౌష్ఠాది సాధనములలో తగుదానిని ఎర్రగా ప్రకాశించునట్లు కాల్చి, వ్యాధిగల ప్రదేశమున తగురీతిగా అర్ధచంద్ర,వలయ, స్వస్తిక, అష్టాపద, బిందు, రేఖాకారమునగాని, రుద్దునట్లుగాని కాల్చవలెను. రోగిని హితోక్తులచేతను, నీళ్ళనుపయోగించును ఊరడిల్ల జేయవలెను. అగ్నికర్మచేయగానే చుంయిమని శబ్దము కలుగుట, దుర్గంధత్వము, చర్మసంకోచము ఇవి సమ్యగ్దాహ చిహ్నములు. ఇవి కలుగు దాక అగ్నికర్మచేయవలెను.

శశిలేఖ : అష్టాపద అనగా చతురంగుళ పీఠము. ప్రతిసారణమ్ అనగా చూర్ణవికిరణం. దేహమందలి ప్రదేశముననుసరించి వలయా కారమున, అర్ధచంద్రాకారమున, స్వస్తికా కారమున, అష్టాపదాకారమున, బిందు, రేఖాకారమున అగ్నికర్మ చేయవలెను.

వి. వ్యా : సుశ్రుతుడు సకలవ్యాధులందును, సర్వ ఋతువులందును స్నిగ్ధాహారమును భుజింపజేసి అగ్నికర్మచేయవలెననియు, మూఢగర్భ, మూత్రకృచ్ఛ్ర, భగందర వ్యాధులందు మాత్రము భోజనాత్పూర్వమే చేయవలెననియు తెలిపినాడు. రోగభేదముచే వలయ బిందు, విలేఖ, ప్రతిసారణములు అని నాలుగు విధములగు అగ్నికర్మ చెప్పెను. ప్రతిసారణము అనగా తప్త శలాకాదులచేత అవఘర్షణము (రుద్దుట) అని డల్హణుని వివరణ.

## త్వగాదులందు దగ్ధ లక్షణములు

మూలము : త్వగ్దగ్ధే కపోతవర్ణత్వమల్పశోఫరుజతా శుష్కసంకుచిత వ్రణతా చ। మాంస దగ్ధే కృష్ణోన్నత వ్రణత్వం స్థితేచర క్తేసలసికాస్రుతిః । సిరాదగ్ధే కృష్ణారుణ కర్కశస్థిరవ్రణతా స్నాయ్వాది దగ్ధే చ। దుర్దగ్ధాతి దగ్ధయోః ప్రమాద దగ్ధవల్లక్షణం చికిత్సితం చ।

ప్రతిపదార్థము : త్వగ్దగ్ధే = చర్మముపై అగ్నికర్మయందు, కపోతవర్ణత్వం =

పావురపు రంగు, అల్పశోఫరుజతా = స్వల్పమగువాపు, బాధయు, శుష్క-సంకుచి తా చ = వ్రణము ఎండి ముడుచుకొనుటయును (ఉండును), మాంసదగ్ధే = మాంసముపై అగ్నికర్మయందు, కృష్ణ-ఉన్నత వ్రణత్వం = నల్లగా ఎత్తుగా నుండు వ్రణము కలుగుట, స్థితే రక్తే || రక్తస్రావము ఆగినదగుచుండగా, స - లసీకా - స్రుతిః = లసీకతో గూడిన స్రావము కలుగును, సిరాదగ్ధే = సిరలపై అగ్నికర్మ చేసినపుడును, స్నాయ్వాదిదగ్ధే చ = స్నాయువులు మొదలగు వానిపై అగ్నికర్మ చేసినపుడును, కృష్ణ-అరుణ = నలుపు, ఎరుపుతో, కర్కశ = కఠినమైన, స్థిర వ్రణతా = స్థిరమగు వ్రణము కలుగుటయు (ఉండును), దుర్దగ్ధ - అతిదగ్ధయోః = సరిగా అగ్నికర్మ జరుగనపుడును, ఎక్కువగా జరిగినపుడును, లక్షణం = లక్షణము, చికిత్సితం - చ = చికిత్సయును, ప్రమాద దగ్ధవత్ = ప్రమాదదగ్ధమునందు వలెనే (ఉండును).

**తాత్పర్యము :** చర్మముపై అగ్నికర్మ చేసినపుడు కపోతవర్ణము, స్వల్పమగు శోఫ బాధయు కలిగి వ్రణము ఎండినట్లై, ముడుచుకొనుటయు కలుగును. మాంసముపై చేసినపుడు కృష్ణవర్ణము, వ్రణము ఎత్తుగాగానగుట, రక్తస్రావము ఆగి, లసీకతో గూడిన స్రావము అగుటయు ; సిరాస్నాయ్వాదు లందు అగ్నికర్మ చేసినపుడు నలుపు - ఎరుపు వర్ణమును, వ్రణము స్థిరముగాను, కర్కశముగాను ఏర్పడును, దుర్దగ్ధ-అతిదగ్ధములందు ప్రమాదవశ దగ్ధ లక్షణములే కలుగును. వాని చికిత్సగూడ ప్రమాదదగ్ధ చికిత్సవలెనే చేయవలెను.

## ప్రమాద దగ్ధ భేదములు — వాని లక్షణములు

**మూలము:** ప్రమాద దగ్ధం పునశ్చతుర్విధం భవతి। తుత్థం, దుర్దగ్ధం, సమ్యగ్దగ్ధ, మతిదగ్ధం చ। తత్ర యద్వివర్ణముష్యతేఽతి మాత్రం తత్తుత్థం। యత్రోత్తిష్ఠన్తి స్ఫోటతీవ్రోషాదాహ రుజశ్చిరాచ్చోపశామ్యన్తి తద్దుర్దగ్ధమ్। పక్వతాలఫల వర్ణం సమస్థితం పూర్వలక్షణ - యుక్తం చ సమగ్దగ్ధమ్। అతిదగ్ధేతూగ్రరుజతా ధూమాయనం మాంస ప్రలంబనమ్, సిరాది వ్యాపదో గమ్భీరవ్రణతా జ్వర దాహ తృణ్మూర్ఛాచ్ఛర్దయః శోణితాతి ప్రవృత్తిస్తన్నిమిత్తాశ్చోపద్రవాః కృచ్ఛ్రేణ రోహణం రూఢేచ వివర్ణతేతి। స్నేహదాహస్తు కష్ట తరో భవతి న హి స్నేహస్య సూక్ష్మమార్గాను ప్రవిశతీతి।

ప్రతి పదార్థము : ప్రమాదదగ్ధం = ప్రమాదముచే కాలినది, పునః = మరల, చతుర్విధం = నాలుగు విధములుగా, భవతి = అగును, తుత్థం = తుత్థము, దుర్దగ్ధం = దుర్దగ్ధము, సమ్యగ్దగ్ధం = సమ్యగ్దగ్ధము, అతిదగ్ధం చ = అతిదగ్ధమును (అగును), తత్ర = అందు, యత్ = ఏది, అతిమాత్రం = చాల ఎక్కువగా, ఉష్యతే = మంట కలిగించునో, వివర్ణం = రంగు మారునో, తత్ = అది, తుత్థం = తుత్థము; యత్ర = ఎచట, స్ఫోట = బొబ్బలు, ఉత్తిష్ఠన్తి = లేచుచున్నవో, తీవ్ర-ఓష-దాహ-రుజః-చ = తీవ్రమగు మంట, బాధయును (కలిగి), చిరాత్-ఉపశామ్యన్తి = చాల కాలమునకు ఉపశమించునో, తత్ = అది, దుర్దగ్ధం = దుర్దగ్ధము (అగును), సమ్యగ్దగ్ధం = సమ్యగ్దగ్ధము, పక్వతాలఫలవర్ణం = పక్వమైన తాటిపండు వంటి వర్ణము కలిగి, సమస్థితం = చర్మముతో సమోన్నతమై, పూర్వలక్షణ యుక్తం-చ = ఇంతకుముందు సమ్యగ్దగ్ధమునకు చెప్పిన లక్షణములు కలిగియున్నదియును

(అగును), అతిదగ్ధే-తు = అతిదగ్ధమునందైతే, ఉగ్రరుజతా = తీవ్రమైన బాధయు, ధూమాయనం = పొగ లెగసినట్లుండుట, మాంసప్రలంబన = మాంసము వ్రేలాడుట, సిరాదివ్యాపదః = సిరలు మొదలగువానియొక్క వ్యాధులు, గంభీరవ్రణతా = లోతగు వ్రణము, జ్వర-దాహ-తృట్-మూర్ఛా-ఛర్దయః = జ్వరము, మంట, దప్పిక, మూర్ఛ, వాంతి; శోణిత-అతిప్రవృత్తిః = రక్తము అతిగా వెడలుట, తన్నిమిత్తాశ్చ ఉపద్రవాః = దానివలన కలుగు ఉపద్రవములును, కృచ్ఛ్రేణ = కష్టముగా, రోహణం = (గాయము) పూడుట, రూఢేచ = పూడిన తరువాతయు, వివర్ణతా-ఇతి = రంగు మారుట, ఇవి (కలుగును).

స్నేహదాహః తు = స్నిగ్ధపదార్థముల వలన కాలటమైతే, కష్టతరః = ఇంకను కష్టమైనది, భవతి = అగుచున్నది, సః = అది, స్నేహస్య = స్నిగ్ధపదార్థము యొక్క, సూక్ష్మమార్గానుసారిత్వాత్ = సూక్ష్మములగు మార్గముల ననుసరించి పోవుట వలన, ధూరం = (లోపలికి) దూరమును, అనుప్రవిశతి = ప్రవేశించును.

**తాత్పర్యము :** ప్రమాద దగ్ధము నాలుగు విధములు. అవి–తుత్థము, దుర్దగ్ధము, సమ్యగ్దగ్ధము, అతిదగ్ధము. వానిలో తుత్థమునందు రంగుమారుట, ఎక్కువ మంటయు ఉండును. దుర్దగ్ధమునందు బొబ్బలు లేచి, తీవ్రమగు మంట కలిగి, పుండు చాల కాలమునకు మానును. సమ్యగ్దగ్ధమున, సరియగు అగ్నికర్మ చిహ్నములు ఉండి, పక్వతాల ఫలవర్ణమున వ్రణము ఎత్తుపల్లములు లేక సమముగా యుండును. అతిదగ్ధమునందు చాల ఎక్కువబాధ, పొగ లెగసినట్లుండుట, మాంసము వ్రేలాడుచుండుట, సిరావ్యాపత్తులు, లోతగు వ్రణము, జ్వరము, దాహము, దప్పిక, మూర్ఛ, ఛర్ది కలుగును. ఇంకను అధిక రక్తస్రావమై, దాని వలన ఉపద్రవములును జనించి, చాల కష్టముగా పుండు మానుటయు, మానిన తరువాత సహజవర్ణము మారియు ఉండును. వేడియగు ఘృతతైలాది స్నిగ్ధపదార్థములవలన కాలినచో వీని అన్నింటికంటె తీవ్రమగు లక్షణములు కలిగి మానుట కష్టమగును. ఏలనన, స్నేహపదార్థములు సూక్ష్మమార్గముల ననుసరించి చాల దూరము వ్యాపించి బాధించును.

**శశిలేఖ :** ప్రమాద దగ్ధమనగా ప్రజ్ఞాపరాధము వలన కలిగినది. తుత్థం అనగా "స్తోకదాహం" కొంచెము కాలినది. శోణితాతిప్రవృత్తి వ్యాధులు–శోష, కంప, అంగావక్షేపము మొదలగునవి.

**వి. వ్యా :** ఈ చెప్పిన ప్రమాద దగ్ధ, తుత్థదగ్ధ, దుర్దగ్ధ, అతిదగ్ధములు వైద్యుని దోషముచేగాని, ప్రమాదవశాత్ గాని సంభవింపవచ్చును. వివర్ణమనగా ఇచట పాండువర్ణము కలుగుట. సుశ్రుతుడు అగ్నిచే రక్తము, దానివలన పిత్తముకూడ ప్రకోపించి తీవ్రమగు వేదనలు, స్ఫోటములు (బొబ్బలు) కలిగి జ్వరము, తృష్ణ ఎక్కువగునని తెలిపెను.

### తుత్థ దగ్ధమున చికిత్స

శ్లో ॥ తుత్థస్యాగ్ని ప్రతపనం కార్యముష్ణం చ భేషజమ్ ।
స్త్యానే రక్తే హిమైరోష్ణైర్నిర్వాపణమతి యథా జహిః ॥
వేదనా వర్ధతే తేన రుధిరం చ విదహ్యతే ।
ఉష్ణం నిర్వాపణమయతుష్కార్యా దూష్మాణం మన్దతాం రుజః ॥

ప్రతి పదార్థము : తుత్థస్య = తుత్థదగ్ధమునకు, అగ్నిప్రతపనం = స్వేదనము, ఉష్ణం భేషజం చ = ఉష్ణమును కలిగించు ఔషధములనిచ్చుటయు, కార్యం = చేయదగినది. యతః = ఎందుచేతననగా, స్త్యానే రక్తే = రక్తము గడ్డకట్టినపుడు, ఊష్మా = వేడి, హిమైః = శీతల ప్రక్రియలు-ఔషధములచేత, బహిః = బయటకు, ననిష్క్రామతి = వెడలదు, తేన = దానిచేత, వేదనావర్ధతే = బాధ అధికమగును. రుధిరంచ = రక్తమును, విదహ్యతే = విదాహము నొందును, ఉష్ణం = ఉష్ణ ప్రక్రియలు, ఊష్మాణం = లోపలివేడిని, నిష్క్రామయత్ = వెడలించును, రుజః = బాధకు, మన్దతాం = తగ్గుదలను, కుర్యాత్ = చేయును.

తాత్పర్యము : తుత్థదగ్ధమునకు స్వేదనము, ఉష్ణమును కలిగించు ఔషధముల నిచ్చుట చికిత్స. అంతేగాని శీతలోపచారములు చేయరాదు. శీతల ప్రక్రియలు-ఔషధముల వలన గడ్డకట్టిన రక్తమునుండి వేడియు, వాయువును బయటకు వెడలక బాధ ఎక్కువగును; రక్తము విదాహము నొందును. ఉష్ణక్రియలచే లోపలివేడి బయటకు వెడలి బాధ తగ్గును.

శశిలేఖ : శీతలక్రియలవలన రక్తము గడ్డకట్టి దేహమునందలి ఊష్మమును అర్ధ గించుటచే ఆ ఊష్మమువలన బాధ ఎక్కువగుటయు, రక్తము దూషింపబడుటయు అగును.

వి. వ్యా. : ఉష్ణమును కలిగించు పదార్థములు ఆలేపనకొరకును, అన్నపానాదు లందును ఉపయోగింపవలెను. ఉష్ణక్రియలు రక్తవిలయనకరములుగా నుండి ఊష్మమును వెడలించుట, వాతానులోమనమును కలిగించుటచే సుఖకరములగును.

## దుర్దగ్ధమున చికిత్స

శ్లో ॥ శీతముష్ణాం చ దుర్దగ్ధే క్రియాం కృత్వా తతః పునః ।
ఘృత లేపన సేకాంస్తు శీతానేవావచారయేత్ ॥

ప్రతి పదార్థము : దుర్దగ్ధే = దుర్దగ్ధమున, శీతాం-ఉష్ణాం చ క్రియాం = శీతల-ఉష్ణ ప్రక్రియలనున్నూ, కృత్వా = చేసి, తతఃపునః = తరువాత మరల, ఘృతలేపన సేకాన్ శీతాన్ ఏవ = ఘృతాదులచే లేపనము, సేకము లను-శీతలములగువానినే, అవచారయేత్ = ఆచరింపజేయవలెను.

తాత్పర్యము : దుర్దగ్ధమున శీతల-ఉష్ణ ప్రక్రియలను రెండింటిని మొదట ఆచరించి, తరువాత ఘృతముచే లేపనము, సేకము మొదలగు ఉపచారములను శీతలములగువానినే ఆచరింపజేయవలెను.

## సమ్యగ్దగ్ధమున చికిత్స

శ్లో ॥ సమ్యగ్దగ్ధే తవక్షీరి కృష్ణ చందన గైరికైః ।
సామృతైః సఘృతైర్లేపం కల్కైర్వానూప మాంసకైః ॥
శాన్తోష్మణి పరం కుర్యాత్పిత్తవిద్రధి సాధనమ్ ।

ప్రతి పదార్థము : సమ్యగ్దగ్ధే = సమ్యగ్దగ్ధమున, సామృతైః = తిప్పతీగెతో గూడిన, సఘృతైః = నేయితో కలిపిన, తవక్షీరీ-కృష్ణచందన-గైరికైః = వెదురుప్పు, నల్లచందనము,

గైరికములచేతను, అనూపమాంసజైః = అనూప జంతువుల మాంసముయొక్క, కల్కైః వా = కల్కములచేగాని, లేపం = లేపము (చేయదగినది). శాంతోష్మణి-పరం = వేడి తగ్గిన తరువాత, పిత్త విద్రధి సాధనం = పిత్త విద్రధియొక్క చికిత్సను, కుర్యాత్ = చేయవలెను.

తాత్పర్యము : సమ్యగ్దగ్ధమున వెదురుప్పు, కృష్ణచందనము, గైరికము (కావిరాయి), తిప్పతీగె-వీని చూర్ణమునుగాని, లేక అనూప జంతువుల మాంసకల్కమునుగాని నేతితో లేపము చేయవలెను. మంట తగ్గిన తరువాత పిత్తవిద్రధికి చెప్పబడిన చికిత్స చేయవలెను.

వి. వ్యా. : సమ్యగ్దగ్ధమున తేనె, నేయి పూయవలెననియు; చందనమను చోట రక్తచందనమును స్వీకరించవలెననియు; గ్రామ్య-అనగా అశ్వాదుల, ఔదక-అనగా కూర్మాదుల మాంసమును గూడ ఉపయోగింపవచ్చుననియు సుశ్రుతుని మతము. అనూప మాంసములనగా వరాహ మహిషాదుల మాంసములు.

## అతి దగ్ధ చికిత్స

శ్లో॥ అతిదగ్ధే విశీర్ణాని మాంసానుద్ధృత్య శీతలామ్ ॥
క్రియాం కుర్యాత్తతః పశ్చాచ్ఛాలి తణ్డుల కణ్డనైః ।
తిన్దుకి త్వక్ కషాయైర్వా పిష్టైః సాజ్యైః ప్రలేపయేత్ ॥
గుడూచ్యాశ్ఛాదయేత్పత్త్రైరథవౌపోదకైర్వ్రణమ్ ।
భేషజం వాస్య కుర్వీత సర్వం పిత్తవిసర్పవత్ ॥

ప్రతి పదార్థము : అతిదగ్ధే = అతిదగ్ధమున, విశీర్ణాని మాంసాని = (కాలి) వ్రేలాడుచున్న మాంస పదార్థములను, ఉద్ధృత్య = బయటకు వెడలించి, శీతలాం క్రియాం = శీతలోపచారములను, కుర్యాత్ = చేయవలెను, తతః పశ్చాత్ = ఆ తరువాత, శాలితణ్డుల కణ్డనైః = శాలి ధాన్యపు తవుడుచేత, తిన్దుకి త్వక్ కషాయైః వా = తిందుకి పట్టయొక్క కషాయముతో గాని, సాజ్యైః-పిష్టైః = నేతితో గూడిన పిష్టముతోగాని, ప్రలేపయేత్ = లేపము చేయవలెను. గుడూచ్యాః = తిప్పతీగెయొక్క, అథవా = లేక, ఔపోదకైః పత్త్రైః = బచ్చలి ఆకులచేత, వ్రణమ్-ఛాదయేత్ = వ్రణమును కప్పవలెను, అస్య = ఈ అతిదగ్ధమునకు, భేషజం సర్వం = చికిత్స అంతయు, పిత్త విసర్పవత్ = పిత్త విసర్పమునకు వలె, కుర్వీత = చేయవలెను.

తాత్పర్యము : అతిదగ్ధమున కాలి వ్రేలాడుచున్న మాంసాదులను కోసి తొలగించి శీతోపచారములను చేయవలెను. తరువాత శాలిధాన్యపు తవుడుతోగాని, తిన్దుకీత్వక్ కషాయముతోగాని, నేతితో చేయబడిన పిష్టములతో గాని వ్రణముపై లేపము జేసి తిప్పతీగె ఆకులు లేక బచ్చలి ఆకులు కప్పవలెను. లేక పిత్తజ విసర్పమున చెప్పిన చికిత్సయంతయు చేయవలెను.

వి. వ్యా : "విశీర్ణాని" యనగా "అవలంబితాని" అని డల్హణుని వివరణ.

శాలిధాన్యపు తవుడును చూర్ణప్రయోగకాలమున అవచూర్ణమున కుపయోగింపవచ్చును. తిన్దుకీ త్వక్-కషాయైః (అనగా కషాయరస వృక్షములయొక్క) అని వేర్వేరుగా డల్హణుడు

ద్రావెను. కొందరు కషాయ శబ్దమునకు చూర్ణము అని అర్థము చెప్పి తిన్దుకీ త్వక్ చూర్ణమును ఉపయోగింపవలెనందురు. ఔదకైః పత్రైః = పద్మోత్పలాది పత్రములు అని సుశ్రుతము. పిత్త, రక్తములవలన దాహయుక్తమగు వ్రణములపై గుడూచ్యాది పత్రములను కప్పుటచేత వేడి తగ్గి సుఖముగా నుండుటయేగాక వ్రణము త్వరగా మానును.

"శాలి తణ్డుల కణ్డనమ్" అనగా బియ్యపు పిండి యని కొందరి అభిప్రాయము.

## స్నేహ దగ్ధ చికిత్స

శ్లో॥ స్నేహ దగ్ధే భృశతరం తత్ర రూక్షం తు యోజయేత్ ।

ప్రతి పదార్థము : స్నేహదగ్ధే = స్నేహదగ్ధమున, తత్ర = అందు, భృశతరం = అధిక తరమైన, రూక్షం = రూక్ష పదార్థములను, యోజయేత్-తు = ఉపయోగింపవలెను.

తాత్పర్యము : స్నేహదగ్ధమున అధికమైన రూక్ష పదార్థముల నుపయోగించి చికిత్స చేయవలెను.

వి. వ్యా. :సుశ్రుతమున ధూమముచే కలుగు లక్షణములు, వాని చికిత్స గూడ విశేషించి చెప్పబడినది. ఇంకను, వేడిగాలి, ఎండవలన గూడ దగ్ధ లక్షణము లేర్పడునని, వానికి శీతలోపచారముల జేయవలయుననియు; మంచు-వర్షములచే గూడ దగ్ధ లక్షణములు కలుగవచ్చుననియు అపుడు ఉష్ణోపచారములు, స్నిగ్ధకర చికిత్సయు చేయవలెననియు; మెఱుపుచే దగ్ధమాయెనేని చికిత్సోపాయము లేదనియు, ఒకవేళ జీవించియున్నచో స్నేహ ద్రవ్యప్రోక్షణము, స్నేహాభ్యంగము చేయవలెననియు తెలుపబడినది (మంచు, వర్షములచేత దగ్ధము కాకున్నను హతము కావచ్చును).

## శస్త్ర, క్షార, అగ్ని కర్మల సమ్యగ్జ్ఞానా వశ్యకత

శ్లో॥ శస్త్రక్షారాగ్నయో యస్మాన్మృత్యోః పరమమాయుధమ్ ।
అప్రమత్తో భిషక్ తస్మాత్తాన్ సమ్యగవచారయేత్ ॥

ప్రతి పదార్థము : మృత్యోః = మృత్యువునకు, శస్త్రక్షారాగ్నయః = శస్త్రములు, క్షారములు, అగ్ని, పరమం-ఆయుధం = ముఖ్య ఆయుధములు, తస్మాత్ = అందుచేత, భిషక్ = వైద్యుడు, అప్రమత్తః = జాగరూకుడై, తాన్ = వానిని, సమ్యక్ = బాగుగా, అవ చారయేత్ = ఆచరింపజేయవలెను.

తాత్పర్యము : శస్త్ర, క్షార, అగ్నికర్మలు మృత్యువునకు ముఖ్య ఆయుధములు (అనగా వీనివలన మరణము సంభవించవచ్చును). అందుచేత వైద్యుడు ఆ కర్మలనెఱిగి జాగ్రత్తతో ఆచరింపవలెను.

## సూత్రస్థాన సమాప్తి

శ్లో॥ ఇతి తన్త్రస్యహృదయం సూత్రస్థానం సమాప్యతే ।
అత్రార్థాః సూత్రితాః సూక్ష్మాః ప్రతన్యన్తే హి సర్వతః ॥

ప్రతి పదార్థము : ఇతి = ఈ విధముగా, తన్త్రస్య = అష్టాంగ సంగ్రహ తంత్రము

యొక్క, హృదయం = హృదయము వలె ప్రధానమగు, సూత్రస్థానం = సూత్రస్థానము, సమాప్యతే = సమాప్తి చేయబడుచున్నది. అత్ర = ఇచట, సూక్ష్మాః = సూక్ష్మములుగా, సూత్రితాః = సూత్రప్రాయములుగా చెప్పబడినవి. సర్వతః = అంతట, అర్థాః = అర్థములు, ప్రతన్యన్తే హి = విస్తరింపబడగలవు గదా.

**తాత్పర్యము :** అష్టాంగసంగ్రహ తంత్రముయొక్క ప్రధానభాగమగు సూత్రస్థానము ఈవిధముగా సమాప్తము చేయబడుచున్నది. ఇచట సూక్ష్మార్థములు సూత్రప్రాయముగా చెప్పబడినవి. ఇకముందు ఇవి విస్తరింపబడగలవు.